# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 15 సంచిక : 5 హైదరాబాద్ 190 మే 2017 పేజీలు : 68 రు. 20

- కుల దురహంకారానికి మధుకర్ బలి
- పోలీసుల తప్పుడు పద్ధతికి ప్రతీక సత్యంబాబు
- నక్సల్బరీ ప్రజ్వలనానికి యాభై ఏళ్లు
- కాళేశ్వరం ప్రాజెక్ట్ నిజానిజాలు
- కామన్ సివిల్‌కోడ్ - ట్రిపుల్ తలాక్
- మార్క్స్ 'కాపిటల్'కు నూట యాభై ఏళ్లు
- సిరియాపై అమెరికా దుర్మార్గం

# ఆర్ఎస్ రావు స్మారకోపన్యాసం - 2017



గత ఆరు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా జరుగుతున్న వార్షిక ఆర్ఎస్ రావు స్మారకోపన్యాసం ఈ సంవత్సరం ఆర్ఎస్ రావు వర్ధంతి సందర్భంగా జూన్ 17న జరుగుతుంది. ఈ సంవత్సరం స్మారకోపన్యాసం అంశం **'ఆర్.ఎస్.రావు దృక్పథంలో ప్రజాస్వామిక హక్కులు - మరొకసారి చర్చ' (Revisiting Democratic Rights through R.S. Rao)** జూన్ 17, శనివారం, సాయంత్రం 6 గంటలకు షోయెబ్ హాలు, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరుగుతుంది.

వక్త: పంకజ్ దత్, రాజకీయార్థిక శాస్త్రవేత్త.

**అందరూ ఆహ్వానితులే.**

KLVA105M175

190 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మే 2017
సంపుటి : 15
సంచిక : 05







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
VEEKSHANAM
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 మార్చ్ నెలలో వచ్చిన విరాళాలు - కొమ్మన బాబు, వైరా - రు. 5000; ఎస్. విద్యాసాగర్ రెడ్డి, డిటిఎఫ్ అధ్యక్షులు, నల్గొండ జిల్లా - రు. 10,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం ఏప్రిల్ సంచికలో 'అబద్ధాల కేసులో అన్యాయమైన కోర్టు తీర్పు' వ్యాసం అనేక అంశాలను వెలుగులోకి తెచ్చింది. జి.ఎన్. సాయిబాబాతో సహా ఐదుగురికి యావజ్జీవ కారాగార శిక్ష, ఒకరికి పది సంవత్సరాల శిక్ష విధించిన కేసులో న్యాయమూర్తి పోలీసు పాత్రను పోషించారు. పోలీస్ చార్జిషీట్‌కు తీర్పు జిరాక్స్ కాపీలా ఉంది. అబద్ధాల కేసులో న్యాయమైన తీర్పు ఎలా ఆశించగలం? ఇది రాజ్యం పన్నిన కుట్ర. భావ ప్రకటనకు జీవితఖైదు విధించడం న్యాయవ్యవస్థకు తగదు. ఇది రాజ్యాంగం లోని ప్రాథమిక హక్కుల ఉల్లంఘన. ఈ వ్యాసం రాసిన సంపాదకులకు కృతజ్ఞతలు.

**- తుంపాల శ్రీరామ మూర్తి**
గాజువాక, విశాఖపట్నం

తెలుగు రాష్ట్రాలు ప్రవేశపెట్టిన బడ్జెట్‌పై విశ్లేషించిన తీరు వాస్తవికతకు అద్దం పట్టింది. లౌకిక పాలనలో ప్రభుత్వ ఖర్చుతో దేవతల మొక్కులు తీర్చుకోవడం ఏ మేరకు సబబు అనే విషయాన్ని విడమర్చి తెలిపినందుకు రచయితకు కృతజ్ఞతలు.

**- బిక్కునూరు రాజేశ్వర్,**
పొన్కల్, నిర్మల్

వీక్షణం మార్చ్, ఏప్రిల్ సంచికలలో పట్టా వెంకటేశ్వర్లు గారు రాసిన కులం - బహుజన ప్రజాస్వామిక విప్లవం వ్యాసం ఎందుకు అచ్చు వేసారో తెలియటం లేదు. గందరగోళం నిండిన ఆ వ్యాసం భారత సమాజం గురించి మార్క్సిస్టు లెనినిస్టు అవగాహనను ఖండించడానికి రాసినట్టున్నది. కాని ఆ గందరగోళం వల్ల చెప్పదలచుకున్నది కూడ సరిగ్గా చెప్పలేకపోయారు రచయిత. జాతీయ ఉత్పత్తిలో వాటాను బట్టి ఒక రంగానికి ప్రాధాన్యత ఉన్నదా లేదా అని రచయిత చేసిన వాదన నవ్వు తెప్పించింది. అసలు జాతీయ ఉత్పత్తి లెక్కలే దొంగలెక్కలు. సేవారంగపు ఉత్పత్తులలో, సేవలలో సగం పనికిరానివి, అనవసరమైనవి. కాని వాటికి ఎక్కువ విలువ కడతారు. పారిశ్రామిక రంగపు ఉత్పత్తులలో కూడ అనవసరమైనవి ఎన్నో ఉంటాయి. వాటికి కూడ సేవారంగపు ఉత్పత్తులంత కాకపోయినా హెచ్చుగానే విలువ కడతారు. ఇక మనిషి మనుగడకు అత్యవసరమైన వ్యవసాయోత్పత్తులకు తక్కువ విలువ కడతారు. అటువంటి తప్పుడు లెక్కలతో తయారయిన జాతీయోత్పత్తిలో వ్యవసాయం వాటా 13.9 శాతం గనుక, "భారతదేశం వ్యవసాయ ఆధారిత ఆర్థిక వ్యవస్థగా ఎంతమాత్రం లేదని తెలుస్తుంది" అని రచయిత రాసింది చదివితే అది 13.9 శాతమే గనుక ప్రతి మనిషీ వంద రోజులకు 13.9 రోజులు తింటే సరిపోతుంది అని రచయిత భావిస్తున్నార నిపించింది. కాని ఆయన అర్ధ భూస్వామ్య అర్ధ వలస అనే భావనను తప్పు పట్టడానికి వ్యవసాయానికి ప్రాధాన్యత లేదని వాదించదలచుకున్నట్టున్నారు. భూమికి ప్రాధాన్యతే లేదని మొదటి భాగంలో (మార్చ్ సంచికలో) రాసి, రెండో భాగానికి (ఏప్రిల్ సంచిక) వచ్చేసరికి ఎవరెవరు భూమిని కొంటున్నారో, అంటే భూదాహం ఎంత పెద్దఎత్తున ఉన్నదో రాసి తనను తానే ఖండించు కున్నారు. ఇక రెండో భాగంలో రష్యా, సిపిఎం విధానం, అంబేద్కర, మెకాలే, ఎన్నికలు, మనువదం, కాన్షీరాం బి ఎస్ పి ప్రయోగం, మెక్సికో జపాటిస్టాలు వంటి ఒకదానికొకటి సంబంధం లేని, లేదా సుదూరంగా మాత్రమే సంబంధం ఉన్న విషయాలను తార్కిక వాదనలు ఏమీ లేకుండా అభిప్రాయప్రకటనలతో గుదిగుచ్చారు. ఆ గందరగోళం ఎవరికైనా అర్థమయిందో లేదో నాకు తెలియదు. మొత్తానికి రెండు సంచికల్లో రాసినదాని సారాంశం భారత సమాజం అర్ధ భూస్వామ్య, అర్ధవలస కాదు, వ్యవసాయ విప్లవం అవసరం లేదు, ఇక్కడ బహుజన ప్రజాస్వామిక విప్లవం జరగాలి. కుల నిర్మూలనకు కాన్షీరామ్ ప్రయోగం సరైనది. ఈ నాలుగు మాటలు నేరుగా రాసి ఉంటే బాగుండేది.

**- జి. లింగమూర్తి**
హుజురాబాద్

భారతదేశంలో వ్యవసాయ రంగం సంక్షోభంలో కొట్టు మిట్టాడుతోంది. పంట దిగుబడి పెరిగింది. మార్కెట్లో తిండి దినుసులకు కొనుగోలుదారుడు ఎక్కువధర చెల్లిస్తున్నాడు. కాని రైతుకు గిట్టుబాటుధర లభించడంలేదు. పంట కోసం చేసిన అప్పులు తీర్చలేక రైతులు ఆత్మహత్యలకు పాల్పడడం తరచూ జరుగుతూ ఉన్నది. పంట దిగుబడి పెరగడం - కొనుగోలు దారుడు ఎక్కువ పైకం చెల్లించడం - రైతుకు గిట్టుబాటు ధర లభించడకపోవడం - ఈ వైరుధ్యం దేన్ని సూచిస్తుంది? భారత వ్యవసాయ రంగంలో పలు చారిత్రక కారణాలవల్ల ఫ్యూడలిజం ఓడించబడ్డది. అది వాస్తవమే. కాని దాని అవశేషాలు ఇంకా మిగిలి ఉన్నదీ వాస్తవమే. ఓడించబడ్డ ఫ్యూడలిజం స్థానంలో పెట్టుబడిదారీ వ్యవస్థ వ్యవసాయ రంగంలో ప్రవేశించిందా?

జనవరి 2017 వీక్షణం జన్మదిన సంచికలో భారత వ్యవసాయరంగ పరివర్తనా క్రమాన్ని వివరిస్తూ డి. నరసింహారెడ్డి భారత వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతున్నదని సూత్రీకరణ చేశారు. ఈ సూత్రీకరణ నన్ను ఒకింత ఆశ్చర్యానికి గురిచేసింది. ఆర్థికశాస్త్ర మూలాల గురించి నాకు తెలిసింది చాలా తక్కువే అయినా, క్షేత్రస్థాయి విషయాలు కొన్ని వీక్షణం పాఠకులతో పంచుకుందామన్న ఉద్దేశంతో 'పాఠకుల వీక్షణాని'కి ఈ ఉత్తరం రాస్తున్నాను.

'పెట్టుబడి' అంటే లాభం. లాభం లేకుండా ఏ వ్యాపారి పెట్టుబడి పెట్టడు. పంట కోసం కొంత ఖర్చు పెడుతున్న రైతు ఆత్మహత్య గురించి ఆలోచిస్తున్నాడు. జానెడు, బెత్తెడు ఆదాయంతో బతుకు వెళ్లదీస్తున్నాడు. పెట్టుబడి పెట్టిన వ్యాపారంలో నష్టం వచ్చే సూచనలు ఉంటే పెట్టుబడి దారుడు ఆ వ్యాపారం మూసివేసి ఇంకో వ్యాపారానికి మారిపోతాడు. ఆ వెసులుబాటు భారత

(మిగతా 55వ పేజీలో...)

(గత ఏప్రిల్ సంచికలో అచ్చయిన 'తమిళ తంబి చెవిలో పువ్వు' వ్యాస రచయిత అర్విణి రాజేంద్రబాబు పరిచయం జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్‌కు బదులు అసిస్టెంట్ ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ అప్లైడ్ ఎకనామిక్స్, తెలంగాణ విశ్వవిద్యాలయం అని పొరపాటుగా అచ్చయింది. ఈ పొరపాటుకు చింతిస్తున్నాం. -సం)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ముత్తనగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల' వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)

# ఏకీకృత జిఎస్‌టి మార్కెట్, ఏకీకృత హిందుత్వ సంస్కృతి

వస్తు, సేవల పన్నుకు సంబంధించిన నాలుగు బిల్లులు – ది సెంట్రల్ జిఎస్‌టి బిల్ 2017, ది ఇంటిగ్రేటెడ్ జిఎస్‌టి బిల్ 2017, ది జిఎస్‌టి (కాంపెన్సేషన్ టు స్టేట్స్) బిల్ 2017, ది యూనియన్ టెర్రిటరీ జిఎస్‌టి బిల్ 2017 – మార్చ్ 29న లోకసభలో, ఏప్రిల్ 6న రాజ్యసభలో ఆమోదం పొందడంతో జూలై 1 నుంచి దేశవ్యాప్తంగా వస్తు, సేవల పన్ను విధానం అమలులోకి రావడానికి మార్గం సుగమం అయింది. వస్తు, సేవల పన్ను విషయంలో ఎన్నో చర్చనీయాంశాలున్నాయి గాని, అవన్నీ అలా ఉంచి అది దేశం మొత్తానికీ ఒక సరుకుకు, ఒక సేవకు ఒకే రకమైన పన్నును ప్రవేశపెట్టి దేశం మొత్తాన్నీ ఏకీకృత ఉమ్మడి మార్కెట్ గా మార్చివేస్తుంది. ఈ పన్నుల రేట్లు ఎలా ఉంటాయి, ఎన్ని రకాల రేట్లు ఉంటాయి ఇంకా చర్చలు జరగవలసే ఉన్నాయి గాని ఒకరకంగా పన్నులు విధించడానికి, వసూలు చేయడానికి, రాయితీలు, మినహాయింపులు ఇవ్వడానికి ఇప్పటివరకూ రాష్ట్ర ప్రభుత్వాలకు ఉండిన అధికారాలన్నీ జూలై 1 నుంచి రద్దయిపోతాయి. రాజకీయ అర్థంలో చూస్తే దేశం సమాఖ్య స్వభావంలో ఒక ప్రధానాంశాన్ని వదులుకుని కేంద్రీకృత నిరంకుశాధికారం వైపు పయనిస్తుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రతినిధులతో కూడిన జిఎస్‌టి కౌన్సిల్ అనేది ఏర్పడుతుందని, అదే పన్నుల రేట్లను నిర్ణయిస్తుందని, రాష్ట్రాలకు జరిగే నష్టానికి మొదటి ఐదు సంవత్సరాలు పరిహారం చెల్లిస్తామని ఎన్ని మాటలు చెప్పినప్పటికీ ఇకనుంచి రాష్ట్ర ప్రభుత్వాల పన్ను వసూలు, వాటా అధికారాల మీద కేంద్ర ప్రభుత్వపు బొటనవేలి పెత్తనమే సాగుతుంది. ఇది రాష్ట్ర ప్రభుత్వ అధికారాలను కత్తిరించి కేంద్ర ప్రభుత్వానికి హెచ్చు అధికారం ఇవ్వడం మాత్రమే కాదు, పరోక్ష పన్నుల విధానాన్ని మరింత పెంచి ప్రజల మీద పెను భారాన్ని మోపుతుంది.

బహుళజాతి సంస్థలకు, కార్పొరేట్ శక్తులకు వ్యాపార సౌలభ్యం (ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్) ఉండాలని నిర్దేశించే ప్రపంచ బ్యాంకు ఆదేశాలలో ఇది ఒక భాగం. వేరువేరు రాష్ట్రాలలో వేరు వేరు పన్నుల విధానాలు, పోటీలు పడి రాయితీలు ప్రకటించడం వంటి చర్యల వల్ల ...ుళజాతి సంస్థల, కార్పొరేట్ శక్తుల మార్కెట్ స్థిరత్వం దెబ్బ ...ృదని వాళ్లు చాలరోజులుగా గొణుగుతున్నారు. ఎల్లలు లేని, ...లేని ఒకే దేశీయ సువిశాల ఏకీకృత మార్కెట్ కావాలని, దేశ ...లుగులను ఇంకా ఇంకా ఎక్కువగా పీల్చే అవకాశం ఇవ్వాలని ...దారీ సంస్థలు కోరుకుంటున్నాయి. ఆ ఒత్తిడి చేస్తున్న ...రాష్ట్ర ప్రభుత్వాల మెడలు వంచి కేంద్ర ప్రభుత్వం ఈ పన్నుల విధానాన్ని తీసుకొచ్చింది.

...ాలు రెండు దశాబ్దాల కిందనే మొదలయినా, ఏకీకృత ...ాజిక, సాంస్కృతిక వ్యవస్థలు కావాలని, అన్నిటిమీద ...ధికారం కావాలని కోరుకునే సంఘ్ పరివార్ పాలకుల ... సులభంగా సాధ్యమయింది. పివి నరసింహారావు – ...్ నాయకత్వంలో జరిగిన ప్రపంచీకరణ విధానాలను ...ందనీరు వంటి విస్తృత ప్రపంచీకరణ విధానం ఇది. ...ర్జాతీయ ద్రవ్యవ్యాపార, బహుళ జాతి సంస్థల, ...ప్రభుత్వాల కనుసన్నల్లో ఇటువంటి ఏకీకృత ఉమ్మడి మార్కెట్ ఆర్థిక విధానం తెస్తున్న సంఘ్ పరివార్ శక్తులే రాజకీయ రంగంలో ఉమ్మడి ఎన్నికలు, సామాజిక, సాంస్కృతిక రంగాలలో ఉమ్మడి హిందుత్వ బ్రాహ్మణీయ సంస్కృతి, ఇతర మతాల పట్ల వ్యతిరేకత, గోమాత పరిరక్షణ వంటి ఏకీకృత, నిరంకుశ విధానాలు తీసుకురావడంలో ఆశ్చర్యం లేదు.

పెట్టుబడిదారీ సిద్ధాంతకర్త ఆడం స్మిత్ మార్కెట్ అంటే సమాజం సమస్తాన్నీ శాసించే అదృశ్యహస్తం అని నిర్వచించినట్టుగానే హిందూత్వ బ్రాహ్మణ్యం కూడ సమస్తసమాజాన్నీ శాసించే అదృశ్య హస్తంగా ధర్మం అనే దాన్ని నిలబెడుతుంది. యూరప్ లో భూస్వామ్య వ్యతిరేకత నుంచి పుట్టి పెరిగిన పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశకు ఎదిగాక, భారత సమాజం వంటి సమాజాలలో భూస్వామ్యంతో మిలాఖత్తు అయింది ఈ ఏకసూత్రత వల్లనే. సామ్రాజ్యవాద భూస్వామ్య మిలాఖత్తుకు, అంటే భారత అర్ధభూస్వామ్య అర్ధవలస స్వభావానికి నరేంద్ర మోడీ ప్రభుత్వాన్ని మించిన ఉదాహరణ లేదు. ఒక పక్క సామ్రాజ్యవాదానికి జీ హుజూర్ జో హుకుం అనడం, మరొక పక్క కాలం చెల్లిన భూస్వామ్య సామాజిక ధర్మాన్ని కొనసాగించడం ఒకే తానులోని ముక్కలుగా మోడీ ప్రభుత్వం అమలు చేస్తున్నది. అది ముస్లింలను ఈ నేలకు చెందనివాళ్లుగా, పరాయిలుగా ప్రచారం చేస్తున్నది. దేశంలోని అత్యధిక సంఖ్యాక ప్రజల ఆర్థిక సమస్యలకూ అసంతృప్తులకూ ముస్లిం బూచిని చూపి రెచ్చగొడుతున్నది. హిందూ బ్రాహ్మణీయ శాకాహార, ఆరాధనా, కళా సంస్కృతే దేశపు సంస్కృతి అన్నట్టుగా అత్యధిక సంఖ్యాక ప్రజల ఆహారపుటలవాట్లను, ఆరాధనా పద్ధతులను, కళలను, దేశపు మూలధాతువైన బహుళత్వాన్ని ధ్వంసం చేయడానికి ప్రయత్నిస్తున్నది. అసలు ఇది ఒకే దేశం కాదు, ఒక ఉపఖండం. ఇదందులో చారిత్రకంగా చప్పన్నారు జాతుల రాజకీయ అస్తిత్వాలు ఇమిడి ఉన్నాయి. అనేక ఉత్పత్తి పద్ధతులు, అనేక భాషలు, అనేక సంస్కృతులు, అనేక ఆహారపుటలవాట్లు, అనేక ఆచారవ్యవహారాలతో ఇది ఒక బహుళత్వ సమాజం. కాని సంఘ్ పరివార్ అది అంగీకరించదు. జాతుల, సంస్కృతుల బందిఖానాలో బలవంతపు ఐక్యతను సాధించి ఆ బందిఖానా మీద నిరంకుశాధికారాన్ని స్థాపించడమే సంఘ్ పరివార్ ఆశయం. బందిఖానా, అన్నప్పుడు వెలుపల సరిహద్దులే ముఖ్యమవుతాయి. లోపల ఖైదీలను క్రమశిక్షణలో శిక్షించి శ్మశానశాంతి నెలకొల్పడమే ప్రధానమవుతుంది. భిన్నాభిప్రాయం మీద చెప్పరాని అసహనం రాజ్యమేలుతుంది.

ఈ చారిత్రక సన్నివేశం ప్రజాశక్తుల ఐక్యతను, సంఘటిత ప్రతిఘటనను కోరుతున్నది. దేశం పట్ల, ప్రజల పట్ల నిజమైన ప్రేమ కలిగిన ప్రజాశక్తులన్నీ, ఆలోచనాపరులందరూ తమ మధ్య ఉన్న రాజకీయ, సామాజిక, సాంస్కృతిక విభేదాలను పక్కనపెట్టి సంఘ్ పరివార్ దుర్మార్గ విధానాలను ప్రతిఘటించవలసిన ఒక అనివార్య సమయం ఆసన్నమవుతున్నది. మన సమాజాన్ని హిందూత్వ బ్రాహ్మణీయ దుర్మార్గం వైపు నడవనిద్దామా, బహుళత్వ ప్రజాస్వామిక ప్రగతిశీల ఐక్యతనూ ప్రతిఘటననూ నిర్మిద్దామా ఎవరికి వారు ప్రశ్నించుకోవలసిన ఒత్తిడి తోసుకొస్తున్నది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# పేరు రైతురాజ్యం - భూస్వాముల, దళారీల భోజ్యం

రాజకీయ నాయకుల ప్రకటనలు ఆచరణలోకి వచ్చేదాకా విశ్వసించ గూడదనే వివేకాన్ని తెలంగాణ బుద్ధిజీవులు మరచిపోతున్నట్టు కనబడుతున్నది. ప్రకటన రావడమే ఆలస్యం జరిగిపోయినట్టుగా, వాగ్దానమే అమలుగా తాము భ్రమపడి ప్రజలను భ్రమల్లో ముంచడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ మాటకు వస్తే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పాలకుల నోటి వెంట కూడ ఇంతకన్న గంభీరమైన వాగ్దానాలు వచ్చాయని, అవి వాస్తవరూపం దాల్చలేదు గనుకనే తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం తలెత్తిందని మరచిపోతున్నారు. గత మూడు సంవత్సరాలలో లెక్కలేనన్ని వాగ్దానాలు వెలువడినా, వాటిలో పదో వంతు కూడ అమలులోకి రాకపోయినా ఆత్మవంచన, పరవంచన ప్రహసనం యథావిధిగా కొనసాగుతున్నది. ఈ నాటకంలో తాజా అంకం పేరు 'రైతే రాజు'. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పటిష్టం కావాలి అని అందరూ ఆమోదించే ఆదర్శం ప్రకటించి, దానితో పాటే కులవృత్తులు పునరుజ్జీవనం కావాలి అనే సామాజిక తిరోగమన సూత్రాన్ని ప్రకటించారు. ఒక్క పైసా కేటాయింపులు లేకుండానే వేలకోట్ల రూపాయల వాగ్దానాలు వెదజల్లుతూ, దళారీల, వందిమాగధుల భజనలతో పబ్బం గడుపు తున్నారు. ఇప్పుడు రెండు పంటలకు ఎనిమిదివేల రూపాయల పెట్టుబడి, ఉచిత ఎరువులు, రైతులకు వడ్డీ లేని రుణాలు, కల్తీ విత్తనాలపై కట్టడి, గ్రామస్థాయి నుంచి రాష్ట్ర స్థాయి వరకు రైతు సంఘాలు, సమాఖ్యలు వంటి భారీ వాగ్దానాల వానలు కురిపించారు. ఇవన్నీ వచ్చే సంవత్సరం నుంచి అమలు చేస్తామని ప్రభుత్వమే అంటున్నది గనుక వీటి విధి విధానాలు ఇంకా తయారీలో ఉన్నాయనుకోవాలి. కాని రాజును మించిన రాజభక్తి ప్రదర్శించే వంది మాగధులు రైతురాజ్యం వచ్చినట్టే ప్రగల్భాలు, ప్రచారాలు ప్రారంభించారు. నిజానికి గ్రామీణ భూసంబంధాలను మార్చకుండా గ్రామీణ ఆర్థిక వ్యవస్థను మెరుగు పరచడం అసాధ్యం. భూసంస్కరణలు, కనీసం భూగరిష్ట పరిమితి చట్టం కచ్చితంగా అమలు చేయడం, మిగులు భూములను, బేనామీల పేర్లమీద ఉన్న గరిష్ట పరిమితి భూములను స్వాధీనం చేసుకొని భూమిలేని నిరుపేద రైతుకూలీలకు పంచడం వంటి చర్యలేవీ తీసుకోకుండా వ్యవసాయాన్ని, రైతును అభివృద్ధి చేస్తామనడం పగటికలల అమ్మకం. ఇప్పటికే దేశవ్యాప్తంగా అతి ఎక్కువ రసాయనిక ఎరువుల వినియోగంతో భూసారం వట్టిపోయి, విషపూరితమై పోయిన తెలంగాణ మాగాణంలో ఉచిత ఎరువులు ఇస్తామనడం, రైతులకు పెట్టుబడి ఇస్తామ నడం ప్రజాధనాన్ని ఒకవంక భూస్వాములకూ, మరొకవంక బహుళజాతి ఎరువుల కంపెనీలకూ కట్టబెట్టే ప్రయత్నం తప్ప మరేమీ కాదు. భూసార స్థితి ఏమిటి, ఏ జిల్లాలో ఏ నేలల్లో ఏ పంటలు పండించడం సాధ్యం, ఎక్కడ ఎరువులు అవసరం, ఎక్కడ రసాయనిక ఎరువులు లేకుండా వ్యవసాయం సాగించవచ్చు అనే కనీస కసరత్తు ఏమీ జరపకుండా రాష్ట్ర వ్యాప్తంగా రైతులకు కోట్లాది రూపాయల ప్రజాధనం పంపిణీ పథకాలు ప్రకటించడం రైతులకోసం కాదు, వ్యవసాయం కోసమూ కాదు, భూస్వాముల కోసమూ దళారీల కోసమూ మాత్రమే. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# హంతక ఇసుక మాఫియాకు ప్రభుత్వ మద్దతు

ఇక్కడ ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం లేదనీ, ఇక్కడ సాగుతున్న పాలన కేవలం మాఫియాలుగా మారిన కొన్ని స్వార్థపరవర్గాల, లాబీల ప్రయోజనాల కోసం బేరసారాలతో నడుస్తున్నది మాత్రమేనని ఎన్నెన్ని రుజువులు దొరుకుతున్నా ఇంకా ఇది ప్రజాస్వామ్యమని నమ్మే అమాయకు లుంటారు. దేశవ్యాప్తంగానైనా, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లోనైనా, ప్రస్తుత తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ లలోనైనా ఈ వ్యాపార–రాజకీయ–సంపన్న–మాఫియా ముఠాలదే అధికారం. ఆంధ్రప్రదేశ్ నైతే ఇవాళ పాలిస్తున్నది విద్య, ఆరోగ్యం, ప్రభుత్వ పనుల కాంట్రాక్టులు, ఇసుక, సారా, సినిమా, మీడియా వంటి ఏడెనిమిది రంగాల మాఫియా ముఠాల కూటమి. ఈ ముఠాలు ఎంత హంతక స్వభావం కలిగినవో, ఎంతగా పాలకులతో మిలాఖత్తయి శక్తిమంతంగా మారాయో తాజా ఉదాహరణ ఏర్పేడు మారణ కాండ. చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తి నియోజకవర్గం ఏర్పేడు మండలంలో స్వర్ణముఖి నది ప్రవహిస్తుంది. దేశంలోని అన్ని ప్రాంతాల్లో లాగనే ఈ నది మీద కూడ ఇసుక మాఫియా తన పంజా చాచింది. స్వర్ణముఖి తీరాన ఉన్న మునగలపాళెం గ్రామస్తులు సుదీర్ఘకాలంగా ఇసుక కాంట్రాక్టర్లతో, స్మగ్లర్లతో పేచీ పడుతున్నారు. నదిలో ఇసుక దిబ్బలు ఉంటేనే తమ ప్రాంతంలో భూగర్భ జలాలు పుష్కలంగా ఉంటున్నాయని, తమ వ్యవసాయం సవ్యంగా సాగుతున్నదని, ఆ ఇసుక దిబ్బలను తవ్వుకుపోతే తమ భూగర్భజలాలు అడుగంటుతాయని, ఆ ఇసుక తవ్వడానికి వీల్లేదని ప్రతిఘటిస్తున్నారు. కాని ఆంధ్రప్రదేశ్‌లో ఇసుక మాఫియా ఎంత బలమైనదో, దాని రాజకీయార్థిక సంబంధాలు ఎంత బలమైనవో అందరికీ తెలుసు. ఇసుక తవ్వకాలను చట్టబద్ధంగా నియంత్రించాలని ప్రయత్నించి, స్మగ్లర్లను అడ్డుకున్న ఒక అధికారిని స్వయంగా ముఖ్యమంత్రే అధికారానికి వచ్చిన కొత్తలోనే బహిరంగంగా అవమానించి, స్మగ్లర్లకు అవకాశం తిరిగి ఇప్పించి ప్రభుత్వం కన్న వాళ్లే శక్తిమంతులని ఇసుక మాఫియాకు సందేశం ఇచ్చారు. ఏర్పేడు మండలం లో ఇసుక తవ్వుకుపోతున్న స్మగ్లర్లకు కూడ అదే అహంకారం, విశ్వాస వెన్నుదన్ను. గ్రామస్తులు రెవెన్యూ అధికారులకు, స్వయంగా తహసీ ఫిర్యాదు చేసినా స్మగ్లర్ల మీద ఏ చర్యా జరగలేదు సరిగదా, చేసిన మర్నాడు స్మగ్లర్లే గ్రామం మీద దాడిచేశారు. దానితో, లందరూ ఇంటికొకరు చొప్పున వెళ్లి మర్నాడు ఏర్పేడులో అ నిలదీయాలనుకున్నారు. తహసిల్దార్ కార్యాలయానికి వెళ్తే స్థానిక పోలీసు స్టేషన్‌కు ఎస్పీ వచ్చారని తెలిసి పోలీస గోడు వినిపించుకుందామని వెళ్లి అక్కడా ఆశాభంగం పొం స్టేషన్ నుంచి వాళ్లు బైటికి వచ్చే సమయానికి సరిగ్గా వా ధూసుకు వచ్చింది. పోలీస్ స్టేషన్ గేటు ముందే అక్కడికక మంది మరణించారు. ఆ లారీ విద్యుత్ స్తంభానికి ఢీకొట్టి, వాహనాల మీదికి ఎక్కడంతో నిప్పురవ్వలు ఎగిసిపడి మరో నలుగురు చనిపోయారు. తమ సమస్యల పరి గ్రామం నుంచి నలభై మంది వస్తే వారిలో పదిహేను మం గా తిరిగివెళ్లారు. ప్రశ్నలడిగిన, న్యాయం అడిగిన, చట్టబ అడిగిన మనుషులను చంపుతున్న నరహంతక రాజ్య

# ఫ్రెంచి ఎన్నికల్లోనూ అవే నినాదాలు

ప్రపంచమంతా ఒకేరకమైన గాలి వీస్తున్నట్టున్నది. భారతదేశపు ఎన్నికల్లో వినిపించిన అభివృద్ధి, ప్రపంచీకరణ, దేశభక్తి, ఇస్లామిక్ తీవ్రవాదులు అనే మాటలే ప్రస్తుతం సాగుతున్న ఫ్రెంచి ఎన్నికల్లోనూ వినబడుతుండడం కొంత ఆశ్చర్యం కలిగించినా, యాదృచ్ఛికమేమీ కాదు. వర్గపోరాటం తీవ్రతరమవుతున్నదని, ప్రజలను భ్రమల్లో ముంచడానికి, ఏదో ఒక బూచి చూపి రక్షకులం తామే అని ఆకట్టుకోవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని ఈ పరిణామం రుజువు చేస్తున్నది. ఫ్రాన్స్ అధ్యక్ష ఎన్నిక చాల సంక్లిష్టమైనది. మొదట 500 మంది స్థానిక ప్రజా ప్రతినిధుల మద్దతు ఉన్నవారు అధ్యక్ష అభ్యర్థులవుతారు. వారిలో ఎవరికి మొత్తం వోట్లలో సగం కన్న ఎక్కువ వస్తే వారు అధ్యక్షులవుతారు. అలా ఎవరికీ రాకపోతే, అందరికన్న ఎక్కువ వోట్లు తెచ్చుకున్న ఇద్దరి మధ్య రెండో విడత పోటీ జరుగుతుంది. ఆ పోటీలో గెలిచినవారు అధ్యక్షులవుతారు. పదకొండు మంది పోటీపడిన మొదటి విడత ఏప్రిల్ 23న జరిగి ఏ ఒక్కరూ సగం కన్న ఎక్కువ వోట్లు తెచ్చుకోకపోవడంతో, మొదటి రెండు స్థానాలలో ఉన్న మధ్యేమార్గవాది ఇమ్మాన్యువల్ మాక్రాన్ (23.74 శాతం వోట్లు), మితవాది మెరిన్ లీ పెన్ (21.53 శాతం వోట్లు) ల మధ్య మే 7న మరొక పోటీ జరగనుంది. మితవాదికీ, మధ్యే మార్గవాదికీ మధ్య జరిగే పోటీ గురించి పెద్దగా పట్టించుకోనక్కరలేదు. ఎవరు గెలిచినా ఒకటే రకమైన విధానాలు అమల్లో ఉంటాయని సులభం గానే చెప్పవచ్చు. పైగా అమెరికాలో డొనాల్డ్ ట్రంప్ ఎన్నిక నాటి నుంచి ప్రపంచవ్యాప్తంగా మితవాద, అభివృద్ధి నిరోధక భావాలదే పైచేయిగా కనబడుతున్నది గనుక ఫ్రెంచి ఎన్నికల్లో కూడ లీ పెన్ గెలుపు సాధ్యం కావచ్చు. కాని దిగిపోతున్న అధ్యక్షుడు ఫ్రాంకోయిస్ హోలాండె తన మద్దతును మాక్రాన్ కే ప్రకటిస్తూ, లీ పెన్ రెండో విడత పోటీకి రావడమే ఫ్రాన్స్‌కు ప్రమాదకరమని అన్నాడు. ఆమెను ఎట్టి పరిస్థితుల్లో గెలవనివ్వ గూడదని అన్నాడు. ఆమె విధానాలు ఫ్రెంచి సమాజాన్ని విభజించేవనీ, జనాభాలో కొన్ని వర్గాల ప్రజల మీద ముద్రలు వేసి దూరం పెట్టేవని అన్నాడు. అసలు ఆమె ఈ స్థానానికి రావడమే ఫ్రాన్స్ సమాజపు నిర్మాణానికీ, ఐక్యతకూ, యూరప్‌లో, ప్రపంచంలో దాని స్థానానికీ భంగకరమని అన్నాడు. మరొకవైపు లీ పెన్ ఇస్లామిక్ తీవ్రవాద ప్రభావం చాల ప్రమాదకరంగా ఉన్నదని, ఒక్క 2015లోనే ఫ్రాన్స్ లో 230 మంది ఆ తీవ్రవాదానికి బలి అయ్యారనీ, ఇస్లామిక్ తీవ్రవాదాన్ని అణచివేసే దమ్ము మాక్రాన్‌కు లేదని అన్నారు. మొదటి విడతలో పోటీ చేసి ఎన్నో కొన్ని వోట్లు తెచ్చుకున్న వారిలో కొందరి మద్దతు కూడగట్ట డానికి "దేశభక్తులందరూ ఒక్కచోటికి చేరి ప్రపంచీకరణ సమర్థకులమీద పోరాటానికి ఏకం కావలసి ఉన్నది" అని ఆమె అన్నారు. నిఘా విభాగాల జాబితాల్లో ఉన్న విదేశీయులందరినీ దేశం నుంచి బహిష్కరించాలన్నారు. మాక్రాన్ దేశభక్తుడు కాదనీ, ఫ్రెంచి సంస్కృతిని విమర్శించాడనీ లీ పెన్ మద్దతుదారులు ప్రచారం చేస్తున్నారు. అభివృద్ధిచెందిన దేశం అని చెప్పుకునే చోట, మూడు వందల సంవత్సరాలకు పైగా అనేక విప్లవాల చరిత్ర ఉన్నచోట దేశభక్తి, ఇస్లామిక్ తీవ్రవాదం వంటి కుహనా నినాదాలు ప్రధానం కావడమే తిరోగామి శక్తుల ప్రాబల్యాన్ని చూపిస్తున్నది. ❖

## అంతర్గత యుద్ధాల వాస్తవాలు : అత్యధిక సాయుధ దళాలు ఉన్న ప్రాంతాలు





❖ **స్మరణిక** - సాహిత్య నివాళి - శిఖామణి - కవిసంధ్య గ్రంథమాల - 112 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 95, ప్రతులకు: కవిసంధ్య గ్రంథమాల, ఫ్లాట్ నెం. 10, సిద్ధార్థ అపార్ట్‌మెంట్స్, సిద్ధార్థనగర్, వెంగళరావు నగర్, హైదరాబాద్ - 500 038; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **చెర్నాకోల** - రెక్కల్లో మానవవాదం - కవిత్వం -ఇసనాక మురళీధర్ - దీపిక పబ్లికేషన్స్ - 120 పేజీలు, 1/10 డెమీ, వెల రు. 100, ప్రతులకు: దీపిక పబ్లికేషన్స్, జయప్రకాశ్ నగర్, హైదరాబాద్-500073; సెల్: 9010601919



❖ **సాహితీ వాహిని** - డా. బన్న అయిలయ్య - నానీ ప్రచురణలు-192 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: శ్రీమతి. కె. విజయ, 2-7-1261/1, 'రాజగృహం', విజయపాల్ కాలనీ, హనమకొండ - 506 370; ఫోన్: 0870 - 2456001



❖ **అభిచందనం** - ఆచార్య తుమ్మల రామకృష్ణ పారాలు, ప్రసంగాలు- సంపాదకులు: డా. మల్లెగోడ గంగాప్రసాద్ - ప్రచురణ వారధి అసోసియేషన్ - 222 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150, ప్రతులకు: చంద్రకళ పబ్లికేషన్స్, టి. విజయలక్ష్మి, ఫ్లాట్ నెం. 204, సిగ్మా సెంట్రల్, తారానగర్, శేరిలింగంపల్లి, హైదరాబాద్; సెల్: 9949055015



❖ **నాన్నా! నాలా ఎదుగు!** - కోట్ల వెంకటేశ్వరరెడ్డి - ఆంగ్లంలో: అర్విణి రాజేంద్రబాబు - 46 పేజీలు, 1/10 డెమీ, వెల రు. 50, ప్రతులకు: 4-31/1/2, భగీరధ కాలనీ, మహబూబ్‌నగర్; సెల్:9440233261 email:kotla9440233261@gmail.com



❖ **వెండితెరపై మహాప్రస్థానం** - శ్రీశ్రీ సినిమా పాటలు - కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి - 47 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40, ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ-520 004. ఫోన్: 0866-6617375, సెల్: 9246277375;



❖ తెలంగాణ కథకుల - **కథాంతరంగం** - గోపగాని రమణశ్రీ - ఉట్నూరు సాహితీ వేదిక ప్రచురణ - 95 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: గోపగాని రవీందర్, ఇ.నెం. 9-76/2, ఫకీర్ గుట్ట, ఉట్నూరు, ఆదిలాబాద్ - 504 203; సెల్: 9440979882



❖ **పాటల సెలయేరు** (పాటల సిడి) - ప్రభాకర్ గొంతు నుండి జాలువారిన గీతాలు - ప్రజా కళా మండలి - వెల రు. 30



❖ **దౌలత్ బేగం** - కథలు - నవచేతన పబ్లిషింగ్ హౌస్ - 165 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100



❖ **అధూరె**- ముస్లిం కథలు - స్కైబాబ - నవచేతన పబ్లిషింగ్ హౌస్-130 పేజీలు, 1/8 డెమీ, వెల రు.100 పై రెండు పుస్తక ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్-500 068, తెలంగాణ ఫోన్ : 040-24224453/54



❖ **మహాశూద్ర విజయం** - యక్షగానం - సాంబరాజు యాదగిరి - తెలంగాణ సాహితి - 30 పేజీలు, 1/8 డెమీ, వెల రు.20, ప్రతులకు: నవ తెలంగాణ బుక్‌హౌస్, బాగ్‌లింగంపల్లి (సుందరయ్య విజ్ఞాన కేంద్రం), చిక్కడ్‌పల్లి, హైదరాబాద్



❖ **పుష్పావతి లోయలో...** - నవల - తరానా - పాలపిట్ట బుక్స్ - 224 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఫ్లాట్ నెం: 2, బ్లాక్-6, ఎం.ఐ.జి-2, ఎపిఎచ్‌బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-500044; ఫోన్: 040-27678430



❖ **బుద్ధిజీవులను ప్రశ్నిస్తున్న ఆదివాసీలు** - ఆంధ్ర-ఒడిసా సరిహద్దు అటవీ ప్రాంతంలో గ్రేహౌండ్స్ పోలీసుల హత్యాకాండపై నిజనిర్ధారణ కమిటీ నివేదిక - పౌరహక్కుల సంఘం (ఆం.ప్ర., తెలంగాణ), ప్రజాస్వామిక హక్కుల సంఘాల సమన్వయ కమిటీ (సిడిఆర్ఓ) 44 పేజీలు, 1/4 క్రౌన్, వెల రు. 30, ప్రతులకు: ప్రొ. ఎస్. శేషయ్య, డోర్.నెం. 12-3-961, ఫ్లాట్ నెం. 49, విద్యుత్‌నగర్, అనంతపురం - 515000, ఫోన్ 9000919100



❖ **గునుగు పూల పొద్దు** - కవిత్వం - సంపాదకుడు: డా. ఏనుగు నరసింహారెడ్డి - పాలపిట్ట బుక్స్ - 128 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60



❖ **ఛౌ మాణొ ఆఠొ గుంఠొ** (ఆరెకరాల ఎనిమిది గుంటలు) ఫకీర్ మోహన్ సేనాపతి - తెలుగు సేత: కస్తూరి - పాలపిట్ట బుక్స్-152 పేజీలు, 1/8 డెమీ, వెల రు.70



❖ **వలసదేవర** - నవల - జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి - పాలపిట్ట బుక్స్ - 320, పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150, ప్రతులకు: జెఎస్ఆర్ మూర్తి, తెలకోవెల, 1-2-9/104, దేవి నిలయం అపార్ట్‌మెంట్స్, ఓల్డ్ మారుతీనగర్, కొత్తపేట్, హైదరాబాద్-500 035;

పై మూడు పుస్తకాల ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ - 500 036,

# సత్యం బాబు - తొమ్మిదేళ్ల వృథా జైలు జీవితం

**పోలీసులు పరిశోధన, విచారణ పేరుతో అమాయకుల మీద ఎలా తప్పుడు సాక్ష్యాధారాలు సృష్టించి, తప్పుడు కేసులు బనాయించగలరో సత్యంబాబు కేసులో హైకోర్టు తీర్పుతో రుజువైందని అంటున్నారు రమా ఎస్ మేల్కోటే, వసుధా నాగరాజ్**

చేయని నేరానికి సత్యం బాబు ఎనిమిది సంవత్సరాలు జైలులో గడిపాడు. హైదరాబాద్ హైకోర్టు 2017 మార్చ్ 31న అతను నిర్దోషి అని నిర్ద్వంద్వంగా తీర్పు ఇచ్చింది. అంతమాత్రమే కాదు. జస్టిస్ సి వి నాగార్జునరెడ్డి ఎంఎస్ కె జైస్వాల్‌ల బెంచి ఒక అమాయకుడిని కేసులో ఇరికించినందుకు, అతనికి అయిన ఖర్చులకు పరిహారంగా ఒక లక్ష రూపాయలు చెల్లించవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఆదేశించింది. లోపపూరితమైన పరిశోధన, బాధ్యతా రాహిత్యాలను విచారించే విచారణ కమిటీ చేత ఈ పరిశోధనాధికారులను విచారింపజేయడం సముచితమని కూడ న్యాయమూర్తులు అభిప్రాయపడ్డారు.

అన్నిటికన్న ముఖ్యంగా ఈ తీర్పు దురుద్దేశపూరితమైన పరిశోధన, విచారణ జరిగినప్పుడు బాధితులు రాజ్యం నుంచి నష్టపరిహారాన్ని కోరవచ్చుననే కొత్త న్యాయసూత్రాన్ని ప్రవేశపెట్టింది.

ఈ తీర్పు గురించి ఆంధ్రప్రదేశ్‌లో పెద్ద ఎత్తున చర్చ జరుగుతున్నది. సంబంధించిన ప్రతి అంశాన్నీ ప్రచార సాధనాలు పట్టించుకున్న సంచలనాత్మక కేసులలో ఇది ఒకటి. పది సంవత్సరాలు గడిచిన తర్వాత కూడ ఈ కేసు బహిరంగ ప్రజా చర్చలో భాగంగానే ఉన్నది. పోలీసులు ఉద్దేశపూర్వకంగా పరిశోధనను ఎలా ధ్వంసం చేశారో, పోలీసుల చర్యను దురుద్దేశపూరితమైన ప్రాసిక్యూషన్ విచారణ ఎలా బలోపేతం చేసిందో చూసి గణనీయమైన వ్యతిరేకత వచ్చింది.

ఈ కేసు ఢిల్లీని 2008లో కదిలించిన తల్వార్ కేసుతో పోల్చవచ్చు. కాని ఈ ఘటన విజయవాడలో జరిగింది గనుక 'జాతీయ' దృష్టిని ఆకర్షించలేకపోయింది.

ఈ కేసుకు సంబంధించిన వాస్తవాలను సంక్షిప్తంగా చూద్దాం. ...వాడలోని ఒక వర్కింగ్ విమెన్స్ హాస్టల్‌లో ఉంటున్న పదిహేడు ...రాల బి ఫార్మసీ విద్యార్థి ఆయేషా మీరాపై అత్యాచారం చేసి, ...శాడని సత్యం బాబు మీద నేరారోపణ. అతను హాస్టల్ లో ...ాడని, ఆయేషా పట్ల తన ప్రేమ ప్రకటించాడని, ఆమె ...నప్పుడు ఒక రోకలి తీసుకువెళ్లి ఆమె తల మీద మోది ...ని నేరారోపణ చేశారు. ఆ తర్వాత ఆమెను అరవై అడుగుల ...ఉన్న బాత్ రూంలోకి లాక్కు వెళ్లి, ఆమె మీద రెండు సార్లు ... చేశాడని ఆరోపణ.

...కూ అత్యాచారానికీ దారి తీసిన పరిణామాల గురించి ... వదలడం మాత్రమే కాదు, ఆమె శరీరం మీద కూడ ...లకు సంబంధించిన పరిశోధన, డిఎన్ఎ పరీక్ష, చేతిరాత ... సంపూర్ణంగా జరిగిందని పోలీసులు అంటున్నారు.

కేసు అంతా కూడ శాస్త్రీయ సాక్ష్యాధారాల మీదనే ఆధారపడింది. అయితే, నలభై మంది విద్యార్థినులున్న ఆ హాస్టల్ లో ఈ మొత్తం ఘటనకు ఒక్కరంటే ఒక్కరు కూడ ప్రత్యక్షసాక్షులు లేకపోవడం విచిత్రం.

నేరం జరిగిన తర్వాత, రాజకీయంగా శక్తిమంతులైన కుటుంబానికి చెందిన నేరస్తులను కాపాడడానికి పోలీసులు ప్రయత్నిస్తున్నారనేది స్పష్టమయింది. విజయవాడలో పెద్ద ఎత్తున నిరసన చెలరేగింది. అసలే ఆ హత్య అత్యంత దుర్మార్గమైనది. ఇక నేరస్తులను కాపాడడానికి జరుగుతున్న ప్రయత్నం ఆ హత్యనూ, లైంగిక హింసనూ మరింత దారుణంగా మార్చింది.

జాతీయ మహిళా కమిషన్‌తో సహా ఎన్నో నిజనిర్ధారణ బృందాలు నేర స్థలాన్ని సందర్శించాయి. ఎనిమిది నెలల పాటు పరిశోధన ఒక నిందితుడి మీది నుంచి మరో నిందితుడి మీదికి తిరుగుతూ వెళ్లింది. దాదాపు 120 మంది పురుషులను డిఎన్ఎ పరీక్షకూ, చేతిరాత పరీక్షకూ పంపారు. వారిలో చాల మంది తమను ఎటువంటి చట్టబద్ధమైన ప్రక్రియ పాటించకుండా తమను ఎన్నెన్నో పరీక్షలకు గురి చేస్తున్నారని వారిలో చాల మంది రాష్ట్ర మానవ హక్కుల కమిషన్‌కు ఫిర్యాదు చేశారు.

మరొకవైపు, హతురాలి తల్లి షంషాద్ బేగం "నిజమైన నేరస్తులు" ఎవరో పరిశోధించమని ఎన్నోసార్లు పోలీసులకు మొరపెట్టుకోవడం కనబడింది. ఆశ్చర్యకరంగా, "నిజమైన నిందితులను" మినహా ఇరుగు పొరుగు ప్రాంతాలలోని యువకులందరినీ పోలీసులు అతి శ్రద్ధగా దర్యాప్తు చేశారు. చివరికి ఆయేషా మీరా మేనమామను కూడ విచారించారు.

ఆ ఎనిమిది నెలల్లో పరిశోధనాధికారులను మూడుసార్లు మార్చడం జరిగింది. చిట్టచివరికి, ఒక సెల్ ఫోన్ దొంగతనం కేసులో శిక్ష పడి ఉన్న సత్యం బాబు అనే దళిత క్రైస్తవ లారీ క్లీనర్ నేరస్తుడని పరిశోధనలో తేల్చారు. తొమ్మిది రోజుల పాటు అక్రమ నిర్బంధంలో ఉంచుకుని, తానే నేరం చేశానని సత్యంబాబు ఒప్పుదల ప్రకటన చేశాడని ప్రకటించారు.

డిఎన్ఎ పరీక్ష, చేతిరాత పరీక్ష కూడ దాన్ని నిర్ధారించాయని అన్నారు. అంతేకాదు, అంతకు ముందు స్త్రీలను వెంటాడి, అత్యాచారం చేసి, చివరికి చంపడానికి కూడ ప్రయత్నించిన ఎనిమిది కేసుల్లో అతను నిందితుడని పోలీసులు ఆరోపించారు.

తాను ఆయేషా మీరాను హత్య చేసి, అత్యాచారం చేయడం మాత్రమే కాక మరొక ఏడు కేసుల్లో కూడ తనకు సంబంధం ఉందని సత్యం బాబు ఒప్పుదల ప్రకటన ఇచ్చాడని అన్నారు.

ఆ సందర్భంలో సీనియర్ న్యాయవాది బొజ్జా తారకం గారు ఈ

అన్ని కేసుల్లోనూ సత్యంబాబును తప్పుడుగా ఇరికించారని, అన్ని కేసులను రద్దు చేయాలని కోరుతూ హైకోర్టులో రద్దు పిటిషన్ వేశారు.

హైకోర్టు అసాధారణమైన తీర్పు ఇస్తూ ఎనిమిది కేసుల్లో ఐదు కేసులను రద్దు చేసింది. ఈ తీర్పునూ, ఆయేషా మీరా కేసు పరిశోధనలో జరిగిన లోపాలనూ ఆధారంగా పెట్టుకుని సత్యం బాబు పోలీసుల కుట్రకు బలి అయ్యాడనీ, కేవలం మొత్తం కేసుకు ఒక తప్పుడు ముగింపు పలికేందుకే సత్యం బాబును ఇరికించారని తారకం గారు విజయవాడ మహిళా సెషన్స్ కోర్టులో వాదించారు.

అంతే కాదు, విచారణలో మొదటి సాక్షి అయిన ఫిర్యాది షంషాద్ బేగం తన వాంగ్మూలంలో సత్యంబాబు నిందితుడు కాదని చెప్పడం ఈ కేసులో నమ్మశక్యంగాని అంశాన్ని ప్రవేశపెట్టింది. అంత ఎత్తు ఉన్న భవనాన్ని ఏ మనిషి అయినా ఎక్కగలడేమో చూడడానికి స్వయంగా సెషన్స్ న్యాయమూర్తి నేరస్థలానికి వచ్చి చూడాలని తారకం గారు పట్టు పట్టడంతో, న్యాయవాదులూ, న్యాయమూర్తీ హాస్టల్ భవనాన్ని స్వయంగా పరిశీలించారు.

అయితే ఇన్ని ప్రతివాదనలు ఉన్నప్పటికీ చాల జాగ్రత్తగా తయారు చేసిన ఫోరెన్సిక్ సాక్ష్యం ముందు సెషన్స్ కోర్టులో అవి నిలవలేక పోయాయి. ప్రాసిక్యూషన్ కథనంలో ఎన్నో కళ్ల ఎదురుగా కనిపించే ఖాళీలు ఉన్నప్పటికీ, వాటన్నిటినీ పక్కకు తోసి, సెషన్స్ కోర్టు 2010 సెప్టెంబర్ లో సత్యం బాబును దోషిగా నిర్ధారించి యావజ్జీవ శిక్ష విధించింది.

### హైకోర్టు విచారణ

ఆరు సంవత్సరాల తర్వాత 2016 అక్టోబర్ లో ఈ కేసుపై అప్పీలు హైకోర్టులో విచారణకు వచ్చింది. అప్పటికి తారకం గారు చనిపోయారు. మానవహక్కుల న్యాయవాది వసుధా నాగరాజ్, సుప్రసిద్ధ క్రిమినల్ న్యాయవాది వి పట్టాభి ఈ అప్పీలుపై వాదనలు కొనసాగించారు. ఈ వాదనలు సుదీర్ఘకాలం సాగాయి. హైకోర్టు ఈ నమ్మశక్యం కాని వాదనలను శ్రద్ధగ విన్నది.

మొత్తానికి పరిశోధనాధికారులు ఉద్దేశపూర్వకంగా పరిశోధనను వక్రీకరించడానికి, తలకిందులు చేయడానికి చేసిన ప్రయత్నాలు బైటపడ్డాయి.

డిఎన్ఎ పరీక్షకు, చేతిరాత పరీక్షకు ఉపయోగించిన నమూనాలు పూర్తిగా తారుమారు చేయబడ్డాయని అనిపించింది. న్యాయశాస్త్ర పరిభాషలో నమూనాలను ఈ శరీరం నుంచే సేకరించి ఫోరెన్సిక్ ప్రయోగశాలకు పంపించడం జరిగిందన్న వరుస క్రమం లేదు.

ఆ రాత్రి ఆ నలభైకి పైగా విద్యార్థినులున్న హాస్టల్‌లో నిందితుడికి ఒక వ్యక్తిని చంపి, కొంతదూరం లాగి, అత్యాచారం చేసి, ఆ తర్వాత ఉత్తరం రాయడానికి తగినంత సమయం ఉందా అని ప్రశ్న వచ్చింది. ఒక చిల్లర దొంగ, ఏడో తరగతి గట్టెక్కని సత్యంబాబు తన ప్రేమనూ ప్రతీకారాన్నీ వర్ణిస్తూ అంత పకడ్బందీ ఉత్తరం రాయగలడా అని ప్రశ్న వచ్చింది. ఎప్పుడూ గలగలలాడుతూ ఉండే హాస్టల్‌లో ఉన్నవారిలో ఏ ఒక్కరూ ఈ చర్యలలో ఏ ఒక్కదాన్నీ చూడకపోవడం ఎలా సంభవించింది? ఈ ప్రశ్నల్లో ఏ ఒక్కదానికీ ప్రాసిక్యూషన్ జవాబు చెప్పలేకపోయింది.

ఈ కేసు న్యాయవ్యవస్థ అంతరాత్మను చలింపజేసేదిగా ఉందంటూ న్యాయమూర్తులు ఈ అభిప్రాయం ప్రకటించారు:

ప్రాసిక్యూషన్ చెప్పిన కేసులో ఎన్నో జవాబులేని ప్రశ్నలున్నాయని గుర్తించడంలో కింది కోర్టు విఫలమయింది. ఇక్కడి నిందితుడు గత నేరచరిత్రతో భయంకరమైన నేరస్తుడు అని పోలీసులు చేసిన అభివర్ణనను నమ్మింది. నిందితుడికి వ్యతిరేకంగా చూపిన ఐదు కేసులు చెల్లవని హైకోర్టు రద్దు చేసిందనే వాస్తవాన్ని కూడ కింది కోర్టు పెడచెవిన పెట్టింది. ఆ వాస్తవమే పోలీసుల విశ్వసనీయతను ప్రశ్నార్థకం చేస్తున్నది.

ప్రాసిక్యూషన్ కేసులోని అసంబద్ధతా స్వభావం, నిందితుడు నేరం చేశాడని ఆరోపించడానికి చూపిన అసంభవనీయమైన పద్ధతి, ప్రాసిక్యూషన్ చూపిన సాక్ష్యాధారాల అవిశ్వసనీయత అన్నీ కలిసి ఈ నిందితుడిని పోలీసులు తప్పుడుగా ఇరికించారని నిర్ధారించడానికి మమ్మల్ని ఒప్పిస్తున్నాయి.

అంత కొట్టవచ్చినట్టుగా సాక్ష్యాధారాలను తప్పుడు పద్ధతిలో తయారు చేయడం జరిగిందనే వాస్తవాన్ని విచారణ జరిపిన సెషన్స్ కోర్టు గుర్తించలేకపోవడం మీద హైకోర్టు న్యాయంగానే తన దిగ్భ్రాంతిని వ్యక్తం చేసింది.

అయితే అది కేవలం సాక్ష్యాధారాలను గుర్తించడం, గుర్తించకపోవడం సమస్య మాత్రమేనా? మరేవైనా కారణాలున్నాయా?

ఇంతకాలం గడిచాక ఒక్కసారి వెనక్కి తిరిగి ఆలోచిస్తే, నేరపరిశోధన, ప్రాసిక్యూషన్ కూడ ఒకపక్క రాజకీయ జోక్యంతోనూ, మరొకపక్క ప్రతిరోజూ సంచలనాత్మక వార్తలు ప్రచారం చేసిన ప్రచారసాధనాల తోనూ తీవ్రంగా ప్రభావితమయ్యాయి. ప్రజా ఆగ్రహం ఎంత పెద్దఎత్తున ఉండిందంటే, ఆ కేసును వీలయినంత త్వరగా మూసివేయవలసి వచ్చింది.

ఒక పేద, నిస్సహాయ దళిత యువకుడు సత్యంబాబు ఈ కేసుకు సరిగ్గా సరిపోయిన నిందితుడిలాగ దొరికాడు. హోరెత్తిస్తున్న ప్రచారసాధనాల వార్తలు, శాస్త్రీయ సాక్ష్యాధారాలు అనేవాటికి ఉందని చెప్పుకునే పవిత్రత, ఆయేషా మీరాకు న్యాయం జరగాలనే ఆకాంక్షలు అన్నీకలిసి సెషన్స్ కోర్టు తీర్పును పూర్తిగా కమ్మేసినట్టున్నాయి.

ప్రచార సాధనాలు రెండంచుల కత్తిలా పనిచేశాయి. స్త్రీల మీ హింస విషయంలో చర్చను రేకెత్తించడానికి అవి తోడ్పడినప్పటికీ, తక్షణం న్యాయం జరగాలనే ప్రతీకారవాంఛలను కూడ ప్రేరేపించా అటువంటి ప్రచారసాధనాల ఉన్మాదం వల్లనే లైంగిక హింస కే స్త్రీలకు న్యాయం జరగడమంటే మరణశిక్ష లాంటి కఠినమైన ఉండాలనే కోర్కెలు తలెత్తుతాయి. పోలీసు పరిశోధనను ఎలా తా చేయవచ్చునో, సమాజంలో ఆ వ్యక్తి స్థానాన్ని, హోదాను బట్టి ఎలా అందుతుందో చూడడానికి సత్యంబాబు కేసే బలమైన ని

ఈ కేసు హైకోర్టును ఎంతగా కలవరపరచిందంటే ఆ ప్రభుత్వం సత్యంబాబుకు ఖర్చుల కింద ఒక లక్షరూపాయల హైకోర్టు ఆదేశించింది.

నష్ట పరిహారం విషయంలో హైకోర్టు ఒక గంభీరమై ఇలా అన్నది: "తనకు వ్యతిరేకంగా దురుద్దేశ పూరిత జరిపినందుకు నష్టపరిహారం కోరుతూ ప్రభుత్వానికి

# ఆయేషా మీరా హత్య కేసు - పరిశీలన

***సత్యంబాబుకు జరిగింది న్యాయం కాదు, కంటితుడుపు చర్య మాత్రమేనని, ఆయేషా మీరా హంతకులకు శిక్ష పడేవరకు ప్రజాస్వామిక వాదులందరూ ఐక్యతతో కృషి చేయాలని అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

కృష్ణా జిల్లా ఇబ్రహీంపట్నం పరిధిలోని నిమ్రా కళాశాలలో బి ఫార్మసి చదువుతూ, దుర్గా లేడీస్ హాస్టల్‌లో ఉంటున్న ఆయేషా మీరా - 2007 డిసెంబర్ 26న అనుమానస్పదంగా మృతి చెందినట్లు చిత్రీకరించబడినప్పటికీ, వాస్తవంగా అత్యాచారానికీ, హత్యకూ గురైంది. ఇది అప్పట్లో దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించిన కేసు.

ఎన్నో అనుమానాలు, అనేక రకాల ఒత్తిళ్లకు గురై ఈ కేసులో పోలీసులు చేసిన 'అసత్యపు విచారణ', అన్యాయంగా ఇరికించబడిన దళితుడైన సత్యంబాబుకు కృష్ణా జిల్లా మహిళా సెషన్స్ కోర్టు జడ్జీ ఎనిమిది సంవత్సరాల క్రితం 'జీవిత ఖైదు' (యావజ్జీవ కారాగార శిక్ష) విధించింది.

పదేళ్ల క్రితం నాటి ఆయేషా మీరా హత్య కేసులో రాష్ట్ర హైకోర్టు 2017 మార్చ్ 31న ఒక సంచలనాత్మక తీర్పు వెల్లడించింది. ఎనిమిది సంవత్సరాలు జైల్లో మగ్గిన సత్యంబాబును నిర్దోషిగా ప్రకటించడమే కాక, అతడి శిక్షకు కారకులైన దర్యాప్తు అధికారులపైన, పోలీసు ఉన్నతాధికారులపైన చర్యలు తీసుకోవాలని ఆదేశించింది. అంతే కాకుండా కోర్టు-న్యాయవాది ఖర్చుల కింద ఒక లక్ష రూపాయలు పరిహారం ఇవ్వాలని ఆదేశించింది.

సత్యంబాబుకు సంపూర్ణంగా న్యాయం జరిగిందా లేదా అనే విషయం పక్కకు పెడితే, పోయిన అతని ఎనిమిది ఏళ్ల జీవితం తిరిగి ఇవ్వలేని పరిస్థితిని రాష్ట్ర హైకోర్టు పరిగణనలోనికి తీసుకున్నట్లు అర్థం చేసుకోవచ్చు. అంతే కాకుండా, ఏ కారణాలైతే కేసును కొట్టివేయడానికి పరిగణనలోనికి హైకోర్టు తీసుకున్నదో అదే కారణాలను, న్యాయ సందేహాలను ఎందుకు జిల్లా మహిళా న్యాయ స్థానం పరిగణనలోనికి తీసుకోలేక పోయింది? అనే విషయాన్ని ఇక్కడ మనం దృష్టిని కేంద్రీకరించాలి.

నిజంగా జిల్లా మహిళా న్యాయ స్థానంలోనే కేసును కొట్టివేసి ఉంటే, సత్యంబాబు ఎనిమిది సంవత్సరాలు జైలు జీవితం గడపాల్సి ఉండేది కాదు. దిగులుతో అతని తండ్రి చనిపోయేవాడు కాదు. అతని తల్లి, చెల్లి, ఇంకా పెళ్లి చేసుకొని ఉంటే భార్య, పిల్లలతో కాలం గడిపి ఉండేవాడు. జిల్లా కోర్టులలో జిల్లా జడ్జీలు, పబ్లిక్ ప్రాసిక్యూటర్ల వాదనలను ఏ విధంగా ఏకీభవిస్తారో అర్థం చేసుకోవడానికి ఈ కేసు మంచి ఉదాహరణ. లేదా పోలీసు ఉన్నతాధికారులతో ఆ మహిళా కోర్టు జడ్జికి సత్సంబంధాలు ఉండి ఉండవచ్చు. అందుకే ఇలాంటి అన్యాయమైన కేసులో 'అన్యాయమైన తీర్పు' జిల్లా కోర్టు ఇచ్చింది.

వాస్తవానికి ఈ కేసులో అసలు నిందితులు, అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వంలో ఉప ముఖ్యమంత్రిగా ఉన్న కోనేరు రంగారావు మనుమడు కోనేరు సతీష్, అతని సన్నిహితులని ఫిర్యాదురాలైన బాధితురాలు తల్లి (షంషార్ బేగం) ఆరోపించినప్పటికీ, అప్పటి పోలీస్ కమిషనర్ (విజయవాడ) సి.వి. ఆనంద్ ఈ కేసును పూర్తిగా 'తప్పుడు ఇన్వెస్టిగేషన్' సృష్టించాడు. మొదట లడ్డూ అనే వ్యక్తిని అరెస్ట్ చేసి, నేరం ఒప్పించాలని ప్రయత్నం చేశాడు. అనేక మంది పాత నేరస్థులను స్టేషన్లకు తీసుకొచ్చి విచారణ పేరు మీద హింసించారు. దానికి పూర్తిగా నందిగామ సర్కిల్ ఇన్స్‌పెక్టర్, విజయవాడ కమిషనర్, డి.ఎస్.పి, మరికొంత మంది పోలీస్ సబ్ ఇన్స్‌పెక్టర్లు బాధ్యత వహించాలి.

ఒక హత్య కేసును తప్పుదోవ పట్టించడానికి పోలీసులు చేసిన కృషి సత్యంబాబును బలితీసుకున్నది. అనేక మంది పాత నేరస్తులను పోలీసులు విచారణ పేరుతో నిందితులుగా చూపించే ప్రయత్నం చేసినప్పటికీ, కేవలం దళితుడైన సత్యంబాబునే ఎంచుకోవడం వెనుక అతనికి ఎలాంటి రాజకీయ పలుకుబడి లేకపోవడమే ప్రధాన కారణం.

---

నిందితుడు వ్యాజ్యం వేయదలచుకుంటే (ఇప్పటికే అతని శక్తి ఉడిగిపోకపోయి ఉంటే), అది అతని ఇష్టానికే వదిలేస్తున్నాం."

నిందితుల పట్ల, ఫిర్యాదీల పట్ల న్యాయవ్యవస్థ ఇటువంటి సానుభూతిని ప్రకటించడం చాల అరుదుగా జరుగుతుంది. మొత్తానికి ఈ తీర్పు షంషాద్ బేగం వాదన నిజమని రుజువు చేసింది. ఈ తీర్పు తొమ్మిది సంవత్సరాల తర్వాత వెలువడినప్పటికీ, ఆయేషా మీరా కేసులో "శక్తిమంతమైన కుటుంబ సభ్యులను పరిరక్షించడం కోసం" పరిశోధనను ఉద్దేశపూర్వకంగా ధ్వంసం చేశారనే హైకోర్టు గుర్తింపు చాల విలువైనది.

ఇవాళ, ఈ తీర్పు ఆయేషా మీరాకు న్యాయం జరగాలనే ప్రశ్నను మళ్లీ లేవనెత్తింది. ఆ హత్య ఇంకా మానని గాయం లాగనే ఉంది. సక్రమంగా పరిశోధన జరగని కేసుల విషయం పరిశీలించడానికి ప్రభుత్వం నియమించిన ఉన్నతాధికార కమిటీ ఈ కేసు పరిశోధనతో సంబంధం ఉన్న పోలీసు అధికారులందరి మీద విచారణ జరపవలసి ఉంది. పునఃపరిశోధన జరుగుతుందని ప్రభుత్వాధికారులు చేసిన ప్రకటనలున్నాయి గాని ఇది ఎంతవరకు జరుగుతుందో తెలియదు. ఈ విషయం మీద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కచ్చితమైన నిర్ణయం తీసుకుంటుందా లేదా చూడవలసే ఉంది. స్త్రీల భద్రత, పరిరక్షణలకు తాను కట్టుబడి ఉన్నానని ప్రభుత్వం రుజువు చేసుకోవలసి ఉంది.

*(రచయితలు - రమా మేల్కోటే సామాజిక కార్యకర్త,*
*వసుధా నాగరాజ్, హైకోర్టు న్యాయవాది )*

వీ

సత్యంబాబు నిర్దోషి అని, అతనిని అన్యాయంగా ఈ హత్య కేసులో ఇరికించారని మొదటి నుంచి ప్రజా, పౌర హక్కుల సంఘాలు, బెజవాడ బార్ అసోసియేషన్ అన్నీ ముక్త కంఠంతో చెబుతున్నప్పటికీ, అప్పటి పోలీస్ కమిషనర్ ఏవీ పట్టించుకోలేదు. తాను నిర్దోషినని ఎన్నోసార్లు బహిరంగంగా ఘీంకరించినప్పటికీ సత్యంబాబు ఘోష అరణ్య రోదన అయింది.

కేవలం డిఎన్ఎ పరీక్షల ఆధారంగా సత్యంబాబును నిందితునిగా నిర్ధారించామని పోలీస్ అధికారులు చెబుతున్నప్పటికీ, అప్పటికే అతడు నరాల బలహీనతతో బాధపడుతున్నాడు.

గోడలను పాకి రెండవ అంతస్థులో ఉన్న ఆయేషా మీరాను కలవడానికి ప్రయత్నించాడని పోలీసులు వాదిస్తున్నప్పటికీ, వాస్తవానికి సత్యంబాబుకు ఉన్న నరాల బలహీనత వ్యాధి వలన అసలు అతను స్థంబాలను ఎక్కే శక్తి లేదని డాక్టర్లు నిర్ధారించడంతో అసలు విషయం బయటపడింది. అంతే కాకుండా ఒక అంతస్థు మెట్లు – మరో అంతస్తు మెట్ల మధ్యన ఒక గ్రిల్ ఉంది. వాటి రెండింటినీ విడదీస్తూ ఒక ఇనుప వాకిలి (ప్రవేశ ద్వారం) ఉండింది. అది అప్పటికే లాక్ చేయబడింది. సత్యంబాబు అనే ఒక నిర్దోషికి శిక్ష వేయడానికి నేరం నిరూపించే కృషి చేసిన ఈ పోలీసు అధికారులు, అసలు దోషులను పట్టుకోవడానికి ఎందుకు విఫలమయ్యారనేది ఒక పెద్ద సంశయం!

ఇక్కడ వారి సూక్ష్మ దృష్టి, ప్రతిష్ట గుర్తుకు రాలేదు కాబోలు. సత్యంబాబును దోషిగా చూపించే ముందు, అతడు ఇలాంటి నేరాలు గతంలో చేసే అలవాటు ఉన్న వ్యక్తిగా చూపించడానికి అతనిపై ఎనిమిది కేసులు నమోదు చేశారు. (అవి దొంగతనాలు, అమ్మాయిల వేధింపులు, లైంగిక దాడులు, మొదలగునవి) అందులో 5 కేసులను రాష్ట్ర హైకోర్టు కొట్టివేసింది. (బొజ్జాతారకం గారు సత్యంబాబు తరపున హైకోర్టులో క్వాష్ పిటిషన్ వేశారు.)

సత్యంబాబును పోలీసులు ఒకసారి నల్లగొండ జిల్లా సరిహద్దుల్లో ఎన్‌కౌంటర్ చేయాలనే ప్రయత్నం చేస్తే, అతడు తెలివిగా తప్పించుకో గలిగాడు. కనీసం ఇలాంటి విషయాలు చెప్పడానికి అతడు స్వయంగా కోర్టు హాలులో గగ్గోలు పెట్టినప్పటికీ, కోర్టు అతని పక్షం ఆలోచనా ధోరణిని అంగీకరించలేకపోయింది.

ఒక్క మాటలో చెప్పాలంటే జిల్లా కోర్టు పూర్తిగా పోలీసుల పక్షం వహించడమే కాకుండా ఒక నిర్దోషికి శిక్ష విధించడం ద్వారా, అన్యాయాన్ని అంగీకరించినట్లయింది.

ఆధునిక న్యాయసూత్రం ప్రకారం 'వంద మంది దోషులు శిక్ష నుంచి తప్పించుకున్నా పర్వాలేదు కానీ, ఒక నిర్దోషి శిక్షింపబడరాదు' అన్న విషయం కూడా జిల్లా న్యాయ స్థానం ఎందుకో ఆలోచించలేక పోయింది. ఇలాంటి తీర్పులు ఇచ్చిన జడ్జీలపై కూడా చర్యలు తీసుకునే విధంగా ఉన్నత న్యాయ స్థానం (హైకోర్టు) అధికారాలు కలిగి ఉండాలి. ఎందుకనగా ఇలాంటి ఎంతో మంది నిర్దోషులు ఈ రోజు జైళ్లలో మగ్గుతున్నారో ఒక్కసారి ఆలోచించాలి.

ఎంతో మంది నిర్దోషులు సరైన న్యాయ సహాయం అందక జైళ్లలో మగ్గుతూ, ఆరోపించబడిన నేరంలో రిమాండ్‌లో ఉంటూ నిజంగా శిక్ష పడనప్పటికీ, శిక్షా కాలం కన్నా ఎక్కువ రోజులు జైళ్లలో మగ్గుతున్నారు. ఇది ఈ దేశంలో సామాన్య ప్రజల, ముఖ్యంగా దళితుల, ఇతర వెనుకబడిన వర్గాల పరిస్థితి.

నిజంగా న్యాయమూర్తులు కోర్టుకు వచ్చిన నిందితుల సాంఘిక, ఆర్థిక, ఆరోగ్య పరిస్థితిని పరిగణనలోకి తీసుకొని తీర్పులనివ్వాలి. కానీ అలాంటి పరిస్థితి ఈ దేశంలో కనబడడం లేదు. 70 సంవత్సరాల స్వాతంత్ర్య ఫలాలు ఈ దేశంలో కొంతమందికే పరిమితయ్యాయి.

ఇది ఒక్క ఆయేషా మీరాకో లేదా సత్యంబాబు లాంటి దళిత యువకులకు మాత్రమే సంబంధించిన విషయం కాదు. మొత్తం నేర నిరూపణ, న్యాయ ప్రక్రియకు సంబంధించిన విషయం. సామాన్య పౌరుల, దళితుల, మహిళల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు, రాజ్యాంగ మౌలిక హక్కులకు సంబంధించిన విషయం. దీనిని గుర్తించడంలో కింది న్యాయ స్థానాలు ఏ విధంగా విఫలం చెందుతున్నాయో ఈ సత్యంబాబు కేసు ఒక మచ్చుతునక.

**ఈ కింది డిమాండ్ల సాధన కోసం మనమంతా కృషి చేయాలి.**

1) సత్యంబాబును హింసించిన అధికారులందరిపై ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం కింద కేసు నమోదు చేయాలి.

2) అంతే కాకుండా ఈ కేసులో ఫిర్యాదు దారులు ఆయేషా మీరా తల్లి చెప్పిన వారందరిపై వెంటనే హత్య కేసు నమోదు చేసి అరెస్ట్ చేయాలి.

3) ఎనిమిది సంవత్సరాలు శిక్ష అనుభవించిన సత్యంబాబుకు నష్టపరిహారం పోలీసు అధికారుల నుంచి వసూలు చేసి ఇవ్వాలి. ఒక ప్రభుత్వ గృహం, ఉద్యోగం ఇవ్వాలి.

4) మొత్తం సంఘటనపై అటు ఆయేషా మీరా కుటుంబ సభ్యుల వాంగ్మూలాలు, సత్యంబాబు, ప్రజా సంఘాల నాయకుల వాంగ్మూలాల ఆధారంగా ఎస్‌సి, ఎస్‌టి కేసుల విచారణ కోర్టు న్యాయమూర్తి చేత జ్యుడీషియల్ విచారణ ప్రారంభించి, నిందితులకు వెంటనే శిక్ష పడే విధంగా ప్రభుత్వం కృషి చేయాలి.

5) నిందితులుగా చెప్పబడుతున్న పోలీసు అధికారులను వెంటనే ఉద్యోగం నుంచి తొలగించాలి.

6) ఆయేషా మీరా కుటుంబ సభ్యులను మానసికంగా వేదనకు గురిచేసిన పోలీసు అధికారులపై కఠిన చర్యలు తీసుకోవాలి. మరీ ముఖ్యంగా ఎంతో మంది సత్యంబాబు లాంటి అమాయకులు, నేరారోపణకు గురై, జైళ్లలో మగ్గుతున్న వాడిని గుర్తించి, వారికి సరైన న్యాయం జరిగేలా కృషి చేయాలి. వారు అమాయకులని తేలితే వెంటనే విడుదల చేయాలి.

ఇదంతా ఒక్క రోజులో జరిగే పనికాదు. సత్యంబాబు కేసులో నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవడానికి పోరాడినట్లే మరింత కృషి కొనసాగించడం ద్వారా సత్యంబాబు లాంటి వారిని విడుదల చేసుకో గలుగుతాం. సత్యంబాబుకు కూడా ఇంకా సంపూర్ణ న్యాయం జరగలేదు. పైన పేర్కొన్న అన్ని డిమాండ్లను నెరవేర్చుకోవడానికి ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, మహిళా సంఘాలు, కలిసి వచ్చే శక్తులన్నింటినీ కలుపుకొని దీక్షతో కృషి చేయాలి. వీ

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)*

# కుల దురహంకారానికి మధుకర్ బలి

**భూస్వామ్య, ఆధిపత్య కుల దురహంకారంతోనే దళితుడైన మధుకర్‌ని హత్య చేశారనీ, పోలీసులు కూడా తమ విచారణలో తప్పుడు నిర్ధారణలు చేస్తున్నారనీ అంటున్నారు ప్రొ. లక్ష్మణ్ గడ్డం**

పెద్దపల్లి జిల్లా మంథని మండలం ఖానాపూర్ గ్రామానికి చెందిన మంథని లక్ష్మి, ఎల్లయ్యలు మాదిగ కులస్థులు. వీరికి ఆరుగురు కొడుకులు, ఇద్దరు బిడ్డలు. అందులో అయిదో సంతానం మధుకర్ ఇతనికి చదువు అబ్బలేదు. అయిదవ తరగతితో ఆగిపోయింది. బతుకు దెరువు కోసం డ్రైవింగు నేర్చుకున్నాడు. ప్రస్తుతం ఊరిలో దేవుని సత్తి దగ్గర ట్రాక్టర్ నడుపుతూ జీవనం వెళ్లదీస్తున్న క్రమంలో మార్చి 13న హత్య గావించబడ్డాడు.

అంతకు ముందు రెండేళ్ల కింద మున్నూరుకాపు కులానికి చెందిన పుట్ట శంకర్ దగ్గర ట్రాక్టర్ డ్రైవరుగా పనిచేశాడు. వెంకటాపూర్‌కు చెందిన రేగడి సుధాకర్ కూతురు శిరీష ఖానాపూర్‌లో తన మేనమామ పుట్ట శంకర్ ఇంట్లో ఉంటూ మంథనిలో రేష్మి డిగ్రీ కాలేజిలో చదువుతుంది. ఈ క్రమంలో తమ దగ్గర డ్రైవర్‌గా పని చేస్తున్న మధుకర్‌ను శిరీష ప్రేమించింది. మూడేళ్లుగా ప్రేమించుకుంటున్న వీరు పెళ్లి చేసుకోవాలని అనుకున్నారు. దీనికి శిరీష తండ్రి ససేమిరా ఒప్పుకోలేదు. వేరే సంబంధాలు చూస్తే శిరీష ఒప్పుకోలేదు. ఘర్షణ మొదలై చివరకు మధుకర్ బలయ్యాడు. పథకం ప్రకారం 2017 మార్చి 13న ఉదయం 11 గంటలకు ఖానాపూర్‌కు చెందిన వ్యక్తే మధుకర్‌ను బైక్‌పై తీసుకెళ్లి వెంకటాపూర్‌లో శిరీష తండ్రి రేగడి సుధాకర్‌కు అప్పగించాడు. ఆ రాత్రంతా మధుకర్‌ను చిత్రహింసలు పెట్టి చివరికి చంపేసి ఖానాపూర్ శివారు చెట్ల పొదల్లో శవాన్ని పడేశారు. ఇది చూసి భరించలేని శిరీష ఆత్మహత్యకు ప్రయత్నం చేస్తే కరీంనగర్ హాస్పిటల్‌లో చేర్పించారు.

ఆ రోజు మధుకర్ తన రెండు ఫోన్లలో ఒకటి ఇంట్లోనే ఉంచి రెండోది వెంట తీసుకెళ్లాడు. రాత్రివరకు తిరిగి రాకపోయే సరికి తల్లిదండ్రులు తీవ్ర ఆందోళనకు గురైనారు. రాత్రి పది గంటల వరకు ఫోన్ చేస్తూనే ఉన్నారు. రింగు అవుతుంది కాని ఎత్తలేదు.

ఆ తర్వాత స్విచ్ ఆఫ్ కావడంతో తీవ్ర భయాందోళనతో రాత్రంత ఏడుస్తూ ఎదురు చూశారు. మరుసటి రోజు ఉదయం మధుకర్ తల్లి తమ బంధువు అనీష్‌ను వెంకటాపూర్ పంపించింది. తనకక్కడ ఏ సమాచారం దొరకక తిరిగి వచ్చాడు.

ఇదిలా ఉండగా శిరీష ఆసుపత్రిలో కోలుకొని వార్డు బాయ్ ఫోను నుంచి మధుకర్ సెల్‌కు ఫోన్ చేసింది. మధుకర్ అన్న సమ్మయ్య మాట్లాడాడు. మధుకర్ గురించి వాకబు చేసింది, మా వాళ్లు మీకేమి చెప్పలేదా అంది. మధుకర్ ఏమయ్యాడో తెలియడం లేదు అంటే మీ ఇంటి వెనక చెట్లల్లో వెతకమంది. ఇంతలో ఎవరో వచ్చి ఆమె సెల్‌ను లాక్కున్నారు. ఎంత వెతికినా మధుకర్ శవం కనబడలేదు. పొద్దంతా గాలిస్తూనే ఉన్నారు. ఈ లోగా సాయంత్రం 6 గంటలకు పోగుల సతీష్ ద్వారా విషయం తెల్సుకున్న పోసాని మొగిలి మధుకర్ తల్లిదండ్రులకు ఫోను చేసి మధుకర్ శవం ఎక్కడ పడివున్నదో స్పష్టంగా చెప్పాడు.

అంటే మధుకర్ హత్య విషయం ఆమె కుటుంబీకులకు ముందే తెలుసని స్పష్టమవుతుంది. దీంతో తల్లిదండ్రులు, ఊరు జనం శవం పడివున్న చోటుకు చేరుకున్నారు. అప్పటికే అక్కడికి చేరుకున్న పోలీసులు పరిశీలిస్తున్నారు. తల్లిదండ్రులకు సమాచారం లేకుండా పోలీసులు అక్కడికి చేరుకోవటంలో అంతర్యమేమిటి? సమగ్ర శవ పంచనామా చేయకుండానే శవాన్ని మార్చురికి తరలించారు. మరుసటి రోజు ఉదయం 11 గంటలకు డాక్టర్లు పోస్టుమార్టం నిర్వహించారు. మధుకర్ ఆత్మహత్య చేసుకున్నాడని నిర్ధారించారు. మరి శవం మీదున్న గాయాలకు డాక్టర్లు ఏం సమాధానం చెప్పగలరూ!

ఖానాపూర్‌కు చెందిన దొరగోల్ల శ్రీనివాస్, మాజీ సర్పంచ్ బూదద జగన్‌లతో శవ పంచనామా పత్రంపై హాస్పిటల్‌లో సంతకాలు తీసుకున్నారు. ఇది చట్ట విరుద్ధం. నేరం జరిగిన చోట చేయాల్సింది హాస్పిటల్ దగ్గర చేశారు. మధుకర్ జబ్బలు, కాళ్లు, మెడలు విరిచారని, పళ్లు విరగ్గొట్టారని, కనుగుడ్డు ఒకటి బయటికి వచ్చిందని, పక్కటెముకలు విరిచారని, పురుషాంగం చిట్లి పోయేలా తొక్కారని, ముక్కులోంచి రక్తం కారిందని తల్లిదండ్రులు తెలియజేస్తున్నారు. ఇవన్ని పంచనామా రిపోర్టులో వ్యక్తీకరణ లేకుండానే పంచ్‌లతో సంతకాలు తీసుకున్నారు.

మధుకర్ తల్లిదండ్రులు మధుకర్ హంతకులైన రేగటి సుధాకర్, సేమంతుల ఒదేలు (సర్పంచ్) అఖిల్ (సర్పంచ్ కుమారుడు), లక్ష్మయ్య, మొగిలి, పుట్ట శంకర్‌ల పేర్లు రాసి ఫిర్యాదు చేశారు. ఇప్పటి వరకు ఎవరిని అరెస్టు చేయలేదు. ప్రత్యక్ష సాక్షులు లేరని, ఎఫ్ఎస్ఎల్ రిపోర్టు, పోస్టుమార్టం రిపోర్టు వచ్చాక అరెస్టు చేస్తామని సిఐ ప్రభాకర్ చెబుతున్నాడు. అన్ని కేసుల్లో పోలీసులు ఇలాగే ప్రవర్తిస్తారా? అగ్రకులానికి చెందిన వ్యక్తి హత్యకు గురైతే అది దళితులపైన మోపబడితే ఈ రకంగా వ్యవహరించగలరా? ఈ పాటికి ఎంత మంది ఎముకలు విరగ్గొట్టేవారో! అగ్రకులం వారికి ఒక న్యాయం, అణగారిన వారికి మరో న్యాయం, ఏ చట్టాల్లో ఉంది ఈ వైనం.

నిజానికి శిరీష ఆసుపత్రిలో చావు బతుకుల మధ్య కొట్టుమిట్టాడుతూ, ఎవరు చూడని సమయంలో వార్డు బాయ్ సెల్ లోంచి ఫోన్ చేయక పోతే హత్య విషయం తెలిసేది కాదు. అందుకే శిరీష నా బిడ్డలాంటిది చల్లంగా బతకాలని మధుకర్ తండ్రి ఎల్లయ్య కోరుకుంటున్నాడు.

నిజానికి శిరీష సమాజంలోని ఏ అంతరాలను పట్టించుకోదల్చు కోలేదు. వాటిని ఎదిరించి కులంలో, చదువులో, ఆస్తి, అంతస్తు, హోదాలో అన్నిట్లో తక్కువైన ట్రాక్టర్ డ్రైవర్ మధుకర్‌ను మనసారా ప్రేమించింది. కాని శిరీష తల్లిదండ్రులు క్రూరంగా ప్రవర్తించారు. ఆమె జీవితంలో మన్నుపోశారు. ఇంతా జేసి ఏం సాధించినట్లు! ఈ పరిణామాల అనంతరం ఆమె జీవితం చిగురిస్తుందా! ఈ దేశంలో కులం, పరువే ప్రధానమా? కేవలం మాదిగ కులపోడు, మా ఆదిపత్య కులం అమ్మాయిని

ప్రేమించడమేమిటనే ఏకైక కారణంతో శిరీష తల్లిదండ్రులు అతి కిరాతకంగా పథకం ప్రకారం హత్య చేశారు కదా. ఆత్మహత్యగా చిత్రీకరించడానికి ఘటన స్థలంలో పురుగుల మందు చల్లారు. అక్కడ ఇప్పటికీ వాసన వస్తుంది. తాగిన వ్యక్తి చుట్టూ చల్లి తాగుతాడా?

దాదాపుగా 20 రోజుల తర్వాత 20 మీటర్ల దూరంలో చున్నీని, కర్చీఫ్‌ను, మరో 50 మీటర్ల దూరంలో పురుగుల మందు డబ్బాను పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. ఇన్ని రోజుల తర్వాత ఈ వస్తువులు ఎక్కడి నుంచి వచ్చాయో ఎవరు తేల్చాలి? ఆత్మహత్య చుట్టూ పోలీసుల దర్యాప్తు సాగుతుంది. పోలీసులు కుమ్మక్కయ్యారనడానికి ఇది నిదర్శనం కాదా! నిందితులు అగ్రకులం వారు కనుక పోలీసులు కొమ్ము కాస్తున్నారు. పైగా వీరికి కావాల్సినంత రాజకీయ అండవుంది.

ఈ ఘటన జరగడానికి సరిగ్గా నెల కింద స్థానిక ఎంఎల్ఏ పుట్ట మధుకర్ మంథని మధుకర్‌ను పిలిచి ప్రేమ వ్యవహారం మానుకోకపోతే నీ అంతు చూస్తామని బెదిరించాడని, అన్నంతపని జరిగిందని తెలియజేస్తూ తల్లి కంటికి పుట్టెడు ఏడుస్తుంది. అప్పుడే చెప్పింది తల్లి వద్దురా గొప్పోల్లతో ఈ వ్యవహారం మనకు మంచిదికాదని. మనకులం లోనే మంచి అమ్మాయిని చూస్తానని చెప్పింది.

ప్రేమ ఈ తల్లిలా ఆలోచిస్తుందా. ఇప్పుడీ తల్లి కడుపుకోతకు రాజకీయ అండ కారణం కాదా? కాని దీన్ని ఆత్మహత్యగా చిత్రీకరిస్తున్న నేపథ్యంలో జిల్లా పోలీస్ కమిషనర్ విక్రమ్‌జిత్ దుగ్గల్ ఈకేసును తన చేతిలోకి తీసుకొని మొదటగా సిఐని బదిలీ చేసి విచారణ కొనసాగిస్తున్నాడు. అయినా ఇప్పటి వరకు ఎవరిని కూడా అరెస్టు చేయలేదు. పౌరహక్కుల సంఘం వేసిన పిటిషన్ ప్రకారం రీ పోస్టుమార్టం జరగాల్సి ఉంది.

అయితే రీ పోస్టుమార్టం జాతీయ మానవ హక్కుల సంఘం మార్గదర్శకాల మేరకు జరగాలి. నేరస్థులను హత్యా నేరం కింద, ఎస్‌సి/ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం కింద శిక్షించాలని ప్రజాసంఘాలు ఆందోళన చేస్తున్నాయి. ప్రభుత్వం మాత్రం ఇప్పటి వరకు పెదవి విప్పలేదు. ఒక్క ప్రభుత్వ అధికారి బాధితులను పరామర్శించలేదు. రాష్ట్రంలో దళితులకు రక్షణ కల్పించడంలో డొల్లతనం బయట పడుతుంది. కుటుంబీకుల మొర అరణ్య రోదన అవుతుంది.

నిజానికి ప్రభుత్వం ఈ సమస్యపై తమంతట తామే దృష్టిసారించి ఉండాల్సింది. సమస్య వచ్చినప్పుడు ప్రజలు ముందుగా ప్రభుత్వాలకు చెప్పుకుంటారు, న్యాయం జరుగుతుందని ఆశిస్తారు. ఈ విషయంలో కూడా అదే జరిగింది. విస్తృతమైన యంత్రాంగం కలిగి ఉన్న ప్రభుత్వం ఈపాటికే సమస్య గురించి నిగ్గు తేల్చాల్సింది. ఎలాంటి స్పందన లేకపోవడంతో దళితులు ప్రభుత్వంపై విశ్వాసం కోల్పోతున్నారు. నమ్మకం కొరవడడం పర్యవసానంగా న్యాయస్థానాలను ఆశ్రయించడం తప్పని స్థితి ఏర్పడింది. న్యాయస్థానాల్లో ఇప్పటి వరకు దళిత బాధితులకు న్యాయం జరగలేదు. నిందితులకు శిక్షపడలేదు.

ప్రభుత్వాల నిర్లక్ష్య వైఖరి వలన రాష్ట్రంలో రక్త చరిత్ర పునరావృతమవుతుంది. దళితులు రాలిపోతున్నారు. కంచిక చెర్ల కోటేశు నుంచి మొదలై మధుకర్‌తో ఆగి పోతుందా! ఆదిపత్యకుల రక్కసి కోరల్లో మరెంత మంది కోటేశు, మధుకర్‌లు సమిదలవ్వాలి? ఈ పరంపరలో ఇంకెంత మంది అగ్రకులానికి చెందిన మహిళలు తక్కువ కులం వ్యక్తులను ప్రేమించడం వలన పరువు హత్యలకు గురికావాలి?

అన్ని వ్యవస్థీకృత హింసల్లో బాధితులు అట్టడుగువర్గాల వాళ్లే. గత చరిత్రంతా కారంచేడు, చుండూరు, పదిరికుప్పం, వేంపెంట, లక్ష్మిపేట, ఖైర్లాంజి నిన్నటి ఖానాపూర్ దాకా అంతులేని వివక్షను ప్రాణాలను జానెడు జాగా అడిగినప్పుడో, ప్రేమ విషయంలోనో, కులం పేరుతో హింసలు పెట్టి చంపినదంతా దళిత రక్త చరిత్రే.

తెలంగాణలో ఇంత కాలం చుండూరు, కారంచేడు లాంటి మారణ హోమాలు జరగలేదు. కానీ మహబూబ్‌నగర్ జిల్లా పాతపల్లిలో దళితులపై జరిగిన దాడికి ప్రభుత్వ అండదండలు ఉండడం అమానుషం. కల్వకోలు బాలస్వామి సంఘటనలు తెలంగాణలో ఉన్న కరుడుగట్టిన పెత్తందారీ, భూస్వామ్య, అహంకారాలు నిగూఢంగా ఉన్నాయని గుర్తు చేస్తున్నాయి. మంథని మధుకర్ హత్య అవి తెలంగాణలో మళ్లీ పునరావృతం అవుతాయని హెచ్చరిస్తోంది. ప్రభుత్వాలు జ్యోతిరావు పూలే, సావిత్రీబాయి పూలే, అంబేడ్కర్ జయంతి, వర్ధంతులకు పూలమాలలు వేసి ఆ తరగతులను ఓటు బ్యాంకుగా మార్చుకున్నాయి. వారి ఆకాంక్షలను ఎక్కడా అమలు చేయడం లేదు. దీనికి కులం పేరుతో జరుగుతున్న హత్యలు ప్రబల సాక్ష్యం.

మధుకర్ కుటుంబానికి న్యాయం చేయాలని, దోషులను కఠినంగా శిక్షించాలని, కుటుంబానికి రక్షణ కల్పించాలని డిమాండ్ చేయటంతో పాటు శిరీషను రక్షించుకునే బాధ్యత కూడా ప్రజాసంఘాలు గుర్తించాలి.

శిరీషను తల్లిదండ్రుల చెర నుంచి విడిపించాలి. ఆమెను బంధువర్గం, తల్లిదండ్రుల దగ్గర కాకుండా ప్రభుత్వ యంత్రాంగం దగ్గర రక్షణ కల్పించాలని డిమాండు చేయాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఆమెను తక్షణమే పరువు హత్య నుండి కాపాడాలి.

ఇవేవి కాకపోయినా తల్లిదండ్రులు ఆమె చేత బలవంతంగా తప్పుడు పలుకులు పలికించే ప్రమాదం కూడా ఉందని గ్రహించాలి. దళిత, ప్రజాసంఘాలు ఏకమై రాష్ట్రంలో న్యాయాన్ని, శిరీషను పరిరక్షించుకోవాలి.

*(రచయిత అధ్యక్షులు పౌరహక్కుల సంఘం)* వీ

# కాళేశ్వరం ఎత్తిపోతల ప్రాజెక్ట్ - నిజానిజాలు

**ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులయ్యే వారికి మౌలిక సదుపాయాలు కల్పించకుండా ప్రభుత్వం కాళేశ్వరం ఎత్తిపోతల ప్రాజెక్టును కట్టడానికి ప్రయత్నిస్తున్నదని అంటున్నారు నిజనిర్ధారణ వేదిక సభ్యులు**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన కాళేశ్వరం లిఫ్ట్ ఇరిగేషన్ ప్రాజెక్ట్ పని ప్రారంభించినప్పటి నుండి పలు కారణాల రీత్యా అనేక వివాదాలకి కేంద్రం అయింది. దాదాపు పది సంవత్సరాల క్రితం రూపొందించిన ప్రాణహిత చేవెళ్ల ప్రాజెక్టును రీడిజైన్ చేసి బ్యారేజ్ స్థలం మార్చి, రిజర్వాయర్ల సంఖ్యను సామర్థ్యాన్ని పెంచి కాళేశ్వరం ప్రాజెక్టు రీ డిజైన్ చేసారు. 18.19 లక్షల ఎకరాలకు ఈ ప్రాజెక్ట్ సాగునీటిని అందిస్తుందని ప్రభుత్వం చెపుతున్నది. నిజానికి ఈ ప్రాజెక్ట్‌కి అంత సామర్థ్యం ఉన్నదా అనే ప్రశ్నతో పాటు అనేక సాంకేతిక, ఆర్థిక అంశాలను కుడా నిపుణులు, పౌరసమాజ సంఘాలు లేవనెత్తుతున్నాయి. మరీ ముఖ్యంగా ఈ ప్రాజెక్ట్‌కి అవసరమైన భూమి సేకరిస్తున్న గ్రామాలలో తీవ్రమైన ప్రతిఘటన ఎదురవుతున్నది. ఈ నేపథ్యంలో మహిళా రైతుల హక్కుల వేదిక తెలంగాణ శాఖ ఏప్రిల్ మొదటి వారం 2,3,4 తారీకులలో ప్రతిపాదిత కాళేశ్వరం ప్రాజెక్ట్ ప్రాంతంలో ఒక అధ్యయన యాత్ర జరిపింది. ఈ యాత్రలో పాల్గొన్న వారిలో ఎక్కువ మంది మహిళలు.

ఈ యాత్ర ముఖ్య ఉద్దేశాలలో ఒకటి మహిళల మీద భూసేకరణ ప్రభావాన్ని, వారి అనుభవాలని అర్థం చేసుకోవడం. అధ్యయన యాత్ర కాళేశ్వరం ప్రాజెక్ట్‌లో వివిధ పనులు ప్రారంభమైన మేడిగడ్డ, అన్నారం, సుందిళ్ల ప్రాంతాలలోని గ్రామాలను దర్శించింది. ఈ ప్రాంతాలలో బారేజీలు కట్టేపని జరుగుతున్నది. కన్నేపల్లి, ఉప్పట్ల, గోలివాడ గ్రామాలలో బారేజీలకి అవసరమైన పంప్ హౌస్ల నిర్మాణం జరుగుతున్న గ్రామాలను కూడా సందర్శించడం జరిగింది. మిడ్ - మానేరు, మల్లన్నసాగర్, కొండపోచమ్మ జలాశయాల కోసం భూసేకరణ జరిపిన గ్రామాలకు కుడా ఈ యాత్ర ప్రయాణించింది.

**వివిధ గ్రామాల పర్యటన తరువాత ముఖ్యమైన పరిశీలనలు**

ఒకే ప్రాజెక్టు కోసం భూసేకరణకి అనేక పద్ధతులను అనుసరించడం: ఈ యాత్ర అనేక గ్రామాల నుండి సాగుతున్నప్పుడు మా దృష్టికి వచ్చిన ముఖ్యమైన విషయం ఒకే ప్రాజెక్ట్ కోసం జరుగుతున్న భూసేకరణ కోసం రకరకాల పద్ధతులను, అనైతిక పద్ధతులను అనుసరిస్తున్నారు, దీనితో ప్రజల్లో భయాందోళనలు, అనుమానాలు కలుగుతున్నాయి. సమగ్ర ప్రాజెక్ట్ రిపోర్ట్‌ని ప్రజల ముందు చర్చకి ఉంచక పోవడంవల్ల ప్రాజెక్ట్ కోసం ఏ గ్రామంలో ఎంత భూమి సేకరిస్తున్నారు అనే విషయంలో స్పష్టత లేదు. ప్రభుత్వం మొదట జి.ఓ నెంబర్ 123 కింద భూమిని సేకరించింది. ఆ తరువాత 2013 చట్టం కింద నోటిఫై చేసింది. ఇదికాక అంబటిపల్లి, సూరారం, ఉప్పట్ల గ్రామాలలో ప్రాజెక్టు నిర్మాణ పనులు నిర్వహిస్తున్న కోయ అండ్ కొ, -మేగా ఇంజనీరింగ్ అండ్‌ఇన్ఫ్రాస్ట్రక్చర్ లిమిటెడ్ కంపెనీలు భూమి సొంతదారుల నుంచి నేరుగా భూమిని ప్రాజెక్ట్ కోసం కొనుగోలు చేస్తున్నారు. ప్రజాప్రయోజన ప్రాజెక్ట్‌కి ఇన్ని రకాలుగా పరస్పర విరుద్ధంగా భూమిని సేకరించవచ్చా? ప్రజాప్రయోజన ప్రాజెక్ట్ కోసం ప్రైవేట్ సంస్థలు ఏవిధంగా భూమిని కొనుగోలు చేస్తున్నాయి? అనే ప్రశ్నను మేము అడుగుతున్నాం.

**ఒకే రకమైన భూములకి వేరు వేరు పరిహారాలు :** అనేక పంటలు పండే, సాగునీటి సౌకర్యంగల సారవంతమైన ఒకే రకమైన భూములకి పరిహారం కింద వేరు వేరు మొత్తాలను చెల్లిస్తున్నారు. ఈ పద్ధతి గ్రామాల్లో ప్రజల మధ్య విభేదాలకి కారణం అవుతున్నది. సర్కారు వాళ్ల పరిహారం రేటు అయిదున్నర నుంచి ఏడు లక్షల దాక ఉండగా, ప్రైవేటు కాంట్రాక్టర్లు మాత్రం 11 లక్షల వరకు ఇచ్చి భూమి సొంతదారులని వలలోకి లాగుతున్నారు.

**తప్పనిసరైన అనుమతులు రాకముందే ప్రాజెక్టు పనుల ప్రారంభం**

ఈ ప్రాజెక్ట్‌కి కేంద్ర జల సంఘం, నిపుణుల కమిటీ నుంచి పర్యావరణ అనుమతి, అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖ నుంచి అడవుల డి నోటిఫికేషన్, తొలగింపులకి అనుమతి అవసరం. కానీ ఈ అనుమతులు క్లియరెన్స్‌లు ఏవి లేకుండానే ప్రాజెక్టుకి సంబంధించిన బారేజీల నిర్మాణం. మట్టి తవ్వకం, సొరంగానికి సంబంధించిన పనులు త్వరత్వరగా జరిగిపోతున్నాయి. ఈ విషయాలు అంబటి పల్లి , సూరారం, ఉప్పట్ల, సిరిపురం, గౌలిగూడ లాంటి అనేక గ్రామాలకి వెళ్లినప్పుడు వెలుగులోకి వచ్చినయి. ఇది అక్కడి ప్రజలను తీవ్ర వేదనకు, ఆందోళనకు గురిచేస్తున్నది.

**భూసేకరణలో విధాన పరమైన ఉల్లంఘనలు**

సాగునీటి ప్రాజెక్ట్‌కి పర్యావరణ ప్రభావ మదింపు తప్పనిసరి. ఈ విషయం 2006 మేలో సుప్రీం కోర్టు ఆర్డర్‌లోను, 2013 భూసేకరణ చట్టంలోనూ స్పష్టంగా ఉన్నది. ఈ మదింపు జరగకుండానే కాళేశ్వరం ప్రాజెక్ట్‌కి భూసేకరణ జరిగింది. రెండవది భూసేకరణకి సంబంధించి మొదటి నోటిఫికేషన్ విడుదల చేసినప్పుడు రైతులు లేవనెత్తిన అభ్యంతరాలకి జిల్లా కలెక్టర్లు ఇప్పటిదాకా ఎటువంటి సమాధానం ఇవ్వలేదు. అంతేకాక డిక్లరేషన్ నోటిఫికేషన్లు, పరిహారం నిర్ణయానికి తేదీలను నిర్ణయించారు. 2013 భూసేకరణ చట్టానికి ఇది అతిక్రమణ. భూమి సొంతదారులకి ముందస్తు సమాచారం ఇవ్వకుండానే భూమి సర్వే మొదలుపెట్టారు. రికార్డులలో ఉన్న భూమి వివరాలకి, సర్వే నెంబర్‌లకి, భూమి విస్తీర్ణానికి, సొంతదారుల పేర్లకి, గ్రామ స్థాయి సమాచారానికి పొంతన లేకపోవటంవల్ల. కన్నేపల్లి వంటి గ్రామాలలో భూమి సర్వే మూడు నాలుగుసార్లు చేసారు. 2017 జనవరిలో 123 జి.ఓ. మీద హైకోర్ట్ ఇచ్చిన మధ్యంతర ఉత్తర్వులకి వ్యతిరేకంగా 2017లో ఈ గ్రామంలో 40 ఎకరాల భూమిని ఇదే జి.ఓ. కింద సేకరించారు.

అధికారులు ఈ భూముల రిజిస్ట్రేషన్ తేదీలను డిసెంబర్ 2016గా చూపించారు. భూసేకరణ విషయంలో మొత్తం మీద పారదర్శకత జవాబుదారితనం లేకపోవడంగా కనిపిస్తున్నది. సిద్దిపేట జిల్లా ములుగు మండలంలో కొండపోచమ్మ జలాశయం కిందకి వస్తున్న మామిడ్యాల, బహిలంపూర్, తానేదార్‌పల్లి గ్రామాల నుంచి అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖకి అటవీ భూములను ప్రాజెక్ట్‌కి సేకరించడం కోసం అధికారులు చెల్లని గ్రామసభ తీర్మానాలను పంపించడానికి కూడా ప్రయత్నం చేసారు.

**భూమి లేనివారికి, ఇతర వర్గాల వారికి పునరావాస ప్రయోజనాల ప్రసక్తే లేదు**

భూమిలేని వ్యవసాయ కూలీలు, కౌలు రైతులు, గ్రామాలలోని ఇతర ప్రజల గురించి ఇప్పటిదాక అధికారికంగా ఎటువంటి లెక్కలు వేయలేదు. సారవంతమయిన భూములున్న ఈ గ్రామాలలో ప్రజల మీద ఈ ప్రాజెక్ట్ తీవ్రమైన ప్రతికూల ప్రభావాన్ని చూపిస్తుంది. ఎక్కువ మంది వ్యవసాయ కూలీలు, కౌలురైతులు మహిళలే. పునరావాసానికి సంబంధించి పక్కా ప్రణాళికలు లేకుండా ప్రాజెక్ట్ కోసం భూములని సేకరించడం 2013 భూసేకరణ చట్టాన్ని అతిక్రమించడమే. హైకోర్టు మధ్యంతర ఉత్తర్వులకి స్పందనగా తెలంగాణ ప్రభుత్వం భుమిలేనివారి, ఇతర బాధిత వర్గాలవారి పునరావాసం కోసం జి.ఓ.నెంబర్ 38ని తీసుకువచ్చింది. ఈ విషయమై సర్కారు ఏవిధమయిన చర్యలు చేపట్టలేదు.

**భూసంస్కరణల తిరోగమనం**

షెడ్యూల్డ్ కులాల, జాతుల, ముఖ్యంగా స్త్రీలకి వివిధ భూపంపిణీ కార్యక్రమాల కింద ఇచ్చిన భూమిని ప్రాజెక్ట్ కోసం సేకరిస్తున్నారని ముస్యాల, ఉప్పట్ల లాంటి గ్రామాలకి వెళ్లినప్పుడు తెలిసింది. పేదలకు ఇచ్చిన భూమిని తిరిగి లాక్కోవడం తిరోగమన భూసంస్కరణ తప్ప మరేమీ కాదు.

**నిర్వాసితం- సామాజిక దుష్పరిణామాలు**

ఇంత భారీ భూసేకరణలో సామాజిక దుష్పరిమాణాలు కూడా భారీగానే ఉంటాయి. గౌరవెల్లి జలాశయం కింద భూములు కోల్పోతున్న గ్రామాల్లో భూమిని కోల్పోతున్న భయం, తప్పని నిర్వాసితం, యువతకు ఉపాధి లేకపోవడం తీవ్ర ప్రభావాన్ని చూపిస్తున్నాయి. భూములకు నష్టపరిహారం వచ్చింది కాబట్టి ఆడపిల్లలకి భారీగా కట్నాలు అడగడం, భూములు పోతున్నాయి కాబట్టి మొగపిల్లలకి పెళ్లి సంబంధాలు రాకపోవడం, కుదిరిన పెళ్లిళ్లు ఆగిపోవడం జరుగుతున్నది.

**మానవ హక్కుల ఉల్లంఘన**

ప్రాజెక్టు పనులు జరుగుతున్న ప్రాంతంలో మానవ హక్కుల ఉల్లంఘన జరుగుతున్నది. తవ్వకాలు, మట్టిదిబ్బలు, బ్లాస్టింగ్ లాంటి పనులు మానవ హక్కైన సంచార స్వేచ్ఛని అడ్డగిస్తున్నాయి. ఉదాహరణకి పెద్దపల్లి జిల్లా గోలివాడ గ్రామంలో సుందిళ్ల బ్యారేజ్ కోసం 14 పంప్ హౌస్‌ల నిర్మాణం కొరకు బ్లాస్టింగ్‌లు జరుపుతున్నారు, దీనివల్ల గ్రామస్తుల ఇల్లు దెబ్బతింటున్నాయి, గోడలు నెర్రెలు పెడుతున్నాయి. రైతులను పంటపొలాల వైపు వెళ్లనివ్వడంలేదు. భూముల్ని ఇవ్వడానికి నిరాకరించిన రైతులు వ్యవసాయం చేసుకోవడానికి అవకాశం లేకుండా చేస్తున్నారు. ఈ గ్రామాల్లో అనేక అభివృద్ధిపనుల మీద నిషేధం అమలో ఉంది.

**కోర్టు ఉత్తర్వుల ఉల్లంఘన**

సుందిళ్ల బ్యారేజ్ పంప్ నిర్మాణం కోసం భూసేకరణ జరుగుతున్న గోలివాడ గ్రామంలో ప్రజలు హైకోర్టులో కేసు వేయగా 247 ఎకరాల భూమి సేకరణపై హైకోర్టు స్టే ఇచ్చి ఆ భూములను రైతులు తదుపరి ఉత్తర్వులు అందేవరకు గతంలో మాదిరిగానే సాగు చేసుకోవచ్చని ఉత్తర్వు ఇచ్చింది. అయితే హైకోర్టు ఉత్తర్వును కూడా ఖాతరు చెయ్యకుండా ఏప్రిల్ 15న రెండు బెటాలియన్ల పోలీస్‌ను దింపి బలవంతంగా భూములను స్వాధీనం చేసుకుంటున్నట్లు అవార్డ్ ఉత్తర్వు కాపీని తీసుకోవాలని, భూములను ఖాళీ చెయ్యాలని గ్రామస్తులను బెదిరించారు.

**మా డిమాండ్లు**

1) కాళేశ్వరం ప్రాజెక్ట్ కోసం మోసం, ద్రోహం, తప్పుడు మార్గాలు, నకిలీ గ్రామసభ తీర్మానాలు వంటి దౌర్జన్యకర పద్ధతుల ద్వార చేస్తున్న భూసేకరణను ఆపివేయాలి. ప్రజలలో భయాలు, అనుమానాలు సృష్టించడం ఆపివేయాలి.

2) రాజ్యాంగబద్ధంగా ఎన్నుకోబడిన ప్రభుత్వంగా ప్రభుత్వ ఆదేశిత సూత్రాలకి, ప్రజాస్వామ్య విలువలకి తన నిబద్ధతని చేతలలో చూపించాలి. కాళేశ్వరం ప్రాజెక్ట్ లాంటి భారీ ప్రాజెక్ట్‌ల రూపు మార్చేటప్పుడు ప్రజలలో విస్తృతంగా చర్చలు జరపాలి. గ్రామసభ స్థాయి నుంచి పైదాక చర్చలు జరగాలి. 2013 భుసేకరణ చట్టంలో పొందుపరచబడిన అన్ని ప్రజాస్వామ్య విధానాలను కంటి తుడుపుగా కాకుండా నిబద్ధతతో అమలు చేయాలి. గవర్నమెంట్ ఆర్డర్స్ ద్వారా వాటిని నీరుకార్చే ప్రయత్నం చేయకూడదు.

3) మహిళా రైతుల హక్కుల కోసం పనిచేస్తున్న పౌర సంఘంగా, రైతులుగా, కూలీలుగా, భూమి మీద ఆధారపడిన ఇతర వృత్తిదారులుగా మహిళలకి, మరీ ముఖ్యంగా షెడ్యూల్ కులాల, జాతుల, బి.సి. కులాల మహిళలకి ప్రభుత్వ పాలసీల తయారీలో ప్రాధన్యత ఇవ్వాలి.

4) అధికారంలోకి వచ్చి మూడు సంవత్సరాలు గడిచినా రాష్ట్రానికి ఇప్పటిదాక ఒక సమగ్రమైన వ్యవసాయ విధానాన్ని ప్రభుత్వం రూపొందించలేదు. సమగ్ర వ్యవసాయ విధానం లేకుండా ఇరిగేషన్ విధానాలు, ప్రాజెక్ట్‌లు కట్టడం ఆపివేయాలి. నీటి వినియోగ విధానాలు, భూమి వినియోగంతోటి, పంటల విధానంతోటి అర్ధవంతంగా కలిసి వుండాలని ఇవన్నీ కలిపి ఒక విస్తృత విధాన పరిధిలో భాగంగా ఉండాలి.

5) ప్రజల పన్నులతోనూ, బ్యాంకుల ఫండింగ్‌తోనూ కాళేశ్వరం ప్రాజెక్ట్‌ల వంటి ప్రాజెక్ట్‌లను రిడిజైన్ చేస్తున్న ప్రభుత్వం, 18 లక్షల ఎకరాలకి సాగునీరు లభిస్తుంది అని హామీ ఇస్తున్న ప్రభుత్వం, భవిష్యత్తులో ఆ భూములు సాగు చేస్తున్న రైతుల చేతిలోనే ఉంటాయని హామీ ఇవ్వగలదా? వ్యవసాయ భూములను కార్పొరేటు కంపెనీలకు పరిశ్రమలకు మళ్లిస్తున్న నేపథ్యంలో ఆ భూములు వ్యవసాయేతర ప్రయోజనాలకి మళ్లించ బడకుండా ఉండడానికి, వ్యవసాయదారులు కాని వారి చేతులలో పడకుండా ఉండడానికి ఎటువంటి విధానాలను చట్టాలను రూపొందిస్తోందా?

6) కాళేశ్వరం ప్రాజెక్టును ఏకపక్షంగా,. చట్ట విరుద్ధంగా పూర్తి చేయడానికి ప్రయత్నించడం ప్రజాస్వామిక తెలంగాణ ఉద్యమ స్ఫూర్తికి విరుద్ధం. అందుకే తెలంగాణ సామాజిక ఆర్థిక అభివృద్ధి చట్రంలో కాళేశ్వరం ప్రాజెక్టు ఎంతవరకు ప్రయోజనకరంగా ఉంటుందో పునః పరిశీలించాలి.

ఈ ప్రాజెక్టు గురించి ప్రజలు ముఖ్యంగా మహిళలు లేవనెత్తుతున్న ప్రశ్నలను పరిగణలోకి తీసుకుని పరిష్కరించాలి.

నిజనిర్ధారణలో పాల్గొన్న వారు - ఎస్. ఆశాలత (మహిళా రైతుల హక్కుల వేదిక); డా. ఉషా సీతాలక్ష్మి (మహిళా రైతుల హక్కుల వేదిక); మీరా సంఘమిత్ర (ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక, మహిళా రైతుల హక్కుల వేదిక); ఆర్. లక్ష్మి (మహిళా రైతుల హక్కుల వేదిక, టిజెఏసి); బీరం రాములు (రైతు స్వరాజ్య వేదిక, మహిళా రైతుల హక్కుల వేదిక) వీ

# విప్లవోద్యమ చరిత్రలో నక్సల్బరీ

**భారత సమాజ స్వభావాన్ని అర్ధ వలస, అర్ధ భూస్వామ్యంగా విశ్లేషించుకొని పార్లమెంటరీ రాజకీయాలకు ప్రత్యామ్నాయంగా ముందుకు వచ్చిన నక్సల్బరీ రైతాంగ సాయుధ పోరాట చరిత్ర పరిణామ క్రమాన్ని వివరిస్తున్నారు ఎ. నర్సింహా రెడ్డి**

## నక్సల్బరీ ప్రజ్వలనానికి యాభై ఏళ్లు

యాభై సంవత్సరాల కింద దేశంలో ఒక మూలన ఒక కుగ్రామంలో భూపోరాటంలో ప్రాణాలు బలిపెట్టిన ఏడుగురు ఆదివాసి స్త్రీలు, ఇద్దరు పిల్లలు, ఇద్దరు పురుషులు, ఆ తరువాత దేశవ్యాప్తంగా దావానలం అయిన నిప్పురవ్వను రగిల్చారు. ఒక బిందువు మహానది అయినట్టు భారత పీడిత ప్రజల కన్నీటి మహానది వ్యవస్థను ప్రశ్నించే, ధిక్కరించే, కూలదోసే సంఘటిత నిర్మాణంగా ఎదిగింది. ఒక గ్రామంలో కొన్ని ఎకరాల భూమి మీద అధికారం కోసం ప్రారంభమైన ఘర్షణ దేశంలోని సమస్త రంగాలనూ ప్రభావితం చేసి ఒక ప్రత్యామ్నాయ ప్రజా అభివృద్ధి మార్గాన్ని దేశం ముందుంచింది.

భూపోరాటాలు, ఆధిపత్య వర్గాల హత్యాకాండలు భారత చరిత్రలో అంతకు ముందు ఎన్ని జరిగినా అవి ఘటనలుగా మిగిలిపోయాయి గాని నక్సల్బరీ ఒక నిరంతర నవనవోన్మేష పరిణామాన్ని, ప్రక్రియను ప్రారంభించింది. ఆ ప్రక్రియ ప్రారంభమైన ఐదు దశాబ్దాలు గడిచినా, అనేక చోట్ల ఉద్యమం అపజయం పాలైనా, వేలాది మంది అమరులు బలయిపోయినా నక్సల్బరీ ఆగలేదు. వెనుకంజ వేయలేదు. తిరిగి తిరిగి వచ్చింది నక్సల్బరీ, తనకు మరణమే లేదంది నక్సల్బరీ అని కవి రాసినట్టు ఇవాళ్టికి నక్సల్బరీ కొనసాగుతున్న ప్రజా ప్రత్యామ్నాయ ఉద్యమంగా ఉంది.

నక్సల్బరీ గ్రామంలోని ఆదివాసి అమరుల అమరత్వం దినం *1967, మే 25*కు యాభై సంవత్సరాలు నిండుతున్న సందర్భంగా నక్సల్బరీ పూర్వరంగం గురించి, నక్సల్బరీ పుట్టుక గురించి, నక్సల్బరీ శ్రీకాకుళాలు అపజయానికి గురైన తరువాత పునరుద్ధరించడానికి కార్మికరంగంలోను, ఆదివాసి ప్రాంతాలలోను జరిగిన ప్రయత్నాల గురించి, ఇవాళ్టికి నక్సల్బరీ ప్రాసంగికత గురించి వీక్షణం పాఠకుల కోసం ప్రత్యేక వ్యాసాలు అందిస్తున్నది.

నక్సల్బరీ ఉద్యమానికి యాభై ఏళ్లు నిండాయి. నక్సల్బరీ అనేది ఒక గ్రామం. పశ్చిమ బెంగాల్‌లోని డార్జిలింగ్ జిల్లా, సిలిగురి సబ్ డివిజన్‌లోని హిమాలయ పర్వత పాదంలో ఉంది. ఆ ప్రాంతమంతా కొండలు, వల్చని అడవి. జనాభా ప్రధానంగా సంథాల్, ఓరావ్, రాజవంశీ తెగలకు చెందిన గిరిజనులే. వీరంతా భూమిని 'అధియార్' కాంట్రాక్టు పద్ధతి కింద దున్నుకునే గిరిజనులు. వీరంతా దారిద్ర్యం అంచున బతుకుతున్న వారే.

నక్సల్బరీ భారత అర్ధ వలస, అర్ధ భూస్వామ్య సామాజికార్థిక వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా నూతన ప్రజాస్వామిక సమాజ స్థాపనకు దేశానికి ఒక విప్లవ పంథాను అందించింది. జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు పొందిన ఒక మహా విప్లవోద్యమానికి సంకేతమైంది. భారత ప్రజా ఉద్యమ చరిత్ర గతిని మార్చిన అద్భుత పరిణామం. దేశంలో మరే ప్రజా ఉద్యమమూ సాధించనటువంటి విస్తృతమైన ప్రభావాన్ని సకల జీవన రంగాల మీద ప్రసరించిన ఉద్యమం నక్సల్బరీ.

1857లో వలసవాదానికి వ్యతిరేకంగా జరిగిన భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంతో బీజరూపంలో ప్రారంభమైన భారత ప్రజాస్వామిక విప్లవం అనేక పరిణామాల అనంతరం 1967 మార్చి నుంచి అర్ధ వలస - అర్ధ భూస్వామ్య దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా 'నూతన ప్రజాతంత్ర విప్లవ' రూపంలో కొనసాగుతోంది. చైనాలో విప్లవం ఎలా విజయవంతమయిందో అలాగే భారత్‌లో కూడా నూతన ప్రజాస్వామిక విప్లవం ద్వారా విముక్తి సాధించవచ్చని పయనిస్తోంది.

నక్సల్బరీ ఉద్యమం ప్రధానంగా 1947 ఆగస్టు స్వాతంత్ర్యం బూటకమని, ప్రజల స్వేచ్ఛ స్వాతంత్ర్యాల కొరకు, దోపిడీ పీడన లేని వ్యవస్థ కొరకు, కార్మిక-కర్షక ఐక్యతతో ప్రజాస్వామిక విప్లవం సాగించాలని, అధికార మార్పిడి తదనంతర పరిస్థితి పట్ల నూతన అవగాహనను, దోపిడీ పీడన అణచివేతలతో సతమతమవుతున్న దుర్భర దుస్థితిని మార్చడానికి నూతన రాజకీయ కార్యాచరణను తీసుకొచ్చింది. తెలంగాణ, తెభాగా పోరాటాల స్ఫూర్తితో నూతన దిశను నిర్దేశించడం ద్వారా దేశంలో ప్రజాస్వామిక విప్లవానికి ఒక రూపకల్పన చేసింది.

**భారత సామాజికార్థిక వ్యవస్థ స్వభావం**

నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని అర్థం చేసుకోవాలంటే 1947 ఆగస్టు 15 అధికార మార్పిడికి ముందు, ఆ తర్వాత భారత పాలక

వర్గాలు అనుసరించిన రాజకీయార్థిక విధానాలను అర్థం చేసుకోవాల్సి ఉంది.రెండు శతాబ్దాల పాటు బ్రిటిష్ వలస పాలనలో భారత్ మగ్గింది. బ్రిటిష్ ప్రవేశం నాటికి ఇండియాలో ఫ్యూడల్ సంబంధాలు బలహీన పడడం ప్రారంభమయ్యాయి. స్వదేశీ, విదేశీ వాణిజ్యం జరుగుతుంది. ద్రవ్య వ్యవస్థ బీజరూపంలో ఉనికిలోకి వచ్చింది. మన దేశ భూస్వామ్య సమాజ గర్భంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడం మొదలైంది. మ్యానుఫాక్చరింగ్, మైనింగ్ ఆవిర్భవించింది. అయితే, బ్రిటిష్ వలస వాదులు ఆ స్వతంత్ర పెట్టుబడిదారీ విధాన అభివృద్ధిని అడ్డుకున్నారు. బ్రిటిష్ వలసవాదుల రాకతో భారత సమాజం భూస్వామ్యం నుండి వలస, అర్ధ భూస్వామ్యంగా మారింది.

బ్రిటిష్ పాలకులు వచ్చేనాటికి ఒక రాజ్యంగా, లేదా ఒక దేశంగా ఇండియా అన్నది లేనేలేదు. అనేక ఫ్యూడల్ రాజ్యాల కింద ఇండియా విభజించబడి ఉన్నది. కొన్నిచోట్ల బానిస సంబంధాలు సైతం వివిధ రూపాల్లో కొనసాగుతున్న పరిస్థితి. అత్యంత హేయమైన కుల వ్యవస్థతో సమాజం విభజించబడి ఉన్నది. దళితులు, అనేక వెనుకబడిన కులాల ప్రజలు వెట్టిచాకిరీలో మగ్గుతున్న పరిస్థితి. భూస్వామ్య, బానిస దోపిడీ పద్ధతులు కొనసాగుతున్న స్థితిలో దేశం వలసపాలన కిందికి వెళ్లింది.

మరోవైపు భారత సామాజికార్థిక వ్యవస్థలోని లోతులకు చొచ్చుకు పోయిన కులవ్యవస్థ, సామాజికార్థిక వ్యవస్థను ఘనీభవింపజేసిన స్వయం సమృద్ధ గ్రామీణ ఆర్థిక వ్యవస్థ, భారత సమాజ పురోగమనానికి అనుకూలించనందున మన దేశ సామాజికార్థిక శక్తులు పశ్చిమ దేశాల్లోలాగ సమాజ పరివర్తనకు పురోగామి పాత్రను పోషించలేక పోయాయి.

బ్రిటిష్ వలస పాలకులు మనదేశానికి రాకముందు మనది భూస్వామ్య సమాజం. బ్రిటిష్ వలస పాలనతో అర్ధ భూస్వామ్య సమాజంగా మారింది. భారతీయ బూర్జువావర్గం దళారీ అవతారం ఎత్తింది. వారి ప్రయోజనాలు బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రయోజనాలతో ముడిపడి ఉన్నందున, దానికి సేవ చేయడమే వారి కర్తవ్యంగా ఉంది. దేశంలో జాతీయ పెట్టుబడిదారీ విధానాన్ని అడ్డుకోవడానికి సామ్రాజ్యవాద ప్రయోజనాల కోసం దళారీ పెట్టుబడిదారీ వర్గాన్ని పెంచి పోషించింది.

బ్రిటిష్ పాలనలో భారత వనరులను విచ్చలవిడిగా లూటీ చేయడానికిగాను, భారతదేశ ఫ్యూడలిజంలో కొన్ని మార్పులు చేసి దాన్ని తమ ప్రధాన సాంఘిక పునాదిగా చేసుకున్నారు. పర్మనెంట్ సెటిల్‌మెంట్, రైత్వారీ, మహల్వారీ పద్ధతుల ద్వారా కొత్త తరహా భూస్వాములను తయారు చేశారు. గ్రామీణ ప్రాంతాలలో అర్ధ భూస్వామ్య సంబంధాలను పరిరక్షించి కాపాడడం, నిలబెట్టడం వలస పాలకులకు తప్పనిసరైంది. అలా చేయకపోతే, సాధారణ పరిస్థితుల్లో జాతీయ పెట్టుబడిదారీ వర్గం భూస్వామ్యాన్ని నాశనం చేసి, స్వతంత్ర పెట్టుబడిదారీ రాజ్యం ఏర్పాటు కోసం బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడి ఉండేది.

యూరప్‌లో పలు దేశాలలో జరిగినట్లు భారతదేశంలో పారిశ్రామిక పెట్టుబడి భూస్వామ్య వర్గాన్ని ఓడించి అభివృద్ధి చెందలేదు. సామ్రాజ్యవాద పోషణలో పెరుగుతూ, భూస్వామ్య వర్గంతో రాజీపడుతూ అభివృద్ధి చెందింది. పలువురు జమీందార్లు, ఫ్యూడల్ రాజులు పరిశ్రమలు స్థాపించారు. రైతాంగాన్ని దోచుకొని కూడబెట్టిన డబ్బుతో బరోడా, ట్రావంకోర్, మైసూర్, ఇండోర్ రాజులు పరిశ్రమలు నెలకొల్పారు. బెంగాల్‌లో జమీందార్లు పరిశ్రమలలో పెట్టుబడులు పెట్టారు. భూస్వామ్య పునాది చెక్కు చెదరకుండానే పరిశ్రమలు స్థాపించడం జరిగింది. భారత ప్రజలను ఫ్యూడల్ దోపిడీతో అణచివేసి, సంపదలు గడించినవారే వర్తకం, వడ్డీ వ్యాపారాలు చేస్తూ బ్రిటిష్ వలస పాలకులకు ముందుండి సహకరించారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పెంచి పోషించిన దళారీ బడా బూర్జువా, బడా భూస్వామ్య వర్గాలకు 1947 ఆగస్టులో సామ్రాజ్యవాద పెట్టుబడిని, ప్రయోజనాలను పరిరక్షించే షరతుపైన అధికారాన్ని బదలాయించింది. ఆ వర్గాలే భారత పాలక వర్గాలైనాయి. దీంతో సామ్రాజ్యవాద తాబేదార్ల పాలన భారత ప్రజలకు దీర్ఘకాల పీడనలాగా పరిణమించింది.

అధికార బదలాయింపుకు ముందుగానీ, ఆ తర్వాత గానీ ఏ సామాజిక విప్లవం భారత్‌లో జరుగలేదు. భారత ఆర్థిక వ్యవస్థ సామ్రాజ్యవాద ప్రయోజనాలకు లోబడి ఉండేలాగా, దేశ సహజ వనరులను దోచుకోవడమే లక్ష్యంగా భారత దేశానికి అధికారం బదిలీ అయింది. దేశ ఆర్థికాభివృద్ధి, స్వతంత్ర స్వయం పోషకం పేరుతో బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పాటు ఇతర సామ్రాజ్యవాద దేశాల పెట్టుబడులపై, సాంకేతిక పరిజ్ఞానంపై, విదేశీ రుణాలపై మరింతగా ఆధారపడే పరాధీన ఆర్థిక వ్యవస్థ కొనసాగుతోంది.

అభివృద్ధి, పారిశ్రామికీకరణ పేరుతో అనుసరించిన మిశ్రమ ఆర్థిక విధానాలు దళారీ బడా బూర్జువాజీ త్వరితగతిన పెరిగేందుకు తోడ్పడ్డాయి. భూస్వామ్య సంబంధాల్లో ఎలాంటి మార్పు తీసుకు రాలేదు. మరోవైపు సామ్రాజ్యవాదులు భారత దళారీ పెట్టుబడిదారులతో మిలాఖత్ అయ్యారు. ప్రైవేట్ ప్రభుత్వ రంగాల్లోని వివిధ పరిశ్రమల్లో వేలాది కోట్ల రూపాయలను పెట్టుబడులుగా పెట్టారు. అందరికీ సమాన అవకాశాలు, ప్రజాస్వామ్యం అంటూనే ప్రజల ప్రజాస్వామిక హక్కులను కాలరాచి, స్వయం ప్రతిపత్తి, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం విభిన్న జాతులు చేస్తున్న పోరాటాలను పాశవికంగా అణచివేసే ప్రయత్నాలు చేసాయి. 1966 కల్లా పాలకవర్గాలు అనుసరించిన సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ అనుకూల, ప్రజావ్యతిరేక విధానాల ఫలితంగా ప్రజల దారిద్ర్యం, నిరుద్యోగం పెరిగింది. ప్రజల కొనుగోలు శక్తి తగ్గినందున, దేశీయ మార్కెట్ క్షీణించి దేశంలో ఆర్థిక సంక్షోభం పరిణతి చెందింది. కొద్దిమంది దగ్గర భూమి, సంపద కేంద్రీకృతమైంది. ఈ నేపథ్యంలోనే నక్సల్బరీ దావానలంలా జ్వలించింది.

**భారత్‌లో కమ్యూనిస్టు పార్టీ ఏర్పాటు**

రష్యాలో లెనిన్ నాయకత్వాన 1917 అక్టోబర్ బోల్షివిక్ విప్లవ విజయ స్ఫూర్తితో 1920 అక్టోబర్ 22న తాష్కంట్‌లో ఏర్పాటైన భారత కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం 1925 నుంచి క్రమంగా పెరిగి అనేక రైతు, కార్మిక ఉద్యమాలకు నాయకత్వం వహించింది. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ఉనికిలోకి వచ్చిన తర్వాత రెండు దశాబ్దాలకు పైగా రాజకీయంగా అత్యంత సంక్షుభితమైన, సంఘర్షణా భరితమైన, విప్లవాత్మకమైన కాలం. సంస్కరణవాదం – విప్లవవాదం సంఘర్షించిన కాలం. అత్యంత క్రూరమైన, హింసాయుతమైన, పీడకమైన వలస పాలనను వదిలించుకోవాలన్న ఆకాంక్షలు కార్మికుల, కర్షకుల, విద్యార్థి

యువజనుల, ఇతర పీడిత వర్గాల పోరాటాల్లో, రాజకీయ కార్యాచరణల్లో బలంగా, వెల్లువలుగా సర్వత్రా ప్రతిఫలించాయి. ఉద్యమాల్లో త్యాగశీలత, అంకితభావం ఉప్పొంగిన కాలం. భారత కమ్యూనిస్టు పార్టీ అనేక అవరోధాల మధ్య, నిషేధాలు నిర్బంధాల మధ్య, ప్రజల మధ్య అత్యంత ఆదర్శవంతమైన, త్యాగపూరితమైన అవిశ్రాంత కృషి జరిపి ప్రజల నాయకుడిగా, ఒక ప్రత్యేకమైన రాజకీయశక్తిగా ఎదిగింది.

పార్టీ పుట్టుక నాటినుండే నిర్బంధానికి గురవుతూ వచ్చింది. ఉద్యమాలలో పాల్గొన్న కమ్యూనిస్టులపైన నిర్బంధకాండ అమలైంది. పెషావర్, లాహోర్, కాన్పూర్, మీరట్ కుట్రకేసులలో సహితం తమ లక్ష్యాలను, ఆశయాలను దాచుకోలేదు. సామ్రాజ్యవాదుల నుండి భారత ప్రజల విముక్తికొరకు పోరాడడం నేరంకాదని, ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక అణచివేతల నుండి, శ్రమ దోపిడి నుండి కార్మిక, కర్షక, బడుగువర్గాల విముక్తి కొరకు ఉద్యమించడం నేరంకాదని, స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు ప్రజల హక్కుని నిర్భయంగా చాటిచెప్పారు. సామ్రాజ్య వాదానికి, ఫ్యూడలిజానికి, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా ప్రజలు సంఘటితం కావాల్సిన అవసరాన్ని ఎలుగెత్తి చాటారు.

1921-35 మధ్య కాలంలో వచ్చిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తీర్మానాలు, స్టాలిన్ ప్రసంగాలు భారత విప్లవ వ్యూహానికి సంబంధించిన అంచనాలను, అనుసరించాల్సిన మార్గదర్శక సూత్రాలను సూచించాయి. అయితే, భారత కమ్యూనిస్టు ఉద్యమం మొదటి నుండి అనేక బలహీనతలకు లోనైంది. 1925లో స్టాలిన్ "జాతీయ విముక్తి యుద్ధంలో కమ్యూనిస్టుల స్వతంత్ర పాత్ర, జాతీయ విప్లవ సంఘటన ఏర్పాటు. ఈ సంఘటనలో జాతీయ విముక్తి ఉద్యమానికి నాయకత్వం వహించడానికి కార్మికవర్గ ఆధిపత్యాన్ని నెలకొల్పుట. బూర్జువా వర్గాన్ని నాయకత్వ స్థానం నుంచి అంచెలంచెలుగా తొలగించడం. అదేవిధంగా, రైతాంగాన్ని విస్తారంగా ఉద్యమంలోకి సమీకరించి, సంఘటితపరచి శ్రామికవర్గ నాయకత్వాన బలమైన, అభేద్యమైన కార్మిక-కర్షక ఐక్యతను, మైత్రిని సాధించాలని" సూచించారు.

అయినా జాతీయోద్యమంలో స్వతంత్ర పాత్రను పోషించలేదు. దేశీయ పరిస్థితిపై సమగ్రమైన అంచనాలతో విప్లవ వ్యూహాన్ని రూపొందించలేదు. ఫ్యూడల్ వ్యతిరేక రైతాంగ ఉద్యమంపై కేంద్రీకరించి సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమానికి పునాది వేయలేకపోయింది.

కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిన తర్వాత మూడు దశాబ్దాల వరకు అంటే 1951 వరకు విప్లవ వ్యూహం (పార్టీ కార్యక్రమం) లేకుండానే రాజకీయ తీర్మానాలతోనే గడిచిపోయింది.

1947 తర్వాత భారతదేశ నిర్దిష్ట పరిస్థితులను సరిగా విశ్లేషించి సరైన వ్యూహం - ఎత్తుగడలను రూపొందించడంలో పార్టీ విఫలమైంది. వరుసగా అతివాద, మితవాద ధోరణులకు గురైంది. పార్టీ తీవ్రమైన మితవాత్వ జాడ్యాన్ని ఎదుర్కొంది. సిద్ధాంత, నిర్మాణ, కార్యక్రమాన్ని ప్రజాస్వామ్య ఉద్యమానికి అన్వయించడంలో జరిగిన వైఫల్యంతో పార్టీ శ్రేణులు పలుగందరగోళానికి గురయ్యారు. నిర్దిష్ట పరిస్థితులపై నిర్దిష్ట విశ్లేషణ అనేది మార్క్సిజం సారంగా ఉంటుంది.

అధికార మార్పిడి తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీ ప్రజాస్వామిక విప్లవం పట్ల, భారతదేశ స్వాతంత్ర్య స్వభావం పట్ల, దేశ సామాజికార్థిక వ్యవస్థ పట్ల సిద్ధాంత రాజకీయ, నిర్మాణపరమైన కర్తవ్యాలను రూపొందించడంలో అవకతవక లకు గురైంది. ఫలితంగా కమ్యూనిస్టు ఉద్యమం ప్రజలకు ప్రత్యామ్నాయ ఉద్యమ మార్గాన్ని అందివ్వలేక పోయింది. నెహ్రూ ప్రభుత్వానికి బేషరతుగా మద్దతు ప్రకటించింది. పార్టీపైన కాంగ్రెస్ ఎన్ని దాడులు చేసినా మౌనంగా ఉంటామని సిపిఐ పార్టీ ప్రధాన కార్యదర్శిగా పి.సి. జోషి ప్రకటించి తన లొంగుబాటును ప్రదర్శించాడు.

1947 డిసెంబర్‌లో జరిగిన కేంద్ర కమిటీ పి.పి.జోషిని తొలగించి రణదివెను ప్రధాన కార్యదర్శి చేసింది. ఆ తర్వాత వచ్చిన పార్టీ నేతలు కూడ అతికొద్ది కాలంలోనే మితవాద తిరోగమన వైఖరి అవలంబించారు. భారత కమ్యూనిస్టు పార్టీ తన అభిప్రాయాలు మార్చుకుంటూ వచ్చింది. అందువల్ల నక్సల్బరీ ఉద్యమాన్ని అర్థం చేసుకోవాలంటే స్వాతంత్ర్యా నంతరం భారత కమ్యూనిస్టు పార్టీ భారత సామాజికార్థిక వ్యవస్థ పట్ల, పాలక వర్గాల పట్ల, విప్లవోద్యమం పట్ల రూపొందించుకున్న అవగాహనను కూడ అర్థం చేసుకోవాలి.

భారత కమ్యూనిస్టు పార్టీ 1947 జూన్ కేంద్ర కమిటీ సమావేశంలో స్వాతంత్ర్యం గురించి దిగువ పేర్కొన్న సూత్రీకరణ చేసింది. "అన్ని వైపుల నుండి ఒత్తిడి రావడంతో గత్యంతరం లేక సామ్రాజ్యవాద పాలకులు భారత నాయకత్వంతో చర్చలకు దిగవలసి వచ్చింది.... ప్రజలను విడగొట్టి, తిరోగామి శక్తులను బలోపేతం చేసి వారితో ఒప్పందం కుదుర్చుకోవడమే (సామ్రాజ్యవాదుల) ఏకైక లక్ష్యం."

1948లో జరిగిన కలకత్తా కాంగ్రెసులో కూడా స్వాతంత్ర్యం బూటకమని పునరుద్ఘాటించింది. "మౌంట్‌బాటెన్ పథకం ప్రజలకు ఇచ్చింది నిజమైన స్వాతంత్ర్యం కాదు. బూటకపు స్వాతంత్ర్యమే... ఇంతకాలం రాజ్యానికి వెలుపల ఉంచబడిన భారత బూర్జువావర్గం జాతీయ ప్రజాస్వామిక విప్లవాన్ని నీరుగార్చడానికే రాజ్యాధికారంలో భాగస్వామ్యం కల్పించారు. సామ్రాజ్యవాదాన్ని, దానితో మిలాఖతైన బూర్జువావర్గాన్ని ఓడించడానికి కార్మికుల, శ్రమించే రైతుల, పెటి బూర్జువాలతో కూడిన ప్రజాస్వామిక రాజ్యమనే నినాదం మాత్రమే అందరినీ కూడగట్టి ముందుకు నడిపించగలుగుతుంది" అని తీర్మానించింది.

1947 ఆగస్టు నాటి అధికార మార్పిడి స్వభావం ఏమిటి? పూర్తి చేయవలసిన కర్తవ్యాలు ఏమిటి? భారత విప్లవ వ్యూహం ఏమిటి? అన్న అంశాలపైన కేంద్ర స్థాయిలోనూ, పార్టీ అంతటా పరిస్థితులకు సంబంధించి, వాస్తవాల ఆధారంగా ఉద్వేగరహితంగా సాగించాల్సిన చర్చలను కేంద్ర నాయకత్వం నిర్వహించలేదు. భారత రాజ్య స్వభావానికి సంబంధించి కమ్యూనిస్టుపార్టీలో స్థూలంగా మూడు భిన్న వైఖరులు వ్యక్తమయ్యాయి, ఘర్షణ పడ్డాయి.

మొదటిది, భారత్‌లో ఏర్పడింది 'జాతీయ ప్రభుత్వం' అన్న వైఖరి. రెండవది, దేశంలో కొత్తగా ఏర్పడిన ప్రభుత్వం జాతీయ బూర్జువావర్గం జూనియర్ భాగస్వామిగా సామ్రాజ్యవాదంతో అధికారం పంచుకొంటున్న ప్రభుత్వం అనీ, సామ్రాజ్యవాదం ఆధిక్యత వహిస్తున్న ప్రభుత్వం అనీ చెప్పింది. ఇది సామ్రాజ్యవాదంపై ఆధారపడిన ఒక ఉపగ్రహ రాజ్యం అనీ, ప్రపంచ బలాబలాల్లో వచ్చిన మార్పుల దృష్ట్యా పాత బూర్జువా

ప్రజాతంత్ర విప్లవ దశ పూర్తయిందనీ, 'ప్రజాతంత్ర విప్లవ కర్తవ్యాల పూర్తి-సోషలిస్టు నిర్మాణం' రష్యా విప్లవం మాదిరిగా ఏకకాలంలో పూర్తి చేయాల్సి ఉంటుందని, అవి పెనవేసుకొని సాగుతాయని చెప్పింది.

మూడవది, 1948 ఏప్రిల్‌లో తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటానికి నాయకత్వం వహిస్తున్న ఆంధ్ర కమిటీ ఒక థీసిస్‌ని రూపొందించి కేంద్రకమిటీ ముందుంచింది. దీనినే ఆంధ్ర థీసిస్ అంటారు. ఈ థీసిస్ మన వ్యవస్థ దళారీ బూర్జువా, భూస్వామ్య వ్యవస్థ అనీ, కార్మికవర్గ నాయకత్వాన కార్మిక కర్షక మైత్రిని నెలకొల్పుతూ, జాతీయ బూర్జువా వర్గాన్ని కలుపుకురావడం విప్లవ వ్యూహంగా నిర్వచించింది. అలాగే గ్రామస్థాయిలో కూలీలు, పేద రైతాంగం, మధ్యతరగతి, ధనిక రైతాంగంతో కూడిన సంఘటన ఏర్పాటు చేయడం, ప్రజా విప్లవపంథాలో వ్యవసాయ విప్లవోద్యమాన్ని నిర్మించడం, గ్రామాలను విముక్తి చేస్తూ విముక్తి ప్రాంతాలను నిర్మించుకొంటూ సాగే విప్లవమనీ నిర్వచించింది. చైనా విప్లవ మార్గమే భారత విప్లవ మార్గమని స్పష్టం చేసింది. జాతీయ స్థాయిలో నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టు పార్టీకి ఒక సరైన విప్లవ రాజకీయ లక్ష్యాన్ని, మార్గాన్ని ఈ థీసిస్ అందించింది. అయితే, ఆంధ్ర థీసిస్‌ని మితవాద, అవకాశవాద, సంస్కరణవాదంగా రణదివె నిందించాడు.

నిజాం నవాబుకు వ్యతిరేకంగా (1946-51) చారిత్రాత్మకమైన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటానికి ఆంధ్ర కమిటీ నాయకత్వం వహించింది. భారతదేశంలో వ్యవసాయ విప్లవం పునాదిగా నూతన ప్రజాస్వామిక విప్లవ రాజ్యస్థాపన మార్గంగా సాగిన మొదటి పోరాటం ఇది. భారతదేశ విముక్తికి ఒక మార్గాన్ని అందించిన విలువైన పోరాటం. తెలంగాణ పోరాటం గెరిల్లా పోరాటం స్థాయికి ఎదిగింది. 4 వేల మంది అమరులయ్యారు. 3 వేల గ్రామాలు, పది లక్షల ఎకరాల భూమి ప్రజల స్వాధీనంలోకి వచ్చింది. ఫ్యూడల్ నిరంకుశ భూస్వాములు వారి గడీలనొదలి పారిపోయారు.

అయితే పార్టీ నాయకత్వం వర్గ సామరస్య విధానాలను చేపట్టి తెలంగాణలో చైనా విప్లవపంథా వెలుగులో నిర్మించబడుతున్న ప్రజాతంత్ర విప్లవోద్యమాన్ని సంస్కరణ వాదంగా కొట్టివేసింది.

పార్లమెంటరీ పంథాలో కూరుకుపోయి 1951 మేలో జరిగిన కేంద్ర కమిటీ సమావేశం 1952 జనరల్ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటాన్ని విరమించాలని నిర్ణయం చేసింది. ఆ నిర్ణయం మేరకు 1951 అక్టోబర్ 21న పోరాటాన్ని విరమించింది.

1951 తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట విరమణ, పార్లమెంటరీ పంథాకు పరిమితమవడంతో భారత కమ్యూనిస్టు పార్టీ తన విశ్వసనీయతను, క్రియాశీలతను కోల్పోయింది. భారత కమ్యూనిస్టు పార్టీ మౌలికంగా మార్క్సిజం -లెనినిజాన్ని తన సిద్ధాంతంగా, దృక్పథంగా స్వీకరించినప్పటికీ దీర్ఘకాలం సంస్కరణవాదాన్ని ఆచరణలో పెట్టింది. అఖిల భారత స్థాయిలో నెహ్రూ జాతీయ బూర్జువా ప్రతినిధియని, పటేల్ దళారీ బూర్జువా, భూస్వామ్య వర్గాల ప్రతినిధియని నిర్వచించింది. జాతీయ బూర్జువా నాయకత్వాన జాతీయ ప్రజాతంత్ర విప్లవం కొనసాగుతుందనీ, దానికి నెహ్రూ నాయకుడనీ నిర్వచించింది. పటేల్ నాయకత్వాన ఉన్న దళారీ బూర్జువా, భూస్వామ్యవర్గం అభివృద్ధి నిరోధకమైనదనీ, అది కాంగ్రెస్‌లోని ప్రగతిశీల శక్తులకు ఆటంకంగా వ్యవహరిస్తున్నదనీ, కనుక కమ్యూనిస్టులు నెహ్రూ నాయకత్వాన్ని బలపరచాలనే వైఖరి తీసుకొన్నది.

పార్టీ ఏర్పడి ముప్పై ఏళ్లు గడిచాక 1951లో ప్రత్యేక కాన్ఫరెన్స్ ప్రప్రథమంగా పార్టీ కార్యక్రమం ముసాయిదాను రూపొందించింది. దానిని 1953లో జరిగిన పార్టీ మూడవ సభ ఆమోదించింది. 1951 కార్యక్రమం 'భారత రాజ్యాంగం ప్రజావ్యతిరేకమైనదనీ, సామ్రాజ్యవాదులకు సేవచేస్తూ, వారిపట్ల లొంగుబాటు వైఖరి కలిగి ఉంటుందనీ, భూస్వాములకు, పెట్టుబడిదారులకు ఉపయోగ పడుతుందనీ' నిర్వచించింది. ఇంకా 'నెహ్రూ నాయకత్వాన ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వం పరాన్న భుక్కులయిన భూస్వాముల, రాజుల, సంస్థానాధిపతుల ఆస్తులను కాపాడుతానని ప్రతిజ్ఞ చేసిందని' చెప్పింది. 'ప్రస్తుత ప్రజావ్యతిరేక ప్రభుత్వాన్ని తొలగించి, దాని స్థానంలో జనతా ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని నెలకొల్పాలని, దీని కోసం దేశంలోని ప్రజాతంత్ర, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నింటినీ కార్మికవర్గ నాయకత్వాన ఐక్యం చేయాల'ని పిలుపు నిచ్చింది.

అనతి కాలంలోనే 1951 కార్యక్రమం (వ్యూహం - ఎత్తుగడలు) తీవ్రమైన మార్పులకు గురైంది. 1953 డిసెంబర్‌లో మధురైలో జరిగిన మూడవ మహాసభలో అంతర్జాతీయ పరిస్థితిపై అంతకుముందున్న అవగాహనలో మౌలిక మార్పులను తీసుకొచ్చింది. "బడా బూర్జువా వర్గం సామ్రాజ్యవాదంతో సత్సంబంధాలను కొనసాగిస్తున్నప్పటికీ ఇటీవల కాలంలో వాటి మధ్య వైరుధ్యాలు కూడా తలెత్తాయి" అని మహాసభ భావించింది. దేశాన్ని స్వతంత్రమైన దేశంగా మార్చడానికి బూర్జువా వర్గం చేస్తున్న ప్రయత్నాలను సామ్రాజ్యవాదులు వ్యతిరేకించడం వల్లనే ఈ వైరుధ్యం తలెత్తిందని పార్టీ మహాసభ తీర్మానించింది. "స్వాతంత్ర్యాన్ని సాధించాలి" అన్న సూత్రీకరణ స్థానంలో "స్వాతంత్ర్యాన్ని రక్షించాలి" అన్న సూత్రీకరణను తెచ్చింది. జనతా ప్రజాతంత్ర విప్లవ లక్ష్యం స్థానంలో మధ్యంతర నినాదంగా ప్రజాస్వామిక ఐక్య సంఘటన అవగాహనను ముందుకు తెచ్చింది.

1953కు ముందున్న అవగాహన ప్రకారం భారతదేశంపై కొనసాగుతున్న సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని, దానితో మిలాఖతైన బూర్జువా వర్గం ఆధిపత్యాన్ని కూలదోయకుండా ప్రజాస్వామిక సమాజం ఉనికిలోకి రాదు. అంటే సమాజంలోని ఆధిపత్య వర్గాలకు వ్యతిరేకంగా ప్రజలు తిరగబడినప్పుడే కొత్త సమాజం ఆవిర్భవిస్తుంది.

1953లో మారిన దృక్పథం ప్రకారం నెహ్రూ ప్రభుత్వ పురోగామి విధానాల అమలు వలన పేదరికం తొలగిపోతుందని, అసమానతలు అంతమవుతాయని పార్టీ భావించింది. అందుకే ఆధిపత్యాన్ని అంతం చేయడానికి ప్రజలను సమీకరించే కర్తవ్యాన్ని పార్టీ వదిలేసింది.

1953 మార్చిలో స్టాలిన్ మరణానంతరం కృశ్చేవ్, బ్రెజ్నెవ్ నాయకత్వాన ఉన్న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, ప్రభుత్వం క్రమంగా ఆధునిక రివిజనిస్టు విధానాలను అనుసరించసాగాయి. లెనిన్, స్టాలిన్‌లు నెలకొల్పి అమలుచేసిన విప్లవ సంప్రదాయాలు, విప్లవ సిద్ధాంతాలను తిరగదోడారు. 1956లో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20వ మహాసభలో

రష్యా విప్లవానికి ద్రోహం తలపెట్టారు. పలు దేశాల్లో జాతీయ విముక్తి కోసం పోరాడుతున్న ప్రజల ఆలోచనలో కొంత గందరగోళాన్ని సృష్టించింది. శాంతియుత పరివర్తన, శాంతియుత సహజీవనం, శాంతియుత ఆర్థిక పోటీలకు సంబంధించిన అపభ్రంశపు సూత్రాలను ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం మీద రుద్ద ప్రయత్నించారు. సోవియట్‌లో ఆధునిక రివిజనిస్టు సిద్ధాంతాలు వ్యాప్తి చేశారు. పెట్టుబడిదారీ పునరుద్ధరణ సాగించారు. అంతర్జాతీయంగా పీడిత ప్రజల ఉద్యమాలను అణచివేయడం, వెనుకబడిన దేశాలపై ఆధిపత్యాన్ని చలాయించడం జరిగింది. అమెరికాతో పోటీగా సోషల్ సామ్రాజ్యవాదం ఏర్పడింది.

భారత జాతీయ కాంగ్రెస్ 1956లో అవడి సమావేశంలో సోషలిస్టు తరహా సమాజాన్ని నిర్మించాలన్న లక్ష్యాన్ని ప్రకటించిన తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీకి ప్రభుత్వ విధానాలపై నమ్మకం మరీ ఎక్కువైంది. సోషలిస్టు విధానాల ద్వారా ప్రభుత్వం అభివృద్ధిని తీసుకొచ్చి స్వావలంబనను పెంపొందించగలదని ఆశించింది. నెహ్రూ ప్రభుత్వం రూపొందించిన అభివృద్ధి నమూనాలోని పురోగామి అంశాలను క్రమంగా విస్తృతపర్చడం, సక్రమంగా అమలయ్యేటట్టు చూడటం కమ్యూనిస్టులు తమ ప్రధాన కర్తవ్యంగా ఎంచుకొన్నారు.

1962 భారత్ – చైనా యుద్ధం తరువాత కమ్యూనిస్టు ఉద్యమంలో విభేదాలు తీవ్రమై భారత కమ్యూనిస్టు పార్టీ సిపిఐ, సిపిఐ(ఎం)లుగా చీలిపోయింది. 1964లో భారత కమ్యూనిస్టు పార్టీ బొంబాయిలో జరుపుకొన్న 7వ పార్టీ మహాసభలో ఒక కార్యక్రమం ఆమోదించింది. దీని ప్రకారం భారతదేశంలో జాతీయ బూర్జువావర్గం అధికారంలో ఉంది. ఇది పెట్టుబడిదారేతర మార్గంలో స్వతంత్ర ఆర్థిక విధానాన్ని అభివృద్ధి చేయడానికి ప్రయత్నిస్తున్నది. 1964లో కలకత్తాలో జరిగిన సిపిఐ(ఎం) 7వ పార్టీ మహాసభ ఆమోదించిన కార్యక్రమం ప్రకారం దేశంలో ఉన్నది బడా బూర్జువా వర్గ నాయకత్వాన ఉన్న బడా బూర్జువా బడా భూస్వామ్య కూటమి ప్రభుత్వం అని చెప్పింది. స్వభావరీత్యా జాతీయ బూర్జువావర్గమే (బడా బూర్జువాతో సహా) ఇది. ఐతే ఇది సామ్రాజ్యవాదంతో పోరాటం – రాజీ అన్న ద్వంద్వ విధానం అనుసరిస్తున్నది. కార్మికవర్గ నాయకత్వాన జనతా ప్రజాతంత్రాన్ని సాధించడం విప్లవ లక్ష్యమని చెప్పింది.

సోవియట్ నాయకత్వాన్ని, వారి దివాళాకోరు విధానాలను ఆనాడు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని ఆధునిక రివిజనిజానికి వ్యతిరేకంగా మావో నాయకత్వంలోని చైనా కమ్యూనిస్టు పార్టీ గ్రేట్ డిబేట్ ద్వారా ఎండగట్టారు. ఈ డిబేట్‌లో అత్యంత ప్రధానమైన సిద్ధాంత సమస్యలు చర్చించబడ్డాయి. ఈ డిబేట్ మార్క్సిజానికి – రివిజనిజానికి మధ్య జరిగింది.

1964లో ఏర్పడిన చీలిక తర్వాత ఏర్పడ్డ సిపిఐ(ఎం) కూడ ఆచరణలో పాత విధానాలనే అనుసరించడం జరిగింది. కమ్యూనిస్టు పార్టీ చీలిపోయి సిపిఐ(ఎం) ఏర్పడినప్పుడు విప్లవ శ్రేణులు వర్గపోరాటం మళ్లీ ఎజెండా మీదికి వస్తుందని ఆశించినా సిపిఐ(ఎం) ఆచరణ నిరాశనే మిగిల్చింది. 1967 నాటికి సిపిఐ(ఎం) పూర్తిగా ఎన్నికల ఊబిలో కూరుకుపోయింది. భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు)గా ఏర్పడినప్పటి నుండి సైద్ధాంతిక విషయాలపై భారత విప్లవ వ్యూహంపై తీవ్ర వాదోపవాదాలు, చర్చలు జరిగాయి. 1964లో సిపిఎం పార్టీ ఏడవ కాంగ్రెస్ ముందు చారుమజుందార్ "రైతుల ఉద్యమాల పాత్ర, సాయుధ పోరాట సన్నాహాలు, పార్లమెంటరీ పంథా, రహస్యపార్టీ ఆవశ్యకత, సోవియట్ రష్యాపై అంచనా" వంటి అంశాలపై తమ వైఖరిని స్పష్టం చేయాలని పార్టీ నాయకత్వాన్ని కోరాడు.

చారు మజుందార్ ఎనిమిది డాక్యుమెంట్లను 1965-67 మధ్యకాలంలో రాశాడు. ఇవి చారిత్రాత్మకమైన '8 డాక్యుమెంట్లు'గా ప్రసిద్ధి గాంచాయి. వీటిని రివిజనిస్టు వ్యతిరేక చారిత్రక డాక్యుమెంట్లని చెప్ప వచ్చు. వీటి ద్వారా రైతాంగానికి, కార్మికులకు, ప్రతి జాతికి ఆయుధాలు చేపట్టండి, పోరాటాలకు సాయుధ యూనిట్లను నిర్మించండి, సాయుధ యూనిట్లను రాజకీయంగా చైతన్యం చేయండని పిలుపునిచ్చాడు. భారతదేశాన్ని అర్ధవలస, అర్ధ భూస్వామ్య దేశంగా గుర్తిస్తూ, విప్లవంలో రైతాంగ ప్రధాన శక్తి అని, వర్గపోరాట ప్రాతిపదికపై మాత్రమే కార్మిక – కర్షక ఐక్యత సాధ్యం అని, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి గ్రామాలను విముక్తం చేసి విముక్తి ప్రాంతాల నిర్మాణానికి కృషి చేయాలని ఆయన 8 డాక్యుమెంట్లలో స్పష్టం చేశాడు.

నక్సల్బరీ గ్రామ జనాభాలో అత్యధికులు సంథాల్ గిరిజనులు. గిరిజన రైతాంగాన్ని స్థానిక భూస్వాములు (జోతేదార్లు) అధియార్ పద్ధతి కింద దోపిడీ, పీడనలకు గురిచేసేవారు. తెభాగా పోరాటం నాటి నుంచి రైతాంగ చైతన్యం ఏదో ఒక స్థాయిలో ఉంటూ వచ్చిన ఈ గ్రామం 196' మార్చి 3న ఒక విశిష్టమైన చర్యకు సాక్షిగా నిలిచింది. ఆ రోజున నక్సల్బరీలోని ఒక జోతేదార్ పంట పొలాన్ని రైతులు ఆక్రమించు కొని, చుట్టూ ఎర్రజెండాలు పాతి పంటను స్వాధీనం చేసుకున్నారు. ఆ ప్రాంతపు రైతుసంఘం ఈ చర్యను ప్రశంసిస్తూ "భూమి మీద భూస్వాముల గుత్తాధిపత్యాన్ని రద్దు చేయాలి. రైతు కమిటీల నాయకత్వంలో భూమి పంపిణీ జరగాలి. భూస్వాముల, గ్రామీణ అభివృద్ధి నిరోధకుల ప్రతిఘటనను నిరోధించడానికి రైతులను సంఘటితం చేసి సాయుధ పోరాటం చేయాలి" అని పిలుపునిచ్చింది. ఈ రైతాంగ పోరాటానికి సిలిగురి డివిజన్ కార్యదర్శిగా చారు మజుందార్, అతనితో పాటు కానుసన్యాల్, జంగల్ సంతాల్, సౌరెన్‌బోస్‌లు నాయకత్వం వహించారు.

నక్సల్బరీ, ఖరీబరీ, ఫాన్సీదేవా పోలీస్‌స్టేషన్ల పరిధిలోని 274 చదరపు మైళ్ల ప్రాంతంలో 1967 మార్చి, ఏప్రిల్ మధ్యకాలంలోనే 60 చోట్ల భూస్వాధీనం, పంటస్వాధీనం సంఘటనలు జరిగాయి. రైతులు సంఘటితమయ్యారు. రైతు కమిటీలు నిర్మాణమయ్యాయి. భూస్వాముల భూమిని స్వాధీనం చేసుకున్నారు. జోతేదార్ల దగ్గర ఉన్న భూ పత్రాలను స్వాధీనం చేసుకొని తగులబెట్టారు. వేలాది మంది రైతులు స్వచ్ఛందంగా ఈ పోరాటంలో భాగస్వాములయ్యారు. ఈ పోరాటం మే 23 –25 మధ్య ఉద్రిక్తతకు దారితీసింది. 1967 మే 23న ఉద్యమ కార్యకర్తలైన రైతులను, గిరిజనులను నిర్బంధించడానికి గ్రామానికి వచ్చిన పోలీసులను ప్రజలు ఎదిరించారు. ఈ ఘర్షణలో ఒక పోలీస్ ఇన్‌స్పెక్టర్ మృతి చెందగా కొందరు పోలీసులు గాయపడ్డారు. ఇందుకు ప్రతీకారంగా మే 25న యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం నక్సల్బరీలోని ప్రసాద్‌జోత్ గ్రామంపై సాయుధ బలగాలతో దాడి చేయించి ఏడుగురు స్త్రీలను, ఇద్దరు పిల్లలను కాల్చి చంపింది. ఈ ఘటనతో ప్రజలకు, భూస్వాముల ప్రభుత్వానికి మధ్య 'రైతాంగ విముక్తి యుద్ధం' ప్రారంభమైందని పోరాట నాయకుడు చారుమజుందార్ ప్రకటించాడు.

రివిజనిస్టు సిద్ధాంత ఆచరణలను బద్దలు కొడుతూ పార్లమెంటరీ పంథాను తిరస్కరించి, కార్యకర్తల్లో గూడుకట్టుకున్న నిరాశ నిస్పృహల్ని పారదోలుతూ ఉద్యమ రూపంలో పెల్లుబికినదే 'నక్సల్బరీ సాయుధ పోరాట పంథా'. ఈ నేపథ్యంలోనే భారతదేశంలో వసంతమేఘం గర్జించింది. అవకాశవాద రివిజనిస్టు కమ్యూనిస్టులకు, విప్లవకర కమ్యూనిస్టులకు మధ్య స్పష్టమైన విభజనరేఖను గీసింది నక్సల్బరీ.

నక్సల్బరీ ఉద్యమం భారతదేశంపై సామ్రాజ్యవాద ఆధిపత్యం బలంగా ఉందని, సామ్రాజ్యవాదులు దేశాన్ని కొల్లగొడుతున్నారని, దేశం లోపల ఫ్యూడల్ సంబంధాలు ఇంకా బలంగానే కొనసాగుతున్నాయని వివరించింది. అందుకే భారతదేశం అర్ధవలస, అర్ధ భూస్వామ్య దేశమని, ఇందులో భూస్వాములే ప్రజలకు ప్రధాన శత్రువులని పేర్కొన్నది. భూస్వాముల సామాజిక-ఆర్థిక ఆధిపత్యాన్ని కూలగొట్టి ప్రజలు అధికారాన్ని చేజిక్కించుకొని దేశాన్ని విముక్తి చేయాలని సంకల్పించింది. ఆ లక్ష్య సాధనకు కార్యాచరణను రూపొందించింది.

అట్లా దేశ పరిస్థితిని మార్చడానికి నక్సల్బరీ ఉద్యమం ఒక కొత్త అవగాహనను ముందుకు తీసుకొచ్చింది. నక్సల్బరీ రైతాంగ ఉద్యమం భూమి, భుక్తి, విముక్తి అనే నినాదాలతో తన లక్ష్యాన్ని స్పష్టంగా నిర్వచించుకున్నది. దున్నేవాడికే భూమి ప్రాతిపదికగా, వ్యవసాయ విప్లవం ఇరుసుగా సాగే నూతన ప్రజాస్వామిక విప్లవం తన సైద్ధాంతిక దృక్పథంగా ప్రకటించుకున్నది.

నక్సల్బరీ గ్రామంలో, పరిసర గ్రామాలలో రైతాంగ పోరాటాల ప్రారంభం, ఆ పోరాటాలపై ప్రభుత్వ నిర్బంధం బెంగాల్ రాష్ట్రంలోనే గాక దేశవ్యాప్తంగా ప్రతిస్పందనలకు దారితీశాయి. విద్యార్థి - యువజనులు, మధ్యతరగతి మేధావులు దేశవ్యాప్తంగా నక్సల్బరీ పోరాట సంఘీభావ సమితిలు ఏర్పాటుచేసి ఆ పోరాటానికి మద్దతు ప్రకటిస్తూ ఆందోళనలు చేపట్టారు. నక్సల్బరీ పోరాట ప్రతిధ్వనులు దేశవ్యాప్తంగా వినిపించసాగాయి.

నక్సల్బరీ ఒక పోరాట మార్గంగా ఆదివాసులను, రైతు కూలీలను, మధ్యతరగతి బుద్ధిజీవులను పెను సంచలనంలోకి తీసుకెళ్లింది. ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాకుళం, బీహార్‌లోని ముషాహరి, గోపీవల్లభ్‌పూర్-దేబ్రా, ఉత్తరప్రదేశ్‌లోని లఖింపూర్ - ఖేరి, బెంగాల్‌లోని బీర్భూం, కేరళలోని వైనాడు, పంజాబ్‌లోని ఫిరోజ్‌పూర్ వంటి ఎన్నో చోట్ల రైతాంగ పోరాటాలు ఉప్పెనలా ప్రారంభమయ్యాయి.

నక్సల్బరీ ఉద్యమానికి ఉన్న విశిష్టత, దాని దృక్పథంలోని స్పష్టత, దాని సంఘటిత నిర్మాణ స్వభావాన్ని గమనిస్తే, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడం అనే లక్ష్యం ప్రధానంగా ఉంది. నక్సల్బరీ రైతాంగ పోరాటం అనతికాలంలోనే ఒక అఖిల భారతస్థాయి పోరాటంగా విస్తరించింది. ప్రజల్లో భూమి, భుక్తి, విముక్తి గురించి ఆకాంక్షలు వెల్లువెత్తాయి. ఈ పోరాటాలు కోట్లాది మంది పీడిత ప్రజల హృదయాలను తాకాయి. నక్సల్బరీ ఉద్యమం పీడితవర్గాల ఆకాంక్షలను రేకెత్తించడంతో పాటు ఆయా బృందాలకు పోరాట చైతన్యాన్నిచ్చింది. పోరాటాల ద్వారానే సమస్యలు పరిష్కారమవుతాయని, విన్నపాలు, ఫిర్యాదులు, బేరసారాల ద్వారా పరిష్కారం లభించదని నక్సల్బరీ స్పష్టం చేసింది.

సిపిఐ రివిజనిస్టు, సిపిఐ(ఎం) నయా రివిజనిస్టు విధానాలను, ఆర్థిక పోరాటాలతో కలిసిన పార్లమెంటరిజాన్ని నక్సల్బరీ తిరస్కరించింది. అసమాన ఆర్థిక, రాజకీయ, సామాజిక అభివృద్ధి కారణంగా పట్టణాలలోని కార్మికవర్గ తిరుగుబాటు ద్వారా అధికారం చేపట్టడం అసాధ్యమని చారు మజుందార్ చెప్పాడు. పట్టణ ప్రాంతాలల్లో కంటే వస్తుగత, స్వీయాత్మక పరిస్థితులు అనుకూలంగా ఉన్న గ్రామీణ ప్రాంతాల్లో మొదట విముక్తి ప్రాంతాలను ఏర్పరచి, వాటిని విస్తరించి, దేశ వ్యాపితంగా అధికారం చేజిక్కించుకోవడం ద్వారా మాత్రమే అధికారం చేపట్టడం సాధ్యమవుతుందన్నారు. వ్యవసాయక విప్లవం ప్రధానంగా ఉండే భారత విప్లవంలో రైతాంగం పాత్ర ప్రాముఖ్యాన్ని గుర్తించాడు. కార్మికవర్గ నాయకత్వంలో రైతాంగ విప్లవం ప్రధాన చోధక శక్తిగా ఉంటుందని ఆయన పేర్కొన్నాడు.

పశ్చిమ బెంగాల్‌లో అధికార పార్టీ సిపిఐ(ఎం)లో తిరుగుబాట్లు మొదలయ్యాయి. 1965 నుంచి చారు మజుందార్ చేస్తున్న ప్రతిపాదనలు నక్సల్బరీ పోరాటంతో ఆచరణలోకి వచ్చాయి. బీహార్, ఆంధ్రప్రదేశ్, కేరళ, తమిళనాడు, ఉత్తరప్రదేశ్, పంజాబ్, కాశ్మీర్ తదితర రాష్ట్రాల్లో సిపిఐ (ఎం) నాయకత్వంపై బహిరంగ తిరుగుబాట్లు జరిగి 1967 నవంబర్ 13 నాటికి సిపిఎం లోని విప్లవకారుల అఖిల భారత సమన్వయ కమిటీ (ఎఐసిసి) ఏర్పడింది. ఈ కమిటీకి వెలుపల కూడ కొన్ని ఎంఎల్ గ్రూపులు ఉన్నాయి.

1968 మే నాటికి ఆ కమిటీ సిపిఐ(ఎం)తో పూర్తిగా తెగతెంపులు చేసుకొని అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటీ (ఎఐసిసిసిఆర్) గా మారింది. చివరికి ఏప్రిల్ 22, 1969న భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు)గా ఆవిర్భవించింది. మావో ఆలోచన విధానాన్ని అంగీకరిస్తూనే సిపిఐ(ఎంఎల్) పార్టీకి వెలుపల వేర్వేరు పేర్లతో, వేర్వేరు గ్రూపులుగా పనిచేస్తున్న కమ్యూనిస్టు విప్లవకారులందరు విప్లవ వ్యూహం పట్ల ఒకే అవగాహన ప్రకటించి ఉన్నారు. వారంతా భారతదేశంలో ఉన్నది అర్ధవలస-అర్ధఫ్యూడల్ సమాజమని, మన విప్లవం ప్రస్తుతం నూతన ప్రజాతంత్ర విప్లవదశలో ఉందని ప్రకటించారు.

నక్సల్బరీ రైతాంగ ఉద్యమం అణిచివేతకు గురైనా, నక్సల్బరీ రాజకీయాలను, సాయుధ వ్యవసాయక విప్లవ రాజకీయాలను అణిచివేయ లేకపోయారు. అది దేశమంతా విస్తరించింది. 'నూతన సమాజాన్ని గర్భంలో ధరించి ఉన్న పాత సమాజానికి బలప్రయోగం మంత్రసాని' వంటిదనే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఎత్తిపట్టింది నక్సల్బరీ. ప్రత్యక్ష వలసానంతర భారతదేశంలో నక్సల్బరీ సాయుధ పోరాటం లాగా విస్తృతస్థాయిలో సుదీర్ఘకాలంగా అనేక ఆటుపోట్లను ఎదుర్కొంటూ కొనసాగుతున్న ఉద్యమం మరొకటి లేదు.

అలాగే ఎన్ని వైఫల్యాలు, పరిమితులు ఉన్నప్పటికీ సమాజంలోని శ్రామికవర్గ ప్రజలందరి సమస్యల్ని తడుముతూ బలమైన మార్క్సిస్టు - లెనినిస్టు - మావో ఆలోచన సైద్ధాంతిక అవగాహనలతో కూడుకున్న వ్యూహం - ఎత్తుగడలతో అమెరికా సామ్రాజ్యవాద, బడా దళారీ బూర్జువా, బడా భూస్వామ్య కూటమికి వ్యతిరేకంగా దోపిడీ పీడనలు లేని సామాజిక వ్యవస్థ స్థాపన కొరకు త్యాగాలతో కొనసాగుతున్న ఉద్యమానికి నక్సల్బరీ ప్రేరణ, దిక్సూచి.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# నక్సల్బరీ పురిటి నొప్పులు

**భారత విప్లవోద్యమంలో చరిత్రాత్మకమైన నక్సల్బరీ ఉద్యమం ప్రారంభం కావడానికి పశ్చిమ బెంగాల్‌లోని సిలిగురి డివిజన్‌లో నక్సల్బరీ అనే గ్రామంలో 1967 మే 25కు ముందు, ఆ రోజు దారితీసిన పరిస్థితులను వివరిస్తున్నారు బి. రామకృష్ణ**

భారత సమాజంలో ప్రత్యామ్నాయ పరిష్కారంగా దూసుకొచ్చిన సంఘర్షణ నక్సల్బరీ. మౌలిక సమస్యల ఆకాంక్షల పరిష్కారాలు వెలుగు చూడని నేపథ్యంలో పెల్లుబికి వచ్చిన దివ్వె నక్సల్బరీ. ప్రజా రాజ్యాధికార దిశలో విఫలమైన అప్పటి కమ్యూనిస్టు పార్టీల రాజకీయాలకు జవాబుగా ముందుకొచ్చిన లేలేత సూర్యకిరణం నక్సల్బరీ. అనన్య త్యాగాలను, ఉడుకు రక్తాలను ఉరకలెత్తించింది నక్సల్బరీ. ఎంతోమంది యువకులను, విద్యార్థులను, మేధావులను తనలో కలుపుకుని కదిలి వచ్చింది నక్సల్బరీ. నక్సల్బరీ ఒక తొలకరి, ఒక పలకరింపు, ఒక పులకరింపు, ఒక జలదరింపు. భారత దేశంలో విప్లవ వెల్లువ నక్సల్బరీ.

పడుతూ లేస్తూ, లేస్తూ పడుతూ; వాడుతూ, చిగురిస్తూ; గెలుస్తూ ఓడుతూ, ఓడుతూ, గెలుస్తూ నాటి నుండి నేటివరకు దోపిడీ, పీడనల వ్యవస్థను ధిక్కరిస్తూ సుదూర స్వప్నాలను సమ సమాజ లక్ష్యాన్ని చేరుకోవడానికి చేస్తున్న ప్రయాణం నక్సల్బరీ. ఆ ప్రయాణంలో ఒడిదొడుకులు, తప్పొప్పులు, అలుపుసొలుపులు, మూల మలుపులు, చిక్కుముళ్లు ఎన్నో.

నక్సల్బరీ లక్ష్యం స్పష్టం. మార్గం స్పష్టం. ఆ మార్గం నచ్చడం, నచ్చక పోవడం ఆ ప్రయాణంలో తప్పొప్పులను పక్కన పెడితే, దాని లక్ష్యం పట్ల లౌకిక, ప్రజాస్వామిక, సమాజ పురోగామి శక్తులకు బేదాభిప్రాయం ఉండాల్సిన అవసరమైతే లేదు.

నక్సల్బరీ అనేది పశ్చిమబెంగాల్ రాష్ట్రంలోని డార్జిలింగ్ జిల్లా సిలిగురి సబ్ డివిజన్‌లోని ఒక గ్రామం. భౌగోళికంగా నక్సల్బరీ ప్రాంతం అటు నేపాల్‌కు ఇటు బంగ్లాదేశ్ (ఒకప్పటి తూర్పు పాకిస్థాన్)కు అతి సమీపంలో ఉన్నది. నక్సల్బరీ, ఖరిబరీ, ఫన్సిదేవ ప్రాంతాలు సిలిగురి పరిధిలోకి వస్తాయి. ఈ ప్రాంతాలు 274 చదరపు మైళ్ల విస్తీర్ణంలో విస్తరించి ఉన్నాయి. వీటిలో లక్షా యాభై వేల జనాభా ఉండేది. యాభై వేల మంది వరకు టీ తోటల్లో కూలీలుగా పనిచేసేవారు. అక్కడి భూమి లేని రైతుకూలీలు సంతాలులు, ఓరానులు, రాజ్‌బన్షీలు, మేచి, లెప్చా, ఛూటియా, గుర్ఖా అనే వేర్వేరు ఆదిమ తెగలకు చెందిన వాళ్లు. వీరు ఆధియార్ (పంటవాటా) పద్ధతి ద్వారా భూస్వాములు (జోతేదార్లు) ఇచ్చిన విత్తనాలు, నాగళ్లు, ఎద్దుల సాయంతో పొలాలను సాగుచేసి పంటలో కొంత భాగాన్ని తీసుకునేవారు. వీరినే అధియార్లు అని అంటారు. జోతేదార్లంటే భూమి మీద హక్కు కలిగి ఉండి ఏ పనీ చేయకుండా ఆ భూమిలో భూమిలేని కూలి రైతులు పండించిన పంటలో ఎక్కువభాగం తీసేసుకునే వారు. జోతేదార్లు వడ్డీ వ్యాపారులుగా కూడా పేద రైతు కూలీలను పిప్పి చేసేవారు. వసూలు కానీ బాకీల కింద రైతులచే వెట్టి చాకిరీ చేయించుకునేవారు.

1967లో జరిగిన నక్సల్బరీ ఉద్యమానికి తేయాకు తోటల్లో 1966 సెప్టెంబర్‌లో జరిగిన పదహారు రోజుల సమ్మె పునాదిగా పనిచేసింది. తేయాకు తోటల యజమానులు తమ కింద పనిచేయడానికి కూలీలను వేర్వేరు ప్రాంతాల నుండి దిగుమతి చేసుకున్నారు. తరతరాలుగా అక్కడే స్థిరపడిన కూలీలు స్థానిక జనంలో భాగమైపోయారు. పరమ నికృష్టమైన దోపిడి కింద కుంగిపోయిన వీరంతా బానిసత్వస్థితిలో మగ్గిపోయారు. మిగులు భూములను ప్రభుత్వం స్వాధీన పరుచుకుని తమకు పంపిణీ చేయాలని తిరుగుబాటు చేశారు. వాళ్లు అంటిపెట్టుకుని ఉన్న భూముల నుంచి గెంటివేసి, ఏనుగుల చేత వారి గుడిసెల్ని టీ తోటల యజమానులు నేలమట్టం చేయించారు.

1967 మార్చ్ 2న పశ్చిమ బెంగాల్‌లో బంగ్లా కాంగ్రెస్, సిపిఐ, సిపిఐ (ఎం), ఫార్వర్డ్ బ్లాక్, సంయుక్త సోషలిస్టు పార్టీ(ఎఎస్‌పి), ప్రజా సోషలిస్ట్ పార్టీ(పిఎస్‌పి), రెవల్యూషనరీ సోషలిస్టు పార్టీ (ఆర్ఎస్‌పి), సోషలిస్టు యూనిటీ సెంటర్(ఎస్‌యుసి), లోక్‌సేవక్ సంఘ్ (ఎల్ఎస్ఎస్), గుర్ఖాలీగ్ (జిఎల్), వర్కర్స్ పార్టీ ఆఫ్ ఇండియా (డబ్ల్యుపిఐ)లతో కూడి ఉన్న 14 పార్టీల కాంగ్రెసేతర వామపక్ష ఐక్య సంఘటన అధికారంలోకి వచ్చింది. బంగ్లా కాంగ్రెస్‌కు చెందిన అజయ్ ముఖర్జీ ముఖ్యమంత్రిగా, సిపిఐ (ఎం)కు చెందిన జ్యోతిబసు హోంమంత్రి, ఉపముఖ్యమంత్రిగా, సిపిఐ (ఎం)కు చెందిన హరేకృష్ణ కోనార్ రెవెన్యు శాఖామంత్రులుగా ఎంపికయ్యారు.

ఈ ప్రభుత్వాన్ని 8 నెలల్లోనే ఇందిరాగాంధీ కూల్చేసింది. ఆహార మంత్రిగా ఉన్న పి.సి. ఘోష్ బంగ్లా కాంగ్రెసు నుండి బయటకు వచ్చి ప్రోగ్రెసివ్ డెమొక్రటిక్ ఫ్రంట్‌ను ఏర్పరిచి కాంగ్రెస్ పార్టీ మద్దతుతో ముఖ్యమంత్రి అయ్యాడు. ఈ ప్రభుత్వం 3 నెలల్లోనే రద్దై ఒక సంవత్సరం పాటు రాష్ట్రపతి పాలన విధించబడింది. తరువాత తిరిగి అజయ్ ముఖర్జీ ముఖ్యమంత్రిగా 5 నెలలు ఉన్నాడు. తిరిగి రాష్ట్రపతి పాలన వచ్చింది. 1971 మార్చిలో ఎన్నికలు జరిగాయి. 1967 ఎన్నికల్లో లెఫ్ట్ ఫ్రంట్ తాము అధికారంలోకి వచ్చాక మిగులు భూములను, జోతేదార్ల ఆక్రమణలో ఉన్న లక్షల కొద్ది ఎకరాల భూమిని భూమిలేని నిరుపేదలకు పంచుతామని వాగ్దానం చేసారు. కాని ఆచరణలో సాధ్యం కాలేదు.

1965 నుండి 1967ల మధ్య చారు మజుందార్ అతని అనుయాయులు ఎన్నో చిన్న చిన్న రైతాంగ ఉద్యమాలను సమీకరించారు. అయితే నక్సల్బరీ ఉద్యమం అనేది మావోయిజంతో కూడి ఉన్న పెద్ద నూతన ప్రయోగం. మొట్టమొదటి సారిగా చైనా మార్గంలో

మావోయిజంను అన్వయించడం నక్సల్బరీ ప్రత్యేకత. చారుమజుందార్ మావోయిజంను ప్రస్తుత మార్క్సిజం, లెనినిజంగా చూసాడు.

సిలిగురి సిపిఐ(ఎం)కు చెందిన చారుమజుందార్, కానుసన్యాల్, జంగల్ సంతాల్ తదితరుల నేతృత్వంలో ఐక్యసంఘటన ప్రభుత్వం ఏర్పడిన మరుసటి రోజే 1967 మార్చ్ 3న ప్రత్యక్షంగా భూస్వాధీన పోరాటం మొదలైంది. ఆ రోజు భూస్వాముల అక్రమాధీనంలో ఉన్న భూములను, పంటలను బాణాలు, విల్లంబులు, బరిసెలు, లాఠీలు కలిగిఉన్న భూమిలేని పేద రైతు సమూహాలు భూమిని స్వాధీన పరుచుకుని హద్దులు గీసి ఎర్రజెండాలు పాతారు. ఈ భూమి కిసాన్ సభకు చెందిందని ప్రకటించి వెళ్లారు. అదే రోజు అధియార్లు నక్సల్బరీ పోలీస్ స్టేషన్ పరిధిలోని బారమని జోతేకు చెందిన జోతేదార్ ఇంట్లో నిలువ ఉంచిన వడ్లను తీసుకెళ్లారు. ఈ దాడిలో 150 మంది వరకు పాల్గొన్నారు.

1967 మార్చ్ 18న సిలిగురి సబ్ డివిజన్ సిపిఐ(ఎం) రైతు సమావేశంలో 1) గ్రామ వ్యవహారాల్లో రైతు కమిటీల అధికారాన్ని నిలబెట్టాలి. 2) జోతేదార్లు, గ్రామీణ అసాంఘిక శక్తుల నుండి వచ్చే ప్రతిఘటనలను ఎదుర్కోవడానికి సంఘటితం కావాలి. సాయుధం కావాలి. 3) భూమిపై జోతేదార్ల గుత్తాధిపత్యాన్ని నాశనం చేసి రైతు కమిటీల ద్వారా భూముల పునః పంపిణీ చేయాలనే పిలుపు ఇవ్వబడింది.

1967 మార్చ్ 3 నుండి మే 22 మధ్య నక్సల్బరీ, ఖరీబరి, ఫన్సీదేవ ప్రాంతాల్లో భూస్వాముల అక్రమ అధీనంలోని భూములను, బినామీ పేర్లపై ఉన్న భూములను ఆక్రమించడం, అక్కడి పంటలను స్వాధీనం చేసుకోవడం, భూస్వాముల వద్ద అక్రమంగా నిలువ ఉన్న ధాన్యాన్ని తీసుకెళ్లడం, తప్పుడు కాగితాలను నాశనం చేయడం వంటి సంఘటనలు మొత్తం అరవై జరిగాయని, అందులో 1967 మే 15 వరకు నలభై రెండు అరెస్టులు, రెండు కేసుల్లో చార్జ్‌షీట్లను కూడా దాఖలు చేసారని, ఈ అన్ని సంఘటనల్లో భూమి లేని పేద రైతాంగం, ఆదివాసీలు తమ సాంప్రదాయక పనిముట్లైన విల్లంబులు, బాణాలు, బరిసెలు, కత్తులు, వ్యవసాయ పనిముట్లను ఆయుధాలుగా వాడారని ప్రభుత్వ (పోలీసు) రికార్డులు తెలుపుతున్నాయి.

మే 1967 నాటికి నక్సల్బరీ పోలీస్ స్టేషన్ పరిధిలోని హాటిఘిషా, ఖరీబరీ పోలీస్ స్టేషన్ పరిధిలోని బూరగంజ్, ఫన్సీదేవ పోలీస్ స్టేషన్ పరిధిలోని చౌపు ఖారియా ప్రాంతాలు పూర్తిగా ఉద్యమకారుల ఆధీనంలోకి వచ్చాయి. వీళ్ల అనుమతి లేనిదే ఇతరులెవరూ ఆ ప్రాంతంలోకి పోలేని పరిస్థితి ఏర్పడింది.

1967 ఏప్రిల్ వరకు అన్ని గ్రామాలను సంఘటిత పరిచారని 15 నుండి 20 వేల రైతులు పూర్తికాలపు కార్యకర్తలుగా నమోదయ్యారని అప్పటి ఉద్యమ నాయకులలో ఒకరైన కానుసన్యాల్ తన నివేదికలో పేర్కొన్నాడు. ప్రతీ గ్రామంలోనూ రైతు కమిటీలు ఏర్పడి వాళ్లే సాయుధ గస్తీగా కూడా వ్యవహరించారు. తరువాత రైతు కమిటీల తరఫున భూమిని ఆక్రమించారు. తమను మోసగించేందుకు ఉపయోగించిన భూమి రికార్డులను, తాకట్టు పత్రాలను తగులబెట్టారు.

1967 మే 11న ఫన్సీదేవ పోలీస్ స్టేషన్ పరిధిలో ఉన్న సన్యసిస్థాన్ టీ ఎస్టేటుకు పక్కన ఉన్న వివాదాస్పద భూమిలో కొత్తగా నియమించిన క్యాజువల్ లేబర్‌కు గుడిసెల్లో నివాసం కల్పించారు. అప్పటికే అక్కడ ఎన్నో ఏళ్ల నుండి పాత కూలీలు నివసిస్తున్నారు. వీరు కొత్తవారి ప్రవేశాన్ని వ్యతిరేకించారు. కొత్తవారికి టీ ఎస్టేట్ లోపల ఉన్న భూభాగంలో నివాసం కల్పించమని డిమాండ్ చేసారు.

టీ ఎస్టేట్ యాజమాన్యం ఈ విషయంపై పోలీస్ స్టేషన్లో ఫిర్యాదు చేశారు. పాత కూలీలకు మద్దతుగా సిపిఎంకు చెందిన 200 మంది కార్యకర్తలు ఎర్రజెండాలతో ఈ ప్రాంతంకు వచ్చి కొత్తవారికి నచ్చచెప్పడంతో వారు శాంతియుతంగానే వెళ్లిపోయారు. ఈ విషయంలో దర్యాప్తుకు వచ్చిన పోలీసులు అక్కడి ప్రజలకు చట్టాన్ని చేతుల్లోకి తీసుకోవద్దని చెప్పారు.

గత కొద్ది నెలలుగా జరుగుతున్న చట్ట రహిత ఆందోళనలన్నీ కూడా వివాదాస్పద భూముల గురించే జరుగుతున్నాయని అక్కడి ఎస్పీ అరుణ్ ప్రసాద్ ముఖర్జీ తెలిపాడు. ఈ సంఘటనలకు సంబంధించి ప్రజలను ఎందుకు అరెస్టు చేయలేక పోతున్నామో పై అధికారులకు వివరిస్తూ 1967 మే 11న రిపోర్ట్ చేసాడు. ఆందోళనల్లో పాల్గొనే వారందరు సిపిఐ(ఎం)కు చెందిన అనుబంధ సంఘాల వారు. చాలా గ్రామాల్లో వారు సంఘటితంగా ఉంటారు. వారెప్పుడూ కూడా గ్రూపులుగా సాయుధులై తిరుగుతుంటారు. అలాంటి వారిని అరెస్టు చేయాలంటే ఘర్షణ జరుగుతుంది. ఆ ఘర్షణలో రక్తపాతం జరుగుతుంది.

సిపిఐ(ఎం) ఆధీనంలో ఉన్న ఆదివాసిలైన సంతాల్‌లు, ఉరాన్‌లు, ముండాలు సాధారణంగా రోజు వారీ పనులకు వెళ్లేటప్పుడు కూడా విల్లంబులు, బాణాలు, బరిసెలను వారి వెంట తీసుకెళతారు. వాటిని కలిగి ఉంటూ వారు ఊరేగింపులుగా గాని, పెద్ద సమూహాలుగా గాని కదులుతుంటే శాంతి భద్రతలకు విఘాతంగా మారుతుంది. 150 నుండి 300 మందితో కూడిన అలాంటి ఆందోళనకారుల బృందాలను చెదరగొట్టడం లేదా నిరాయుధులుగా చేయడానికి 144 సెక్షన్‌ను అమలు చేయవల్సి ఉంటుంది. ఈ సందర్భంలో పోలీసులు తుపాకులను వాడవల్సి వస్తుంది. ఫలితంగా సాయుధ ఘర్షణ జరిగి రక్తపాతం, చనిపోయే పరిస్థితులు ఎదురవుతాయి.

ఈ సందర్భంలో 144 సెక్షన్ కింద ఊరేగింపులను, ప్రదర్శనలను ఆయుధాలతో సంచరించడాన్ని, నిషేధించడానికి అవసరమైతే కాల్పులు జరపడానికి అవకాశమిచ్చే స్పష్టమైన ఉత్తర్వులను ముఖ్యమంత్రి నుండి పొందాలని డార్జిలింగ్ ఇంటెలిజెన్స్ బ్యూరో ఎస్.పి. అరుణ్ ప్రసాద్ ముఖర్జీ పోలీసు ఉన్నతాధికారులకు 1967 మే 11న విజ్ఞప్తి చేసాడు.

భూమి శిస్తుల శాఖమంత్రి హరేకృష్ణ కోనార్ డార్జిలింగ్‌కు 1967 మే 15న వచ్చాడు. అతనికి పోలీసు అధికారులు ఇక్కడి సంఘటనలను వివరించారు. ఇవి దుస్సాహసిక చర్యలని, ఇవి దారి తప్పిన వ్యక్తులు చేసేవని కోనార్ అభిప్రాయం వ్యక్తం చేసాడని, 1967 మే 17న సిలిగురి సబ్ డివిజన్‌లో జరిగే సమావేశంలోని చర్చల్లో వీటిని పరిష్కరిస్తామని చెప్పినట్లుగా పోలీస్ అధికారులకు చెప్పాడు.

మే 17న కోనార్ నక్సల్బరీలో 50 మందిని కలిసి వారి సమస్యలు విన్నాడు. తమ పార్టీ కార్యకర్తలు బాణాలు, విల్లంబులు మొదలగు వాటితో ఎవరినీ భయపెట్టరని హామీ ఇచ్చాడు. సిలిగురిలో పెద్ద బహిరంగసభలో మాట్లాడాడు. ఆరోజు రాత్రి కానూసన్యాల్‌తో మాట్లాడతానని చెప్పాడు. కానుసన్యాల్‌తో తాను మాట్లాడానని కానూసన్యాల్‌తో ముఖాముఖి

మాట్లాడడానికి సిలిగురిలోని సుక్నా ఫారెస్ట్ బంగ్లాకు రమ్మన్నానని చెప్పాడు.

మంత్రి సమక్షంలో ఎస్పీ అరుణ్ ప్రసాద్ ముఖర్జీ అక్కడికి వచ్చిన కానుసన్యాల్, సోరేన్ బోస్‌ల ముందు మూడు ప్రతిపాదనలు పెట్టాడు. 1) విల్లంబులు, బాణాలు ఇతర ఆయుధాలను ఆందోళనకారులు సిపిఐ(ఎం)కు చెందిన ఇతరులెవరైనా పట్టుకోరాదు. భూముల గురించిన సమస్యలను అధికారుల దృష్టికి తేవాలి. అధికారులు వాటిని సత్వరమే పరిష్కరించేలా చూస్తారు. 2) సిలిగురి సబ్ డివిజన్లో జరిగిన చట్టరహిత చర్యల్లో పాల్గొన్న వారందరు సరెండర్ కావాలి. వారి అరెస్టులను ఎవరు ప్రతిఘటించకూడదు. 3) చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోకూడదు. బలవంతంగా ఇతరుల ధాన్యాన్ని ఎత్తుకెళ్ల కూడదు. ఎక్కడైనా దాచిపెట్టిన ఆహార ధాన్యాన్ని వెలికితీయడం కోసం పోలీసులకు గాని, ఇతర సంబంధిత అధికారులకు గాని తెలియజేయాలి.

ఇక్కడ సూత్రప్రాయంగా అంగీకారానికి వచ్చిన విషయాలను కానుసన్యాల్ గ్రామాలకు వెళ్లి చర్చించి ముఖ్యంగా ప్రతిఘటన లేకుండా సరెండర్ కావడంపై అంగీకారాన్ని వ్యక్తిగతంగా గాని లేదా సోరేన్‌బోస్ ద్వారా గాని 1967 మే 20న సమాచారం అందిస్తానని చెప్పాడు. అయితే పోలీసులు పెట్టిన ప్రతిపాదనల అంగీకార ఆచరణ గురించి మధ్యవర్తులుగా వచ్చిన కానుసన్యాల్ గాని, సోరేన్‌బోస్ గాని మే 22 నాటికి కూడా ఏ విషయమూ తేల్చలేదు.

వ్యక్తిగతంగా జంగల్ సంతాల్‌ను, కానుసన్యాల్‌ను హాతిఘిషాలో కలవడానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదని ఎ.పి. ముఖర్జీ తన పుస్తకంలో వివరించాడు. ఆందోళనకారుల సంఘటిత చట్టరహిత కార్యక్రమాలను నిరోధించడం, ఇంతవరకు జరిగిన వాటిలో బాధ్యులైన వారిని అరెస్టులు చేయడం కొరకు 1967 మే 23న నక్సల్బరీ పోలీస్ స్టేషన్ పరిధిలో హాతిఘిషా వద్ద ఒకటి, ఫన్సిదేవ పోలీస్‌స్టేషన్ పరిధిలో బురాగంజ్ వద్ద ఒక పోలీస్ క్యాంపును ఏర్పాటు చేసారు.

అదేరోజు, అంటే మే 23న సబ్ డివిజన్ మెజిస్ట్రేట్ ద్వారా నక్సల్బరీ, ఫన్సిదేవా, ఖరీబరీ పోలీస్ స్టేషన్ల పరిధిలో 144 సెక్షన్‌ను అమలు చేయడానికి పోలీసులు ఉత్తర్వులను పొందారు. తద్వారా ఈ ప్రాంతాల్లో విల్లంబులు, బాణాలు, బరిసెలు ఇతర ఆయుధాలతో తిరగడం, ఐదు లేదా అంతకు మించి సమూహాలుగా గుమిగూడడం, తిరగడం, బహిరంగ ప్రదేశాలలో, పొలాల్లో ఊరేగింపులు తీయడం, ప్రదర్శనలు నిర్వహించడాన్ని నిషేధించారు. ఇతరుల ఆస్తులను, భూములను ఆక్రమించడం, శాంతి భద్రతలకు విఘాతం కల్గించడాన్ని నిషేధించినట్లు కోర్టు తన ఉత్తర్వుల్లో పేర్కొంది.

పోలీసులకు భూమిలేని పేద రైతాంగం, ఆదివాసులకు మధ్య మొదటి ఘర్షణ మే 24న జరిగింది. భూములు దున్నడానికి ఉదయం వెళ్లిన కొందరు రైతులు సాయంకాలం ఇళ్లకు తిరిగి రాకపోవడంతో తాగడం కోసం వెళ్లారేమోనని గ్రామస్తులు అనుకున్నారు. మరుసటి రోజు కూడా రాకపోవడంతో భయాందోళనలకు గురయ్యారు. మరికొందరు కూడా తరువాత రోజు అదృశ్యమయ్యారు. దీంతో కొందరు మరుసటి రోజు పొదలమాటున దాక్కొని ఏం జరుగుతుందోనని గమనించసాగారు. భూములు దున్నడం మొదలు పెట్టగానే పోలీసులు వచ్చి రైతులను పట్టుకుపోతున్నారు. ఎందుకు అని ప్రశ్నిస్తే ఈ భూములకు చెందిన జోతేదారు ఫిర్యాదు చేసాడని పోలీసులు బదులిచ్చారు. ఆ తరువాత రోజు పెద్ద ఎత్తున ప్రజలు ఈ అరెస్టులను అడ్డుకోవడానికి, పోలీసులు తమ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించకుండా నిరోధించడానికి బోరోజోరుజోట్ లోని పొలాల వద్ద గుమిగూడారు. 144 సెక్షన్ అమల్లో ఉందని చెబుతూ ప్రజలను చెల్లా చెదురు చేయడానికి ఉద్యమ నాయకులను అరెస్ట్ చేయడానికి పోలీసులు ప్రయత్నించారు. దీన్ని ప్రజలు ప్రతిఘటించారు. వీరి మధ్య ఘర్షణ జరిగింది.

పోలీసు రికార్డుల ప్రకారం ఇందులో విల్లంబులు, బాణాలు మొదలైన వాటితో 300 మంది ప్రజలు పాల్గొన్నారు. ఇది గమనించిన పోలీసులు మరిన్ని పోలీసు బలగాలను రప్పించుకున్నారు. అదనంగా వచ్చినవారిలో ఇన్‌స్పెక్టర్ సోనంవాంగ్ది ఉన్నాడు. పోలీసులతో జరిగిన ఘర్షణలో ప్రజల్లో కొందరు బాణాలు వేసారు. వాంగ్దికు బాణాలు తగిలాయి. అక్కడికక్కడే స్పృహ తప్పి పడిపోయాడు. మరొక పోలీసుల అధికారికి కూడా బాణాలు తగిలాయి. దీంతో పోలీసులు ఆ ప్రాంతాన్ని వదిలి వెళ్లిపోయారు. ఇన్‌స్పెక్టర్ వాంగ్ది చికిత్స పొందుతూ సిలిగురి ఆసుపత్రిలో అదేరోజు రాత్రి 9.45గం.కు చనిపోయాడు.

మే 25న ఉద్యమకారులను అరెస్ట్ చేయడానికి పెద్దఎత్తున పోలీసుల బలగాలు ప్రసాదో జోటే గ్రామానికి చేరుకున్నాయి. ప్రజలు తమ చేతికందిన సాంప్రదాయక ఆయుధాలను చేత పుచ్చుకుని, మహిళలు చిన్నపిల్లలను వీపుకు కట్టుకుని, పోలీసుల ప్రవేశాన్ని వ్యతిరేకిస్తూ నిరసనలు తెలిపారు. పంటలు పండించుకునే హక్కు జోతేదార్ల చేతుల్లోని అక్రమ భూములను పంచుకునే హక్కు కోసం ఆందోళన చేస్తున్న ఆదివాసీలు, పేద రైతాంగంపై పోలీసులు విచక్షణా రహితంగా కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో నిరాయుధులైన ధనేశ్వరిదేవి, సీమేశ్వరి మల్లిక్, నయనేశ్వరీ మల్లిక్, సురుబాలబర్మన్, సనమతిసింగ్, ఫల్మతిదేవి, సంసారిసాయిబని అనే ఏడుమంది మహిళలు, గౌద్రావ్ సాయిబని, ఖర్ సింగ్ అనే ఇద్దరు పురుషులు, మరో ఇద్దరు చిన్నపిల్లలు మరణించారు.

పోలీస్ రికార్డు ప్రకారం ఈ సంఘటనలో స్త్రీలు, పురుషులు ఇతరులు మొత్తం వెయ్యి మందికి పైగా ప్రజలు ఈ సంఘటనలో పాల్గొన్నారు. ఒకసారి ఐదు రౌండ్ల కాల్పులు, ఆ తరువాత వెంటనే ఎనిమిది రౌండ్ల కాల్పులు జరిపారు. ఇలా పోలీసుల కాల్పులతో మొదటి సారిగా ప్రజలు ప్రాణాలు కోల్పోవడంతో నక్సల్బరీ ఉద్యమం పురుడుపోసుకున్నది.

ఈ సంఘటన ఐక్య సంఘటన లోపలా, బయటా ఎన్నో చర్చలకు దారితీసింది. సిపిఐ(ఎం)రాష్ట్ర కార్యనిర్వాహక వర్గం మే 29న పోలీసు కాల్పులను ఖండిస్తూ దానిపై న్యాయవిచారణ జరపాలని కోరింది. ముఖ్యమంత్రి అజయ్ ముఖర్జీ శాంతి భద్రతలను కాపాడేందుకు పోలీసులపైనే ఆధారపడుతున్నాడని ఆరోపించింది.

జూన్ 12న ముఖ్యమంత్రి డార్జిలింగ్ జిల్లాలో బీభత్స పరిపాలన ఏర్పడిందని తెలిపాడు. కేంద్ర హోంమంత్రి వై.బి. చవాన్ లోకసభలో ప్రస్తావిస్తూ ఈ ప్రాంతంలో తీవ్ర అరాచకం జరిగిందని, అధికార సిపిఐ(ఎం) నాయకత్వం నుండి వాళ్లను వేరు చేస్తూ, ఆ ప్రాంతంలో తీవ్రవాదులు ప్రముఖ పాత్ర వహిస్తున్నట్లు అభిప్రాయం వ్యక్తం చేసాడు.

చివరకు నక్సల్బరీకి ఒక కేబినెట్ కమిటీని పంపించారు. ఆ కమిటీలో

# నక్సల్బరీ అనుబంధం - కొన్ని జ్ఞాపకాలు

**నక్సల్బరీ పంథాలో కార్మికవర్గం పాత్ర, కార్మికవర్గ నాయకత్వం పాత్ర గురించి కొన్ని సంఘటనలను వివరిస్తూ, కొన్ని అనుభవాలను జ్ఞాపకం చేసుకుంటూ, నక్సల్బరీ పంథాయే దేశ భవిష్యత్తుకు ప్రత్యామ్నాయం అని అంటున్నారు బి.ఎస్. రాజు**

ఈ రోజు కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (మావోయిస్టు) బీజం నక్సల్బరీలో మొలకెత్తి, ఓ చెట్టుగా విస్తరించడానికి 50 ఏళ్లు పట్టింది. నక్సల్బరీ వసంత మేఘగర్జన నాటి నుండి ఈ ఏభై ఏళ్ల భారత పాలకవర్గ చరిత్ర అంతా నక్సలబరీ ఉద్యమాన్ని తుడిచిపెట్టే ప్రయత్నాల చరిత్రే! ప్రజా ఉద్యమాల ఊపిరి తీసేసే చరిత్రే! మరోవైపు నుండి చూస్తే ఈ ఏభై ఏళ్ల నక్సల్బరీ చరిత్ర పాలక వర్గ దమనకాండను ఎదుర్కొంటూ భారతదేశ ప్రజాయుద్ధ నిర్మాణాన్ని పట్టువిడవక కొనసాగిస్తున్న చరిత్రే!

నక్సల్బరీ ప్రేరణతో మొదలైన ఈ ప్రజాయుద్ధ నిర్మాణం రిక్తహస్తాల తోనే మొదలైంది. చైనా శ్రామికవర్గ విప్లవం, నక్సల్బరీ ఉద్యమాలు అందించిన చైతన్య-ఉత్తేజాలు, అవి చూపిన మార్గం విప్లవోద్యమ నిర్మాణానికి ఆనాటి యువతకు అందివచ్చిన ముడిసరుకు. ఈ ముడిసరుకుతో త్యాగాలను రంగరించి, విప్లవ ఆచరణను జోడించి ప్రజాయుద్ధ నిర్మాణానికి ఎందరు ఎన్నివిధాలుగా పనిచేసారో, తమ జీవితాలను అర్పణ చేశారో తెలుసుకుని, పరిశోధించి సంపూర్ణంగా, సమగ్రంగా గ్రంథస్తం చేస్తేగాని, ఓ సమ్యక్ రూపం ఇస్తేగాని నక్సల్బరీ ఉద్యమానికి న్యాయం జరగదు.

నక్సల్బరీ స్పిరిట్ వేగంగా విస్తరించాల్సి ఉన్న చారిత్రిక సందర్భం లోకి ఇప్పుడు ప్రజాయుద్ధం ప్రవేశించింది. ఈ యుద్ధం మరింత వేగవంతంగా, విస్తృతంగా కొనసాగాల్సిన ఆవశ్యకత, బాధ్యత ఇప్పటి యువతరంపై ఉంది. నక్సల్బరీ నడిచివచ్చిన మార్గాన్ని, సృష్టించిన త్యాగపూరిత చరిత్రను వారు సొంతం చేసుకుని పలు రీతుల్లో ప్రజా యుద్ధాన్ని కొనసాగించాల్సిన సమయమిది.

పాత తరానికి చెందిన నేను, నక్సల్బరీ రాజకీయాలతో నాకు ఏర్పడ్డ చిరు అనుబంధం నుండి, నా అనుభవాల జ్ఞాపకాల నుండి కొన్ని నక్సల్బరీ ఉద్యమ నిర్మాణ సంఘటనలను ఇప్పటి యువతకు ఉపయోగ పడతాయనే ఉద్దేశ్యంతో ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

రిక్త హస్తాలతో ఇద్దరు యువకులు హైదరాబాద్ నగరంలో సనత్‌నగర్, బాలానగర్ పారిశ్రామిక ప్రాంతంలో 1970-1973 మధ్య

మంత్రులు హరే కృష్ణ కోనార్ సిపిఐ(ఎం), బిశ్వనాథ్ ముఖర్జీ (సిపిఐ)లు ఉన్నారు. వారు హింసను విడనాడమని చేసిన విజ్ఞప్తికి స్పందనేమిలేదు. వీరు ప్రస్తుత రాజకీయ పరిధిలోనే పరిష్కారాన్ని అంగీకరించమని ఉద్యమకారులైన సిపిఐ(ఎం)లోని అసమ్మతివాదులకు నచ్చచెప్పే ప్రయత్నం విఫలం అయింది. వాళ్లు తమ కామ్రేడ్లపై నక్సల్బరీలో జరిగిన పోలీసు, దమనకాండపై నిస్సహాయ ప్రేక్షకులుగా మిగిలిపోయారు. పోలీసు చర్యతో తమకు సంబంధం లేదని చెప్పుకోవడానికి ఎంతగానో ప్రయత్నించారు.

జూన్ చివరి నాటికి నక్సల్బరీ తిరుగుబాటుదార్లను సిపిఐ(ఎం) బాహాటంగా వ్యతిరేకించడం మొదలుపెట్టింది. పశ్చిమబెంగాల్‌లో కొందరు పార్టీ సభ్యులు కేంద్ర కమిటీ ఆమోదించిన కార్యక్రమాన్ని సవాల్ చేస్తున్నారని వారిని వెంటనే పార్టీ సభ్యత్వం నుండి బహిష్కరించా లని జూన్ 20న సిపిఐ(ఎం) పొలిట్‌బ్యూరో నిర్ణయించింది. దానికి అనుగుణంగా సిపిఐ(ఎం) నుండి 19 మంది సభ్యుల్ని బహిష్కరించారు.

ఇదే క్రమంలో 1967 జూన్ 28న పెకింగ్ రేడియో తన ప్రసారంలో నక్సల్బరీ సంఘటనలను భారత ప్రజలు మావో సే టుంగ్ మార్గ దర్శకత్వంలో తలపెట్టిన సాయుధ సంఘర్షణల పంజాగా వర్ణించింది. ప్రజలను మోసగించేందుకు భారత ప్రగతి నిరోధకుల సాధనంగా ఐక్య సంఘటన ప్రభుత్వాన్ని పేర్కొంది. చైనా మీడియా ఈ ఉద్యమానికి ఎంతో ప్రాధాన్యాన్నిచ్చింది. మావో ప్రశంసలను అందుకుంది. అక్కడి కమ్యూనిస్టు పార్టీ దీనికి నైతిక మద్దతును ఇచ్చింది తద్వారా నక్సల్బరీ ఉద్యమం మరింతగా ప్రపంచానికి తెలిసి వచ్చింది.

1967 జూలై 5న చైనా కమ్యూనిస్టు పార్టీకి చెందిన 'పీపుల్స్ డైలీ' పత్రికలో నక్సల్బరీ ఉద్యమంపై 'స్ప్రింగ్ థండర్ ఓవర్ ఇండియా' పేరుతో సంపాదకీయం ప్రచురించబడింది. దీన్ని నవంబర్ 1967లో లిబరేషన్ పత్రికలో పునర్ముద్రించారు. దీంట్లో భారత కమ్యూనిస్టు పార్టీలోని విప్లవ గ్రూపు నాయకత్వంలో గత కొన్ని నెలల్లో డార్జిలింగ్ ప్రాంతంలోని రైతాంగ ప్రజలు నయా రివిజనిస్టు సంకెళ్లను బద్దలుకొట్టారు. వాళ్లు తేయాకు తోటల యజమానులు, భూస్వాముల నుండి ధాన్యం, భూమి, ఆయుధా లను స్వాధీనం చేసుకున్నారు. స్థానిక కిరాతక పెత్తందార్లను శిక్షించారు.

ఉద్యమాన్ని అణచివేసే పోలీసు యంత్రాంగంపై, ప్రతిఘాతుక శక్తులపై మెరుపుదాడులు చేస్తూ సాయుధ రైతాంగ విప్లవ పోరాటాన్ని ఎత్తిపట్టారని నక్సల్బరీ ఉద్యమాన్ని గొప్పగా వర్ణించింది.

ఈ ఉద్యమం భారత ప్రజా విప్లవ పోరాటంలో ప్రత్యేకమైన స్థానం కలిగి ఉంది. డార్జిలింగ్‌లో విప్లవకారులు వెలిగించిన సాయుధ పోరాటం ఆరిపోదు. ఒక ఒంటరి నిప్పురవ్వ దావానలాన్ని సృష్టించగలదు.

డార్జిలింగ్ నిప్పురవ్వ భారత దేశవ్యాప్తంగా విప్లవ పెను మంటలను రగిలిస్తుందని మార్క్సిజం, లెనినిజం మావో ఆలోచనల మార్గ దర్శకత్వంలో తప్పకుండా విజయం సాధిస్తుందని పేర్కొంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

కాలంలో కార్మిక శ్రేణుల్లో విప్లవోద్యమాన్ని బీజరూపంలో ఎలా నిర్మాణం చేసారో మననం చేసుకోవడం ద్వారా నక్సల్బరీ స్పిరిట్ అప్పటి యువకులను ప్రేరేపించి నడిపించిన తీరు అర్థం చేసుకోవచ్చు.

ఈ యువకులిద్దరిలో ఒకరి పేరు రవి. ఇతను ఐటిఐ చేసి ఆల్విన్ ఫ్యాక్టరీలో ఎప్రంటీస్‌గా పనిచేసేవాడు. మరొకతని పేరు కుమార్. ఇతను ఇంజనీరింగ్ పాసై ఉద్యోగం కోసం హైద్రాబాద్ వచ్చి, రెండేళ్లు ట్రైనీ ఇంజనీర్‌గా ఒక ఫ్యాక్టరీ ప్రాజెక్ట్ నిర్మాణంలో పనిచేసాడు. తరువాత పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సు చేసే అవకాశం వచ్చి తిరిగి విద్యార్థిగా మారాడు. వీరిద్దరికీ ఒక సాహిత్య సభలో పరిచయమైంది. ఆ పరిచయం భావ సారూప్యతతో చిక్కనైన స్నేహంగా మారింది. వీరిరువురూ తరచూ కలుస్తూ తమ ఆలోచనలను పంచుకునేవారు. వారి ఆలోచన, ధ్యాస అంతా నక్సల్బరీ సృష్టించిన ప్రజా ఉద్యమాలపైనే, వాటి గురించే!

కేవలం చర్చలతో కాలం గడిపే బదులు, తాము కూడా నక్సల్బరీ స్పిరిట్‌తో కార్మికుల్లో పని చేయాలని నిర్ణయించుకున్నారు. రవికి, తనలానే ఉద్యోగాల వెతుకులాటలో హైదరాబాద్ నగరం చేరుకుని కార్మికవాడల్లో నివసిస్తున్న యువకార్మికులతో స్నేహ పరిచయాలున్నాయి. అప్పటికే కార్మిక వర్గం కాంగ్రెస్, కమ్యునిస్టు, సోషలిస్టు పార్టీల ట్రేడ్ యూనియన్ల ప్రభావంలో ఉంది.

కార్మిక భావజాలమంతా బూర్జువావర్గ వాతావరణంతో కలుషితమై ఉందని రవి ఎప్పుడూ చింతిస్తూ ఉండేవాడు. ఈ వాతావరణ ప్రభావం కొత్తతరం యువకులపై పడకుండా ప్రచార కార్యక్రమం చేపట్టాలని తన మిత్రుడు కుమార్‌తో ఎప్పుడూ అంటుండేవాడు. అప్పటికి వాళ్లకి మార్క్సిస్టు స్పృహే గాని ఏమంత సైద్ధాంతిక జ్ఞానం, కార్మికోద్యమ నిర్మాణ అనుభవం లేదు. వాళ్లిద్దరూ తరచూ చర్చించుకుని ఒక నిర్ణయానికి వచ్చారు.

ముందుగా కమ్యూనిస్టు ప్రణాళికను క్షుణ్ణంగా చదివి, అవగాహనను పెంచుకోవాలని, ఆ అవగాహనతో యువకార్మిక మిత్రులను కూడా కమ్యూనిస్టు ప్రణాళికను చదవమని ప్రోత్సహించాలని, దానిపై చర్చను ప్రోత్సహించాలని, ఆ క్రమంలో కార్మిక సమస్యలను, ఇతర సామాజిక అంశాలను చర్చించాలని, మార్క్సిస్టు-లెనినిస్ట్ అధ్యయనం ద్వారా జ్ఞానాన్ని పెంచుకునే ప్రయత్నం చేయాలని అనుకున్నారు. ప్రతి సాయంకాలం ఒక్కొక్క మిత్రుణ్ణి కలవడం, అతనితో కలిసి తిని, అతని రూములోనే అవకాశాన్ని బట్టి నిద్రపోవడం, ఈ క్రమంలో కమ్యూనిస్ట్ ప్రణాళికను పరిచయం చేయడం, చదవమని ప్రోత్సహించడం, ప్రణాళిక కాపీ ఇవ్వడం, దేశంలో జరుగుతున్న విప్లవోద్యమ రాజకీయాలను, చుట్టూ ఉన్న కార్మిక జీవన పరిస్థితులను చర్చించడం, ఇలా కొన్ని నెలల కాలంలో వారిరువురు ఓ కార్మిక మిత్రబృందాన్ని కూడగట్టారు. రమారమి ఒక 50 మంది యువకులు ఈ బృందంలో జమకూడారు. వీరిలో చాలా మంది తెలంగాణ జిల్లాల గ్రామాల నుండి వచ్చినవారే. కోస్తా నుండి వచ్చిన వారు చాల తక్కువే అని చెప్పాలి.

ఈ బృందంలోని వారంతా వారి వారి గ్రామాల రాజకీయ, సామాజిక స్థితిగతులనుబట్టి వివిధ చైతన్య స్థాయిల్లో ఉండేవారు. బూర్జువా లేక రివిజినిస్టు రాజకీయాల ప్రభావం ప్రబలంగానే ఉండేది. అయితే నక్సల్బరీ ఉద్యమం సృష్టించిన దోపిడీ వ్యతిరేక విప్లవ మార్పుల పట్ల మక్కువను ప్రదర్శించే వారు. ఆ విప్లవ మార్గంలో అమరులవుతున్న వారి పట్ల, వారి ఆచరణ పట్ల వారికి ప్రేమాభిమానాలుండేవి. వారి త్యాగాల పట్ల ఆరాధనా భావముండేది.

ఇటువంటి స్థితి నుండి కమ్యూనిస్ట్ అధ్యయన సెల్స్ నిర్మాణం చెయ్యాలనే ఆలోచన ఈ ఇరువురు మిత్రులకు వచ్చింది. దానితో, ఎక్కువ ఉత్సాహవంతులతో మొదలుపెట్టి, ఒక్కొక్క సెల్‌లో 5 నుండి 6 గురు సభ్యులను సమీకరించడం మొదలుపెట్టారు. అలా 6 నెలల కాలంలో 10 సెల్స్ వరకు నిర్మాణం చేశారు. ఇందులో కొన్ని ఉత్సాహవంతంగా నడిస్తే, కొన్ని కుంటుకుంటూ నడిచేవి. వారంలో ప్రతిరోజు సాయంకాలం ఒక సెల్ మీటింగ్ నడిపేవారు. ప్రతి మీటింగుకు రవి తప్పక హాజరైతే, రొటేషన్ పద్ధతిలో కుమార్ ప్రశ్నల-జవాబుల, చర్చల సమావేశాలకు హాజరయ్యేవాడు. ఫ్యాక్టరీ షిఫ్టుల్లో పనిచేసే వారిని, వారివారి సమయాను కూలతను బట్టి ఈ సెల్ సమావేశాల్లో పాల్గొనేటట్లు చూసేవారు.

ఈ సెల్ సమావేశాల్లో సభ్యులు తాము పనిచేస్తున్న ఫ్యాక్టరీల్లో, తమ తమ గ్రామాల్లో జరుగుతున్న దోపిడీ విధానాలను, దేశంలో పలు చోట్ల ఇటువంటి పెత్తందారీ శక్తులపై నక్సలైట్ ఉద్యమం చేస్తున్న పోరాట వివరాలను చర్చకు తెచ్చేవారు. ఈ చర్యలపై భిన్నాభిప్రాయాలుండేవి.

ఇటువంటి పురోగామి సెల్ అంతర్గత సమావేశానికి ఓమారు చెరబండరాజు, వరవరరావులను ఆహ్వానించారు. ఆ సమావేశంలో సెల్ సభ్యులు లేవనెత్తిన అనేక అంశాలను, ప్రశ్నలను విని వారు హర్షం వ్యక్తం చేశారు. సభ్యుల సందేహాలకు, ప్రశ్నలకు సమాధానమిస్తూ విప్లవ సాహిత్యాన్ని, మార్క్సిస్టు అధ్యయనాన్ని కొనసాగించమని; స్వయం కృషితో స్వతంత్ర కార్మికోద్యమ నిర్మాణానికి పూనుకోవడం, నక్సల్బరీ స్పిరిట్‌తో పనిచేయడం మంచి పనని, దానిని మరింత ఓరిమితో, నిష్ఠతో కొనసాగించమని వారు సెల్ సభ్యులను ప్రోత్సహించారు.

తదనంతరం ఈ సెల్ సభ్యుల నుండి ఒక కోర్ టీమును తయారు చేసుకుని వారి చొరవతో పారిశ్రామిక ప్రాంతాల్లో గోడ రాతలు, విప్లవ నినాదాలు, దగాకోరు యూనియన్లపై, కార్మికులను మోసాలు చేస్తున్న కార్మిక యూనియన్ నాయకులపై విమర్శనాత్మక నినాదాలు, హెచ్చరికలు రాసేవారు. ఇటువంటి వారి చర్యలను, వారు కార్మికులకు చేస్తున్న అన్యాయాలను, వారి వల్ల కార్మికులకు జరుగుతున్న నష్టాలను, కార్మికుల ఐక్యతను వారు ఎలా అడ్డుకుంటున్నారో వివరిస్తూ కార్మికుల సంఘటిత శక్తితో ఇటువంటి కార్మికవర్గ వ్యతిరేక శక్తులను ఎదుర్కోవాలని ఓ నాలుగు పేజీల కరపత్రాన్ని 2000 కాపీలు ముద్రించి సనత్‌నగర్, బాలానగర్ పారిశ్రామిక ప్రాంతాల్లో పంచారు.

ఇటువంటి కరపత్రం ఒకటి రాయాలని, ముందుగా సెల్ సభ్యుడు కాని ఓ కార్మిక మిత్రుడు తరచూ కుమార్‌ను కలుస్తూ ఒత్తిడి పెట్టేవాడు. అప్పట్లో ఇతను శ్రీరామ్ రిఫ్రిజరేషన్ కంపెనీలో పనిచేసేవాడు. ఇతను ఆ ఫ్యాక్టరీ ఎ.ఐ.టి.యు.సి యూనియన్‌లో సభ్యుడిగా ఉండేవాడు. వాళ్ల యూనియన్ భాగోతం ఇతనికి నచ్చక యూనియన్ నాయకులపై విమర్శ పెట్టేవాడు. ఇతర కార్మికులతో నాయకత్వాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడేవాడు. ఇతను అనంతపూర్ జిల్లావాసినని, నక్సల్ నాయకుడు రఫూఫ్‌కు చుట్టాన్నని చెప్పేవాడు. ఇతను ఇచ్చిన సమాచారంతోనూ, ప్రోద్బలం తోను, పలు సెల్ సమావేశాల్లో కార్మిక నాయకుల ఆగడాలపై,

మేనేజ్మెంట్లతో వాళ్ల లాలూచీలపై చర్చకు వచ్చిన ఇతర సమాచారంతోను కుమార్ ఈ నాలుగు పేజీల కరపత్రం తయారుచేసాడు. దీన్ని సెల్ మీటింగుల్లో చదివి వినిపించిన తరువాత మెజారిటీ సభ్యుల ఆమోదంతో అచ్చువేసి పంచారు.

ఈ కరపత్రం పంచడంలో అనంతపూర్ కార్మిక మిత్రుడు, రవి ఎక్కువ చొరవతో పనిచేసారు. ఈ కరపత్రం పంచడంలో కూడా కార్మిక మిత్రులు కొత్త పద్ధతులు అవలంభించారు. పెద్ద, మధ్య తరహా పరిశ్రమల గేట్ల ముందు రాత్రి వేళల్లో చిన్న చిన్న దొంతర్లు పెట్టి ఎగిరిపోకుండా బరువులు పెట్టేవారు. కొన్ని కరపత్రాలు వెదజల్లేవారు. అప్పట్లో కార్మికులు సైకిళ్లు, బస్సుల్లోనే ప్రయాణించే వారు కాబట్టి రద్దీ చౌరాస్తాల్లో, బస్సు స్టాపుల్లో, బస్‌స్టాండ్లలో పంచేవారు. విప్లవ అభిమానులకు స్వయంగా అంద చేసేవారు. కార్మికుల నివాస ప్రాంతాల్లో చీకట్లో పంచడం, వెదజల్లడం చేసేవారు. కార్మిక నాయకుల ఇళ్ల ముందు విసిరి వచ్చేవారు. పగటిపూట కొంతమంది కార్మికుల ఇళ్లకు వెళ్లి మహిళలకు కరపత్రాలు ఇచ్చే వారు.

మొత్తానికి ఈ కరపత్రం సనత్‌నగర్, బాలానగర్ పారిశ్రామిక ప్రాంతంలో అలజడి సృష్టించింది. చర్చనీయాంశమైంది. ఇంతవరకు వచ్చేక కార్మిక నాయకులు, పోలీసులు ఊరుకుంటారా? వాళ్లకు అర్థమైంది ఈ కరపత్రం వెనుక ఏదో నిర్మాణం ఉందని, అది నక్సల్బరీ భావజాలంతో పనిచేస్తోందని, బహుశా నక్సలైట్లే దీన్ని నడిపిస్తూ ఉండొచ్చని వాళ్లు ఊహించి అటువంటి నిర్వాహకులు, వారి ప్రోత్సాహికులపై కన్నువేసారు. వాతావరణం వేడెక్క సాగింది. అప్పటి వరకు నక్సలైట్ పార్టీతో ఏ ప్రత్యక్ష సంబంధం లేని సెల్‌ల నిర్వాహకులు అటువంటి సంబంధం పెట్టుకునే ప్రయత్నం చేయసాగేరు.

ఈ ఘటనల క్రమంలో ఓ సంవత్సరం మేడేను ఓ సాంప్రదాయక సంబరాల హిందూ పండుగగా మార్చివేసి బూర్జువా, రివిజనిస్టు ట్రేడ్ యూనియన్లు నిర్వహిస్తున్న పద్ధతికి భిన్నంగా నిర్వహించాలని ఈ కార్మిక మిత్రబృందం ఆలోచించింది. మేడేను ఎలా నిర్వహించాలి? ఎక్కడ నిర్వహించాలి? నిర్వహిస్తే కార్మికులు నివసించే ప్రాంతంలోనే, బహిరంగంగానే నిర్వహించాలి. అలా నిర్వహించాలంటే అక్కడి చోటా-బడా కార్మిక నాయకుల అండదండలుండాలి. లేకపోతే సభను జరగనివ్వరు. చివరకు కార్మిక నాయకుల ఇళ్లు ఎక్కువగా ఉన్నచోట, అదీ పోలీసు స్టేషన్ వెనుక పక్కనున్న ఆవరణే సభ జరపడానికి అనువుగా ఉంటుందని తేలింది. సభ భగ్నమైనాసరే ఫరవాలేదు గాని ఈ ప్రాంగణంలోనే సభ జరపాలని, ఆఖరుకు మిత్రబృందమంతా ఓ నిర్ణయానికి వచ్చారు.

ఈ సభ నిర్వహణకు వారు ఎన్నుకున్న ప్రచార పద్ధతి, అనుసరించిన ప్రజావిధానం ఒక మంచి ఉదాహరణ. ఎంచుకున్న సభా ఆవరణకు చుట్టూ ఎక్కువగా చోటా కార్మిక నాయకుల, సీనియర్ కార్మికుల కుటుంబాలు నివాసముంటున్నాయి. వీళ్లకు ముందుగానే తెలిస్తే, చెబితే సభ జరగనివ్వరు. ఆ కుటుంబాల మద్దతు లేనిదే సభ నిర్వహించడం కష్టం. అందుచేత ఆవరణ చుట్టుపక్క కుటుంబాల మహిళల్లో మేడే సభ గురించి, ఆ రోజు ఉండబోయే సాంస్కృతిక కార్యక్రమాల గురించి విస్తృతంగా ప్రచారం చేసి వారి మద్దతు కూడగట్టారు. నిజానికి ఆ మహిళల హార్దిక సహాయ సహకారాలతోనే సభ నిర్వహించగల్గారు. కొన్ని కుటుంబాలు బల్లలు కుర్చీలు ఇస్తే, కొన్ని కుటుంబాల వారు మంచినీళ్లు, కరెంటు సమకూర్చారు. తోచిన కాడికి 5, 10 రూపాయల చందాలిచ్చారు. ఇదంతా రెండు కారణాల వల్ల సాధ్యమైంది.

కార్మిక యువకులు ఆ కుటుంబాల మహిళా యజమానులతో, ఇతర మహిళా సభ్యులతో మేడే ప్రాధాన్యతను, కార్మికులకు దాని పట్ల ఉండాల్సిన స్ఫూర్తిని, దాని వెనుక ఉన్న కార్మికుల త్యాగాలను వివరించడం, ఆ స్ఫూర్తితోకాక, యాజమాన్యాలను మెప్పించే రీతిలో ప్రతి సంవత్సరం ఇప్పుడు జరుపుకుంటున్న మేడేకు భిన్నంగా తాము అసలు సిసలు మేడేను నిర్వహించ తలపెట్టామని, ఇటువంటి సభను నిర్వహించడానికి లీడర్లు, పోలీసులు అనుమతించరు కాబట్టి మీరంతా మాకు పూర్తి సపోర్టు, సహకారం అందించాలని ఉన్నది ఉన్నట్లు చెప్పడం వల్ల మహిళల అభిమానం, సహకారం కార్మిక మిత్రులు పొందగలిగారు. ఈ సహకారమే సభ దిగ్విజయంగా నడవడానికి దోహదపడింది.

ఈ సభ జరగనివ్వమని స్థానిక, యూనియన్ నాయకులూ బెదిరింపులు జారీచేస్తే, మీరు తాగి తందానాలాడే మేడే కన్నా మంచి ఆటపాటల మేడే పిల్లలు జరిపితే మీకేమి అభ్యంతరమని వాళ్ల కుటుంబాల మహిళలే నిలదీశారు. పిల్లలూ మీరు సభ పెట్టండి, పాటలు, పద్యాలూ పాడండి.. మేం బల్లలిస్తాం, కుర్చీలిస్తాం, నీళ్లిస్తాం, కరెంటిస్తామని గొప్ప ప్రోత్సాహాన్నిచ్చారు.

ఈ రకంగా ప్రజల సహాయ సహకారాలతో మేడేను విప్లవ స్ఫూర్తితో దిగ్విజయంగా నిర్వహించారు. సభా ప్రాంగణం నిండి వక్తల ప్రసంగాలతో, సాంస్కృతిక కార్యక్రమాలతో మార్మోగింది.

సభకు అనుమతి లేదని అడపా తడపా పోలీసులు, సభ నడిపే దెవుళ్లురా అంటూ స్థానిక రౌడీలు ఆటంకాలు సృష్టించినా, సభా భగ్నానికి ప్రయత్నించినా మహిళలు ముందుకొచ్చి మేడే మంచిగా పాటలు పడుతూ జరుపుకుంటుంటే అనుమతేంది? సక్కగా కూసుని ఇనుండి, లేదంటే పొండి, మేమింటం. సభ మాగ్గావాలె, ఆపకుండా నడపండి పిల్లలూ అని సభ ముగించే వరకు నడుంకట్టి నిలబడ్డారు. సభకు వచ్చిన చాలా మంది కార్మికులు కూడా సభకు మద్దతు పలికి కార్యక్రమాలను ఆస్వాదించారు.

ఈ సభ, సనత్‌నగర్-బాలానగర్ పారిశ్రామిక ప్రాంతంలో కార్మిక యువకులు చేపట్టిన కార్యక్రమాల పట్ల రెండు కొత్త కోణాలను తెరపైకి తెచ్చింది. ఒకటి - కార్మిక యువకుల ఉత్సాహాన్ని పెంచి వారిని కొత్త కార్యక్రమాలు చేపట్టడానికి ప్రోత్సహించడం; రెండు - యువ కార్మికులపై స్థానిక యూనియన్ నాయకుల కన్నుపడి వాళ్లు పోలీసులను అప్రమత్తం చేయడం. పోలీసుల, బస్తీల నాయకుల బెదిరింపుల జోరు పెరిగింది. కొంతమంది యువకులను పోలీసు స్టేషన్‌కు పిలిపించి మీ వెనుక ఎవరున్నారో చెప్పండని ఒత్తిడి చేయడం, కొట్టి లాకప్పుల్లో వేయడం మొదలైంది.

వీళ్లను విడిపించడానికి కొంతమంది వీళ్లపట్ల కొంత అభిమానం గల యూనియన్ నాయకుల, వాళ్ల ఊళ్లల్లోని నాయకులతో చెప్పించి విడుదల చేయించారు. పోలీసుల దెబ్బలకు బెదిరి కొంతమంది దూరమైనా కొంతమంది గట్టిగా నిలబడ్డారు. దూరమైనా వారు కూడా సంబంధాలతో ఉండే వారు.

. యువ కార్మికబృందం తలపెట్టిన కార్యక్రమాలు ఇలా కొత్త స్థితిలోనికి ప్రవేశించిన తరుణంలోనే ఒక దుర్ఘటన జరిగింది. ఈ మిత్ర బృందంతో సంబంధాల్లో ఉన్న ఒక మహిళా అభిమాని ఇంటికి వెళ్లి ఈ బృంద కార్మికుడు ఒకడు ఆమెపై బలాత్కార ప్రయత్నం చేసాడు. ఆమె బృంద నాయకులకు అతనిపై కంప్లైంట్ ఇచ్చి అతనిపై గట్టి ఏక్షన్ తీసుకోవాలని పట్టుపట్టింది. ఈ కార్మికుడు 35 ఏళ్ల వయసు వాడు. వివాహితుడు, ఓ చంటి బిడ్డకు తండ్రి కూడా!

ఇతని గురించి ఎంక్వయిరీ చేయగా తేలిందేమంటే, ఇతను సమాంతరంగా బస్తీ యూనియన్ రౌడీ నాయకులతో సంబంధాలు కొనసాగిస్తున్నాడని, వాళ్లతో సాయంకాలాల్లో మందు తాగుతున్నాడని, బృంద వ్యవహారాలు లీక్ చేస్తున్నాడని బయటపడింది. ఇతనికి కాంగ్రెస్ పార్టీ వాళ్లతో సంబంధాలు ఉన్నాయని, వాళ్ల దగ్గరకు వెళుతూ వస్తూఉంటాడని తెలిసింది. యువ కార్మిక బృందంతో ఇప్పటివరకు మంచిగా ఉండే ఇతనికి బ్యాక్‌గ్రౌండ్ అప్పటివరకు ఎవ్వరూ పట్టించుకోలేదు.

దీంతో బృంద నాయకులు కూర్చుని ఇతని నడత మీద, మిత్ర మహిళపై అత్యాచారం పట్ల, అతనిపై తీసుకోవాల్సిన చర్య పట్ల చర్చించారు. అప్పటికి ఇంకా ఏక్టివ్‌గా అన్ని సెల్ మీటింగుల్లో కూడా ఈ చర్చ చేపట్టారు. అతనితో రవి మాట్లాడాలని, నడత సరిచేసుకోమని హెచ్చరించాలని, అతన్ని మహిళానేస్తం ఇంటికి తీసుకువెళ్లి ఆమెకు క్షమాపణ చెప్పించాలని, దీనికి అతను ఒప్పుకోని పక్షంలో ఇతనిపై అతని భార్యకు ఫిర్యాదు చెయ్యాలని, ఈ విషయం ముందుగానే అతనికి చెప్పాలని నిర్ణయించారు.

ఐతే, దారితప్పిన ఈ కార్మిక మిత్రుడు మొరాయించి ఎదురుతిరిగి మీ అందరి సంగతి తెలుస్తానని ఎదురు బెదిరింపులకు దిగాడు. వ్యవహారం గంభీరంగా మారుతోందని రవి గుర్తించి, తదుపరి అడుగు ఎలా వెయ్యాలో తన సహచరుడు రవి డైరెక్షన్‌కై సంప్రదించాడు. అంతా విని అతనేమన్నాడంటే.. మనం 15 రోజుల్లో ఒక ప్రజా కోర్టును నిర్వహిద్దాం. అతన్ని ఆ ప్రజా కోర్టుకు హాజరు కమ్మని చెప్పు. అతనికి మనమొక ఉత్తరం రాద్దాం! అందులో అతనికి సన్మార్గంలో నడుచుకోమని మంచిగా చెబుతూనే, వక్రమార్గం అనుసరిస్తే తగిన శిక్ష అనుభవిస్తావని గట్టిగా హెచ్చరిద్దాం అని కుమార్ ఒక ఉత్తరం తయారుచేసి రవికి వినిపించాడు.

ఈ ఉత్తరం చదివి అతను లొంగి వచ్చాడు. కార్మిక మిత్రులను కలిసి చెప్పాడు.. తాను ప్రజాకోర్టుకు హాజరౌతానని, తాను పొరబాటు చేశానని, ఆ యువతికి నలుగురి ముందు క్షమాపణ చెబుతానని మాట్లాడేడు. ఈ విషయం ఎక్కడా బయటపడనివ్వొద్దని, తన భార్యకు, చుట్టుపక్కల వాళ్లకు తెలియనియ్యొద్దని వాళ్లను ప్రాధేయ పడ్డాడు.

అనుకున్న ప్రకారం సనత్‌నగర్ పారిశ్రామిక ఎస్టేట్ ఆఫీసు ముందున్న పార్కులో, పోలీసు స్టేషన్‌కు కూతవేటు దూరంలో ప్రజాకోర్టు కూర్చుంది. 25 మంది సభ్యులు హాజరయ్యారు. బలాత్కారానికి ఒడంబడిన కార్మిక మిత్రుడు, బాధిత యువతీ హాజరయ్యారు.

ప్రజాకోర్టు నిర్వహన బాధ్యత సమీకరించిన పెద్ద అందరికి ప్రజాకోర్టు నిర్వహణకు దారితీసిన పూర్వరంగాన్ని, బలాత్కార అభియోగాన్ని సభ్యులకు వివరించాడు. బాధిత యువతిని ముందుగా మాట్లాడమన్నాడు.

ఆమె మొత్తం సంఘటనను పూస గుచ్చినట్లు చెప్పింది. విప్లవ రాజకీయాలంటే తనకు అభిమానమని, అందుకే నా అన్నకు మిత్రులైన కార్మికదోస్తులు మా ఇంటికి వస్తే గౌరవాదరణతో చూసేవారమని, మా అన్న కూడా మిత్రులకు చేతనైన సహాయం చేసేవాడని, ఇది అనువుగా తీసుకుని, ఈ మిత్రులతో పాటు వచ్చే ఇతను మా అన్న షిఫ్టులో ఉండే టైం తెలుసుకుని తాగి దుర్మార్గపు ఆలోచనతో వచ్చి తనను బలాత్కరించ బోతే, తాను మందలించి గట్టిగా అరుస్తానని, పిచ్చి పిచ్చి వేషాలు వేయక వదిలిపెట్టమని తోసివేయడంతో భయపడి వెళ్లి పోయాడని, ఇతనికి భార్యా బిడ్డ ఉన్నారని తెలిసి విస్తుపోయానని చెప్పింది.

విప్లవ భావాలుగల మిత్రులు ఇటువంటి చెడు స్వాభావిని ఎందుకు గుర్తించ లేకపోయారని ప్రశ్నించింది. అతనికి ఈ కోర్టు తగిన గుణపాఠం చెప్పాలని, ఇటువంటి పనులు చేయకుండా శిక్షించాలని కోర్టుకు నివేదించింది. అయితే బలాత్కారానికి ఒడంబడిన కార్మిక మిత్రుడు తాను వెంబడి తెచ్చుకున్న కొంతమంది మిత్రుల సలహాతో, నేను బలాత్కరించ ప్రయత్నించలేదని, స్నేహితునిగానే వెళ్లానని, తనపై తప్పుడు అభియోగం మోపుతున్నారని అన్నాడు. అతనితో వచ్చిన కొందరు అతనికి వత్తాసు పలికారు. చర్చ జరిగింది.

మెజారిటీ సభ్యులు దిగజారిన మిత్రుడు యువతికి బహిరంగ క్షమాపణ చెప్పాలని, కోర్టు ముందు అటువంటి చేష్టలకు ఇక పాలుపడనని హామీ ఇవ్వాలని ప్రతిపాదించారు. దిగజారిన మిత్రుడి సమర్థకులు గొడవకు దిగారు.

ఈ ఘటనల అనంతరం అప్పటి సిపిఐ(ఎం-ఎల్) నాయకుడు కె.ఎస్ (కొండపల్లి సీతారామయ్య) ఈ మిత్ర బృంద సెల్ నిర్వాహకులను కలిశారు. వారితో సుదీర్ఘంగా చర్చించి నిర్మాణాన్ని పార్టీ ఆధ్వర్యంలో నడిపించాల్సిన అవసరాన్ని వివరించాడు.

దానికి ఈ నిర్వాహకులు మనస్ఫూర్తిగా ఒప్పుకున్నారు. తదనంతరం పార్టీ తన ఉద్యమ నిర్మాణ అవసరాల రీత్యా, ఈ కార్మిక ప్రాంత నిర్మాణాన్ని, భాద్యులను రీఆర్గనైజ్ చేసింది. అదంతా వేరేకథ.

ఈ క్రమంలోనే కె.ఎస్.తో నా పరిచయాలు పటిష్ట పడ్డాయి. వీటి గురించి, కె.ఎస్ గురించి చెప్పడానికి చాలా ఉన్నా, చెప్పే అవసరం కూడా ఎంతో ఉన్నపటికీ, ఒక ప్రధాన సంఘటన ఇక్కడ వివరించి ముగిస్తాను.

ఈ కాలంలో ఆయన మా దగ్గరకు తరచూ వస్తూపోతూ ఉండేవారు. మా దగ్గర ఉండే ఎన్నో వ్యాసాలు, పార్టీ పత్రాలు రాస్తూ ఉండేవారు. మాకు కొత్త కొత్త బాధ్యతలు అప్పచెప్పే వారు. అప్పటికే కకావికలైన, ఎన్నో నష్టాల పాలైన, ఎంతో మంది అమూల్యమైన నాయకులను, కార్యకర్తలను, యోధులను కోల్పోయిన నక్సల్బరీ ఉద్యమ సందర్భం.. ఏర్పడిన చీలికలు, ముఠాలు సిద్ధాంత-ఆచరణల్లో ఏర్పడ్డ గందరగోళం, గ్రూపుల మధ్య కొట్లాటలు, రాద్ధాంతాలు; ఇటువంటి పరిస్థిలో ఎందరో ఉత్సాహవంతులైన యువకుల నిరాశమయ విప్లవ రాజకీయ నిష్క్రమణ.. వీటన్నిటినీ తట్టుకుని, ఓపిగ్గా విప్లవ పురోగమనానికి ఉపక్రమించిన మేటైన విప్లవకారుడు, కార్యశూరుడు కె.ఎస్.

ఈ కాలంలో ఆయన మావద్దకు వచ్చిన ఓ రోజు తన అంగీ పక్కజేబు

నుండి మడత పెట్టి ఉన్న ఓ కాగితాన్ని బయటకు తీసి మడతవిప్పి ఇది చూడండని నా చేతికిచ్చాడు. చూస్తే అది కోడిగుడ్డు ఆకారంలో ఉన్న ఒక రేఖా చిత్రం. ఎవరో గజిబిజిగా చేత్తో గీసి ఇచ్చిన ఓ బొమ్మ. ఆలోచించి పోల్చుకుంటే అది ఓ చేతిబాంబు బొమ్మని అర్థమైంది. అంతకు మించి ఇంకే వివరాలు అందులో లేవు.

మీరు ఇంజనీర్లు కదా! దీన్ని బట్టి మనం ఇటువంటి చేతి బాంబులు తయారు చెయ్యాలి. ఇవి లేక మన దళాలు చాలా నష్టపోతున్నాయి. పార్టీకి ఇప్పుడు వీటిని తయారు చేయడం ప్రధాన బాధ్యత. మనం వీటిని ఎలా చెయ్యొచ్చో, చెయ్యాలో ఆలోచించి చెప్పండి. దీనిపై సీరియస్‌గా దృష్టి పెట్టండి అని అన్నాడు.

ఇందులో ఏ వివరాలు లేవు, ఉత్త వంకర బొమ్మ, ఇంత మాత్రంతోనే బాంబులు ఎలా తయారు చెయ్యగలం? అని నేనన్నాను.

మరి ఇంజనీర్ల పని ఏమిటి? అని ఆయన నవ్వి చెయ్యాలి, చెయ్యక తప్పదు. సాధించాలి అని ప్రోత్సహించాడు. మేమప్పుడు ఈ విషయాన్ని పెద్దగా సీరియస్‌గా తీసుకోనప్పటికీ మాలో మేము చర్చించుకోసాగాం! ఎలా? ఎలా? పెద్దాయన పెద్దపనే పెట్టాడని అని బుర్రగోక్కో సాగాం!

ఆయన వచ్చినప్పుడల్లా, వస్తూనే కామ్రేడ్ ఏమైంది మన బాంబు వ్యవహారం? దారి దొరికిందా అని నవ్వుతూ ప్రశ్నించేవాడు. మేం తెల్ల మొఖం వేసేవాళ్లం. ఇలా కొన్ని నెలలు గడిచింది.

ఒక ట్రిప్పులో నన్ను కూర్చోబెట్టి కొన్నాళ్ల పాటు కార్మికోద్యమ నిర్మాణ బాధ్యతను పక్కకుపెట్టి మీరు వేరే బాధ్యతలోనికి వెళ్లాలని, దానికి తయారుగా ఉండమని, ఇంకొక కామ్రేడ్ వచ్చి ఆ పనికోసమై మిమ్ములను తీసుకు వెడతాడని చెప్పాడు. సరే అన్నాను.

ఆ రోజు రానే వచ్చింది. ఓ కామ్రేడ్ వచ్చి నన్ను నగరంలో ఇంకో ప్రదేశానికి, తీసుకు వెళ్లాడు. అదొక శ్రామికుల బస్తీ. చిన్న చిన్న ఒంటి గది, రెండుగదుల రేకుల నివాసాలు. తలుపు బార్లా తెరిచి ఉన్న ఒక ఒంటి గది ఇంటిలోనికి ప్రవేశ పెట్టాడు. ఆ గదిలో ఓ మూలన కూర్చున్న ఒక వ్యక్తి పరపర హేక్సా ఇనుప బ్లేడు రంపంతో పరపరా ఏదో ఇనుప ముక్కను ఏకాగ్రతతో కోస్తున్నాడు. ఇనప రజను కిందికి జారి నేలపై పడుతోంది. నన్ను తీసుకు వెళ్లిన కామ్రేడ్ అక్కడున్న వ్యక్తిని, కామ్రేడ్ అని సంబోధించి అతని ఏకాగ్రతకు భంగం కలిగించాడు. అతను కొంత చికాకుతో మొఖం పైకెత్తి, ఆ ఆ రండి అని తిరిగి పనిలో పడ్డాడు.

ఇదిగో ఈయన మన కామ్రేడ్. పెద్దాయన నీకు సహాయంగా ఈయన్ను పంపించాడు. ఈయన ఇంజనీరు. నీకు బాగా ఉపయోగ పడతారు. జాగ్రత్తగా చూసుకో, నీతో తర్వాత మాట్లాడుతా, పనుంది, వెళ్తాతా అని నన్ను తీసుకొచ్చిన కామ్రేడ్ వెళ్లిపోయాడు. అప్పుడుగాని నాకు అక్కడ జరుగుతున్న పని ఏమిటో తెలియ రాలేదు. రిక్కించి చూస్తే అక్కడ పనిచేస్తున్న మనిషికి ఓ పక్కన కోడిగుడ్డు ఆకారంలో కొన్ని ఇనుప వస్తువులు కనిపించాయి. నా గుండె దడదడ కొట్టుకుంది. పెద్దాయన చూపించిన కాగితం ముక్కలో బొమ్మ ఆకారంలోనే అవి ఉన్నాయి. అంటే పరపర కోస్తున్న మహానుభావుడు బాంబుల తయారీలో తల మునకలై ఉన్నాడన్నమాట. నన్నతను కూర్చోమని అనలేదు. నాతో మాట్లాడనూ లేదు. తన పనిలో మునిగిపోయి ఉన్నాడు, చెమటలు కారుకుంటూ. కాస్సేపు ఆలోచించి, తటపటాయిస్తూ అతని పక్కన కాళ్లు మడిచి కూర్చున్నాను. ఆయన చేసే పని చూస్తున్నాను.

మెల్లగా చెయ్యిచాపి ఇనుప చేతి బాంబు షెల్స్‌ను పరిశీలించ సాగేను. ఒకటి చేతిలోకి తీసుకుని పరీక్షగా చూడ సాగేను. అప్పుడు ఆ వ్యక్తి నోరు తెరిచి ఏమిటి చూస్తున్నావ్? అవేంటో తెలుసా? అన్నాడు. నేను కొంచెం స్థిమితపడి, ఇవి హ్యాండ్ గ్రెనేడ్ బాంబ్ షెల్స్ అన్నాను. నీకెలా తెల్సన్నాడు. పెద్దాయన ఓ బొమ్మ చూపించాడని, మమ్ములను ఎలా తయారు చెయ్యాలో ఆలోచించమన్నాడని చెప్పాను.

దానితో అతను వెటకారంగా మూతి విరిచి, మరి చేశారా? అంటే, లేదు మాకు అసలు అటువంటి ఐడియానే రాలేదు అన్నాను. దానికి అతను, పెద్దాయన అనుకుంటాడు, ఇంజనీర్లు ఏదో పొడిచేస్తారని.. అని మళ్లీ వెటకరించాడు.

నాకు ప్రాక్టికల్ ఎక్స్పీరియన్సు లేదు అని అంటే, పని చేస్తే కదా, చేతులు కాయలు కాస్తే కదా అనుభవం వచ్చేది అని, సరే చూడు నేను ఎలా చేస్తున్నానో, ఏమి చేస్తున్నానో అని తిరిగి పనిలో పడిపోయాడు. ఈ కథనం వివరంగా చెబితే చాలానే ఉంటుంది.

ఇక్కడకు ఆపి ముగింపు వైపు వెడతాను.

ఒక నెల గడిచింది. మందుగుండు దట్టించిన ఐదు ఇనుప చేతి బాంబుల (మొదటి ట్రయిల్ సెట్ హేండ్ గ్రెనైడ్లు) తయారైనాయి. ఇంకొక 25 వరకు తయారు చేయడానికి విడి భాగాలు సమకూరి ఉన్నాయి. వీటిని క్షేత్రంలో విసిరి పేల్తాయో, లేదో పరీక్షించాలి. పేలినట్టైతే మిగతావి తయారు చెయ్యాలి.

ఒక రోజు తెల్లారి 4 గంటలకు నన్ను తీసుకొచ్చిన కామ్రేడ్, బాంబుల స్పెషలిస్టు, నేను మూసీ నది ఒడ్డున దూరంగా ఒక మైదానంలోకి వెళ్లాం. స్పెషలిస్టు బాంబు లివర్ చేతితో ఎలా లాగి నొక్కి పట్టి ఉంచి, విసరాలో వివరించాడు. బాంబు లీవర్ నొక్కడం నావల్ల కాలేదు.

వాళ్లిద్దరూ చెరో బాంబు దూరంగా విసిరారు. ఎగిరి నేల మీద పడ్డాయి. నేను భయంతో చెవులు మూసుకున్నాను. అవి ఎంతకీ పేల్లేదు. నాచేత కూడా ఒకటి విసిరించారు. అదీ పేల్లేదు. ఇంకా రెండున్నాయి. ఏం చెయ్యాలో అయోమయంలో పడ్డాం. స్పెషలిస్టు మిగతా రెండూ వేద్దామన్నాడు. వద్దు వేస్ట్ అన్నాను నేను. స్పెషలిస్టుకు కోపమొచ్చింది. ఇంకో కామ్రేడ్ కారణమడిగేడు.

అనుభవం లేకపోయినా, తయారైన తీరు చూసి, కొంత ఇంజనీరింగ్ చదివిన జ్ఞానంతో నాకు తోచిన లోపాలు చెప్పాను. వేసినా ఇవికూడా పేలవని మిగిలిన రెండూ అలానే ఉంచుదామని, విసిరిన వాటిని వదిలి నిష్క్రమిద్దామని నేను నా అభిప్రాయం చెప్పాను. దీనితో స్పెషలిస్టుకు చాల కోపం వచ్చింది, ఈ బచ్చాగాడికి ఏమి తెలుసునన్నట్లు మాట్లాడేడు.

ఆచరణ ద్వారా అనుభవజ్ఞులైన పనివారికి, అంతగా ఆచరణాత్మక అనుభవం లేని చదువరులైన ఇంజనీర్లకు ఉండే వైరుధ్యమే ఇది. ఈ రెండు శాస్త్రీయ పద్ధతిలో మేళవింపైతే గాని సరైన ఆవిష్కరణ జరగదు. ఇదీ అంతే.

అయితే కాలం గడిచిపోతోంది, మనుష సంచారం మొదలయ్యే సమయం దగ్గర పడుతోంది. ఏదో నిర్ణయం తీసుకోవాలి. పేలని వాటిని వదిలేయడానికి స్పెషలిస్టు సుముఖంగా లేదు. మిగిలిన వాటిని విసురుదామని కూడా అంటున్నాడు. అందులో నుండైనా ఏదో ఒకటి పేలక పోతుందా అని ఆయన ఆశ.

మేమిద్దరం అతని నిర్ణయాన్నే ఆమోదించాం. ఆయనే మిగతా బాంబులు విసిరేడు. అవీ పేలలేదు. ఇప్పుడేం చేయాలి? పేలని బాంబులు వదిలి వెళ్లిపోవాలా? లేక వాటిని సేకరించి వెనక్కు తీసుకువెళ్లాలా? వదిలి పెడితే, ఆ వదిలిన బాంబులు జనం కంట బడితే పోలీసులకు రిపోర్ట్ చేస్తారు. అది మరింత ప్రమాదం కాబట్టి అవి వెనక్కు తీసుకు పోవాల్సిందేనని, ఒక అర్ధ గంట చూసి ఇక పేలుడు సంభవించే ఆస్కారం లేదు కాబట్టి, వాపసు తీసుకుని నిష్క్రమిద్దామని స్పెషలిస్టు సూచించాడు. అతనే ఈ పనికి బాధ్యుడు కాబట్టి ఆ నిర్ణయాన్ని అమలు చేసాం.

ఐదు పేలని బాంబులను వెనక్కి తీసుకు వెళ్లిపోయాం. షెల్టర్‌కు వెళ్లాక వంట చేసుకు తిని ఎందుకు ఇలా జరిగిందో చర్చిద్దామని మూడో కామ్రేడ్ అన్నాడు. ఈయన కూడా ఇంజనీరింగ్ చదువుకున్నది, చాల బాధ్యత గల సీనియర్ కామ్రేడ్ అని నాకు తరువాత తెలిసింది.

ఈ కామ్రేడ్, ముందుగా స్పెషలిస్ట్ అభిప్రాయం చెప్పమన్నాడు. ఆయన మందుగుండు సరైనది కాదని, ఇంకా ఏవో కొన్ని లోపాలు చెప్పాడు. నా వంతు వచ్చినప్పుడు నేను నిష్కర్షగా చెప్పాను. ఇవి ఒక డిజైన్ ప్రకారం చేసినవి కాదు కాబట్టి ఇలా తయారు చేసినవి పనిచేస్తాయనే నమ్మకం నాకు లేదని, ప్రతి విడి భాగము ఒక లెక్క ప్రకారం రూపొందించ బడాలనీ అప్పుడే పని చేస్తాయని నా థియరీ నేను చెప్పాను.

మిగతా ఇద్దరు కామ్రేడ్లు కూడా సరే! కరక్ట్. అయితే ఈ డిజైన్ మనకు ఆకాశం నుండి ఊడి పడుతుందా? అని ప్రశ్నించారు. నువ్వు డిజైన్ చేయగలవా అని ప్రశ్నించారు. ఎలాగైనా ఒక ఒరిజినల్ సంపాదిస్తే, అది కాపీ కొట్టడం చేయొచ్చని, అలా చేయడం శ్రేయస్కరమని, అలా చేయడం ద్వారా చాల మట్టుకు, ట్రయిల్ ఎండ్ ఎర్రర్ పద్ధతి నుండి బయట పడవచ్చని నా అభిప్రాయాన్ని చెప్పాను.

చర్చ తెగ లేదు. ముందు జాగ్రత్తగా అక్కడ నుండి బిఛానా మార్చి వేయాలని నిర్ణయించి, ఇంకొక చోటుకు మకాం మార్చాం. ఇక ముందు ఏమి చెయ్యాలో స్పెషలిస్టు నిర్ణయానికి వదిలి పెట్టారు. నన్ను ఆయనకు సహాయకుడిగా ఉండమన్నారు. మొత్తానికి ఆ పని నాకు సహించలేదు, స్పెషలిస్టు మనస్తత్వం, పని తీరు కూడా నాకు మింగుడు పడలేదు. ఒక రోజు మూడో కామ్రేడ్ నన్ను వేరే రూంకు తీసుకు వెళ్లి కె.ఎస్‌తో సమావేశంలో కూర్చోబెట్టాడు. బాంబుల విషయమై ఈ సమావేశం ఏర్పాటైంది.

ఆయన నా అభిప్రాయం క్షుణ్ణంగా తెలుసుకోవాలని పిలిపించాడు. నాకు తెలుసున్నది, నేను అర్థం చేసుకున్నది, నాకు ఈ ప్రాజెక్టులో పనిచేయడానికి హితవులేనిది, నా రంగానికి నేను వెడతానని వివరించాను.

ఆయన ఓపిగ్గా అన్నీ విన్నాడు. భుజం మీద చెయ్యి వేసి నిమురుతూ, నవ్వు మొఖంతో అన్నాడు – మీరు ఇంజనీర్, మీ అవసరం ఈ ప్రాజెక్టుకు చాల ఉంది. మనకు ప్రత్యామ్నాయ మార్గం దొరికేవరకు, మన జ్ఞానం పెరిగే వరకు ఉన్న దాన్నే మరింత మెరుగ్గా చేయగలిగే మార్గం పట్టుకుని ప్రయత్నం కొనసాగించాలని, అలాగే ప్రత్యామ్నాయాలకై పార్టీ తప్పక పట్టుదలతో పనిచేస్తుందని బోధించాడు. ఐనా నేను గట్టిగా పట్టుబట్టిన మీదట నాకు వేరే బాధ్యతలు అప్పచెప్పారు. అదంతా వేరే ఘట్టం.

'అతనెవరో గుర్తున్నాడా?' అని నేను ఆయన జ్ఞాపకాల మననంతో రాసుకున్న కవితలో – ఒక రోజు బుర్రలో బాంబులు మోసుకొచ్చాడు అని రాసేను.

ఆయన విప్లవోద్యమ నిర్మాణానికి ఎన్నో ఆలోచనలను మోశాడు. అందులో ఇదొకటి. ఈ రోజు ప్రజా విముక్తి గెరిల్లా సైన్యానికి సమకూరిన ఆయుధ సంపత్తికి శత్రువు నుండి తుపాకులు గుంజు కోవడం ఒక వీరోచిత ఆలోచన అయితే, కె.ఎస్ బుర్రలో బాంబుల తయారీ ఆలోచనల మోత, దాని సాధనకై పట్టువిడవని దీక్ష మరొక విప్లవాత్మక ముందంజ.

నక్సల్బరీ వసంత మేఘ గర్జన నా చెవిన పడిన నాటికి నాకు 18–19 ఏళ్లు. ఇంజనీరింగ్ విద్య ఇంకా పూర్తికాలేదు, మధ్యలో ఉన్నాను. 50 ఏళ్ల నాటి నక్సల్బరీ విప్లవ శంఖారావం నన్ను విడనాడక నామదిలో అప్పటి నుండి ఇంకా మార్మోగుతూనే ఉంది. నక్సల్బరీ రాజకీయాలను నేను మరిచిపోలేదు. ఆ రాజకీయాలు నన్ను వీడలేదు. ఆ రాజకీయాలపై నాకు కొన్ని ప్రశ్నలు, సంశయాలు, సందేహాలు అప్పటి నుండి ఇప్పటి వరకు ఉన్నప్పటికీ భారత దేశంలో శ్రామికవర్గ విప్లవానికి అది నిర్దేశించిన మార్గం, ఎన్నుకున్న దారి, ఆచరణ తీరు, ఆచరిస్తున్న విప్లవ కార్యక్రమంపై నాకు నమ్మకం ఉంది.

నక్సల్బరీ ఉద్యమ ఆశయాల పట్ల, విలువలపట్ల ఎంతో గౌరవం ఉంది. అందుచేతనే నక్సల్బరీ రాజకీయంతో నేను అనుబంధం ఏర్పర్చుకుని కొనసాగిస్తున్నాను. అంతేగాక ఒక్క నక్సల్బరీ రాజకీయ పంథా మినహా, భారత దేశంలో ఇప్పటికి ఉనికిలో ఉన్న మరే ఇతర రాజకీయ పంథా భారత దేశ విప్లవాన్ని ముందుకు నడిపించలేదని రుజువైంది. అందుచేత నక్సల్బరీకి 50 ఏళ్లు నిండిన ఈ సందర్భంలో, ఈ పంథాను కాపాడుకుని, బలోపేతం, సంపద్వంతం చేసుకుని విప్లవ విజయాన్ని సాధించడానికి పాటుపడటమే, ఏకైక కర్తవ్యంగా మలుచు కోవడమే, ఈ దేశ శ్రామిక ప్రజలు, కార్మికులు, కష్టజీవులు, బుద్ధిజీవులు చెయ్యాల్సిన పని.

నక్సల్బరీ ప్రారంభం నుండి మొదలై, గత ఐదు దశాబ్దాల నుండి భారత పాలకవర్గం అణచివేతతో, ఊచకోతతో, దమనకాండతో దేశ ప్రజలు నక్సల్బరీ మార్గంలోనికి మళ్లకుండా, నక్సల్బరీని పూర్తిగా తుడిచిపెట్టి నామరూపాలు లేకుండా చేయడమే ఏకైక ఎజెండాగా కొనసాగిస్తున్నది. ఇప్పుడు హిందూ ఫాసిస్టు ముఠా పారిపాలనతో ఈ పాలకవర్గ ఎజెండా మరింత బలాన్ని, వేగాన్ని సంతరించుకుంది. దీన్ని ధీటుగా ఎదుర్కొని నిలబడాలంటే తొలినాటి నక్సల్బరీ స్ఫూర్తితో శ్రామిక ప్రజారాశులు, బుద్ధిజీవులు, విప్లవ శక్తులు తమ యావత్ శక్తి యుక్తులను ఐక్యపరిచి, కేంద్రీకరించి మరింత నిబద్ధతో పనిచేయాల్సిన తరుణం, చారిత్రక సందర్భం తోసుకొస్తున్నది. ఫాసిస్టు పెను ప్రమాదం చుట్టుముడుతున్నది.

మొత్తం దేశ రాజకీయం రెండు ప్రత్యర్థి సేనలుగా తోడుకుంటున్నది. ఒక పక్క కాషాయసేన, మోడీ సర్కార్. రెండో పక్క ప్రజా సేన, జనతన సర్కార్. ఎవరు ఎవరిని చుట్టిముట్టి తుడిచి వేస్తారు? ఈ దేశ భవిష్యత్తును నిర్ణయించే దెవరు? కాషాయ సేనా? లేక నక్సలబరీ ప్రజా సేనా?

దేశ భవిష్యత్తును నక్సల్బరీ ప్రజా సేనే నిర్ణయించాలని ఆకాంక్షిస్తూ, యువతరం నక్సలభరీ కేతనాన్ని బలంగా ఎత్తిపట్టి కదంతొక్కి నడుస్తారని, భారత దేశ విప్లవ విజయాన్ని సాకారం చేస్తారనే ప్రగాఢ నమ్మకంతో ఈ వ్యాసం ముగిస్తాను.

*(రచయిత జాతీయ కౌన్సిల్ సభ్యుడు, విస్థాపన్ విరోధి జ[illegible]న్ ఆందోళన్)* వీ

# అడవిలో ప్రవేశించాలనే ఆశయం నెరవేరిన రోజు...

**శ్రీకాకుళం, విశాఖపట్నంలలో పార్టీ శ్రేణులతో ఉన్న అనుబంధాన్ని గుర్తు చేసుకుంటూ, వారు అమరులైనా కూడా వారి వారసత్వాన్నీ, సాహసాన్నీ పుణికి పుచ్చుకున్న గిరిజన రైతాంగ విప్లవోద్యమం నక్సల్బరీ పంథా వెలుగులో ముమ్ముందుకే సాగుతోందనీ అంటున్నారు డా. శ్రీనివాస్**

సరిగ్గా నలభై ఏళ్ల కిందటి సంగతి.

హైదరాబాద్‌లోనైనా, వరంగల్‌లోనైనా విద్యార్థుల ప్రదర్శనలో మార్మోగే నినాదాలు:

'అప్నాబరీ నక్సల్బరీ, సబ్‌కాబరీ నక్సల్బరీ, నక్సల్బరీ వర్ధిల్లాలి!'

'దొంగనోట్ల దొంగ ఓట్ల రాజ్యం ఒక రాజ్యమా! లంచగొండి వెధవలిచ్చు సాక్ష్యం ఒక సాక్ష్యమా!'

'యే ఆజాదీ జూటీహై, దేశ్‌కీ జనతా భూఖీహై!'

'జీనాహైతో మర్నా సీఖో, కదం కదం పర్ లడ్నా సీఖో!'

నక్సల్బరీ విప్లవ సందేశం దేశం నలుమూలలా వ్యాపించిన కాలం అది. దేశ దేశాలలో 'తూర్పు పవనం వీచేనోయ్! తూర్పు దిక్కెరుపెక్కె నోయ్!' అంటూ కార్మికులు పోరాటాలతో వెల్లువెత్తుతున్న కాలం. వియత్నాం, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు అగ్రరాజ్య ఆధిపత్యాన్ని ఎదురొడ్డి పోరాడుతున్న కాలం. అందుకే ఆ నినాదాలు ఎందో విప్లవ స్ఫూర్తినిచ్చాయి. తరతరాల దోపిడీని ఎదిరించే ధైర్యాన్నిచ్చాయి.

మహత్తర నక్సల్బరీ ఆశయంతో ఉత్తేజితుడనై, ఉస్మానియా మెడికల్ కాలెజి ఎంబిబిఎస్ చదువుకి మధ్యలోనే స్వస్తి చెప్పి ఫిబ్రవరి 1976లో విశాఖ జిల్లా ఆర్గనైజర్ బాధ్యతలు చేపట్టాను. విశాఖకు వెళ్లాలనే రాష్ట్ర కమిటీ నిర్ణయాన్ని నాకు తెలియజేయడానికి వచ్చింది రాష్ట్ర కమిటీ సభ్యుడు కామ్రేడ్ మహదేవన్. అక్కడ ప్రసాద్ పేరుతో పరిచయం చేసుకోవాలంటూ ఆ పేరు పెట్టింది కూడా ఆయనే.

మొదటి అయిదుగురు ఆంధ్ర యూనివర్సిటీ విద్యార్థులతోను, ఆరుగురు పట్టణ యువకులతోను, ముగురు పోర్టు ఉద్యోగులతోను, కొద్దిమంది షిప్‌యార్డు కార్మికులతోను సంబంధాలు ఉండేవి. వీరిలో ముఖ్యులను నాకు పరిచయం చేసింది ప్రముఖ రచయిత రావిశాస్త్రి కొడుకు కామ్రేడ్ నారాయణమూర్తి. కృష్ణా జిల్లాలో కామ్రేడ్ కె.ఎస్. కుడి భుజంగా పేరొందిన కామ్రేడ్ తప్పెట సుబ్బారావు నాకు షెల్టర్ ఇచ్చారు. ఆయన స్వగ్రామం పెంజెండ్ర. ఉద్యోగ రీత్యా విశాఖకు వచ్చి సెటిలయ్యారు. ఈ సంబంధాలను పటిష్ట పరుచుకుంటూ కొత్త సానుభూతిపరులను తయారు చేసుకోవాలని నా శాయశక్తులా కృషి చేశాను.

అవి ఎమర్జెన్సీ చీకటి రోజులు. రహస్య జీవితం గడుపుతున్న నేను ఎన్నో టెక్నికల్ జాగ్రత్తలు తీసుకుంటూ సానుభూతిపరులను కలవాల్సి వచ్చేది. పాలక వర్గాలు విద్యార్థులను అనేక విధాలుగా వేధిస్తుండేవారు. పరీక్ష కేంద్రాలలో 'ఫ్లయింగ్ స్క్వాడ్స్'ని తిప్పుతూ నానా బీభత్సం సృష్టించారు. ఈ నిరంకుశ చర్యలను తిప్పి కొట్టాలని పిలుపునిస్తూ రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ పేరుతో కరపత్రాలు ప్రచురించాను. కామ్రేడ్ తిరుపతి పట్నాయక్ సిందియా హై స్కూల్‌లో కరపత్రాలు పంచుతూ పోలీసులు ప్రవేశించగానే గోడదూకి, పోలీసులు వెంబడించినా పట్టుబడక, సాహసోపేతంగా తప్పించుకున్నాడు. విశాఖలోని అన్ని పరీక్షా కేంద్రాల్లో విద్యార్థులు ఈ కరపత్రాలు పంచారు. రాష్ట్ర వ్యాప్తంగా కూడా ఈ కరపత్రాలను విద్యార్థులు విస్తృతంగా పంచారు.

ఎమర్జెన్సీ నీడలో విచ్చలవిడిగా అమలైన పోలీసుల జులుంను యూనివర్సిటీ విద్యార్థులు బలంగా ప్రతిఘటించడంతో అప్పటికప్పుడు ఎస్.ఐ. భాస్కరరాజును సస్పెండ్ చేయక తప్పలేదు. షిప్‌యార్డు కార్మికులు తమ న్యాయమైన కోర్కెల సాధన కోసం సమ్మెకు దిగి డిమాండ్లను సాధించుకున్నారు. ఎమర్జెన్సీ నిర్బంధాన్ని లెక్కచేయక సాగిన ఈ పోరాటాలన్నీ ప్రజల పోరాట పటిమకు ప్రత్యక్ష నిదర్శనాలు.

ఈ పోరాట వార్తలన్నీ ఎమర్జెన్సీలో రాష్ట్ర కమిటీ వెలువరించిన రహస్య పత్రిక 'ఎర్రజెండా'లో ప్రచురితమయ్యాయి. ఈ పోరాటాల నేపథ్యంలో కామ్రేడ్ కె.ఎస్. నాకు రాసిన ఇరవై పేజీల సుదీర్ఘమైన లేఖ గురించి ప్రముఖంగా చెప్పుకోవాలి. తీవ్రమైన ఫాసిస్టు నిర్బంధ కాలంలో బహిరంగ, రహస్య కార్యకలాపాలను మేళవిస్తూ ప్రజా సంఘాల నిర్మాణాన్ని, పార్టీ నిర్మాణాన్ని ఎలా చేపట్టాలో వివరిస్తూ ఆయన చేసిన సూత్రీకరణలు పార్టీ కార్యకర్తలందరికీ గొప్ప గైడెన్సునుగా నిలుస్తాయి. ఆ లేఖలో ఆయన ఇలా రాశారు.

'మీరు మీ రిపోర్టులో కరపత్రాలు పంచడం ఒక ఎత్తు. తరువాత మన ఆర్గనైజేషన్ బిల్డ్ చేయడం ఇంకొక ఎత్తు అని రాశారు. అది చాలా కరెక్టు... ఒక అందోళన లేదా సమ్మె ముగించడంతో ఒక రివిజనిస్టు పని పూర్తవుతుంది. అందుకు విరుద్ధంగా ఒక రివల్యూషనరీ కృషి ద్విగుణీకృతమవుతుంది. అందులో నుండి కొత్తగా వచ్చిన మిలిటెంట్స్‌ను ఎడ్యుకేట్ చేయడం, వారిని ఆయా ఆర్గనైజేషన్‌లలో సంఘటిత పరచడం, తద్వారా పోరాటాన్ని మరింత ఉన్నత స్థాయికి తీసుకొనిపోవడానికి పునాదులు వేయడం వగైరా వగైరా పనుల ద్వారా నిజంగా అతని కృషి ద్విగుణీకృతం కావాలి. దీన్నంతా కలిపి మనం కన్‌సాలిడేషన్ అంటాం.

'అలాంటి కన్సాలిడేషన్‌లో పార్టీ నిర్మాణానికి, ఆర్ఎస్‌యు తదితర ప్రజా సంఘాల నిర్మాణానికి మధ్య వైరుధ్యం లేదు. పైపెచ్చు ఆ రెండు ఒకదానిపై మరొకటి ఆధారపడుతూ ముందుకు పోయేవే. పార్టీ కరపత్రాలు పంచుతారు. 'ఎర్రజెండా' పత్రికలు చదువుతారు. చదివిస్తారు. కానీ అందులో చాలా మంది ఆర్ఎస్‌యు నిర్మించడానికి చైతన్య యుతంగా కృషి చేయరు (మీ రిపోర్టును బట్టి). అది ఈ రోజు చాలా చోట్ల జరుగుతున్న విషయమే. దానికి కారణం ప్రజల్ని ఆర్గనైజ్ చేయాల్సిన ఆవశ్యకత, ప్రజా సంఘాల పాత్ర, మొదలైన వాటి గురించి ఈనాటికీ పార్టీలో స్పష్టమైన అవగాహన లోపించడమే. 'ప్రజలే నిజమైన ఉక్కుకోట' అనే మావో సూక్తిని రోజూ వల్లిస్తూనే ఉన్నా ఆచరణలో విప్లవంలో ప్రజల పాత్రను గుర్తించకపోవడమే. కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే చాలదు. ప్రజలు కూడా ఆర్గనైజు అయితేనే తప్ప మన దేశంలోని అభివృద్ధి

నిరోధక ప్రభుత్వాన్ని నిర్మూలించలేమనే సత్యాన్ని గుర్తించలేకపోవడమే. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ప్రజలు కూడా సంఘటితమైతేనే తప్ప ప్రజాసైన్యాన్ని సైతం మనం నిర్మించజాలమనే యధార్థన్ని అర్థం చేసుకొనకపోవడమే. మనలో ఇంకా కొనసాగుతున్న లెఫ్ సెక్టేరియనిజం అవశేషం తాలూకు ఆచరణ రూపమే అది. ఈ విషయంపై పార్టీని ఇంకా చాలా ఎడ్యుకేట్ చేయాలి. దీనిని గట్టిగా ప్రయత్నిస్తే గాని సాధించలేం.'

ఈ లేఖ "విభిన్న అంతరంగిక పోరాటాల ద్వారా పీపుల్స్‌వార్ పార్టీ అభివృద్ధి క్రమం" పేరుతో వెలువడింది. రెక్టిఫికేషన్ కేంపెయిన్ డాక్యుమెంట్స్ నాలుగో సంపుటంలో అచ్చయింది. ఎమర్జెన్సీలో పనిచేయడానికి, ఆత్మవిమర్శ రిపోర్ట్, అత్యావసర పరిస్థితి – మన కర్తవ్యం డాక్యుమెంట్స్‌తో పాటు ఈ లేఖ నాకు మార్గదర్శకంగా నిలిచింది.

విప్లవ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొంటున్న కామ్రేడ్ గంటి రమేష్, తిరుపతి పట్నాయక్, యూనివర్సిటీ నుంచి ఎఆర్‌డి ప్రసాద్, మరొక కామ్రేడ్ ఎమర్జెన్సీలోనే ప్రొఫెషనల్ రివల్యూషనరీస్‌గా పని చేయడానికి ముందుకు వచ్చారు. నళిని ఫుల్ టైమర్‌గా పని చేయడానికి సంసిద్ధత వ్యక్తం చేసినా పార్టీ ఆదేశాల మేరకు తన వైద్య విద్యను కొనసాగిస్తూ వచ్చింది. అనకాపల్లి, చోడవరం తాలూకాల్లో రైతాంగం తోను, ఎపిటిఎఫ్ ఉపాధ్యాయులతోను సంబంధాలు పెంపొందించు కోవడానికి నేను, రమేష్ గట్టి ప్రయత్నాలు ప్రారంభించాం.

విశాఖ నగరంలోని 'సౌత్ ఈస్ట్రన్ యూత్ అసోసియేషన్' కళాకారులతో పరిచయాలు ఏర్పరచుకుని వారిని విప్లవ రాజకీయాలతో చైతన్యవంతం చేయడం కోసం ప్రత్యేక కృషి జరిపాను. ఫలితంగా ఆ అసోసియేషన్ కళాకారులందరూ విప్లవ రాజకీయాల వైపు ఆకర్షితులయ్యారు. అసోసియేషన్ ప్రెసిడెంట్ కామ్రేడ్ అప్పారావు సిపిఎం రాజకీయాలకు స్వస్తి చెప్పి 'జననాట్య మండలి' బృందాన్ని ఆర్గనైజ్ చేయడానికి ముందుకు వచ్చారు. విప్లవ రచయిత వంగపండు ప్రసాదరావుతో పరిచయం ఏర్పడింది. ఎమర్జెన్సీ లీగల్ పరిమితులకు లోబడి ఆయన రాసినర 'వెట్టిచాకిరి' బుర్రకథ ప్రదర్శనలను పలు కార్మిక వాడలలో ఏర్పరిచాం. కార్మికులు పెద్ద సంఖ్యలో హాజరై ఈ ప్రదర్శనలను విజయవంతం చేశారు.

శ్రీకాకుళం జిల్లాలో రాష్ట్ర కమిటీ సభ్యుడు మామిడి అప్పలసూరి నాయకత్వాన గంటి ప్రసాద్, అట్టాడ అప్పలనాయుడు ఫుల్ టైమర్స్‌గా పనిచేసేవారు. ఎమర్జెన్సీ మధ్యలో గంటి ప్రసాద్ అరెస్టయ్యారు. ఆ తరువాత అప్పలసూరి విశాఖ వచ్చి నన్ను కలుసుకున్నారు. ఆయనను చూడడం అదే మొదటిసారి. ఆయన శ్రీకాకుళ పోరాట చరిత్ర గురించి, అనేక మంది సభ్యులతో కూడిన గెరిల్లా దళాలు ఎదుర్కొన్న సమస్యల గురించి, పోరాటం ఎదుర్కొన ఆటుపోట్ల గురించి వివరంగా చెప్పారు. ఆయన శ్రీకాకుళ పోరాట కాలంలో పనిచేసిన లీడింగ్ కామ్రేడ్ కావడం చేత ప్రత్యక్ష అనుభవాన్ని ఎంతో ఆసక్తిగా విన్నాను. అనేక విషయాలు తెలుసుకోగలిగాను. కానీ మా మధ్య ఉన్న భిన్నాభిప్రాయాల మూలంగా ఎడతెగని చర్చలు మాత్రం కొనసాగేవి.

1977 ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఘోరంగా ఓడిపోయింది. ఇందిరాగాంధీ ప్రభుత్వం పతనమయింది. ఎమర్జెన్సీ రద్దయింది. ఆ కాలంలో నిర్బంధించబడిన కామ్రేడ్సందరూ విడుదలయ్యారు. విప్లవ రాజకీయాల ప్రచారానికి లీగల్ అవకాశాలు వినియోగించుకునే అవకాశం ఏర్పడింది. ఆ పరిస్థితులన్నింటినీ వినియోగించుకుని గ్రామ సీమలకు విస్తరించడానికి వీలుగా అక్కడ బలమైన ప్రజా పునాదిని ఏర్పరచుకోవాలనే లక్ష్యంతో ఆగస్టులో రాష్ట్ర కమిటీ తీర్మానం, 'ప్రస్తుత పరిస్థితి – మన కర్తవ్యాలు' వెలువడింది. అందులో సాయుధ పోరాటాన్ని తాత్కాలికంగా నిలిపివేయాలని రాష్ట్ర కమిటీ నిర్ణయించింది. యావత్తు పార్టీ కేడర్ దీనిని ఆమోదించింది.

ఎమర్జెన్సీ కాలంలో విశాఖ విద్యార్థులతోను, కార్మికులతోను ఏర్పడిన సంబంధాలు ఆ తర్వాత కాలంలో వారిని విస్తృతంగా కదిలించడానికి దోహదపడ్డాయి. 'సౌత్ ఈస్ట్రన్ యూత్ కల్చరల్ అసోసియేషన్' కళాకారులతో జననాట్య మండలి ట్రూప్‌ను ఆర్గనైజ్ చేశాను. గురజాడ కళామందిర్‌లో అమర వీరుల స్మారక సభగా ఒక పెద్ద బహిరంగ సభ జరపాలని ప్లాను వేసుకుని, అందులో ప్రదర్శించడానికి వంగపండు రాసిన 'భూమి భాగోతం' నృత్యనాటిక రిహార్సల్స్ ప్రారంభించాం.

రైల్వే క్వార్టర్స్ మేడ మీద ఆ రిహార్సల్స్ నెల రోజుల పాటు కొనసాగాయి. భూస్వాములు, కరణ మునసబులు, పోలీసు అధికారులు, రాజకీయ నాయకులు కుమ్మక్కయి కొనసాగిస్తున్న దోపిడీని రైతాంగం ప్రతిఘటించాలనే సందేశంతో ఆ నృత్యనాటిక రూపొందింది. దుడ్డుకర్ర చేబూని రైతు మునసబు, కరణాలను పారదోలిన సన్నివేశాన్ని చేర్చాలని వంగపండుని నేను కోరినప్పుడు అందుకు ఆయన వెంటనే అంగీకరించి 'అరెఅరెఅరెఅరే మునసబూ సరి నీ రోజులు శరభ శరభ శరభా హశ్శరభ శరభ' పాటను చేర్చారు.

గురజాడ కళామందిర్ సభలో 1977 జూలై 31న జరిగిన మొదటి ప్రదర్శన ప్రజల్ని ఉర్రూతలూగించింది. ప్రదర్శనను రక్తి కట్టించి జనరంజకం చేసినవారు రైతుగా అప్పారావు, కరణంగా శంకర్, మునసబుగా నాగేశ్వరరావు, రాజకీయ నాయకుడిగా రమణారావు, రైతు భార్యగా నవత, హరిజన రైతుకూలీగా పరదేశినాయుడు, రైతు కూలీలుగా సుబ్బారావు, హరి, ఎస్ఐగా నరసింహ మొదలైనవారు, తెర వెనుక వంగపండు, పి.వి. రమణ, నళిని, పద్మిని పాటలు పాడేవారు. తెర ముందు ఈ పాత్రలన్నీ తమతమ స్టయిల్లో స్టెప్పులేస్తూ, అభినయిస్తూ కథని నడుపుతుంటే రెండు కళ్లు చాలేవి కావు. ఆ తరువాత ఇదే జననాట్య మండలి ట్రూప్ విశాఖ జిల్లాలో అనేక ప్రదర్శనలిచ్చింది.

ప్రతి సమావేశంలో తొలుత విప్లవ గీతాలు ఆలపించేవారు. మొదట్లో శ్రీశ్రీ 'కొంత మంది కుర్రవాళ్లు', 'ఏటికేతం బట్టి', వంగపండు రాసిన 'ఉందర్రా మాలపేట', సుత్తీ కొడవలి గురుతుగా ఉన్న ఎర్రని జెండా ఎగురుతున్నది' మొదలైన పాటలు పాడితే, మేడేకి కొన్ని కార్మిక గీతాలు పాడేవాళ్లు.

ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి ట్రూప్ తరలివెళ్తుంటే, ప్రదర్శనను మళ్లీ మళ్లీ చూడడం కోసం ప్రజలు అక్కడికి కూడా వచ్చేవాళ్లు. ఒకటిన్నర గంటల భూమి భాగోతానికి ముందు వెనుక డప్పు డాన్సు, 'కొండలు పగలేసినం', 'జీతాల తమాషా', పట్నవాసం' కూడా ఉండేది. ప్రదర్శనకి ముందు స్థానిక కార్యకర్తల ఉపన్యాసాలు, పాటలకి డాన్సులకి చిన్న వివరణలు ప్రజల్లో ఆసక్తిని నిలిపి ఉంచేది. ఈ ట్రూప్ విశాఖలోనే కాక, శ్రీకాకుళం, తూర్పు గోదావరి, గుంటూరు జిల్లాల్లో కూడా విస్తృతంగా పర్యటించి ప్రదర్శనలు ఇచ్చింది. విరసం నాయకుడు చలసాని ప్రసాద్ ఈ సాంస్కృతిక కార్యక్రమాల్లో ఉత్సాహంగా పాల్గొనేవారు.

1977 నవంబర్‌లో ప్రళయ భీకరమైన తుఫాను, ఉప్పెన వచ్చి దివిసీమకు, కోస్తా జిల్లాలకు అపారమైన నష్టాన్ని కలిగించింది. విశాఖ జిల్లాలో శారద, వరాహ, తాండవ నదులు పొంగిపొర్లి వరదలు ముంచెత్తడంతో రైతాంగం, పల్లెకారుల జీవితాలు అతలాకుతల

మయ్యాయి. విశాఖ నగరంలో వందలాది విద్యార్థులు ఆర్ఎస్‌యు, పిడబ్ల్యుఒ కింజ సమీకృతుమై ఇంటింటికీ, కొట్టుకొట్టుకూ తిరిగి చందాలు, బట్టలు సేకరించి ఎలమంచలి, అనకాపల్లి తాలూకాల్లోని అనేక గ్రామాల్లో విస్తృతంగా పర్యటించి ప్రజలకు నేరుగా సహకారాన్ని అందజేశారు. కలరా వాక్సిన్ అనేకమంది బాధితులకు ఇచ్చి ప్రాణాంతకమైన కలరా నుంచి వాళ్లని రక్షించారు.

ప్రభుత్వం సరఫరా చేసిన దుప్పట్లు, నష్టపరిహారం, ధాన్యం వారికి సక్రమంగా అందేలా చూశారు. వివిధ టీమ్స్‌గా ఏర్పడిన విద్యార్థులు నడుంలోతు నీళ్లలో దిగి ఏడెనిమిది కిలోమీటర్లు కాలినడకన పయనించి సముద్ర తీర గ్రామాలకు చేరుకోవడం ప్రత్యేకించి పేర్కొనదగింది.

ఈ సహాయ కార్యక్రమాలను ఆరంభించేనాటికి ఆర్ఎస్‌యు నాయకులు రాజ్‌కుమార్ ఆంధ్రా యూనివర్సిటీ ఇంజనీరింగ్ కాలేజీలో ఎంటెక్ కెమికల్ ఇంజనీరింగ్ కోర్సులో చేరారు. ఆయనతో పాటు యూనివర్సిటీ విద్యార్థులు, నళిని, వసుంధర, కదలి, ఎడివి లక్ష్మి మొదలైన మెడికల్ స్టూడెంట్స్, ఇంకా అనేకమంది కలిసి టీమ్స్‌గా ఏర్పడి గ్రామాలకు తరలి వెళ్లారు.

కామ్రేడ్ వై. కోటేశ్వర్రావు జైలు నుంచి విడుదలై లా చదవడానికి వచ్చాడు. ఆయన, రాజ్‌కుమార్, సుబ్బారాజు, రామకృష్ణ ప్రసాద్, నాగేశ్వర్రావు తదితరులు యూనివర్సిటీ హాస్టల్ విద్యార్థులను కూడగట్టారు. విద్యార్థి ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవడానికి వీరు ఎంతగానో దోహదం చేశారు. రాష్ట్ర వ్యాప్తంగా సాగిన సాంఘిక సంక్షేమ హాస్టల్ పోరాటంలో విద్యార్థులు చురుగ్గా పాల్గొన్నారు. పాలిటెక్నిక్ విద్యార్థులు తమ న్యాయమైన కోర్కెల సాధన కోసం పెద్ద ఎత్తున కదిలి రాస్తారోకో, ఘెరావ్, ధర్నాలకు దిగి విజయం సాధించారు.

విశాఖలో ప్రైవేట్ సిటీ బస్సులు విపరీతమైన స్పీడుతో వీర విహారం చేస్తూ ప్రజల ప్రాణాల్ని బలిగొనడం రోజు రోజుకూ పెరుగుతూ వచ్చింది. 1978 జూలై నెలలో ఒక ప్రమాదంలో అక్కడికక్కడే ఎనమండుగురు చనిపోయారు. విశాఖ ప్రజలు కోపోద్రిక్తులయ్యారు. ఎప్పటిలాగే బస్సు యజమానులు, అధికారులు శవ పంచాయితీ తతంగం పూర్తి చేసి, తర్వాత నష్ట పరిహారం చెల్లిస్తామని చెప్పి ప్రమాద స్థలం నుంచి తప్పుకోవాలని చూశారు. కానీ రాడికల్ యువజన సంఘం ఆధ్వర్యంలో ప్రజలు పెద్ద సంఖ్యలో సమీకృతులై, అక్కడిక్కడే తగిన నష్ట పరిహారాన్ని చెల్లించాలని పట్టుబట్టి విజయం సాధించారు.

అధికారులు, స్థానిక ఎంఎల్ఎలు సర్దిచెప్పి జనాన్ని పంపివేయాలని ఎంత ఆరాట పడినా ఫలితం లేకపోయింది. సంఘటనా స్థలానికి దగ్గర్లోనే ఉండి, పోరాటాన్ని నడుపుతున్న యువజన నాయకుల్ని గైడ్ చేయడం నా జీవితంలో మరిచిపోలేని అనుభవం. ఆ తరువాత 'సిటీ బస్సు సర్వీసులను జాతీయం చేయాల'నే డిమాండ్‌తో వరుసగా నెల రోజుల పాటు సమ్మెలు, ప్రదర్శనలు, చివరకు మిలిటెంట్ పోరాటాలు జరిపాం. దీంతో ప్రభుత్వం దిగివచ్చి, ఆర్‌టిసి బస్సులను ప్రవేశపెట్టింది. ఇది విశాఖ ప్రజానీకం, రాడికల్స్ సాధించిన గొప్ప విజయం. ఈ పోరాటం సందర్భంగా విద్యార్థి యువజన నాయకులపై పోలీసులు అనేక అక్రమ కేసులు బనాయించారు. అయినా వారు వెనకడుగు వేయలేదు. గ్లోబలైజేషన్‌లో భాగంగా విస్తరిస్తున్న ప్రైవేటీకరణ సమస్య ఈనాటికీ మనల్ని అనేక రూపాల్లో వేధిస్తూనే ఉంది.

ప్రతి కాలేజీలో వారం వారం 'రాడికల్ వాయిస్' గోడ పత్రికని క్రమం తప్పకుండా ప్రదర్శించేవాళ్లం. సమకాలీన సామాజిక రాజకీయ సమస్యలపై స్పందిస్తూ, ఒక్క పేజీలో ఆకట్టుకునే విధంగా విశ్లేషిస్తూ, రాబోయే సంచికలకోసం ఎదురుచూసే విధంగా వాటిని రూపొందించాం. నగర శివార్లలో డైరీఫారం కోసం చుట్టు పక్కల గ్రామాల రైతుల భూములను స్వాధీనం చేసుకుంటే, వారికి నష్ట పరిహారం చెల్లించాలని కోరుతూ విద్యార్థులు అక్కడి రైతాంగాన్ని సమీకరించారు. రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ రూపొందించిన 'గ్రామాలకు తరలండి క్యాంపెయిన్'లో మొదటి దశ విద్యార్థులకు రాజకీయ శిక్షణా తరగతులు 1978 మే నెలలో పది రోజుల పాటు వెంకుపాలెం గ్రామంలో జరిగాయి.

రాజకీయ తరగతులు ముగించుకుని విద్యార్థులు చిన్న చిన్న దళాలుగా గ్రామాలకు తరలివెళ్లారు. ప్రతి గ్రామంలో వర్గ విశ్లేషణ చేసి, భూ యాజమాన్య వివరాలు సేకరించారు. ముఖ్యంగా పేద రైతు, వ్యవసాయ కూలీలపై కేంద్రీకరించి, యువజనులకు రాజకీయాలు బోధించడం, విప్లవ గీతాలు నేర్పడం, గ్రామ గ్రామాన యువజన సంఘాలు ఏర్పరచడం కార్యక్రమంగా స్వీకరించారు. ప్రజలతో మమేకం కావడంలో విద్యార్థుల చొరవ ఈ క్యాంపెయిన్ ద్వారా ఎలా పెంపొందిందో, చారిత్రాత్మక కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలకు అది ఎలా నాందిపలికిందో, నేను రాసిన 'ఎపి ఆర్ఎస్‌యు – ఎ గ్లోరియస్ సాగా ఆఫ్ స్టూడెంట్స్ స్ట్రగుల్' అనే ఆంగ్ల పుస్తకంలో వివరంగా ఉంది.

ఈ క్యాంపెయిన్‌లో భాగంగానే సీతానగరం భూస్వామి సూర్యనారాయణ రాజు పెత్తందారీ చర్యలను మొండిపాలెం రైతు కూలీలు ప్రతిఘటించారు. ఈ క్యాంపెయిన్ మూలంగా అనేక గ్రామాల యువకులతో సంబంధాలు ఏర్పడ్డాయి. నీలకంఠపురం హరిజనుల భూమిని అక్రమంగా కాజేసిన పెత్తందార్లు పండించిన పంటలను రైతు కూలీలు స్వాధీనం చేసుకున్నారు. వెంకుపాలెం రైతాంగం పంచదార మిల్లు ఆస్తులను స్వాహా చేయాలనుకున్న మేనేజింగ్ డైరెక్టరు జివికె రాజు కుతంత్రాన్ని వమ్ము చేశారు. ప్రభుత్వ భూములనే కాక, దొంగ అప్పు పత్రాల పేరుతో పేద రైతు భూముల్ని కూడా కాజేసిన రాజాం భూస్వామి అక్రమాలకు వ్యతిరేకంగా రైతు కూలీలు సంఘటితపడ్డారు. ఇలా క్యాంపెయిన్ క్రమంలోనే కాక ఇంకా ముందు కూడా ఏర్పడిన పరిచయాలని సంఘటితపరుచుకోవడం వల్ల ఆయా ప్రాంతాల్లో ప్రజల పక్షాన నిలిచే కార్యకర్తలు తయారయ్యారు. ఆ ప్రాంతంలో ఉన్న అనేక సమస్యలను ఆకళింపు చేసుకుంటూఏ, వాటి పరిష్కారం కోసం యువజనులు ఉత్సాహంగా ముందుకు వచ్చారు.

రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ ప్రథమ జిల్లా మహాసభలు 1978లో విశాఖలో జయప్రదంగా జరిగాయి. వందలాది మంది విద్యార్థులు వరంగల్‌లో జరిగిన ఆర్ఎస్‌యు రెండవ రాష్ట్ర మహా సభలకు హాజరయ్యారు. రాజ్‌కుమార్ ప్రెసిడెంట్‌గా, రవి వైస్ ప్రెసిడెంట్‌గా, వసుంధర సంయుక్త కార్యదర్శిగా ఎన్నికయ్యారు. విశాఖ జిల్లా రైతుకూలీ సంఘం ప్రథమ సహా సభలు 1979 ఏప్రిల్ 8న చోడవరం పట్టణంలో అత్యంత ఉత్సాహ పూరితంగా జరిగాయి. వివిధ తాలూకాల నుండి వచ్చిన సుమారు పన్నెండు వందల మంది రైతుకూలీ ప్రతినిధులు జిల్లాలోని వివిధ వ్యవసాయ సమస్యలపై చర్చించి, రైతుకూలీ సంఘాన్ని అన్ని తాలూకాలకూ విస్తరింపచేసి, గ్రామ స్థాయిలో పటిష్టం చేయడానికి కార్యక్రమం రూపొందించారు. రైతు కూలీల దైనందిన పాక్షిక సమస్యలపై పోరాటాలు నిర్మిస్తూ, తద్వారా భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని సమరశీలంగా నిర్వహించి, 'దున్నేవానికే భూమి' దక్కే విధంగా వ్యవసాయ విప్లవాన్ని విజయవంతంగా పూర్తి చేయడం ఒక్కటే రైతు కూలీల సమస్యలకు నిజమైన పరిష్కారమని, అందుకోసం రైతాంగాన్ని చైతన్యవంతం చేసి సంఘటితపరచడం ప్రథమ కర్తవ్యంగా స్వీకరించాలని

మహాసభ తీర్మానించింది. జిల్లా ఆర్‌వైఎల్ మహా సభలు మే 31న ఎలమంచిలి పట్టణంలో జరిగాయి.

ఇదే కాలంలో, కామ్రేడ్ అప్పల సూరి కేంద్ర ఆర్గనైజింగ్ కమిటీకి ఆగస్టు తీర్మానాన్ని పంపలేదనే కారణం జూపి పార్టీ నుంచి వైదొలిగారు. పార్టీ సభ్యులు రాష్ట్ర కమిటీకి ఎదురు తిరగాలని పిలుపునిచ్చారు. రాజకీయ నిర్మాణ సమస్యలపై అప్పల సూరితో విభేదాలు తీవ్రస్థాయికి చేరుకున్నాయి. కామ్రేడ్ కె.ఎస్. విశాఖకు వచ్చి, పార్టీ కార్యకర్తలను, పార్టీ సానుభూతి పరులను విడివిడిగా సమావేశపరిచి, పార్టీలో ఏర్పడిన సంక్షోభం గురించి వివరించారు. గంటి ప్రసాదు, దాలినాయుడు, షిప్‌యార్డు సత్యం, ఎర్నెస్ట్ తదితరులు తప్ప మరెవ్వరూ అప్పల సూరి రాజకీయాలను సమర్థించలేదు. రాష్ట్రంలో ఇతర జిల్లాల్లోని పార్టీ సభ్యులందరూ రాష్ట్ర కమిటీ నిర్ణయాలని ఆమోదించారు. చాలా తక్కువ నష్టంతోనే ఈ సంక్షోభం నుంచి బయటపడగలిగాం.

జనతా హయంలో ఏర్పడిన లీగల్ అవకాశాలను విశాఖ కామ్రేడ్స్ శక్తివంతంగా ఉపయోగించుకోగలిగారు. విప్లవ ప్రచారాన్ని విస్తృతంగా కొనసాగించగలిగారు. వేలాది పీడిత రైతు కూలీలతో సంబంధాలు ఏర్పడ్డాయి. రాడికల్స్ పట్ల ప్రజల్లో విశ్వాసం పెరిగింది. ఏ సమస్యని పరిష్కరించాలన్నా వారికి తెలియజేయాలని, వారే సమర్థవంతంగా సాధిస్తారని నమ్మకం ఏర్పడింది. విప్లవమే వృత్తిగా స్వీకరించిన పది మందికి పైగా ఆర్గనైజర్లు తయారయ్యారు. రాజ్‌కుమార్ పూర్తికాలం కార్యకర్తగా పనిచేయడానికి సంసిద్ధమయ్యాడు. నాస్తిక సంఘం నుంచి వచ్చిన లా విద్యార్థి కామ్రేడ్ విమల్ రాడికల్ యువజన సంఘం కార్యక్రమాలపై కేంద్రీకరించారు. మహిళా రంగంలో పనిచేయడం కోసం కామ్రేడ్ పద్మ రాష్ట్ర కమిటీ పంపగా విశాఖ వచ్చింది. కృష్ణ, అజయ్‌లు జెఎన్ఎంపై కేంద్రీకరించారు. ఐదు తాలూకాల్లో ప్రజా సంఘాల యూనిట్లు ఏర్పడ్డాయి. కాని రాష్ట్ర కమిటీ చేపట్టిన 'తప్పులు సరిదిద్దుకుని సంఘటితపడి పురోగమిద్దాం' అనే మూడవ క్యాంపెయిన్‌ను పరిపూర్తి చేయడం మిగిలే ఉంది.

1980 ఏప్రిల్ 22న సిద్ధాంత రాజకీయ సమైక్యత ప్రాతిపదికపై భారత కమ్యూనిస్టు పార్టీ (మా-లె) పీపుల్స్‌వార్ కేంద్ర కమిటీ ఏర్పడింది. కామ్రేడ్ కె.ఎస్. కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి బాధ్యతలు చేపట్టారు. గత ఐదేళ్ల ఆత్మ విమర్శ, ఎత్తుగడల పంథా, పార్టీ కార్యక్రమం, నిబంధనావళి – వీటిపై ఏర్పడిన సమైక్యత ఆధారంగానే వివిధ రాష్ట్రాల మార్క్సిస్టు – లెనినిస్టు గ్రూపులతో కలిసి పార్టీ కేంద్ర కమిటీ ఏర్పడింది. భారత విప్లవ చరిత్రలో, ముఖ్యంగా భారత విప్లవకారులను సమైక్యపరిచే ప్రయత్నంలో ఇది ఒక ముఖ్యమైన మలుపు.

విశాఖ జిల్లాలో సుమారు ఒకే రాజకీయ నిర్మాణం స్థాయి కలిగిన నాయకత్వ టీం ఏర్పడడంతో జిల్లా ఉద్యమాన్ని ముందుకు తీసుకు పోవడానికి వీలుగా 1980 ఆరంభంలో భా.క.పా (మా-లె) ప్రథమ జిల్లా మహాసభ జరిగింది. సుమారు ఇరవైమంది ప్రతినిధులు హాజరయ్యారు. రాష్ట్ర కమిటీ ప్రతినిధులుగా సత్యమూర్తి మహాసభలో పాల్గొన్నారు. జిల్లా కమిటీ సభ్యులుగా నేను, రాజ్‌కుమార్, గంటి రమేష్‌లు ఏకగ్రీవంగా ఎన్నికయ్యాం. జిల్లా కమిటీ సెక్రటరీగా నేను ఎన్నికయ్యాను. జిల్లా కమిటీ సమావేశాలు రెండు మాత్రమే జరిగాయి.

సెప్టెంబర్ నెలలో జరిగిన భా.క.పా (మా-లె) 12వ ఆంధ్ర రాష్ట్ర కాన్ఫరెన్స్‌లో నేను రాష్ట్ర కమిటీ సభ్యుడిగా ఎన్నికయ్యాను. ఆ కాన్ఫరెన్స్ తరువాత రాజ్‌కుమార్ వివిధ రాష్ట్రాల విద్యార్థి ఉద్యమాన్ని సమన్వయ పరచడం కోసం జిల్లాను వదిలి వెళ్లవలసి వచ్చింది. గంటి రమేష్ అటవీ ప్రాంతానికి వెళ్లడంతో ఆచరణలో జిల్లా కమిటీ బాధ్యతలన్నీ నేనే నిర్వహించాను.

ఇదే కాలంలో జిల్లా వ్యాప్తంగా విద్యార్థి యువజనులపై, రైతాంగంపై తీవ్రమైన నిర్బంధం అమలయింది. అరెస్టులు, అక్రమ కేసులు, లాఠీ చార్జీలు, ఇళ్లపై దాడులు సర్వసాధారణమయ్యాయి. రాజాం భూస్వామి ప్రజల ఆగ్రహానికి గురైన తరువాత అరెస్టు చేసిన వారందరినీ చిత్రహింసల పాల్జేయడం నిత్యకృత్యమై పోయింది. తీవ్ర చిత్రహింసలకు గురై అనారోగ్యంతో కామ్రేడ్ రాజారావు అమరులయ్యారు. పదేళ్లుగా జైలు శిక్ష అనుభవిస్తున్న నారాయణరెడ్డి, శంకర్‌రెడ్డిలు కెజిఎచ్ నుంచి తప్పించుకోవడంతో విద్యార్థులపై తప్పుడు కేసులు బనాయించారు.

ఈ నిర్బంధాలని అధిగమించడం కోసం అటవీ ప్రాంతానికి విస్తరించాలని ప్రయత్నించాం. ఆ ప్రయత్నంలో భాగంగానే కామ్రేడ్ తిరుపతిని చింతపల్లి అడవిలోని గ్రామాలకు, కామ్రేడ్ సురేష్‌ని అరకులోయ ప్రాంతానికి, కామ్రేడ్ పాపినాయుడిని పాడేరు గ్రామాలకు కేంద్ర ఆర్గనైజర్లుగా పంపించాం. కామ్రేడ్ జగన్, నర్సీపట్నం యువకులు కలిసి, వెదురు కూపీ అటవీ కూలీలను సంఘటితపరచడానికి వెళ్లారు.

దీర్ఘకాలిక సాయుధ పోరాటంలో అటవీ ప్రాంతానికి ఉన్న ప్రాముఖ్యత గురించి కె.ఎస్. పలుమార్లు చెప్పి ఉండడం చేత ఈ నిర్ణయాలు వెంటవెంటనే తీసుకోగలిగాను. వెదురుకూపీ కూలీలు సంఘాలలో చేరి ఆరంభించిన సమ్మె మిలిటెంట్ రూపం తీసుకుంది. పేపరు మిల్లు లారీల నిలిపివేత, వెదురుకూపీల దగ్ధం, రస్తారోకో కార్యక్రమాలతో యాజమాన్యం దిగివచ్చింది. అరకు ఏరియాలో గిరిజనులు విస్తృతంగా కదిలారు. చింతపల్లిలో గిరిజనుల ప్రదర్శనలు జరిగాయి.

అటు ఉత్తర తెలంగాణలోని కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో రైతాంగ పోరాటాలు పెద్ద ఎత్తున పెల్లుబికాయి. భూస్వాములు ఊళ్లు విడిచి పారిపోయారు. ప్రభుత్వం జగిత్యాల, సిరిసిల్లా తాలూకాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించింది. భూస్వాములపై రైతాంగ పోరాటం ఉధృతంగా పాకి అనేక విజయాలు సాధించింది. ఆ పోరాటాన్ని మరింత ఉన్నత దశకు తీసుకెళ్లాల్సిన తక్షణ అవసరం ఏర్పడింది. ఆదిలాబాద్ నుండి ఖమ్మం వరకు గోదావరికీ, రైలు రోడ్డుకూ మధ్యగల ప్రాంతాన్ని 'గెరిల్లా జోన్'గా అభివృద్ధి పరచాలనే లక్ష్యంతో అందుకు సన్నాహాలు ప్రారంభించిన కామ్రేడ్ కె.ఎస్. జిల్లా కమిటీ సమావేశాలలో నిమగ్నమయ్యారు. కరీంనగర్–ఆదిలాబాద్ కామ్రేడ్స్ ఆదిలాబాద్, మహారాష్ట్ర అడవిలోకి, వరంగల్–ఖమ్మం కామ్రేడ్స్ బస్తర్ అడవిలోకి తరలి వెళ్లాలని నిశ్చయించుకుని దళాలుగా ఏర్పడ్డారు. ఇదంతా ఒక పథకం ప్రకారం, 'గెరిల్లా జోన్ స్థావర ప్రాంతాల ఏర్పాటు' అనే ఒక సమగ్ర వ్యూహంలో భాగంగానే కొనసాగింది.

ఆ సమయంలోనే కె.ఎస్.ను కలుసుకున్న నేను చింతపల్లి, అరకు ఫారెస్టులో గిరిజనుల్ని సమీకరించడం కోసం చేస్తున్న ప్రయత్నాల గురించి వివరించాను. కేంద్ర ఆర్గనైజర్లు బాధ్యతలు చేపట్టి విడివిడిగా వ్యక్తులుగా పనిచేస్తున్న క్రమం గురించి తెలిపాను. అక్కడి దారుణమైన దోపిడీ పరిస్థితులను, ప్రజలు పార్టీ కార్యకర్తలను ఉత్సాహంగా ఆహ్వానిస్తున్న తీరు గురించి వివరించాను. కె.ఎస్. ఎంతో శ్రద్ధతో విని, చింతపల్లి మన్యం ఫారెస్టులో ప్రవేశించడం చాలా అవసరమని అభిప్రాయపడ్డారు. తూర్పు గోదావరి రంపచోడవరం ఫారెస్టులో విమోచన గ్రూపు దళాలు చాలా ఏళ్ల నుంచి పనిచేస్తున్నాయి కనుక అక్కడికి వెళ్లకుండా, మిగిలిన ప్రాంతాలలో ప్రవేశించాలని సలహానిచ్చారు.

దళ సభ్యులందరినీ సెంటరు నుంచి పంపలేం, ముగ్గిరిని మాత్రమే

# నక్సల్బరీ ప్రాసంగికత

**ఐదు దశాబ్దాలు గడిచిన తరువాత నక్సల్బరీ వేసిన ప్రశ్నలన్నీ ఇవాళ్టికీ అంతే సంబద్ధంగా ఉన్నాయనీ, నక్సల్బరీ మార్గపు ప్రాసంగికతను రుజువు చేస్తున్నాయనీ అంటున్నారు వరవరరావు**

మే 23-25కు నక్సల్బరీ వసంత మేఘం గర్జించి యాభై ఏళ్లు అవుతుంది. నక్సల్బరీకి అది అర్థవంతమైన విశేషణం. వసంతం రానున్న ఆకురాలు కాలాన్ని కూడా సూచిస్తుంది. మళ్లీ వసంతం రావడాన్ని కూడా సూచిస్తుంది. అట్లని అది వర్తులాకారం కాదు. మేఘానికి, నేలకు, సముద్రానికి ఉండే గతితార్కిక సంబంధంలో అది ఆటుపోట్లను కూడా సూచిస్తుంది. అది విచిత్రంగా బంగాళాఖాతంలో తూర్పు సముద్రం దగ్గర ప్రారంభమై తూర్పు తీరం వెంబడి శ్రీకాకుళం మీదుగా, పడమటి సముద్రం అరేబియా తీరంలోని వైనాడు మీదుగా మైదాన ప్రాంతపు పంజాబ్ దాకా పయనించింది. ఈశాన్య గాడ్పుగా ఇది బెంగాల్, బీహార్‌ల మీదుగా ఢిల్లీ కోటను కూడా చుట్టుముట్టింది. కన్యాకుమారి నుంచి కశ్మీర్ దాకా ఒక ప్రభంజనం అయి వీచింది.

నక్సల్బరీ ఒక ఊరు కాదనుకున్నాం. నక్సల్బరీ అందరి ఊరను కున్నాం. అవి సామెతలు, నుడికారాలు అయినవి. పునాది ఉత్పత్తి సంబంధాల్లో మాత్రమే కాదు ఇవన్నీ భావజాలంలో భాగమైనవి. భాషలో, సంస్కృతిలో భాగమైనవి. నక్సల్బరీ అనే నాలుగు అక్షరాల కోసం పిల్లలు తమ పుస్తకాల్లో వెతుక్కున్నారు. ప్రపంచ వ్యాప్త శబ్దకోశాల్లో నక్సలైట్ అనే మాట కొత్తగా చేరింది.

ఇంచుమించు నలభై ఏళ్లు పోయాక ఇప్పుడు వీస్తున్న గాలి వలె ఆ స్థానంలో మావోయిస్టు అనే మాట వచ్చి చేరింది.

ఒక నిప్పు రవ్వ దావానలం అయినట్లుగానే నక్సల్బరీ, ఖరీబరీ అనే రెండు గ్రామాల్లో సంతాల్ ఆదివాసులు తమ నేల మీద తాము నిలబడి ప్రకటించిన అధికారం దేశవ్యాప్తంగా భూమిపుత్రులు తాము భూమి మీదనే కాదు, రాజ్యం మీద ప్రకటించిన స్వామ్యంగా రాజకీయ సంస్కృతిలో భాగమైంది. ప్రత్యామ్నాయ రాజకీయ ఆచరణలో, ఆలోచనలో భాగమైంది.

ఇది సంతాల్ ఆదివాసులు ప్రారంభించింది గనుక తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట వారసత్వాన్నే కాకుండా, ఈస్ట్ ఇండియా కంపెనీకి వ్యతిరేకంగా, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఈ దేశంలో మొట్టమొదటిసారి ఆదివాసులు ఎక్కుపెట్టిన వింటినారి నాయకత్వాన్ని కూడా స్వీకరించింది.

---

పంపగలం. కనుక వారికి తోడు మరో ముగ్గురు విశాఖ కామ్రేడ్స్‌ని కలుపుకుంటే దళం తక్షణమే ఏర్పరచ వచ్చని సూచించి, ఆ మేరకు నిర్ణయం తీసుకున్నారు. కామ్రేడ్ విశ్వేశ్వరరావు, గంగన్న (నంబల్ల కేశవరావు), రంగన్నలను రాష్ట్ర కమిటీ సెంటర్ పంపగా, విశాఖ జిల్లా కామ్రేడ్ తిరుపతి పట్నాయక్, సురేష్, చిన్న నారాయణలు వారితో కలిశారు. ఫలితంగా 1981 ఆరంభంలో చింతపల్లి మొదటి గెరిల్లా రైతాంగ దళం ఏర్పడింది. దానికి కమాండర్ విశ్వేశ్వరరావు.

దళ కార్యకలాపాలు ఆరంభమైన కొద్ది రోజులకే గంగన్న, రంగన్నలు అరెస్టయ్యారు. వెంటనే మరో ముగ్గురు విశాఖ కామ్రేడ్స్ గంటి రమేష్, మౌలా, నాగులపల్లి సత్యంలను ఫారెస్టుకి పంపి దళాన్ని పునర్నిర్మించాం. చింతపల్లి తాలూకా గ్రామాలతో పాటు సరిహద్దులో ఉన్న తూర్పు గోదావరి అటవీ గ్రామాలను కూడా దళం కవర్ చేసింది. ప్రారంభంలో దళ సభ్యుల వద్ద కొద్దిపాటి ఆయుధాలే ఉండేవి. ఆ దళం 1981 సెప్టెంబర్ వరకు కొనసాగింది.

ఈ కాలంలో మన్యం గిరిజన ప్రజానీకం విస్తృతంగా కదిలారు. అనేక పోరాటాలు చేపట్టారు. దళ కమాండర్ విశ్వేశ్వరరావు అనారోగ్య కారణాల వల్ల హాస్పిటల్లో చేరడంతో పోలీసులు అరెస్ట్ చేశారు. తరువాత గంటి రమేష్ దళ కమాండర్ బాధ్యతలు నిర్వహించారు. అనతి కాలంలోనే చింతపల్లి ప్రాంతం గిరిజనోద్యమానికి బలమైన కేంద్రంగా పెంపొందింది. ప్రారంభంలో చింతపల్లి దళం విశాఖ జిల్లా కమిటీ కింద పనిచేసినా, అటు తరువాత రాష్ట్ర కమిటీ, ఫారెస్టు కమిటీల గైడెన్సు కింద తన విప్లవ కృషి కొనసాగించింది.

రైతాంగదళం మన్యంలో అడుగుపెట్టిన తొలిరోజుల్లో అనేక ఒడిదుడుకులు ఎదురైనా, విశాఖ ఉద్యమం గమనించదగిన స్థాయిలో పెంపొందడం వల్ల విప్లవ శక్తులు దళాన్ని కాపాడుకోగలిగాయి. అక్కడ దళ కార్యకలాపాలు గత ముప్పది ఏళ్లుగా క్రమం తప్పకుండా కొనసాగుతూనే ఉన్నాయి. మైదాన ప్రాంత కేడర్‌తో మొదటి దళం ఏర్పడినా, ఆ తరువాత గిరిజన యువతీ యువకులు దళాల్లోకి చేరడం ఆరంభమయింది. దళాల సంఖ్య పెరిగింది. యావత్తు మన్యం ప్రాంత గ్రామాలన్నింటికీ గిరిజన సంఘ కార్యకలాపాలు విస్తరించాయి. సరిహద్దుల్లో ఉన్న రాష్ట్రాలకు ఉద్యమం విస్తరించింది. అనేక మంది కామ్రేడ్స్ ఉద్యమ పురోగమన క్రమంలో నేలకొరిగారు. కామ్రేడ్స్ రాజారావు, తిరుపతి పట్నాయక్, గంటి రమేష్, రాజ్‌కుమార్‌లు అమరులయ్యారు. విప్లవ శక్తులు అపారమైన పోరాట అనుభవాన్ని గడించాయి.

నక్సల్బరీలో సంతాల్ తెగ గిరిజనుడు ఎగరేసిన ఎర్రజెండా నేడు మన్యం అంతటా రెపరెపలాడుతోంది. సంతాల్ గిరిజనుడి తెగువనీ, అల్లూరి పోరాట వారసత్వాన్నీ, సిక్కోలు సవర సాహసాన్నీ పుణికి పుచ్చుకుని గిరిజన రైతాంగ విప్లవోద్యమం నక్సల్బరీ పంథా వెలుగులో ముమ్ముందుకే సాగుతోంది. నాతో పనిచేసిన అనేక మంది కామ్రేడ్స్ ఈనాడు లేరు. వారంతా అమరులయ్యారు. కానీ వారందరి విప్లవ స్ఫూర్తి పీడిత ప్రజల హృదయాల్లో సదా నిలిచే ఉంటుంది.

యాభై వసంతాల నక్సల్బరీ పోరాటానికి విప్లవ జేజేలు!

*(రచయిత 'కె.ఎస్. స్మారక కమిటీ' సభ్యులు, ఫ్యామిలీ ఫిజీషియన్‌గా ప్రాక్టీస్ చేస్తున్నారు)*

పూర్తిగా కాలి బూడిదయిన ఒక జ్వాల నుంచి మళ్లీ ఒక ఫీనిక్స్ పక్షి లేచినట్లుగా నక్సల్బరీ తిరిగి తిరిగి వచ్చింది. తాను బయలుదేరిన చోటికి వచ్చింది. తనకు ఇదివరకెన్నడూ పరిచయం లేని చోటికి వచ్చింది. కావల్సిన వాళ్ల అనుభవంలోకి మాత్రమే కాదు, కలలో కూడా ఊహించని వాళ్ల అనుభవంలోకి కూడా వచ్చింది. ఎందుకంటే ఇది ప్రపంచాన్ని అర్థం చేసుకునే తత్వవేత్తల కృషిగా కాకుండా, ప్రపంచాన్ని మార్చే కమ్యూనిస్టుల విప్లవాచరణగా ముందుకు వచ్చింది. ఈ కమ్యూనిస్టులు, ఈ ఆదివాసి రైతాంగం విప్లవం నుంచి విప్లవ నిర్మాణానికి పయనించారు.

ప్యారిస్ కమ్యూన్ విజయవంతం చేసిన కమ్యూనార్డులు కూడా లెనిన్ కాలపు విప్లవ నిర్మాణానికి దోహదం చేసిన వాళ్లు కావచ్చు గాని ఈ కమ్యూనిస్టులు తమ ఆచరణ నుంచి ఒక నిర్మాణాన్ని చేపట్టారు. అది ప్రపంచ వ్యాప్తమైన నిర్మాణాలకు సమ ఉజ్జీగా ప్రారంభమై ఇవాళ్టికీ సజీవంగా ఉన్నది. కొనఊపిరి స్థితికి, కోమాలోకి వెళ్లిన స్థితికి వెళ్లి మళ్లీ నవయవ్వనాన్ని పుంజుకున్నది.

నక్సల్బరీకి ఒక బాహిర అంతర్జాతీయ దోహదం ఉన్నది. ఒక తక్షణ అంతర్గత ప్రేరణ ఉన్నది. ప్రపంచ వ్యాప్తంగానే 1966 తరువాత పెల్లుబుకిన విప్లవాలకూ, ఎనభై దేశాల్లో ఏర్పడిన మార్క్సిస్ట్ - లెనినిస్ట్ పార్టీలకూ చైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం చూపిన దిక్సూచినే నక్సల్బరీ కూడా అందుకున్నది. అంటే అది రివిజనిజానికి వ్యతిరేకంగా పది సంవత్సరాల మహత్తర చర్చ ఫలితం.

మన దేశంలో చర్చగా అది 1951 నుంచి ఉన్నది. బహుశా 1948 నుంచి కూడా ఉన్నది. దేశంలో అధికార మార్పిడితో ఈ చర్చ మొదలై 1951లో తెలంగాణ సాయుధ పోరాట విరమణతో కమ్యూనిస్టు శిబిరంలో పదహారు సంవత్సరాలు సాగిన చర్చ. తిరిగి 1964లో అవిభక్త కమ్యూనిస్టు పార్టీ సిపిఐ, సిపిఎంగా చీలినప్పుడు ప్రజల్లో, శ్రేణుల్లో వర్గపోరాట ఆకాంక్ష వల్ల కలిగిన చర్చ. ఆ చర్చకు ఒక రూపం ఇచ్చి, ఒక కెటాలిస్ట్ పాత్ర నిర్వహించి ఎనిమిది దస్తావేజులు (తెరాయ్ డాక్యుమెంట్లు) 1965 నుంచి 1967 వరకు రాసి నక్సల్బరీని సాకారం చేసిన నాయకత్వం చారు మజుందార్ అందించాడు. జంగల్ సంతాల్ వంటి ఆదివాసులు, నక్సల్బరీ గ్రామానికి చెందిన కానూ సన్యాల్ వంటి విద్యావంతులు అందుకున్నారు.

నక్సల్బరీ ప్రత్యేకత చెప్పాలంటే అది ఆరంభమైనప్పుడే కాదు, ఇప్పటికీ రివిజనిజం మీద రాజీలేని పోరు. చైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం వలెనే అది ఎప్పుడూ తన ఇల్లు ఊడ్చుకొని, తుడుచుకొని, తలుపులు, కిటికీలు తెరిచి పెట్టుకొని కల్మషమైన గాలిని బయటికి పంపి, స్వచ్ఛమైన వాయువును ఆహ్వానించిన ఒక నిరంతర పునాది, ఉపరితల పోరాటం. అది ఆనాడు పార్లమెంటరీ రాజకీయాలను బూర్జువా నియంతృత్వంగా నిర్వచించి, నిరాకరించి ప్రజల రాజకీయాలను ప్రత్యామ్నాయంగా ప్రతిపాదించిన పోరాటంగా ప్రారంభం అయింది.

నక్సల్బరీ ఇరవై ఏళ్ల భారతీయ సమాజాన్ని, వ్యవస్థను స్పష్టంగా విశ్లేషించి, నిర్వచించింది. వ్యవస్థను, రాజ్యాన్ని అర్ధవలస, అర్ధ భూస్వామ్య దళారీ స్వభావం కలవిగా తేల్చి చెప్పింది. అధికార మార్పిడి జరిగి అప్పటికి ఇరవై ఏళ్లు గడిచినా ఒక బ్రిటిష్ సామ్రాజ్యవాదం స్థానంలో ప్రపంచ సామ్రాజ్యవాద దేశాలన్నిటి పట్టు కొనసాగడం వల్ల, అన్నిటికీ దేశం ఒక తాకట్టుగా మారడం వల్ల ఈ వ్యవస్థనూ అర్ధ వలస అన్నది. చట్టాలలోనే తప్ప ఆచరణలో భూసంస్కరణలు అమలు కాకపోవడం వల్ల, ఇరవై ఏళ్లు గడిచినా అంటరానితనం కొనసాగు తుండడం వల్ల ఇది అర్ధ భూస్వామ్యం అని కూడా నిర్వచించింది.

సామ్రాజ్యవాద పెట్టుబడిదారులకు, దేశంలోని బడా కంపెనీలకు, దేశంలోని భూస్వాములకు దళారీలుగా వ్యవహరించే రాజ్యాంగ యంత్రమే ఈ ఇరవై ఏళ్లు కొనసాగిందని, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుతో జరిగే ఎన్నికలైనా, సంస్కరణలైనా కేవలం శవాలంకారాలేనని, ఈ వ్యవస్థను సాయుధంగా కూలదోసి దీనిస్థానంలో నూతన ప్రజాస్వామిక వ్యవస్థను నెలకొల్పడమే లక్ష్యంగా నక్సల్బరీ రైతాంగ పోరాటం ప్రారంభమైంది.

ఈ విప్లవానికి భూమిక భూమిని స్వాధీనం చేసుకునే ఆర్థిక పోరాటం. స్వాధీనం చేసుకున్న భూమిని భూస్వాముల గుండాల నుంచి, వాళ్లకు మద్దతుగా వచ్చే పోలీసుల నుంచి, ప్రభుత్వం నుంచి, రాజ్యం నుంచి కాపాడుకోవడానికి చేసే గెరిల్లా పోరాటమే సైనిక రూపం. లక్ష్యం ప్రజల చేతికి అధికారం. సోవియట్ రష్యాలో సోవియట్‌లకు, చైనాలో కమ్యూన్‌లకు వచ్చిన అధికారం వంటిది. ఉత్పత్తిలో పాల్గొంటున్న ప్రజలకు, దోపిడీకి, పీడనకు గురవుతున్న ప్రజలకు, గడ్డివేళ్ల స్థాయిలో ఉన్న ప్రజలకు. అట్టడుగున ఉన్న ప్రజలకు, పోరాడుతున్న ప్రజలకు అగ్రగామి కార్మికవర్గం నాయకత్వంలో అధికారాన్ని సాధించే విప్లవం అది.

అత్యధిక సంఖ్యలో గ్రామాలు, రైతాంగం, వ్యవసాయ సంబంధిత వృత్తులు ఉన్న దేశం భారతదేశం. భూమిలేని నిరుపేద, వ్యవసాయ కూలి మొదలు ధనిక రైతు వరకు ఇక్కడ ఫ్యూడల్ భూస్వామ్య సామ్రాజ్యవాద దోపిడీకి గురవుతున్నారు. ఈ అన్నివర్గాల విముక్తి అగ్రగామి కార్మికవర్గం నాయకత్వంలో జరిగే వర్గపోరాటం నక్సల్బరీ.

తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో ఇటువంటి పోరాటానికి నాయకత్వం వహించే అవకాశం మైదాన ప్రాంతంలో ఉన్న వెట్టి బానిసలుగా పిలువబడిన మాల, మాదిగలకు, ఈనాటి అర్థంలో దళితులకు వచ్చింది. నక్సల్బరీ, శ్రీకాకుళం, వైనాడు, గోపివల్లభ్‌పూర్ వంటి విప్లవ వెల్లువలు ఆదివాసి ప్రాంతాల నుంచి ప్రారంభమైనవి.

సిపిఐ (మార్క్సిస్ట్ - లెనినిస్ట్) పార్టీ ఏర్పడి దాని అధికార పత్రికగా 'లిబరేషన్' ప్రారంభమై కొనసాగిన కాలపు సంచికలన్నీ కలిపి సునీత్ ఘోష్ రెండు సంపుటాలుగా వేసినప్పుడు వాటికి 'టర్నింగ్ పాయింట్' అని పేరు పెట్టాడు. అంటే భారత రాజకీయాల్లో అది ఒక గుణాత్మకమైన మార్పు అనే అర్థంలో. నక్సల్బరీ ప్రాసంగికత గురించి మాట్లాడు కోవాలంటే అన్నిటికంటే ముఖ్యమైనది అది బూర్జువా రాజకీయాల స్థానంలో ప్రజా ప్రత్యామ్నాయంగా వర్గపోరాట రాజకీయాలను ప్రవేశపెట్టింది. వర్గపోరాటానికి ప్రధాన పోరాట రూపంగా సాయుధ పోరాటాన్ని ప్రవేశపెట్టింది. మిగిలిన ప్రజా పోరాటాలన్నీ దీనికి దోహదంగా, అనుసంధానంగా ఉండే పోరాటాలే. ఇందుకొరకే అంటే విప్లవ ప్రచారం కోసమే ప్రజాసంఘాలు ఏర్పడతాయి.

మావో సె టుంగ్ చెప్పిన 'విప్లవంలో రెండు సైన్యాల పని - భూమి సేన, ప్రచార సేన (ఆయన సాంస్కృతిక సేన అన్నాడు). విప్లవానికి రెండు కళ్లు, చెవులు, చేతులు, కాళ్ల వంటివి. దీనికి మొదటి దశ లక్ష్యం నూతన ప్రజాస్వామిక విప్లవం. భూమి ఇరుసుగా కొనసాగే వ్యవసాయ విప్లవం. రైతు వ్యవసాయం చేయడం వంటిదే రైతాంగ విప్లవ పోరాటం.'

1967 నాటికే పార్లమెంటరీ రాజకీయాలు భ్రష్టుపట్టి పోయాయి. మన దేశంలో పార్లమెంటరీ రాజకీయాలు అనేవి అంటుమొక్క వంటివే. ఆమాటకొస్తే ఇంగ్లండ్‌లో పారిశ్రామిక విప్లవం, ప్యారిస్‌లో ఫ్రెంచ్ విప్లవం తరువాత పార్లమెంటరీ రాజకీయాలకు కాలం చెల్లింది. ఆ రెండు దేశాలు మాత్రమే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వచ్చి కొంతకాలం మనగలిగింది.

ఆ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కూడా రెండు చోట్లా సాయుధ పోరాటం ద్వారానే సాధ్యమైందనే విషయం మనం మర్చిపోకూడదు. పెట్టుబడిదారీ విధానం ఇంగ్లండ్‌కో, ఫ్రాన్స్‌కో పరిమితమైన ఉత్పత్తి విధానంగా కాకుండా అది అత్యున్నత దశకు చేరుకొని సామ్రాజ్యవాదంగా మారిన తరువాత ఇంక పార్లమెంటరీ రాజకీయాలకు స్థానం లేకుండా పోయింది. పార్లమెంటరీ రాజకీయాల పేరుతో ప్రపంచవ్యాప్తంగా కొనసాగుతున్న దంతా బూర్జువా నియంతృత్వమే. దాని స్థానంలో శ్రామికవర్గ నియంతృత్వాన్ని నెలకొల్పాలనేదే బోల్షివిక్ విప్లవం నాటికి లెనిన్ ఒక ఉక్కు పార్టీ నిర్మాణం వంటి కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం ద్వారా కార్మికవర్గ విప్లవం ద్వారా రుజువు చేశాడు.

వలస దేశంగా ఇండియా స్వీకరించిన వలస రాజకీయాలలో భాగమే పార్లమెంట్. అశేష ప్రజానీకానికి, వ్యవసాయం మీద ఆధారపడిన పీడిత ప్రజలకు ప్రధాన వైరుధ్యం ఉన్న చోట పారిశ్రామిక విప్లవం నేపథ్యంలో వచ్చిన పార్లమెంటరీ రాజకీయాలకు చోటు లేదు. సామ్రాజ్యవాద స్వభావమే అసమానతను కొనసాగించడం. సామ్రాజ్యవాదం ప్రపంచాన్ని మూడు ప్రపంచాలుగా విభజించింది. అమెరికా, యూరప్ వంటి పెట్టుబడిదారీ దేశాలకు ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా వంటి ఖండాలలోని దేశాలన్నీ అర్ధవలసలుగా మారిపోయాయి. కొన్ని దేశాలైతే చాలా కాలం వరకు నయా వలసలుగా కూడా మిగిలిపోయాయి.

చైనా విప్లవం నాటికే రానున్న ప్రపంచ విప్లవాలన్నీ నూతన ప్రజాస్వామిక విప్లవ దశలుగానే సాధ్యమవుతాయని రుజువైంది. చైనా తరువాత వియత్నాం, కంపూచియా మొదలైన చాలా దేశాల్లో ఆ రూపంలోనే విప్లవం విజయవంతమైంది. చాలా విషయాలలో చైనాతో పోలిక ఉన్న భారతదేశం నూతన ప్రజాస్వామిక విప్లవ మార్గాన్ని ఎంచుకున్నది.

అటువైపు బూర్జువా రాజకీయాల్లో పార్లమెంట్ అనేది ఒక గుదిబండగా మారింది. నిలువ నీరైపోయింది. భూస్వామ్య పెట్టుబడిదారీ దళారీ పాలకుల బాతాఖానీ క్లబ్బుగా మారింది. స్వార్థ (వెస్టెడ్) ప్రయోజన వేదికగా మారింది. మిశ్రమ ఆర్థిక విధానం, పంచవర్ష ప్రణాళికలు, సహకార వ్యవసాయం, భూసంస్కరణలు వంటివన్నీ కాగితాలకే పరిమితమైపోయినవి. 1967 నాటికే రాజ్యాంగంలోని ఉపోద్ఘాతం, ఆదేశిక సూత్రాలు, ప్రాథమిక హక్కులు కాగితాలకే పరిమితమైనవి. దేశం అమెరికన్ సామ్రాజ్యవాదం (ప్రైవేట్ రంగం)తో పాటు సోవియట్ సోషల్ సామ్రాజ్యవాద (పబ్లిక్ రంగం) ఏజెంట్‌గా మారిపోయింది. 1971 రష్యాతో చేసుకున్న సైనిక ఒడంబడికతోనైతే ఈ దేశం రష్యాకు ఒక ఉపగ్రహంగా మారిపోయింది.

నలభై ఏళ్లు గడిచే వరకు వచ్చిన మార్పు ఏమిటంటే ఇప్పుడిది అమెరికన్ సామ్రాజ్యవాదానికి ఒక ఉపగ్రహంగా మారిపోయింది. చంద్రశేఖర్ ప్రధానిగా ఉన్న కాలానికే అమెరికా యుద్ధ విమానాలు మన దేశంలో చమురు పోసుకొని అఫ్ఘనిస్తాన్ మీదికి యుద్ధానికి పోయే స్థితి వచ్చింది. అమెరికా, భారత సైన్యాలు కలిసే స్థావరాలు, విన్యాసాలు చేసుకోవడానికి అమెరికాతో ఎన్నో రకాల సైనిక ఒప్పందాలు, ఆయుధాల కొనుగోలు ఒప్పందాలు మన కేంద్ర ప్రభుత్వం చేసుకుంటున్నది. ఒకప్పుడు ఇజ్రాయెల్‌ను గుర్తించని దేశం, పాలస్తీనాకు అండగా నిలబడిన దేశం దేశభక్తియుత సంఘ్ పరివార్ కేంద్ర ప్రభుత్వ పుణ్యమా అని సైనిక ఒప్పందాలకు, ఆయుధాల కొనుగోలుకు అన్నిటికంటే విశ్వసనీయతను పొందిన దేశంగా మారింది. ఒక్కమాటలో ఇవాళ అమెరికన్ సామ్రాజ్యవాద ఫాసిస్ట్ విధానాలను అమలు చేసే రెండు చేతులుగా ఇండియా, ఇజ్రాయెల్‌లు మారినవి.

మోడీ పరిపాలన కాలానికి ప్రజాస్వామ్యం నిర్వచనవే మెజారిటేరియనిజంగా మారింది. దేశ భావన జాతి భావనగా, జాతి భావన మత భావనగా, అంటే అధిక సంఖ్యాక మత భావనగా, అంటే బ్రాహ్మణీయ హిందుత్వ భావనగా మారిపోయింది. దీన్నే ఇవాళ బ్రాహ్మణీయ హిందూ ఫాసిజంగా నక్సల్బరీ పంథాను అనుసరిస్తున్న మావోయిజం నిర్వచిస్తున్నది.

జర్మనీలో 1930ల్లో జాతీయ సామ్యవాదాన్ని తెస్తానని ఎన్నికల్లో గెలిచిన హిట్లర్ బహుళజాతి కంపెనీల ప్రయోజనం కోసం పార్లమెంట్‌ను తగులబెట్టి నాజీజాన్ని అమలు చేసిన కాలాన్ని చూసాం మనం. చాలా విషయాల్లో అటు అమెరికాలో గాని, ఇజ్రాయెల్‌లో గాని, ఇండియాలో గాని మతం, జాతిగా ఒక రేఖ చెరిగిన స్థితి మనం ఇవాళ చూస్తున్నాం. ముస్లిం వ్యతిరేకత ఒక రేసిజంగా అమెరికా, ఇజ్రాయెల్‌లో మాత్రమే కాదు, ఇంగ్లండ్, ఫ్రాన్స్‌ల దాకా విస్తరించింది. రెండో ప్రపంచ యుద్ధ కాలానికి ఇటువంటి ఉన్మాదం ముఖ్యంగా జర్మనీలో ఆర్య జాతి పేరుతో, స్వస్తిక్ గుర్తుతో అమలైన తీరు ఇవాళ మన దేశంలో చూస్తున్నాం.

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం తరువాత క్రమంగా దేశాన్ని మత ప్రాతిపదిక మీద విభజించిన వలసవాదం సాధించిన దానికన్నా ఇవాళ మన దేశంలో ఎన్నికలు దేశ ప్రజలను మత ప్రాతిపదికతో విభజించడం ఎంతో సులభతరం అయిపోయింది. గుజరాత్‌లో ఐదు ఎన్నికల్లో చేసిన ఈ ప్రయోగం 2014లో అఖిల భారత స్థాయిలో జరిగి, ఇప్పుడు యుపి ఎన్నికలతో రానున్న రాష్ట్రాల ఎన్నికలకు కూడా ఒక నమూనాగా మారిపోయింది. ఉత్తరప్రదేశ్ వంటి యూరప్‌లోని అన్ని దేశాల కంటే ఎంతో పెద్దదైన రాష్ట్రంలో ఒక్క ముస్లిం అభ్యర్థికి సీటు ఇవ్వకుండా బిజెపి ఎన్నికలు గెలుచుకోగలిగింది.

కనుక ఎన్నికల చట్రంలోని ప్రజల ప్రజాస్వామ్యం సాధన అనే మాట ఎంత ఎండమావియో రుజువు అయిన క్రమంలో నక్సల్బరీ ప్రాసంగికత ఇదివరకెప్పటికన్నా ఎక్కువగా ఉన్నది.

ఎన్నికలు సంస్కరణవాదం మాత్రమే కాకుండా కుహనా సంస్కరణవాదం అని 1991 సామ్రాజ్యవాద ప్రపంచీకరణ తరువాత రోజురోజుకూ రుజువు అవుతున్న ఒక చేదు నిజం. సంక్షేమ రాజ్యం, సామ్యవాదం, గరీబీ హఠావో వంటివి ఇవాళ ఎన్నికల రాజకీయాల్లో ఒక ఆదర్శభావంగా కూడా చెప్పబడడం లేదు. సమానత్వం అనే మాట ఇవాళ ఎన్నికల రాజకీయాల్లో వినిపించదు. ఎన్నికల రాజకీయాల్లో వినిపిస్తున్నదంతా 'అభివృద్ధి' అనే మాట. ఈ అభివృద్ధి కూడా నూతన ఆర్థిక విధానం పేరుతో పైనుంచి అమలయ్యే అభివృద్ధి నమూనాగా అమలవుతున్నది. ఇది కేవలం కార్పొరేట్ శక్తుల ప్రయోజనం కోసమే అనేది ఈ ఇరవై ఐదు సంవత్సరాల అనుభవంలో స్పష్టమైంది. ముఖ్యంగా పీడిత ప్రజలైన ఆదివాసులు, దళితులు, ముస్లింలు, రైతాంగం, కార్మికులు, అసంఘటిత రంగంలో ఉన్న కోట్లాది మంది నిరుద్యోగులు, విద్యార్థులు, ఈ అన్ని సమాజాల్లో, సమూహాల్లో ఉన్న మహిళలు ఈ అభివృద్ధి నమూనా బాధితులే.

దళిత, బహుజన రాజకీయాలు చెప్పే వాళ్లతో సహా మౌలికంగా ఈ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నమూనాను వ్యతిరేకిస్తున్నారా అనేది ఇప్పుడు ఒక మౌలికమైన ప్రశ్న. యుపిలో మాయావతి పాలన గాని, బెంగాల్‌లో లెఫ్ట్ ఫ్రంట్ పాలన గాని, ఇవాల్టికివ్వాళ కేరళలో లెఫ్ట్ ఫ్రంట్ పాలన గాని, ఒకప్పటి రైతుల రాజకీయ పార్టీ అయిన అకాలీదళ్ మొదలు కేంద్రానికి వ్యతిరేకంగా వచ్చిన అస్సాం గణపరిషత్ వరకు ఏ

ఒక్క ప్రాంతీయ పార్టీ కూడా ఈ అభివృద్ధి నమూనాను వ్యతిరేకించ లేదు. పైగా అదే విధానాలు అమలు చేశాయి. అన్నాదురై కాలపు అన్నా డిఎంకె కూడా ఎంత మారిందో తాజా తమిళ రాజకీయాల్లోని పరిణామాలను బట్టి ఊహించవచ్చు.

ఎన్నికల రాజకీయాల్లోకి ప్రవేశించిన తరువాత వ్యక్తులుగానూ, పార్టీలుగానూ దళారీ పాత్ర నిర్వహించకుండా స్వతంత్రమైన పాత్రను నిర్వహించే స్థితి సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో అసాధ్యమైన స్థితి.

కేంద్రం విషయం అలా ఉంచి ఏ ఒక్క ప్రాంతీయ పార్టీ కూడా ఇవాళ స్వావలంబన రాజకీయాలు మాట్లాడడం లేదు. స్వయం పోషక విషయం మాట్లాడడం లేదు. స్వపరిపాలన విషయం మాట్లాడడం లేదు. అవి ఎన్నికల రాజకీయాల ద్వారా, పార్లమెంటరీ వ్యవస్థ వల్ల సాధ్యమయ్యేవి కాదు.

నక్సల్బరీ రాజకీయాలు కార్మిక వర్గ నాయకత్వంలోకి ఆదివాసులను, దళితులను పెద్ద సంఖ్యలో తీసుకువచ్చాయి. నక్సల్బరీ రాజకీయాలను చెపుతూ గ్రామాలకు వెళ్లడానికి చారుమజుందార్ ఇచ్చిన కార్యక్రమంలో విప్లవకారులను అంటే కమ్యూనిస్టు కార్యకర్తలను గ్రామాలకు వెళ్లినప్పుడు షెడ్యూల్డ్ కాస్ట్ ప్రజలు ఉండే వాడల్లోకి వెళ్లమని పిలుపు ఇచ్చాడు. వాళ్ల దగ్గరే ఆశ్రయం తీసుకోమన్నాడు. అంటరానివాళ్ల వాడలు తిరిగి అందరి దగ్గర అన్నం అడుక్కుని ఒక చోట చేరి వాళ్లతో పాటు తింటూ, వాళ్ల నుంచి ఆహారం పంచుకున్నట్టుగానే వాళ్లకు విప్లవ రాజకీయాలు ప్రచారం చేయమన్నాడు.

1969 నాటికే చారు మజుందార్ ఇచ్చిన పిలుపు. 1978 తరువాత 85 దాకా ఆంధ్రప్రదేశ్‌లో రాడికల్ విద్యార్థి యువజనులు 'గ్రామాలకు తరలండి' పిలుపులో లక్షలాది మంది ప్రజల మధ్యన జననాట్య మండలి, విప్లవ రచయితల సంఘం సహకారంతో గ్రామాల్లో అమలు చేసిన విధానం. రైతు కూలీ సంఘాలు ఏర్పడి భూస్వాధీనం చేసుకోవడానికి, విప్లవ పోరాటాల నిర్మాణం చేయడానికి జగిత్యాల జైత్రయాత్ర మొదలు, ఆదిలాబాద్, కరీంనగర్ పోరాటాల నిర్మాణానికి దోహదం చేసింది.

అంత మాత్రమే అయితే అది ఒక ప్రగతిశీలమైన ఆర్థికవాదమే అవుతుంది. 1980లో సిపిఐ (ఎంఎల్) పీపుల్స్‌వార్ ఏర్పడి ప్రజా యుద్ధానికి పిలుపు ఇచ్చింది. విముక్తి ప్రాంతాల నిర్మాణానికి గడ్చిరోలి, బస్తర్ అడవుల్లోకి ప్రవేశించింది. 1999 నుంచి 2004 నాటికి దేశంలో ప్రధానమైన రెండు విప్లవ పార్టీలతో కలిసి ఒక ఐక్య విప్లవ పార్టీ నిర్మాణంగా మారింది. దానితో తూర్పు, మధ్య భారతాల్లో ఇటు దండకారణ్యం, అటు సరండా, బెంగాల్‌లో జంగల్‌మహల్‌ల దాకా బేస్ ఏరియాలు ఏర్పాటు చేసుకునే స్థితికి ఎదిగింది. పడమటి కనుమల్లో కూడా ఒక బేస్ ఏరియా ఏర్పాటు చేసుకునే ప్రయోగాన్ని ప్రారంభించింది.

1995లో ప్రత్యామ్నాయ రాజకీయాల అమలు కోసం గ్రామ రాజ్య కమిటీలు ఏర్పాటు చేసి బస్తర్, ఉత్తర తెలంగాణలో వందలాది గ్రామాల్లో అమలు చేసే క్రమం తెలంగాణలో దెబ్బతిన్నప్పటికీ గత పన్నెండు సంవత్సరాలుగా అది బస్తర్‌లో జనతన సర్కార్‌గా ప్రత్యామ్నాయ రాజకీయాలను అమలు చేస్తున్నది. ఇవాళ దేశవ్యాప్తంగా ప్రపంచ బ్యాంక్ సహకారం లేకుండా బహుళజాతి కంపెనీలను, బడా కంపెనీలను నిలువరించి, ప్రజాయుద్ధాన్ని కొనసాగిస్తూ, ప్రజల ప్రత్యామ్నాయ రాజ్యాన్ని నిర్వహిస్తున్న ఒకే ఒక్క ప్రభుత్వం దండకారణ్యంలో అమలవుతున్నది.

నక్సల్బరీ కాలం నుంచి ఏ ప్రత్యామ్నాయ రాజకీయాలనైతే నక్సల్బరీ పంథా చెబుతున్నదో ఇవాళ ఆ ప్రత్యామ్నాయ రాజకీయాలు దండకారణ్యంలో అమలవుతున్నవి. తెలంగాణలో 1948-51 మధ్యన మూడు వేల గ్రామాలలో పది లక్షల ఎకరాల భూమిని స్వాధీనం చేసుకొని ఎర్రరాజ్యాన్ని ప్రజలు చవిచూసినట్టుగా ఇవాళ పన్నెండేళ్లుగా దండకారణ్యంలో అటువంటి రాజకీయ నిర్మాణాన్ని ప్రజాకీయ రాజకీయాలుగా ఐక్య సంఘటన ప్రభుత్వం అమలు చేస్తున్నది. ఈ ఐక్య సంఘటనలో భూమి లేని నిరుపేదలు, వ్యవసాయ కూలీలు, చిన్న రైతులు, ధనిక రైతులు దాకా ఉన్నారు. నాయకత్వం కార్మిక వర్గానిదే. వీళ్లంతా ఆదివాసులు, దళితులు, బడుగు వర్గాలు. ఎన్నికలను బహిష్కరించి, బూర్జువా ప్రభుత్వాలకు పన్నులు నిరాకరించి, సహకారం, దాని ఉన్నత స్థితి అయిన సమష్టి రాజకీయ ఆర్థిక విధానాలతో స్వావలంబన విధానాలు అక్కడ అమలవుతున్నాయి. స్వపరిపాలన అక్కడ కొనసాగుతున్నది. ఇది ప్రధానంగా రెండు రాజకీయ పంథాల మధ్య ఘర్షణ. రెండు అభివృద్ధి నమూనాల మధ్య ఘర్షణ. అందుకే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇక్కడి ప్రజలపై గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరుతో యుద్ధానికే దిగాయి.

ఈ యుద్ధం శ్రీశ్రీ చెప్పినట్లుగా 'విప్లవ కుగ్రామంలో సాగుతున్న గ్లోబల్ సంగ్రామం'గా ఉన్నది. ఊర్లు తగలబెట్టబడుతున్నాయి. స్త్రీలు సామూహికంగా లైంగిక అత్యాచారాలకు గురవుతున్నారు. వేలాది మంది ఆదివాసులు బూటకపు ఎన్‌కౌంటర్లలో అమరులవుతున్నారు.

నక్సల్బరీ కాలంలోనే విస్తృతంగా ప్రచారంలోకి వచ్చిన మాట 'సబ్ కా నామ్ వియత్నాం' అనేది. ఆనాడు వియత్నాం ప్రజల మీద అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రత్యక్ష యుద్ధానికి దిగితే మొత్తంగా జపాన్, ఫ్రెంచ్, అమెరికన్ సామ్రాజ్యవాద కబళింపుకు వియత్నాం దేశంగా, ప్రజలుగా గురవుతూ ప్రజా యుద్ధాన్ని నిర్మాణం చేసి 1974కు విముక్తమై ఒక్కటైతే ఇవాళ ఈ సామ్రాజ్యవాద దళారీల యుద్ధాన్ని దండకారణ్యం ప్రజాయుద్ధంతో ప్రతిఘటిస్తున్నది.

రాజకీయ పంథా ప్రజా జీవితంలో చాలా ప్రధానమైనటువంటి, కీలకమైనటువంటి సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక నిర్ణయాలు తీసుకోవడానికి అవసరమైనది. అది ఉత్పత్తి సంబంధాల ఆధారంగా రూపొందుతుంది. వర్గపోరాటం ద్వారా రూపొందుతుంది. ఉత్పత్తి మీద, ఉత్పత్తి సాధనాల మీద ఉత్పత్తి శక్తులు పూర్తి అధికారాన్ని పొందకుండా వాటిని స్వాధీన పరుచుకోకుండా ప్రజల మౌలిక ప్రయోజనాలు నెరవేరవు. శ్రామిక వర్గానికి మాత్రమే కాదు దోపిడీకి గురవుతున్న అన్ని వర్గాలకు కూడా విముక్తి ఇవ్వగలిగినటువంటిది కార్మిక వర్గ అధికారమే. ఇది ఎన్నికల రాజకీయాల వల్ల వచ్చేది కాదు.

ఎన్నికల రాజకీయాలు మనను నెహ్రూ నుంచి మోడీ దాకా నడిపించిన తీరు చూశాం. ఇటీవలనే వెలువడిన రెండు పుస్తకాలు అయూబ్ రానా 'గుజరాత్ ఫైల్స్' గాని, తీస్తా సెతల్వాద్ 'ఫుట్ సోల్జర్స్ ఆఫ్ కాన్‌స్టిట్యూషన్' చదివితే 2002 నుంచి ఇప్పటి దాకా గుజరాత్ మారణకాండ గురించి దేశంలో లౌకిక ప్రజాస్వామ్యవాదులు, విప్లవోద్యమం చెప్తున్న విషయాలకు ఎంత ప్రామాణికమైన ఆధారాలు ఉన్నాయో తెలుస్తుంది. అంతటి గుజరాత్ మారణకాండకు బాధ్యులైన హంతకులు ఇవాళ దేశ భవిష్యత్తును నిర్దేశించే శక్తిగా కేవలం ఈ ఎన్నికల ద్వారానే కాగలిగారు. అక్కడితో ఆగకుండా ముజఫర్‌నగర్ మారణకాండ దాకా అట్లాగే దాదాపు ఈ మూడు సంవత్సరాలలో గోవధ ఎజెండాగా దళితులపై జరిగిన మారణకాండకు బాధ్యులైన వాళ్లు ఇవాళ ఉత్తరప్రదేశ్‌లో అధికారానికి రాగలిగారు.

రాజ్యాంగం, లౌకిక ప్రజాస్వామ్యంగా ఉంటూనే ఎన్నికల రాజకీయాల

ద్వారా మత రాజ్యంగా మారిన తీరును 70 ఏళ్ల భారత స్వాతంత్ర్యం ఒక విషాద చరిత్రగా మన ముందుంచింది. అమెరికాలో రేసిజం, మన దేశంలో హిందూ మతోన్మాదం ప్రజలను ఏకం చేసే ఒక సాధనగా ఈ ఎన్నికల మాయాజాలం ద్వారా సాధ్యం కావడంలోనే మరో ప్రత్యామ్నాయం గురించి చాలా రాడికల్‌గా ఆలోచించాల్సిన సందర్భం వచ్చింది. అప్పుడే రాజ్యాంగ చట్రానికి బయట ఒక ప్రత్యామ్నాయాన్ని ప్రతిపాదించిన నక్సల్బరీకి ప్రాసంగికత వస్తుంది.

నక్సల్బరీ నాడు గాని, 1991 కంటే ముందు గాని విప్లవోద్యమం బయట ఉన్న వాళ్లకు అర్థం కాని సామ్రాజ్యవాద శక్తుల దోపిడీ ఇప్పుడు తూర్పు, మధ్య భారతాల్లో కార్పొరేట్ శక్తుల దోపిడీ వల్ల స్పష్టంగా అర్థమవుతున్నది. కార్పొరేట్ శక్తుల కొరకే ఇవాళ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు శాసనాలు చేస్తున్నాయనీ, రాజ్యాంగాన్ని సవరిస్తున్నాయనీ, రాజ్యాంగేతరంగా కూడా వ్యవహరిస్తున్నాయనీ ప్రజల సార్వభౌమాధికారం పట్ల గౌరవం ఉన్న ప్రతి ఒక్కరూ మాట్లాడుతున్నారు. ప్రకృతి సంపదను, ప్రజల శ్రమశక్తిని దోచుకుంటున్న ఈ కార్పొరేట్ శక్తులకు వ్యతిరేకంగా తూర్పు, మధ్య భారతాల్లో పోరాడుతున్న ఆదివాసుల మధ్యన మావోయిస్టులు ఉన్న చోట మాత్రమే ప్రతిఘటన సాధ్యమవుతున్నదని కూడా వీళ్లందరూ అంగీకరిస్తున్నారు.

తాజాగా ప్రపంచం దృష్టిని ఆకర్షించిన నియాంగిరి ఆదివాసుల పోరాటాన్ని, వేదాంత కంపెనీని నిలువరించగలిగిన శక్తిని పార్లమెంట్‌లో హోంమంత్రిత్వ శాఖ మావోయిస్టు ప్రతిఘటనగా చూపి నిషేధించే ప్రయత్నం చేసింది. జార్ఖండ్‌లో కూడా అదే పని చేసింది. ప్రొ. జి.ఎన్. సాయిబాబా భావజాల రీత్యా ఇటువంటి పోరాటాలను బలపరచడాన్ని కూడా చాల ప్రమాదకరమైన చర్యగా న్యాయవ్యవస్థ కూడా భావిస్తున్నది. ఆదివాసులపై జరుగుతున్న అణచివేతను జల్, జంగల్, జమీన్‌ల దోపిడీని పరిశీలించి, సత్యశోధన చేయాలనుకునే వాళ్లు కూడా ఈ వ్యవస్థ దృష్టిలో నేరస్తులుగా కనిపిస్తున్నారు. ప్రజల స్వతంత్రాన్ని కాపాడుకోవడానికి కూడా, అంటే ప్రజలదైన శ్రమ, ప్రకృతి సంపద పైన ప్రజల స్వాధీనతను ప్రకటించుకోవడానికి కూడా విప్లవ ప్రతిఘటన తప్ప మార్గాంతరం లేని దగ్గరికి వచ్చి చేరాం.

గెలుపు ఓటముల దృష్టితో కాకుండా న్యాయాన్యాయాల దృష్టితో చూసినప్పుడు ఇవాళ ఉన్న ఎన్నికల రాజకీయాల దోపిడీ, పీడనల స్వభావానికి నక్సల్బరీ పంథా ప్రతిఘటన స్వభావానికి ఉన్న వ్యత్యాసం స్పష్టంగా అర్థం అవుతుంది. ప్రజాన్యాయం కోసం నక్సల్బరీ పంథా తప్ప మరో మార్గం లేదనే అవగాహనకు వర్గపోరాట దృక్పథం ఉన్నవాళ్లు మాత్రమే కాక స్వేచ్ఛ, సౌభ్రాతృత్వంతో పాటు సమానత్వం కోరుకునే వాళ్లు కూడా రాకతప్పనిస్థితి ఇవాళ ఉంది.

ఫ్రెంచ్ విప్లవం ప్రతిపాదించిన స్వేచ్ఛ, సౌభ్రాతృత్వంతో పాటు సమానత్వం కూడా సాధించబడాలంటే అది ప్యారిస్ కమ్యూన్‌లో మొదటిసారి సాధ్యమైన కార్మికవర్గ విప్లవం ద్వారానే సాధ్యం అనేది ఇవాళ నిర్వివాద అంశంగా దండకారణ్యంలోని జనతన సర్కార్ ద్వారా నక్సల్బరీ పంథా రుజువు చేస్తున్నది.

ఒక ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయ స్వాధీన స్వామ్యం ఏర్పడడానికి అంతే స్థాయిలో ఒక ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయ నిర్మాణం కూడా అవసరం అవుతుంది. మానవ శరీరంలో మానవ చర్యలన్నిటినీ నియంత్రించే మెదడు గాని, గుండె గాని మానవశరీరాకృతి లోపలనే ఉంటాయి. ఆ రెండింటి ఆరోగ్యమే బాహిరంగా కనిపించే కార్యాచరణలో నిమగ్నమయ్యే అంగాలన్నిటినీ నియంత్రిస్తుంది, నిర్దేశిస్తుంది. కార్మికవర్గ పార్టీ నిర్మాణం కూడా అటువంటిదే.

నక్సల్బరీ విస్ఫోటనం తరువాత అటువంటి కార్మిక వర్గ పార్టీ నిర్మాణం అవసరమై సిపిఐ (ఎంఎల్) 1969 ఏప్రిల్ 22న ఏర్పడింది. ఆనాడు అది ఏ బహిరంగ కార్యకలాపాలు లేకుండా మొత్తం రహస్యంగానే పనిచేయాలని అనుకున్నప్పటికీ తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట అనుభవం కలిగిన ఆంధ్రప్రదేశ్‌లోని విప్లవోద్యమం విరసం ఏర్పాటుతో మొదలై క్రమంగా 1974 నాటికి అన్ని ప్రజాసంఘాలను ఏర్పాటు చేసుకున్నది. 1980లలో, 90లలో అటువంటి ఏర్పాటులో మినహాయింపులు, లోటుపాట్లు ఉన్నా సవరించుకున్నది. సహస్ర బాహువులతో నూతన ప్రజాస్వామిక విప్లవ నిర్మాణంలో భాగమయింది.

కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం ఒక్కటే రాజ్యానికి రహస్యం తప్ప ప్రపంచాన్ని సమూలంగా మార్చే కమ్యూనిస్టు పార్టీ ప్రాపంచిక దృక్పథం ఎవరికీ రహస్యం కాదనే మార్క్సిస్ట్ అవగాహనకు అనుగుణంగా విప్లవోద్యమ నిర్మాణం, ప్రచారం జరుగుతున్నది. ఇది సరళరేఖగా సాగుతున్నదని గాని, సజావుగా సాగుతున్నదని గాని చెప్పడం కాదు. ఎన్నో ఒడిదొడుకులు, ఎన్నో లోటుపాట్లు, ఎన్నో ఆటుపోట్లకు గురవుతూ కూడా ప్రపంచ చరిత్రలోనే ఇంత సుదీర్ఘకాలం సాయుధ పోరాటం ప్రధాన రూపంగా వర్గపోరాటం నిర్వహించిన సందర్భం మరొకటి లేదు. రష్యా ఎదుర్కొన్న జాతుల సమస్య, చైనాకు లేని కుల సమస్య, పార్లమెంటరీ రాజకీయాల సమస్య ముప్పేటగా భారత విప్లవం ఎదుర్కొంటున్నది. నక్సల్బరీ కాలానికి చాపకింద నీటిలాగా ఉన్న మెజారిటీ మత భావన ఇప్పుడు రాజ్య స్వభావం అయింది. ఎన్నికల ఎజెండా అయింది. ప్రజాస్వామ్యం అంటే మెజారిటేరియనిజంగా మారింది. ఆసియా ఖండంలో ఇంత కేంద్రీకృతమైన, సాంకేతికంగా బలపడిన, విస్తృత నిర్మాణం ఉన్న పార్లమెంటరీ రాజకీయాలు కూడా మరెక్కడా లేవు. ఇన్ని ప్రతికూల భావాలను ఎదుర్కొంటూ నక్సల్బరీ పంథా పురోగమిస్తున్నది.

ఈ రాజకీయ ఎజెండాను ఆచరించడానికి ఏర్పడిన పార్టీ నిర్మాణం అజ్ఞాతంగా ఉండాలనేది సిపిఐ (ఎంఎల్) ఏర్పడినప్పటి నుంచి ఉన్న అవగాహన. ఎన్నికల బహిష్కరణ, బూర్జువా నియంతృత్వ పాలన విధించే పన్నుల ఎగవేత అది ప్రతిపాదించే కనీస కార్యక్రమం. విప్లవ నిర్మాణం బలమైన చోటల్లా అమలవుతున్నది. ఇప్పుడు అది దండకారణ్యంలోని జనతన సర్కార్‌లో అమలవుతున్నది. వాటి స్థానంలో సహకార, సమష్టి స్థాయిలో స్వచ్ఛందంగా శ్రమలో పాల్గొంటూ, ఉత్పత్తి సాధనాలను, భూమిని తమ స్వాధీనంలో ఉంచుకొని ప్రజలు ఫలాలు అనుభవించే ప్రజాస్వామ్యం అక్కడ అమలవుతున్నది. మావో చెప్పినటువంటి మూడు మంత్రదండాలు – ఉక్కు శిక్షణ గల పార్టీ; ఐక్య సంఘటన; ప్రజాసైన్య నిర్మాణం – అక్కడ బీజరూపంలోనైనా ఉన్నాయి.

పునాది రాజకీయాల్లో ఎంత ప్రత్యామ్నాయం అయినటువంటి మౌలిక మార్పులను నక్సల్బరీ ప్రతిపాదించి ఈనాటికీ కొనసాగిస్తున్నదో, ఉపరితల రాజకీయాలలో కూడా అన్ని ప్రత్యామ్నాయ మార్పులను తీసుకొని వచ్చింది. పునాది ఉపరితల సంబంధాలను సృజనాత్మకంగా నిర్వచించింది. ఒక రైతు భాషలో మావో సె టుంగ్ చెప్పినట్టు చూరు నుంచి కారే నీరు ఇంటి పునాదిలో పడి పునాది లుకలుకలయ్యే ప్రమాదం ఉందని చెప్పినట్టుగా ఉత్పత్తి సంబంధాల చర్చల వలెనే భావజాల చర్చ కూడా అంత తీవ్రంగా నక్సల్బరీ కాలంలో జరుగుతున్నది. నక్సల్బరీ ప్రతిపాదించిన విగ్రహ విధ్వంసనను యాంత్రిక రూపంలో తీసుకున్న వాళ్లు అది విలువల సంస్కృతి చర్చ అని గ్రహించలేరు. మనకివ్వబడిన

ఏ విలువనూ దానికదిగా ప్రశ్నించకుండా స్వీకరించకూడదు. అది కన్‌ఫ్యూషియస్ చెప్పిందైనా సరే, రాజారాం మోహన్ రాయ్ చెప్పిందైనా, గాంధీ చెప్పిందైనా. జాతీయోద్యమం, రెనైజాన్స్ వంటి మాటలను కూడా విమర్శించకుండా నక్సల్బరీ ఉండలేదు.

నక్సల్బరీ 1857 భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని ఈ దేశంలో ప్రజాస్వామ్య విప్లవానికి ఆరంభంగా తీసుకున్నది. అది అసంపూర్ణంగా మిగిలిపోయిందని, దాని పరిపూర్తి మాత్రం నూతన ప్రజాస్వామిక విప్లవంలోనే ఉన్నదని ప్రతిపాదించింది.

వ్యవసాయ విప్లవం భూమిలేని నిరుపేదలు, వ్యవసాయ కూలీలు రైతాంగంగా, కర్మాగారంలో పనిచేసే కార్మికులు కార్మికవర్గంగా, రైతాంగ, కార్మిక వర్గాలు ప్రధాన విప్లవకర వర్గాలుగా నిర్వహింపబడేది గనుక, వ్యవసాయ దేశాల్లో ఇటువంటి వాళ్లందరు ఎక్కువగా నిరక్షరాస్యులే గనుక వీళ్ల దగ్గరికి విప్లవ సందేశం మౌఖిక కళారూపాల్లో వెళ్లాలనే స్పష్టమైన మార్క్సిస్ట్ అవగాహన కూడా నక్సల్బరీ ముందుకు తెచ్చింది.

ఇది చారు మజుందార్, సరోజ్ దత్తా, వెంపటాపు సత్యం, సుబ్బారావు పాణిగ్రాహి కాలం నుంచి ఇవ్వాల్టి వరకు విప్లవోద్యమంలోని భూమిసేన, సాంస్కృతి సేనలను అనుసంధానం చేసి నిర్వహిస్తున్న విప్లవ మార్గంగా రూపొందింది. ఈ క్రమంలో విప్లవ రచయితల సంఘం, జననాట్యమండలి దేశంలోనే సాంస్కృతిక రంగానికి 1970ల నుంచి 90ల దాకా ఒక అగ్రగామి పాత్ర నిర్వహిస్తే, ఇవాళ ఆ కర్తవ్యాన్ని దండకారణ్యంలోని చేతనా నాట్యమంచ్ నిర్వహిస్తున్నది.

మౌఖిక, దృశ్య కళారూపాలలో గాయకులు మొదలు, వాద్యకారుల వరకు దళిత, ఆదివాసి, వృత్తి కులాల నుంచి వాళ్లు విప్లవ సాంస్కృతిక కార్యకర్తలుగా మారడం అనేది ప్రత్యామ్నాయ రాజకీయాలు సాధించిన ఒక సాంస్కృతిక విజయం.

విద్యారంగంలో నక్సల్బరీ ప్రతిపాదించిన విప్లవాత్మక ప్రత్యామ్నాయం గురించి ముందే ప్రస్తావించుకున్నాం.

చైనా విప్లవం కాలంలోనే విప్లవంలో మహిళలు నిర్వహించవలసిన పాత్ర గురించి మావో సె టుంగ్ 'వాళ్లు ఆకాశంలో సగం' అన్నాడు. ఇవాళ దండకారణ్యంలో వాళ్లు పోరాటంలో సగమై, ఐక్య సంఘటన, పార్టీ, ప్రజాసంఘాలన్నిటా సమాన భాగం పంచుకొని విప్లవ నిర్మాణం చేస్తున్నారు. దండకారణ్యంలోని త్యాగాల పరంపరలో నిత్యం మనం వింటున్నది మహిళల త్యాగాల గురించే. ఒక రకంగా ఇది నక్సల్బరీ ఒరవడి. గురజాడ అప్పారావు చెప్పిన ఆధునిక స్త్రీ రేపటి చరిత్రను రచిస్తుందనేది మన వ్యవస్థ స్వభావ, స్వరూప సందర్భంలో నక్సల్బరీ, ఆదివాసి మహిళ ఒక నూతన ప్రజాస్వామిక చైతన్యంతో, తన నెత్తుటి త్యాగాల చాలుతో ఇవాళ దేశవ్యాప్తంగా విప్లవోద్యమంలో భాగమైంది. దండకారణ్య క్రాంతికారీ మహిళా సంఘటన్‌లో ఇవాళ దేశంలోని ఏ మహిళా సంఘంలో లేనంతగా ఒక లక్ష మంది సభ్యత్వం ఉన్నారు.

బయట ఏ మహిళా సంఘానికి, సాంస్కృతిక సంఘానికి సాధ్యం కాని చరిత్ర నిర్మాణం మాత్రమే కాదు, చరిత్ర రచన కూడా చేతనా నాట్యమంచ్‌కు, దండకారణ్య క్రాంతికారి మహిళా సంఘటన్‌కు సాధ్యం కావడమే ఇందుకు నిదర్శనం. ఇతర సంఘాలకు సాధ్యం కాకపోవడానికి కారణాలు ఏమైనా కావచ్చు. విప్లవ క్రమశిక్షణ వల్ల ఈ రెండు సంఘాలు కూడా దండకారణ్య విప్లవోద్యమం యవ్వన ప్రాయంలో ప్రవేశించిన ముప్పై ఏళ్లకు తమ చరిత్రను ప్రకటించుకున్నవి. అవి పునర్ముద్రణను పొందినవి. ఇతర భాషల్లోకి అనువాదం అవుతున్నవి.

భాషా శాస్త్రజ్ఞులు కాడ్వెల్ నాటికి, భద్రిరాజు కృష్ణమూర్తి, చేకూరి రామారావు నాటికి ఒక కొలిక్కి తెచ్చిన చర్చలు విప్లవోద్యమ క్రమం మరింత ముందుకు తీసుకువెళ్లి ఇవాళ గోండు, కోయ జాతుల మూల భాష అయిన కోందు భాష ఆదివాసి భాష ద్రవిడ భాషల మూల రూపమనే చర్చను ప్రతిపాదిస్తున్నది. ఆఫ్రికాలో స్వాహిలీ, గికుయు వంటి భాషల గురించి సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు లేవనెత్తిన చర్చల వంటివే ఇవాళ ఆదివాసి భాషల గురించి దండకారణ్య నేపథ్యంలో మన దగ్గర జరుగుతున్నవి.

కార్మికవర్గ నాయకత్వంలో రైతాంగ పోరాటం తరువాత నక్సల్బరీ పంథా అయినా, దానిని కొనసాగించడానికి ఏర్పడిన విప్లవ పార్టీ అయినా ప్రాధాన్యం ఇచ్చిన అంశం దేశంలోని జాతుల సమస్య.

భారతదేశంగా మనం పిలుచుకుంటున్నది వాస్తవానికి భారత ఉపఖండం. ఇది బ్రిటిష్ ఇండియా ఏర్పడే వరకు కూడా ఎన్నడూ ఒక పరిపాలన కింద లేదు. చక్రవర్తులుగా పేరుపడిన అశోకుడు, అక్బర్‌లు కూడా వింధ్యాచలాలు దాటి దక్షిణ భారతానికి రాలేదు. వచ్చి గోల్కొండ గెలిచిన ఔరంగజేబు నియమించిన సుబేదార్ తరువాత స్వతంత్రత ప్రకటించుకున్నాడు. బ్రిటిష్ ఇండియా వెలుపల హైదరాబాద్ వంటి పెద్ద సంస్థానం మొదలుకొని జునాఘడ్ వంటి చిన్న సంస్థానాలు ఐదు వందలు ఉండేవి. దేశం అనే భావనను, జాతి అనే భావనను ప్రచారంలో పెట్టింది వలస పాలనయే. పెట్టుబడిదారీ విధానం వల్ల యూరప్‌లో జాతులే దేశాలుగా ఏర్పడిన నేపథ్యం నుంచి వచ్చిన అవగాహన అది.

వాస్తవానికి అంతకన్న ముందు మనం జాతులు అని ఈ దేశంలో పిలుచుకుంటున్నవన్నీ చెప్పన్నారు దేశాలు.

వలస పాలనలో మన రాజకీయ నాయకత్వమంతా వలస విద్యా విధాన ఆలోచనలతో రూపొందిందే గనుక ఈ జాతి, భాష ప్రాతిపదికగనే 1936 నుంచి భాషా రాష్ట్రాల ప్రస్తావన తెస్తూనే మరొకవైపు భారతజాతి అనే ఒక కృత్రిమ భావవాదాన్ని వలస వ్యతిరేక పోరాటం కోసం ప్రచారం చేసింది. 1967 నాటికి భాషా రాష్ట్రాలు ఏర్పడినవి గనుక, అవి జాతి, భాష ప్రాతిపదికనే ఇంచుమించు ఏర్పడినవి గనుక అప్పటికి ఉన్న స్థితి గురించి ఎం.ఎల్. పార్టీ విశ్లేషించింది. ఈ దేశం జాతుల బందిఖానాగా మారిందని నిర్వచించింది. దీనిని ఒక నందనోద్యానంగా మార్చాలని పిలుపు ఇచ్చింది.

అయితే కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల వంటి జాతులు ఎన్నడూ భారత ఉపఖండంలో భాగం కాకపోవడమే కాకుండా ఎన్నడూ ఢిల్లీ పాలన కింద లేవు కనుక వాటి స్వయం నిర్ణయాధికార హక్కును గుర్తించింది.

ఆదివాసులు కూడా స్వయం ప్రతిపత్తిగల రాజ్యాలతో ఒక కేంద్రీకృత రాజ్యాన్ని, ఒక కేంద్రాన్ని బ్రిటిష్ పాలన మొదలైన తరువాత తమపై రుద్దబడిన మార్కెట్‌ను నిరాకరిస్తూ తమ జల్, జంగల్, జమీన్‌లను వాటితో పాటు తమ స్వయం పాలనను కాపాడుకునే పోరాటాలు ఈస్ట్ ఇండియా పాలన కాలం నుంచే చేస్తున్నాయని గుర్తించింది. ఈశాన్య రాష్ట్రాల్లోనైతే ఇండియన్ యూనియన్ నుంచి విడివడడానికి ఈ పోరాటాలు ఇప్పటికీ సాయుధంగానే కొనసాగుతున్నాయి. ఒక గ్రూప్ కేంద్రానికి లొంగిపోయినా మరొక చిన్న బృందమైనా తమ స్వతంత్రం కోసం ప్రతిఘటించే స్థితిని మనం మణిపూర్ వంటి ప్రాంతాల్లో చూడవచ్చు.

మణిపూర్ ఆదివాసుల పోరాటం పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీ నిర్మాణం చేసుకునే దశకు ఎన్నడో చేరుకున్నది. అక్కడ సైన్యానికి ప్రత్యేక అధికారాలు ఇచ్చే చట్టాన్ని రాజీవ్‌గాంధీ ప్రధానిగా ప్రవేశపెట్టిన నాటి నుంచి అక్కడి మహిళలు ముందు భాగాన నిలిచి వీరోచిత పోరాటాలు

చేశారు. ఆ చట్టాన్ని రద్దు చేయాలని ఇరోం షర్మిలా చేసిన పదహారు సంవత్సరాల నిరాహార దీక్షను కూడా ఒక పోరాట రూపంగా గుర్తించిన మణిపూర్ ప్రజలు అందుకే ఆమె ఎన్నికల దారిని ఎంచుకునే వరకు కేవలం 72 ఓట్లు మాత్రమే వేసి ఆ పద్ధతిని నిరాకరించారు.

నాగాలాండ్ ఉద్యమం అయితే తమదైన ఒక స్వతంత్ర రాజ్యాన్ని సోషలిస్ట్ లక్ష్యంతో ఏర్పరుచుకొని ప్రధాని, సైన్యం వంటి అన్ని హంగులతో నడుపుకొని ఇండియన్ యూనియన్ ప్రధాని వాజ్‌పేయ్ కాలంలో సమాన స్థాయిలో విదేశాల్లో చర్చలు చేశారు.

ఈశాన్య రాష్ట్రాల విషయంలో గాని, కశ్మీర్ విషయంలో గాని ఇవాళ పార్లమెంటరీ రాజకీయాల్లో ఉన్న వాళ్లు ఎన్ని మాటలైనా చెప్పవచ్చు గాని చారిత్రకంగా వాటి స్వయం ప్రతిపత్తిని గుర్తించక తప్పని స్థితికి కేంద్రంలోని ప్రతి ప్రభుత్వం ఇవాల్టికీ నెట్టబడుతున్నది.

కశ్మీర్ విషయంలో నెహ్రూ ప్రభుత్వం ఐక్యరాజ్య సమితి భద్రతా మండలికే స్వయం నిర్ణయాధికారానికి హామీ పడింది. ఆచరణలోనేమో కశ్మీర్‌తో సహా ఈశాన్య రాష్ట్రాలంతటా సైనిక పాలన కొనసాగుతున్నది. మారణకాండ కొనసాగుతున్నది. అణచివేత, దౌర్జన్యం, హింస రచన రీత్యా చూసినప్పటికి కూడా ఇండియన్ యూనియన్ విదేశాల మీద దాడి చేసినంతగా ఈ రాష్ట్రాలలో రాజ్యహింసను అమలు చేస్తున్నది.

బుర్హాన్ వలి ఎన్‌కౌంటర్ కాలం నుంచి శ్రీనగర్ ఎన్నికల దాకా కేంద్రం, సైన్యం అనుసరించిన దమననీతి, ప్రజల ప్రతిఘటన ఆరు శాతం, రెండు శాతం ఓట్లతో, సైనిక ట్యాంకర్‌కు సైన్యం రక్షణ కోసం తాము చిత్రహింసలు పెట్టిన కశ్మీరీ యువకుడి దేహాన్ని కట్టుకొని వీథుల్లో స్వైర విహారం చేసే స్థితిని చూస్తే అక్కడి ప్రజల ఆజాదీ ఆకాంక్ష ఎంత బలమైనదో అర్థమవుతుంది.

సైన్యం నిర్వహిస్తున్న మారణకాండ, అత్యాచారాలు, దౌర్జన్యాలకు నిరసనగా యువకులు చేసిన దాడిలో ఒక సైనికుడు చనిపోతే ఇవాళ దేశమంతా కశ్మీరీ యువకులపై జరుగుతున్న దాడిని చూస్తే ఇండియన్ యూనియన్‌లోని సగటు మానసికత కశ్మీరీ ప్రజల పట్ల వాళ్లు, మనం అనేదే తప్ప మరొకటి కాదు.

1948 నుంచి డెబ్బై సంవత్సరాలుగా సాగుతున్న ఆజాదీ పోరాటానికి నక్సల్బరీ పంథాను అనుసరిస్తున్న విప్లవ పార్టీలు మాత్రమే మద్దతు ప్రకటిస్తున్నాయి.

దేశాలు స్వాతంత్ర్యాన్ని కోరుతాయి. జాతులు విముక్తిని కోరుతాయి. ప్రజలు విప్లవాన్ని కోరుతారు. ఈ మూడు సందర్భాల్లోనూ, దశల్లోనూ కార్మికవర్గం నాయకత్వం వహించినప్పుడు అవి దశల వారీగా విప్లవోద్యమంలో భాగమవుతాయని మావో సె టుంగ్ చేసిన పరిశీలనయే నక్సల్బరీ పంథాకు గీటురాయి. వియత్నాం పోరాటం అందుకు ఒక చక్కటి ఉదాహరణ. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం (1946–51), 1971 బంగ్లాదేశ్ పోరాటం అటువంటి గుణాత్మక మార్పులోకి ప్రవేశించకుండా నెహ్రూ, ఇందిరాగాంధీ పోలీసు చర్య పేరుతో, ముక్తి ఫౌజ్ పేరుతో చేసిన సైనిక జోక్యం, దాడి ఫలితాలే అక్కడ ప్రజాస్వామిక విప్లవాలు అసంపూర్ణంగా మిగిలిపోవడం.

1974లో చీలిపోయిన ఎంఎల్ పార్టీలను, ముఖ్యంగా ఎంఎల్ పార్టీ ఏర్పడినప్పుడు కేంద్ర కమిటీలో ఉన్న వాళ్లందరినీ ఒకచోటికి తేవాలనే ప్రయత్నంలో ఆంధ్రప్రదేశ్ పార్టీ నాయకత్వం చొరవతో సిపిఐ (ఎంఎల్) సెంట్రల్ ఆర్గనైజింగ్ కమిటీ ఏర్పడినప్పుడు అందులో కశ్మీర్ నుంచి ష్రాఫ్ చేరాడు. కాని ఆ సిఒసియే ఎక్కువ కాలం మనలేదు.

స్వీయాత్మక శక్తుల కొరత వల్ల కూడా కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల్లో విప్లవ పార్టీల నిర్మాణం నిర్దిష్టంగా ఏర్పడలేదు. అక్కడి జాతివిముక్తి ఉద్యమాలు భూస్వామ్య, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాలుగా నిర్వహించడానికి ఏమేరకైనా ప్రయత్నం చేసే శక్తులకు దోహదం ఇచ్చేవిగానే అక్కడి విప్లవ పార్టీ కార్యాచరణ ఉంటున్నది. జాతి విముక్తి ఉద్యమాలతో సంబంధాలు పెట్టుకునేదిగానే ఉంటున్నది.

1996 ఫిబ్రవరిలో ఢిల్లీలో ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం జాతుల సమస్యపై అంతర్జాతీయ స్థాయిలో నిర్వహించిన సదస్సు, బహిరంగ సభ ఈ ప్రయత్నంలో ఒక బలమైన అడుగు. ఆ సందర్భంలో వచ్చిన పత్రాలన్నీ ఇంగ్లిష్, హిందీ పుస్తక రూపంలో కూడా వచ్చాయి. విప్లవోద్యమాన్ని బలపరిచే ఎఐపిఆర్ఎఫ్, కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల స్వయం నిర్ణయాధికారం కోసం ఉద్యమిస్తున్న శక్తులు, ముఖ్యంగా హురియత్ కలిసి ఒక సమన్వయ కమిటీ కూడా ఏర్పడింది. కాని ఆ తరువాత తగినంత స్వీయాత్మక శక్తులు లేకపోవడం వల్ల అది ముందుకు సాగలేదు.

పీపుల్స్‌వార్ పార్టీగా పార్టీ స్థాయిలో నాగాలాండ్, మణిపూర్‌లలో నిర్మాణం కోసం కృషి చేసి అక్కడి జాతివిముక్తి సాయుధ పోరాటాలు నిర్వహిస్తున్న శక్తులతో సంయుక్త కార్యాచరణ రూపొందించుకున్న దశ కూడా 1990లలో కనిపించింది. కాని తీవ్రమైన రాజ్యహింసతో అది సెట్‌బ్యాక్‌కు గురైంది.

నక్సల్బరీ పంథాలోనే ఇమిడి ఉన్న అంశమేమిటంటే అది ఆచరణలోకి వచ్చిన ప్రాంతాలను, సామాజిక వర్గాలను చూసినప్పుడు గాని, అది పిలుపు ఇచ్చిన ప్రకారం గాని అది సాంఘిక చోదక శక్తిగా, ఆదివాసి, దళిత, అణగారిన వర్గాల విముక్తి మార్గం. నక్సల్బరీ, శ్రీకాకుళం, వైనాడ్ వంటి ఆదివాసి అడవి ప్రాంతాల్లో సాయుధ పోరాటంగా అది ప్రారంభం కావడం, విప్లవ చైతన్యాన్ని ప్రచారం చేయడానికి వెళ్లే విద్యార్థులను, యువకులను దళితుల ఇళ్లల్లోనే ఉండి ప్రచారం చేయాలని చెప్పడం నక్సల్బరీ కాలం నుంచి గ్రామాలకు తరలండి పిలుపు దాకా ఒక కొనసాగింపుగా చూశాం.

ఈ వ్యవస్థను అర్ధవలస, అర్ధ భూస్వామ్యం అని నిర్వచించడంలోనే వెనుకబాటుతనం గురించి కులం, మతంపై అగ్రవర్ణాల, దళారీ వర్గాల పట్టు గురించి చెప్పినట్లయింది. పైగా ఎం.ఎల్. పార్టీ తీర్మానంలో అస్పృశ్యత ప్రస్తావన ఉన్నది.

భౌతిక వాస్తవికత కూడా నక్సల్బరీ విప్లవం ప్రారంభమైన కాలంలోనే దక్షిణాన మద్రాస్ రాష్ట్రంలో కిలవేన్మణి ప్రాంతంలో దళితుల దహనకాండ జరిగింది. నలభై దళితుల గుడిసెలను అగ్రవర్ణాలు బయటి నుంచి గొళ్లాలు పెట్టి తగులబెట్టారు. ఆ గుడిసెల్లోని దళిత కుటుంబాలన్నీ సజీవ దహనానికి గురయ్యాయి. అగ్రవర్ణాలు అంత బీభత్సంగా వ్యవహరిస్తాయని నమ్మలేకపోతున్నామని న్యాయవ్యవస్థ వాళ్లను నిర్దోషులుగా తీర్పు చెప్పింది. దళిత శ్రేణులు ఎక్కువగా కలిగిన విప్లవ పార్టీ ఆ అగ్రవర్ణాలపై చర్య తీసుకొని శిక్ష విధించింది. ఇందిరా పార్థసారథి, మీనా కందసామి ఈ ఘటన మీద నవలు రాశారు.

అడవిలో ఆదివాసులు గాని, మైదాన ప్రాంతంలో దళితులు గాని భూస్వాధీనం కోసం చేసే పోరాటాలు భూస్వామ్య వర్గాలకు వ్యతిరేకంగా చేస్తున్నాయంటే అగ్రవర్ణాలకు వ్యతిరేకంగా చేస్తున్నాయని అర్థం. అయితే తొలిరోజుల్లో వ్యవసాయ కూలీలుగా, భూమిలేని నిరుపేదలుగా దళితుల గురించి విప్లవోద్యమ రాజకీయ పత్రాల్లోనూ, కార్యక్రమాల్లోనూ ఉన్నంత ప్రస్తావన దళితులుగానూ, సాంఘికంగా స్వీయ గౌరవం కోరుకుంటున్న అంటరానివారుగానూ లేకపోవడం ఒక లోపం.

రాజకీయార్థిక పరిభాషలో దళితులను వ్యవసాయ కూలీలుగా, భూమిలేని నిరుపేదలుగా విశ్లేషించి వర్గపోరాటంలోకి తెచ్చినంతగా బ్రాహ్మణీయ హిందూ వ్యవస్థ వివక్షతో అంటరానివారుగా, స్వీయ గౌరవం కోసం పోరాడుతున్న వారుగా చూడకపోవడం ఒక లోపం.

క్షేత్రస్థాయిలో వాస్తవమేమిటంటే గ్రామాల్లో భూపోరాటమంతా పెత్తందారీ అగ్రవర్ణాలతోటే జరుగుతున్నది. ఆంధ్రప్రదేశ్ వంటి చోట్ల అది రెడ్డి, కమ్మ, వెలమ, బ్రాహ్మణ, వైశ్య వంటి అగ్రకులాలకు వ్యతిరేకంగా. భూమిగాని, ఆస్తిగాని ఎక్కువగా భూస్వామ్య వర్గాలుగా వాళ్ల చేతుల్లోనే ఉన్నది.

ఉపరితల అంశాల్లోకి వస్తే ఈ అగ్రవర్ణాల వారి పిల్లలందరూ విద్యాలయాల్లో పాలకవర్గాల పార్టీల విద్యార్థి సంఘాల్లో ఉన్నారు. ముఖ్యంగా అందులో మిలిటెంట్ స్వభావం ఉన్న ఎబివిపిలో ఉన్నారు. దళితుల, ముస్లిం మైనారిటీల, అణగారిన వర్గాల, కులాల పిల్లలందరూ నక్సల్బరీ తరువాత విప్లవ విద్యార్థి సంఘాల్లో ఉన్నారు. నక్సల్బరీకి సమాంతరంగా ఈ రెండు విద్యార్థి వర్గాల మధ్యన భావఘర్షణలు, భౌతిక ఘర్షణలు అదే స్థాయిలో మొదలయ్యాయి.

ఉస్మానియా యూనివర్సిటీలో జార్జిరెడ్డి హత్య ఈ ఘర్షణలకు ఒక స్పష్టమైన వ్యక్తీకరణ. వరంగల్ ఆర్ఇసి, కెఎంసిలలో సూరపనేని జనార్దన్, మురళీమోహన్, ఆనందరావు వంటి వాళ్లు అటువంటి పోరాటాలు ప్రారంభించారు. ఇంక ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత జగిత్యాల, సిరిసిల్ల పోరాటాలు క్షేత్రస్థాయిలోను, విద్యా, సాంస్కృతిక రంగాల్లోను స్పష్టంగా ఇందులో ఇమిడి ఉన్న వర్గ, కుల ఘర్షణను ముందుకు తెచ్చాయి. ఇది సాంస్కృతిక పరంగా ఎంతో ఎక్కువగా ప్రతిఫలించిన వ్యక్తీకరణయే 'ఊరు మనదిరా, వాడ మనదిరా' పాట. 'కాళ్లకింది మట్టి కంట్లో ఎగసి పడిందనే మాట. ఏ ఇంట్లో కోడి కూసినా దొర ఇంట్లోనే తెగాలి వంటి భావగర్భితమైన దోపిడీ, అత్యాచారాల గురించిన వ్యక్తీకరణ. వీటికి వ్యతిరేకంగానే అశేష పీడిత వర్గాలు కదిలాయి.

రాడికల్ విద్యార్థి సంఘం, రాడికల్ యువజన సంఘం, రైతు కూలీ సంఘం, జననాట్యమండలి వంటివి ఇటువంటి స్వీయ గౌరవ పోరాటాలను, కుల నిర్మూలన పోరాటాలను వర్గ పోరాటంలో భాగంగా 1985 వరకు అపూర్వంగా నిర్వహించాయి. లోపం ఎక్కడ జరిగిందంటే ఈ పోరాట ఆచరణనంతా ఒక రాజకీయార్థిక పోరాటంగా తప్ప సాంఘిక, సాంస్కృతిక పోరాటంగా సైద్ధాంతీకరించక (కాన్సెప్చువలైజ్ చేయక) పోవడంలో ఉంది.

ఆ అవసరమే కావచ్చు, అవకాశమే కావచ్చు కారంచేడు కల్పించింది. కారంచేడు దళితులపై అగ్రవర్ణాల దాడి, మారణకాండ దళితుల స్వీయ గౌరవ పోరాటాన్ని ముందుకు తెచ్చింది. పీపుల్స్‌వార్ పార్టీ నాయకత్వంలో ఈ అగ్రవర్ణాల దాడిని దళితులు మిలిటెంట్‌గా ఎదుర్కొని హంతకునిపై చర్య తీసుకొని శిక్షించారు. కిలవేన్మణి నుంచి కారంచేడు ఒక గుణాత్మక దశకు చేరుకున్నది.

సరిగ్గా ఇదే కాలం విప్లవోద్యమంలో జెండర్ సమస్య కూడా వచ్చింది. 1980ల ఆరంభంలో ఐక్యరాజ్య సమితి 80వ దశాబ్దాన్ని జెండర్ దశాబ్దంగా ప్రకటించింది. 1980 పీపుల్స్‌వార్ ఏర్పడి ప్రజాయుద్ధానికి పిలుపు ఇచ్చి దండకారణ్యంలో ప్రవేశించిన కాలం. ప్రజాపంథా చేపట్టి మిలిటెంట్ ప్రజా ఉద్యమాలు నిర్మించిన కాలం. 1985 నాటికి దానిపై తీవ్రమైన నిర్బంధం వచ్చింది. కేంద్రంలోని రాజీవ్‌గాంధీ ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్‌లో ఎన్‌టిఆర్ ప్రభుత్వం అమలు చేసిన రాజ్యహింస గురించి చాలా సందర్భాల్లో చెప్పుకున్నాం. ఇక్కడ చెప్పుకోవలసిందల్లా ఇది 1991లో బయటపడిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణలకు డ్రెస్ రిహార్సల్ జరిగిన కాలం. ఇటువంటి ప్రయత్నం ఒకటి ప్రపంచబ్యాంక్ ఎమర్జెన్సీ కాలంలోనే చేసింది. 1984 నుంచి మాత్రం దానికి కొనసాగించే అవకాశం వచ్చింది.

ఇంద్రవెల్లి మారణకాండ తరువాత విప్లవోద్యమం అడవిలో విస్తరించే కాలంలో తునికాకు పోరాటం ఒక విశాల ప్రజాపోరాటంగా అడవి, మైదానాలను కలిపింది. తునికాకు ఏరడం నుంచి బీడీలు చేసే దాకా ఆదివాసులు, మైదాన ప్రాంత బడుగు వర్గాలు కుటుంబాలుగా ఈ పోరాటంలో పాల్గొన్నాయి. కుటుంబాలు అన్నప్పుడు ఎక్కువగా స్త్రీలు, పిల్లలు. అట్లాగే భూపోరాటంలో వ్యవసాయ కూలీలన్నప్పుడు ఎక్కువగా దళిత స్త్రీలు, పిల్లలు. కనుక దళిత, బడుగువర్గాల కుటుంబాలు ఆశ్రయం ఇచ్చే వాళ్లుగా మాత్రమే కాకుండా పోరాట భాగస్వాములు అయ్యారు. అంతర్గతంగా విప్లవోద్యమం జెండర్ సమస్యను ఇట్లా ముందుకు తెచ్చింది.

ఎన్‌టిఆర్ బిసి రిజర్వేషన్‌ను 40 శాతానికి పెంచిన సందర్భంగా, తిరిగి మండల్ కమిషన్ సందర్భంగా దళిత ఉద్యమం ఒక అస్తిత్వ ఉద్యమంగా ముందుకు వచ్చింది. 1992లో నిషేధానికి గురయ్యే దాకా పీపుల్స్‌వార్ గాని, నేరుగా పీపుల్స్‌వార్ కార్యక్రమాన్ని ప్రచారం చేసి, బహిరంగంగా ఆచరించే ప్రజాసంఘాలుగా ఆర్ఎస్‌యు, ఆర్‌వైఎల్, రైతుకూలీ సంఘం, సికాస గాని నిషేధానికి గురయ్యే దాకా ఇటువంటి స్వీయగౌరవ, అస్తిత్వ పోరాటాలన్నీ వర్గపోరాటంలో భాగంగానే జరిగాయి.

1985 నుంచి 89 దాకా అప్రకటిత నిషేధానికి గురైన విప్లవ ప్రజాసంఘాలు 1991 సామ్రాజ్యవాద ప్రపంచీకరణ, 1992 బాబ్రీ మసీదు విధ్వంసంతో పాటు వచ్చిన నిషేధంతో బహిరంగంగా ప్రజల మధ్య పారదర్శకంగా పనిచేయలేని స్థితి వచ్చింది.

సరిగ్గా ఇదే కాలంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అస్తిత్వ ఉద్యమాలను, ముఖ్యంగా దళిత ఉద్యమాన్ని విప్లవోద్యమానికి కేటాగా నిర్వహించే శక్తులకు దోహదం చేసింది. చుండూరు మారణకాండ తరువాత కారంచేడు వంటి చొరవ విప్లవోద్యమానికి సాధ్యం కాని స్థితిని రాజ్యం కల్పించగలిగింది. చుండూరు మారణకాండపై ప్రత్యేక కోర్టు ఏర్పడి నేరస్తులకు శిక్ష పడిన స్థితి నుంచి హైకోర్టు వాళ్లను వదిలి పెట్టిన కాలానికి ఈ పరిణామ క్రమాన్ని చూస్తే ఇదొక విషాదం. ఇటు విప్లవోద్యమం, అటు దళిత అస్తిత్వ ఉద్యమాలు స్వీయ విమర్శ చేసుకోవలసిన విషాదం.

విప్లవోద్యమం అస్తిత్వ ఉద్యమాలను, ముఖ్యంగా దళిత ఉద్యమాన్ని అస్పృశ్యతకు వ్యతిరేకంగా, స్వీయగౌరవానికి వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమంగా గుర్తించి, గౌరవించి విప్లవోద్యమంలో ఒక క్రియాశీలమైన నినాదంగా, కార్యాచరణగా మార్చుడం జరగాల్సి ఉన్నది. దళిత అస్తిత్వ ఉద్యమం భూస్వాధీన పోరాటాలు, కార్పొరేట్ శక్తులను ఎదుర్కొనే పోరాటాలు మిలిటెంట్‌గా చేపట్టాల్సి ఉన్నది.

దళితులకు రాజ్యాధికారం ఓటు ద్వారానే సిద్ధిస్తుందనే భ్రమ నుంచి వర్గ పోరాటంలో భాగంగానే కుల నిర్మూలన పోరాటాలు నిర్వహించబడాల్సి ఉంటుందని, అందుకు ప్రాతిపదిక స్వీయగౌరవంతో పాటు భూస్వాధీన పోరాటం కావాలని గ్రహించాల్సి ఉంటుంది. దళితులు మాత్రమే కాకుండా ముస్లింలు కూడా ఆ వాస్తవాన్ని గుర్తిస్తున్న సందర్భం ఉనా సంఘటనతో ఏర్పడింది.

ఒక విధంగా ఉనా సంఘటన, లేదా మోడీ అధికారంలోకి వచ్చినప్పటి నుంచి అఖ్లాఖ్ హత్యతో మొదలై గోవధ, గొడ్డు మాంసం తినడం అనే పేరుతో ముస్లింలతో మొదలై, దళితులపై సంఘ్ పరివార్ శక్తులు సాగిస్తున్న మారణకాండ వీళ్లను ఏకం చేస్తూ, స్వీయగౌరవంతో పాటు భూస్వాధీన పోరాట గుర్తింపును ముందుకు తెచ్చింది.

ఈ గుర్తింపు భూస్వామ్య, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో విప్లవోద్యమంలో సంలీనం అయి దళితుల స్వీయ గౌరవ, అంటరానితనానికి వ్యతిరేకంగా వర్గపోరాటంలో భాగంగా కొనసాగాల్సి ఉందనే అవగాహన దృఢం కావడానికి దోహదం చేయాలి. ఆ కృషి ఇరువైపులా సాగాలి.

ముస్లిం, మైనారిటీలను విప్లవోద్యమంలో భాగం చేయడంలో నక్సల్బరీ పంథా ఈ యాభై ఏళ్ల కాలంలోను చేయవలసినంత చేయలేదనేది స్వీయ విమర్శ చేసుకోవాల్సిన అంశం. బాబ్రీ మసీదు విధ్వంసం, గుజరాత్ మారణకాండ సందర్భంగా బాధిత ముస్లిం సమాజానికి విప్లవ పార్టీలు గాని, వాటి ప్రజాసంఘాలు గాని ఎంత అండగా నిలబడినప్పటికీ వారిని తమలో సంలీనం చేసుకోలేకపోయాయి. బాధితులుగా ముస్లింలు విప్లవోద్యమాన్ని సేవియర్ (రక్షకులు)గానే చూశారు గాని అందులో భాగం కాలేకపోయారు.

మైనారిటీ మతానికి ఉండే ఒక అభద్రతా భావం, దేశంలో రెండో పౌరులుగా చూడబడుతుండడం వల్ల ఏర్పడే ఒక ముడుచుకునే స్వభావం, మత విశ్వాసాలు ఇందుకు కారణమైనా అవిభక్త కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిన కాలంలో విశేషంగా ముస్లింల విశ్వాసాన్ని చూరగొన్న స్థితి నుంచి విప్లవ పార్టీ నిర్మాణ కాలానికి కారణాలేమైనా బలహీనపడడమే కనిపిస్తున్నది.

ముస్లిం మత నాయకత్వం పేద ముస్లిం ప్రజలను, శ్రేణులను తమ గుప్పిటలో ఉంచుకునే ప్రయత్నం చేస్తున్నది. అశేష ముస్లిం ప్రజానీకానికి క్యాపిటలిజం ఎంత శత్రువో కమ్యూనిజం అంత శత్రువు అని చెప్తూ ఇస్లాం మాత్రమే విముక్తి మార్గమని చెప్తున్నది. ముస్లిం యువత అందుకే అటువంటి మిలిటెన్సీకి, ఇస్లాం రాజ్యానికి ఆకర్షింపబడినంతగా తమను విముక్తి చేయగల విప్లవోద్యమం వైపు ఆకర్షింపబడడం లేదు.

క్షేత్రస్థాయి వాస్తవం ఏమిటంటే ప్రపంచవ్యాప్తంగా చమురు, ప్రకృతి సంపదలు కలిగినందు వల్ల ఆదివాసుల తరువాత సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు ఇస్లాం మతస్తులుగా భావించబడుతున్న ముస్లిం దేశాల ప్రజలే. సహస్ర వృత్తుల, సమస్త చిహ్నాలతో శరీర శ్రమలో పాల్గొనే పీడిత, పోరాట ప్రజలుగా కూడా ముస్లింలు బలమైన సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు. ముఖ్యంగా ఈ అనుకూలాంశం వల్ల విప్లవోద్యమం వీళ్లను నిర్మాణంలోకి తెచ్చే విషయంలో కేంద్రీకరించాల్సి ఉంది. 1990వ దశకం ఆరంభంలో తప్ప అటువంటి కృషి జరగలేదు.

2007లో మావోయిస్టు పార్టీ ఐక్య కాంగ్రెస్‌లో ప్రజల ముందు ఉంచిన రెండు మిలిటెంట్ కార్యక్రమాల్లో సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ప్రతిఘటించడం అనే మొదటి కార్యక్రమంతో పాటు, బ్రాహ్మణీయ హిందుత్వ శక్తులను ప్రతిఘటించాలన్న రెండో కార్యక్రమం ఇంకా ఆచరణ రూపానికి రావాల్సే ఉన్నది.

ట్రంప్, మోడీ అధికారంలోకి వచ్చిన తరువాత అటు సామ్రాజ్యవాద ఫాసిజాన్ని, ఇటు బ్రాహ్మణీయ హిందు ఫాసిజాన్ని విశ్లేషించి, నిర్వచించిన మావోయిస్టు పార్టీ దేశంలో అధికారంలో ఉన్న బ్రాహ్మణీయ హిందు ఫాసిజాన్ని మిలిటెంట్‌గా ప్రతిఘటించే ఒక కార్యక్రమాన్ని చేపట్టాల్సే ఉన్నది.

కారణాలు ఎన్ని ఉన్నా ఈ స్వీయాత్మక ఆకాంక్షకు పెద్ద ప్రతిబంధకంగా ఉన్నది మాత్రం విప్లవ నిర్మాణ కార్యాచరణను బహిరంగంగా, పారదర్శకంగా చేపట్టే విప్లవ ప్రజాసంఘాలు లేకపోవడమే. నక్సల్బరీ, శ్రీకాకుళాలు సెట్‌బ్యాక్‌కు గురైన కాలంలో విరసం, జననాట్యమండలి మొదలు 1980లలో ఎఐఎల్ఆర్‌సి, ఎఐపిఆర్ఎఫ్‌లు దేశవ్యాప్తంగా నిర్వహించగలిగిన కనీస కర్తవ్యాలను ఇవాళ నిర్వహించడానికి ఒక విప్లవ ప్రజాసంఘం కూడా లేదు.

రెండు రాష్ట్రాల్లో విరసం, దేశవ్యాప్తంగా ఉండీ లేని ఆర్‌డిఎఫ్ తప్ప ఇవాళ నేరుగా, ప్రత్యక్షంగా ప్రాపంచిక దృక్పథ ప్రచారాన్ని, ప్రజాయుద్ధ ప్రచారాన్ని చేసే ఒక విప్లవ ప్రజాసంఘం లేకపోవడమే ఒక కొరత.

ప్రత్యామ్నాయ రాజకీయం తాను వచ్చిన కులాన్ని, మతాన్ని, వర్గాన్ని రద్దుచేసుకొని, సాంఘిక వ్యక్తిత్వాన్ని రద్దుచేసుకొని విప్లవ సమష్టిలో భాగమైన నూతన స్వరూపాన్ని సంతరించుకుని విప్లవమే చిరునామాగా మారింది. విప్లవంలో కొనసాగినంత కాలం అంతర్ బాహిర్ యుద్ధాన్ని నిర్వహిస్తూనే విప్లవకారులుగా ఈ లక్ష్యం కోసం నక్సల్బరీ కాలం నుంచి ఈ యాభై ఏళ్ల కాలంలో ఎందరు అమరులయ్యారో. అట్లా అమరులు అయినప్పుడు మాత్రమే వాళ్లు మళ్లీ తమ ఊరు, పేరులతో నలుగురికి తెలుస్తున్నారు, గుర్తింపబడుతున్నారు. అంటే విలువలు, జీవనశైలి, ప్రజల్లో మమైక్యం కావడం, ఈ రాజకీయ లక్ష్యం కోసం అన్నిటికంటే విలువైన ప్రాణాలు ఇవ్వడం అనేది నక్సల్బరీ పంథా నెలకొల్పిన ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ సంస్కృతి.

ఈ రాజకీయ క్రమం బయట ఉండే బూర్జువా రాజకీయ జీవనశైలికి పూర్తిగా భిన్నమైనది. వృత్తి విప్లవకారులందరు అజ్ఞాత జీవితంలో ఉండడం పార్టీ నాయకత్వం పూర్తిగా ప్రజల్లోను, బేస్ ఏరియాల నిర్మాణం దృష్ట్యా అడవిలోను ఉండడం ఒక నియమంగా అమలవుతున్నది. అంటే, వ్యక్తిగత ఆస్తి రద్దు చేసుకొని, వ్యక్తిగత గుర్తింపు రద్దు చేసుకొని, ఊరు, పేరు, ఆవాసం అన్ని మార్చుకొని నుదుటిపై మరణశాసనం రాసుకొని ప్రజల కోసం విప్లవంలోకి దూకడం అనే ఒక కఠిన నియమాన్ని విప్లవకారులు అనుసరిస్తున్నారు. ఇది ఇవాళ ఎన్నికల రాజకీయాల జీవనశైలికి పూర్తి భిన్నమైన ప్రజా ప్రత్యామ్నాయం. ఎన్నికల రాజకీయాలు ఒక పంచాయితీ స్థాయి నుంచి పార్లమెంట్ స్థాయి వరకు ఆస్తి సంచయంగా మారినవి. అవినీతిగా మారినవి. ఆశ్రిత పక్షపాతంగా మారినవి. అక్రమంగా మారినవి. హింస, దౌర్జన్యం, పెత్తనంగా మారినవి. ఒక్కమాటలో ఆధిపత్య భావజాలంగా మారినవి.

అందుకే చారు మజుందార్ ఇది త్యాగాల, బలిదానాల యుగం అన్నాడు. శత్రువు కూడా ఈ విలువ ప్రమాణంగా నక్సల్బరీ రాజకీయాల గురించి మాట్లాడేవారిని, ఆ రాజకీయాలు ఆచరించేవారిని విమర్శించే స్థితి ఉండడమనేదే నక్సల్బరీ రాజకీయాలకు ఉన్న ఒక ప్రాసంగికత. ఒకప్పుడు ఒక కమ్యూనిస్టును సమాజంలో ఒక ప్రత్యేకమైన వ్యక్తిగా చూసేవారు. ఇవాళ ఒక మావోయిస్టును అట్లా ఒక ప్రత్యేకమైన వ్యక్తిగా చూస్తున్నారు. ఆ ప్రత్యేకత కనిపించకపోతే అది ఒక లోపంగా చర్చిస్తున్నారు. నక్సల్బరీ నెలకొల్పిన ఒక ఉన్నతమైన ప్రమాణం అది. నూతన మానవావిష్కరణ అనేది నక్సల్బరీ ఆకాంక్ష ఆ నూతన మానవావిష్కరణ అనే ప్రమాణానికి ఏమాత్రం భిన్నంగా ఉన్నా ప్రజలే కాదు శత్రువు కూడా ఒక సాకుగా చూపే ప్రత్యామ్నాయ విలువను నక్సల్బరీ ప్రతిపాదించింది. జనతన సర్కార్ ఆచరణ సందర్భంగాను, చర్చ సందర్భంగాను ఈ నూతన మానవావిష్కరణ నూతన ప్రజాస్వామిక విప్లవ విలువగా ఇవాళ విస్తృతంగా చర్చలో ఉన్నది.

ఎన్నో సమస్యలు, ఎన్నో ప్రశ్నలు, ఎన్నో ఆటుపోట్లతోనైనా సరే మానవ జీవన పార్శ్వంలోని ప్రతి అంశాన్ని స్పృశిస్తూ, సమాజంలోని సకల రుగ్మతలకు ఒక శాస్త్రీయమైన శస్త్ర చికిత్సగా నక్సల్బరీ ప్రతిపాదించిన ప్రత్యామ్నాయ రాజకీయ పంథా ఇవాళ దేశవ్యాప్తంగా ఎంత బీజరూపంలోనైనా సరే పాదాల కింద నలుగుతూ తలెత్తుతున్న గడ్డిపేళ్లు చిగురిస్తున్న నూతన అంకురాల వలె, మరణిస్తున్న విత్తనం హామీ పడుతున్న నూతన సృష్టి వలె పునర్నవిస్తూనే ఉన్నది.

*(రచయిత విరసం వ్యవస్థాపక సభ్యులు)* వీ

# కార్ల్ మార్క్స్ కాపిటల్‌కు నూటయాభై ఏళ్లు

**వ్యవస్థను అర్థం చేసుకోవడానికీ, మార్చడానికీ కరదీపిక కార్ల్ మార్క్స్ రచన కాపిటల్ మొదటి సంపుటం వెలువడి నూటయాభై ఏళ్లు అయిన సందర్భంగా దాన్ని వివరిస్తున్నారు ఎన్. వేణుగోపాల్**

ప్రచురణ కథ

కార్ల్ మార్క్స్ రచన కాపిటల్ వెలువడి ఈ సంవత్సరం సెప్టెంబర్‌కు సరిగ్గా నూట యాభై ఏళ్లు. అంతకు ముందు ఇరవై ఐదు సంవత్సరాలుగా కార్ల్ మార్క్స్ (1818-1883) తన భావాలు ప్రకటిస్తూ, ఆ భావాలను ఆచరణలోకి అనువదిస్తూ ఉన్నప్పటికీ, ఆయన సిద్ధాంతాల సంఘటిత, సమగ్ర, సారాంశ రూపమైన కాపిటల్ గ్రంథం మొదటి సంపుటం వెలువడింది మాత్రం, ఆయన 49వ ఏట, 1867లోనే. జర్మన్ భాషలో కార్ల్ మార్క్స్ రచన దాస్ కాపిటల్ మొదటి సంపుటం తొలి కూర్పు తొలి ముద్రణ వెయ్యి కాపీలు అచ్చయి హాంబర్గ్ లోని ముద్రణాలయం నుంచి 1867 సెప్టెంబర్ 14న విడుదలై, యూరప్ లోని అన్ని దేశాలకూ చేరింది. ప్రచురణకర్త వెర్లాగ్‌వాన్ ఆటో మీస్నర్‌కు న్యూయార్క్‌లో కూడ కార్యాలయం ఉండడంతో ఆ జర్మన్ ప్రతి అమెరికాకు కూడ చేరింది. మిగిలిన ఖండాలకూ దేశాలకూ చేరడానికి మరికొంత కాలం పట్టి ఉండవచ్చు. మొదటి సంపుటం తర్వాత మార్క్స్ పదహారు సంవత్సరాలు జీవించి ఉన్నప్పటికీ మిగిలిన సంపుటాలు ఆయన స్వయంగా అచ్చుకు పంపించడం కుదరలేదు. కాకపోతే రెండో సంపుటం, మూడో సంపుటం మార్క్స్ జీవించి ఉన్నప్పుడే ఆయన చేతులలోనే దాదాపుగా పూర్తి అయ్యాయి.



Das Kapital.

Kritik der politischen Oekonomie.

Karl Marx.

Erster Band

మొదటి సంపుటం వెలువడడానికీ, మరణానికీ మధ్య కాలంలో మార్క్స్ ఆ మొదటి సంపుటంలో కూడ ఎన్నో మార్పులు, చేర్పులు చేస్తూ వచ్చాడు. అలా ఆయన జీవితకాలంలో జర్మన్ రెండో కూర్పు 1873లో వెలువడగా, మూడో కూర్పు ఆయన మరణం తర్వాత ఎనిమిది నెలలకు 1883లో వెలువడింది. మార్క్స్ జీవితకాలంలోనే రష్యన్ (ఏప్రిల్ 1872), ఫ్రెంచి (సెప్టెంబర్ 1872) అనువాదాలు వెలువడ్డాయి. ఇంగ్లిష్, పోలిష్ తదితర భాషల్లోకి అనువాద ప్రయత్నాలు మొదలయ్యాయి. అనువాదకులతో, ప్రచురణకర్తలతో మార్క్స్, ఎంగెల్స్‌ల ఉత్తర ప్రత్యుత్తరాలు, వెలువడిన రెండు అనువాదాల ప్రచురణలు, పంపిణీ ఎదుర్కొన్న ఇబ్బందులు వాటికవిగా అధ్యయనం చేయదగినంత ఆసక్తికరమైనవి. వీటిలో ఫ్రెంచి అనువాదం మొత్తాన్నీ స్వయంగా మార్క్స్ సరిచూశాడు. అందులో భాగంగా తన జర్మన్ మూలంలో లేని అదనపు వివరణలు కూడ చేర్చాడు.

మార్క్స్ 1883లో మరణించిన తర్వాత, కాపిటల్ లో మిగిలిన రెండు సంపుటాలకు ఆయన చిరకాల మిత్రుడు, సహవాసి ఫ్రెడరిక్ ఎంగెల్స్ (1820 - 1895) సంపాదకత్వం వహించి రెండో సంపుటం 1885లో, మూడో సంపుటం 1894లో ప్రచురించాడు. మార్క్స్, ఎంగెల్స్‌ల మిత్రుడు శామ్యూల్ మూర్, మార్క్స్ కూతురు ఎలియనార్ సహచరుడు ఎడ్వర్డ్ అవెలింగ్‌లు మొదటి సంపుటాన్ని ఇంగ్లిష్‌లోకి అనువదించగా ఎంగెల్స్ దాన్ని సరిచూసి ముందుమాట రాసి 1887లో ప్రచురించాడు. మొదటి సంపుటానికి జర్మన్ లో నాలుగో కూర్పును కూడ తయారుచేశాడు. కాని కాపిటల్‌కు నాలుగో సంపుటంగా, లేదా స్వతంత్రమైన గ్రంథంగా ఉన్న 'థియరీస్ ఆఫ్ సర్ ప్లస్ వాల్యూ'ను ఎంగెల్స్ కూడ అచ్చుకు సిద్ధం చేయలేకపోయాడు. అది వెలువడడానికి ఎంగెల్స్ మరణించాక పది సంవత్సరాలు పట్టింది.

కాపిటల్ మొదటి సంపుటం వెలువడిన 1867 నుంచి ఎంగెల్స్ మరణించిన 1895 వరకు, ఇరవై ఎనిమిది సంవత్సరాలలో మొదటి సంపుటం తొమ్మిది భాషలలో, పదిహేడు కూర్పులలో, ఎనిమిది దేశాలలో అచ్చయింది. ఈ కాలంలోనే రెండో సంపుటం జర్మన్ కూర్పులు రెండు, రష్యన్, డేనిష్ అనువాదాలు, మూడో సంపుటం మొదటి జర్మన్ కూర్పు వెలువడ్డాయి. ఈ అనువాదకులందరితో మార్క్స్, ఎంగెల్స్‌లు జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలలో మూలగ్రంథపు సైద్ధాంతిక అంశాలకూ, అనువాదానికీ సంబంధించిన వివరణలెన్నో ఉన్నాయి.

రష్యన్‌లోకి మిఖయిల్ బకూనిన్ చేసిన అనువాదం ఎందుకూ పనికిరానంత ఘోరంగా ఉన్నదని ఆ తర్వాతి అనువాదకుడు నికొలాయ్ డేనియల్సన్ అన్నాడు. ఫ్రెంచి అనువాదం విషయంలోనైతే మొదటి సంపుటం వెలువడడానికి ఐదు సంవత్సరాల ముందు నుంచే ఫ్రెంచి అనువాదకులను వెతకడానికి మార్క్స్ ప్రయత్నాలు ప్రారంభించాడు. జర్మన్ ప్రతి బైటికి రాగానే ఫ్రెంచిలోకి అనువదిస్తామని ఐదారుగురు అనువాదకులు స్వచ్ఛందంగా ముందుకు వచ్చినప్పటికీ 1872 దాకా ఏదీ కుదరలేదు. అప్పుడు కూడ ముక్కస్య ముక్కార్థ అన్నట్టుగా అనువాదం చేశారని, మార్క్స్ దాన్ని పూర్తిగా దిద్దాడు.

రష్యన్‌లోనూ, ఫ్రెంచిలోనూ మార్క్స్ ఎంగెల్స్‌ల జీవితకాలంలోనే ఐదారుగురు అనువదించడానికి ప్రయత్నించడం, వారి అనువాదాల్లో లోపాలున్నాయనో, వారికి విషయం సరిగా అర్థం కాలేదనో పక్కనపెట్టడం జరిగాయి. రష్యన్‌లోకి చివరికి అనువాదం చేసిన డేనియల్సన్ అనువాదాన్ని కూడ లెనిన్ విమర్శించాడు. డేనియల్సన్ తనను తాను మార్క్స్ సూత్రాల సమర్థకుడిగా భావించు కున్నప్పటికీ ఆయనకు మార్క్స్ ఎంతమాత్రం అర్థం కాలేదని లెనిన్ అన్నాడు.

1885లో జరిగిన ఒక ఇంగ్లిష్ అనువాదాన్ని చూసి ఎంగెల్స్ "మార్క్స్‌ను ఎలా అనువదించగూడదు' అని ఒక వ్యాఖ్య రాయవలసి వచ్చింది. మార్క్స్‌ను సక్రమంగా అనువదించాలంటే అనువాదకులకు తాము అనువదిస్తున్న విషయమూ, భాషలూ తెలిసి ఉండాలని ఎంగెల్స్ అన్నాడు. "ఒక నిజమైన, సత్యసంధత కలిగిన శాస్త్రీయ రచన అంటే ఏమిటో ఈ అనువాదకుడికి ఎంతమాత్రం తెలిసినట్టు లేదు" అనీ, "జర్మన్ అర్థాన్ని ఇంగ్లిష్ అర్థరాహిత్యంగా మార్చడానికి ఇది ఉదాహరణ" అనీ ఎంగెల్స్ అన్నాడు.

దాస్ కాపిటల్ జర్మన్ మూల గ్రంథం మొదటి సంపుటం మొదటిసారి వెయ్యి ప్రతులు మాత్రమే అచ్చు కాగా, మార్క్స్ ఎంగెల్స్‌ల జీవితకాలంలో అచ్చయిన పదిహేడు కూర్పులూ కలిసి యాభైవేల ప్రతులు అచ్చయి ఉంటాయని ఒక అంచనా. కాపిటల్ మీద విశేష పరిశోధన చేసి, శతజయంతి సందర్భంగా ఒక పుస్తకమూ (ఫర్ ఆల్ టైమ్ అండ్ ఆల్ మెన్, ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో, 1969), ఎన్నో వ్యాసాలూ (ఉదాహరణకు, మోహిత్ సేన్, ఎంబి రావుల సంపాదకత్వంలో 1968లో పీపుల్స్ పబ్లిషింగ్ హౌజ్ ప్రచురించిన 'దాస్ కాపిటల్ సెంటెనరీ వాల్యూం' వ్యాససంకలనానికి అనుబంధం - ఫాక్ట్స్ అండ్ డేట్స్ రిగార్డింగ్ దాస్ కాపిటల్) రాసిన ఎ డబ్ల్యు ఉరోయెవా ప్రకారం కాపిటల్ శతజయంతి నాటికి, అంటే 1967 నాటికి కేవలం సోవియట్ యూనియన్‌లోనే ఎన్నో భాషలలో అరవై లక్షల ప్రతులు వెలువడ్డాయి.

సోవియట్ యూనియన్‌లో కాపిటల్ మొదటి మూడు సంపుటాలు, 18 భాషల్లోకి అనువాదమై, 167 కూర్పులలో అచ్చయ్యాయి. కాపిటల్ శతజయంతి సందర్భంగా 1967లో వేసిన లెక్క ప్రకారం అప్పటికి అది 43 భాషల్లోకి అనువాదమై, 220 కూర్పుల్లో, మరెన్నో పునర్ముద్రణలు పొందింది. ప్రస్తుతం మరొక యాభై సంవత్సరాలు గడిచిన తర్వాత ఉరోయెవా చేసినంత విస్తృతమైన, నిశితమైన పరిశోధన ఎవరూ చేసినట్టు లేదు గాని, మరెంతో మంది ప్రచురణకర్తల మరెన్నో ప్రచురణలు, అనువాదాలు, పరిచయాలు, సంక్షిప్తీకరణలతో కనీసం మరొక నలభై లక్షల ప్రతులైనా చలామణీలోకి వచ్చి ఉంటాయి.

1970లలో వియత్నాం, కంపూచియా విజయాలతో సహా ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో దేశాలలో విప్లవోద్యమాలు విస్తరించినప్పుడూ, 2008లో సామ్రాజ్యవాద దేశాలను సంక్షోభం చుట్టుముట్టినప్పుడూ కాపిటల్ అధ్యయనం మీద ఆసక్తి మరొకసారి మరింతగా పెరిగింది. పెంగ్విన్ వంటి బహుళజాతి ప్రచురణసంస్థలతో సహా ఎన్నో దేశాల ప్రచురణకర్త లెందరో కాపిటల్ అనువాదాలను, సంక్షిప్తీకరణలను, పరిచయాలను ప్రచురించారు. ఎంతో మంది కొత్తగా కాపిటల్ అధ్యయనం వైపు మళ్లారు. అందువల్ల మరిన్ని అనువాదాలు, ప్రచురణలు జరిగే ఉంటాయి.

వీటిలో ఇంగ్లిష్ అనువాదాలదే ప్రథమస్థానం కావడం సహజమే. ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా ప్రచారంలో ఉన్న కాపిటల్ ఇంగ్లిష్ అనువాదాలు రెండు. ఒకటి, శామ్యూల్ మూర్, ఎడ్వర్డ్ అవెలింగ్ అనువదించిన, ఎంగెల్స్ సంపాదకత్వం వహించిన మొదటి సంపుటం అనువాదం. దీన్ని మొదటిసారి లండన్‌కు చెందిన స్వాన్ సొన్నెన్షీన్, లౌరీ అండ్ కంపెనీ అనే ప్రచురణకర్త ప్రచురించగా ఎన్నో దేశాలలో ఎందరో ప్రచురణకర్తలు పునర్ముద్రించారు. ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో ఎన్నోసార్లు పునర్ముద్రించింది.

1990లో సోవియట్ యూనియన్ పతనమైన తర్వాత ఈ ప్రచురణ ఆగిపోయింది గాని, వేరువేరు ప్రచురణకర్తలు ఇంకా ఆ గ్రంథాన్ని పునర్ముద్రిస్తూనే ఉన్నారు. సోవియట్ ప్రచురణలో ముందుమాటలు, ఉటంకింపులు, ఉపయుక్త గ్రంథసూచి, వివరణలు, పదసూచి వగైరాలతో కలిపి మొదటి భాగం 768 పేజీలు, రెండో భాగం 552 పేజీలు, మూడో భాగం 948 పేజీలు అంటే మూడు భాగాలూ కలిసి 2268 పేజీలు. రెండో సుప్రసిద్ధ ఇంగ్లిష్ అనువాదం బెన్ ఫౌక్స్ (మొదటి భాగం), డేవిడ్ ఫెర్న్‌బాక్ (రెండో, మూడో భాగాలు) అనువదించిన, పెంగ్విన్ బుక్స్ 1970లలో ప్రచురించిన సంపుటాలు. పెంగ్విన్ ప్రచురణలో మొదటి భాగం 1152 పేజీలు, రెండో భాగం 624 పేజీలు, మూడో భాగం 1088 పేజీలు (మొత్తం 2864 పేజీలు). ఇవి కాక, వివిధ ప్రచురణకర్తలు ప్రచురించిన ఇంగ్లిష్ మొదటి సంపుటం, సంక్షిప్తీకరణలు, పరిచయాలు, వ్యాఖ్యానాలు ఎన్నో ఉన్నాయి. బొమ్మల్లో, కార్టూన్లలో, సమీకరణాల్లో మొదటి సంపుటాన్ని గాని, మొత్తం కాపిటల్‌ను గాని వివరించిన ప్రచురణలూ ఎన్నో ఉన్నాయి. ఇటీవలి కాలంలో మొత్తం కాపిటల్ గ్రంథం ఆన్‌లైన్ కూర్పు, ఆడియో బుక్ (ధ్వనిముద్రణ) కూడ దొరుకుతున్నాయి.

ఇక కాపిటల్ నాలుగో భాగంగా వెలువడిన 'థియరీస్ ఆఫ్ సర్‌ప్లస్ వాల్యూ' అసలు కాపిటల్‌కు మొదటి భాగంగా ఉండవలసిందని భావించే మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్తలు కూడ ఉన్నారు. తనకంటె ముందరి అర్థశాస్త్రవేత్తల అవగాహనలను విమర్శించే క్రమంలో, వారి అభిప్రాయాలను విస్తృతంగా ఉటంకిస్తూ, వాటిమీద వ్యాఖ్యలుగా, విమర్శలుగా, వివరణలుగా తన అభిప్రాయాలు ప్రకటిస్తూ, మార్క్స్ 1861-63ల్లో రాసుకున్న 23 నోట్‌బుక్స్ ఇవి. ఆ కాలంలో ఫొటోకాపీ సౌకర్యం లేదు గనుక మార్క్స్ తాను వివరించదలచుకున్న, విశ్లేషించదలచుకున్న, విమర్శించదలచుకున్న పూర్వ రచయితల భావాలన్నిటినీ తన చేతిరాతలో రాసుకుని, వాటి మీద తన అభిప్రాయాలు, విమర్శలు, విశ్లేషణలు రాశాడు. అలా మార్క్స్ చేతిరాతలో ఉన్న నోట్‌బుక్స్ మీద వరుసగా నోట్‌బుక్ సంఖ్యా, వరుసగా మార్క్స్ వేసిన పేజి నంబర్లు ఉన్నాయి. అలా ఈ థియరీస్ ఆఫ్ సర్‌ప్లస్ వాల్యూ 1472 పుటల్లో ఉంది.

మార్క్స్ చనిపోవడానికి రెండు సంవత్సరాల ముందు పరిచయమైనా, మార్క్స్ ఎంగెల్స్‌ల మిత్రుడుగా, మార్క్సిస్టు సిద్ధాంతకర్తగా సుప్రసిద్ధుడైన చెక్-ఆస్ట్రియన్ తత్వవేత్త కార్ల్ కాట్స్కీ (1854-1938) ఈ థియరీస్ ఆఫ్ సర్ ప్లస్ వాల్యూకు సంపాదకుడుగా ఉంటే బాగుంటుందని ఎంగెల్స్ 1888లో ప్రతిపాదించాడు. కాట్స్కీ సంపాదకత్వంలో థియరీస్ ఆఫ్ సర్‌ప్లస్ వాల్యూ మూడు సంపుటాలుగా 1905-1910 మధ్య వెలువడింది. అయితే మూల రచనలో కాట్స్కీ అనవసరమైన జోక్యం చేసుకున్నాడనీ, మార్క్స్ పెట్టిన శీర్షికలను మార్చాడనీ, వరుస క్రమాన్ని మార్చాడనీ, కొన్ని వాదనలు తీసివేశాడనీ విమర్శలున్నాయి.

చివరికి మార్క్స్ సొంత చేతిరాత నోట్‌బుక్స్ సహాయంతో తూర్పు జర్మనీలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం లెనినిజం సంపూర్ణ, యథాతథ గ్రంథాన్ని జర్మన్‌లో 1959లో ప్రచురించింది. దాన్ని ఇంగ్లిష్‌లోకీ, ఇతర భాషలలోకీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మార్క్సిజం లెనినిజం, మాస్కో అనువదింపజేయగా, ఇంగ్లిష్ అనువాదాన్ని ప్రోగ్రెస్ పబ్లిషర్స్ మూడు భాగాలుగా (మొదటి భాగం అనువాదం ఎమిలీ బరన్స్ - 1963, రెండో భాగం అనువాదకుల పేరు లేదు, సంపాదకులు ఎస్ ర్యజన్‌స్కయా - 1968, మూడో భాగం అనువాదం జాక్ కోహెన్, ఎస్ ర్యజన్‌స్కయా - 1971) వెలువరించింది. ఈ మూడు భాగాలూ కలిసి 1806 పేజీలు (మొదటి భాగం 506 పేజీలు, రెండో భాగం 662 పేజీలు, మూడో భాగం 638

పేజీలు). అంటే మొత్తంగా కాపిటల్ ఆరుసంపుటాలు, నాలుగువేల పేజీలు.

ఇవి కాక మార్క్స్ రాజకీయార్థిక శాస్త్ర రచనలు మరికొన్ని ఉన్నాయి. ఇరవై ఆరేళ్ల యువకుడిగా ప్రవాసంలో పారిస్ లో రాజకీయార్థిక అంశాల గురించి చేసిన తొలి ఆలోచనలు 'ఎకనామిక్ అండ్ ఫిలసాఫిక్ మాన్యుస్క్రిప్ట్స్ ఆఫ్ 1844' అనే పేరుతోనూ, 'పారిస్ మాన్యుస్క్రిప్ట్స్' అనే పేరుతోనూ ఎన్నో ఇంగ్లిష్ అనువాదాలు వెలువడ్డాయి. నిజానికి ఆయనకన్న ముందే ఎంగెల్స్ రాజకీయార్థిక శాస్త్రంలోకి ప్రవేశించాడు. మార్క్స్ సంపాదకుడిగా ఉండిన డాయిష్ ఫ్రాంజోసిష్ జార్బుషర్ అనే పత్రికలో ప్రచురణార్థం ఎంగెల్స్ 1843లో ఔట్‌లైన్స్ ఆఫ్ ఎ క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ అనే వ్యాసం పంపాడు. అది 1844లో అచ్చుకాగా దాదాపు అప్పటినుంచే ఇద్దరి మధ్య స్నేహం, మార్క్స్‌లో రాజకీయార్థికశాస్త్రం మీద ఆసక్తి మొదలయ్యాయి. ఇద్దరూ కలిసి 1847-48ల్లో ఆన్ ది క్వశ్చన్ ఆఫ్ ఫ్రీ ట్రేడ్ అని వ్యాసాలతో, ఉపన్యాసాలతో ఒక చిన్న పుస్తకం ప్రచురించారు.

బ్రస్సెల్స్‌లో 1847లో జర్మన్ వర్కింగ్ మెన్స్ క్లబ్‌లో మార్క్స్ ఇచ్చిన ఉపన్యాసాలు 1849లో 'వేజ్ లేబర్ అండ్ కాపిటల్' పేరుతో పుస్తక రూపంలో వెలువడ్డాయి. మార్క్స్ సుప్రసిద్ధ రచన 'ఎ కాంట్రిబ్యూషన్ టు ఎ క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ' 1859లో వెలువడింది. ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్ మొదటి సమావేశంలో, 1865లో మార్క్స్ ఇచ్చిన ఉపన్యాసం 'వాల్యూ, ప్రైస్ అండ్ ప్రాఫిట్' పేరుతో అచ్చయింది.

అలాగే 1857-58ల్లో మార్క్స్ తన సొంత వివరణ, విశ్లేషణ కోసం ఏడు నోట్‌బుక్స్ నిండా రాసుకున్న గ్రండ్రిస్సె డర్ క్రిటిక్ డర్ పొలిటిషెన్ ఒకానమీ (ఫండమెంటల్స్ ఆఫ్ క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ) అనే కాపిటల్ రచనకు సన్నాహక వ్యాఖ్యల రచన మాస్కోలోని భాండాగారంలో ఉండిపోయి, కొన్ని భాగాలు మాత్రం 1939లో, 1941లో తొలిసారి జర్మన్‌లో వెలుగు చూశాయి. లెనిన్ కూడ చూడని, చదవని మార్క్స్ రచనగా ప్రసిద్ధమైన ఈ గ్రంథం జర్మన్ మూలపు పూర్తి ప్రచురణ 1953లో జరిగింది. దానికి మార్టిన్ నికొలస్ ఇంగ్లిష్ అనువాదం గ్రండ్రిస్సె పేరుతో న్యూలెఫ్ట్ రివ్యూ సహకారంతో పెంగ్విన్ బుక్స్ ప్రచురణగా 1973లో మొదటిసారి వెలువడింది.

కాపిటల్‌తో ఇవన్నీ కలిపితే మార్క్స్ రాజకీయార్థశాస్త్ర రచనలు ఐదువేల పేజీలు దాటుతాయి. నిజానికి ఈ రాజకీయార్థ శాస్త్ర రచనలు మాత్రమే కాక మార్క్స్ ఎంగెల్స్‌ల రచనలన్నీ ఒక సమగ్ర ప్రాపంచిక దృక్పథంలో భాగమైనవే గనుక ప్రతి రచనలోనూ రాజయార్థిక విశ్లేషణా దృక్పథం కనబడుతుంది.

అయితే కాపిటల్ చదవడం కష్టం అనే అభిప్రాయం ఒకటి బలంగా ఉంది. ముఖ్యంగా మొదటి మూడువందల పేజీలు క్లిష్టంగా ఉంటాయని, అందువల్ల ఆ తర్వాత సులభంగా ఉన్నప్పటికీ ఈ అవరోధాన్నే చాలమంది దాటలేరని అంటారు. మార్క్స్ జీవితకాలంలోనే జరిగిన ఫ్రెంచి అనువాదం ఒక పత్రికలో సీరియల్ గా ప్రచురిస్తామన్నప్పుడు ఆయన వారికి ఒక హెచ్చరిక చేశాడు: "దాస్ కాపిటల్ అనువాదాన్ని విడతలు విడతలుగా ప్రచురించాలనే మీ ఆలోచనను ప్రశంసిస్తున్నాను. అ రూపంలో పుస్తకం శ్రామిక వర్గానికి ఎక్కువ అందుబాటులోకి వస్తుంది. ఆ ఆలోచనే నన్ను మిగిలిన వాటన్నిటినీ పక్కనపెట్టేలా చేస్తోంది. మీ సూచనలో అది మేలైన భాగం కాగా, ఆ నాణానికి బొరుసు ఏమిటో చూడండి: నేను ఈ పుస్తకంలో ఉపయోగించిన విశ్లేషణా పద్ధతి ఆర్థిక విషయాలకు సంబంధించి ఇంతవరకూ ఎవరూ ఉపయోగించనిది. అందువల్ల తొలి అధ్యాయాలు చదవడం చాలకష్టంగా ఉంటుంది. వెంట వెంటనే నిర్ధారణకు, ముగింపుకు రావాలని, సాధారణ సూత్రాలకూ తమ భావోద్వేగాలను ప్రేరేపిస్తున్న తక్షణ ప్రశ్నలకూ మధ్య సంబంధం ఏమిటో ఎప్పటికప్పుడే తెలుసుకోవాలని ఆత్రుతతో ఉండే ఫ్రెంచి ప్రజలు ఇది చదివి, ఇక్కడ ఏదీ తొందరగా కదలడం లేదని నిరుత్సాహపడవచ్చు" అన్నాడు.

ఈ అననుకూలతను అధిగమించడం తనకు సాధ్యం కాదని, సత్యాన్ని గ్రహించాలనే ఆసక్తి ఉన్న పాఠకులకు ఎక్కువలో ఎక్కువ ఒక ముందస్తు హెచ్చరిక చేస్తానని, అలా అది చదవడానికి వారిని సన్నద్ధం చేస్తానని అంటూ, "శాస్త్రం నేర్చుకోవడానికి రాజమార్గమేమీ లేదు. కొండ ఎక్కేటప్పుడు దాని నిటారైన కష్టతరమైన బాటల మీద అలసిపోగొట్టే నడక సాగించడానికి భయపడని వారికే కొండకొమ్ము మీద ఉజ్వల కాంతిని చేరుకునే అవకాశం వస్తుంది" అన్నాడు. నిజంగానే కాపిటల్ అధ్యయన క్రమం కష్టతరమైనదే అయినప్పటికీ ఆ అధ్యయన ఫలం కొండకొమ్మున అందే ఉజ్వల కాంతి. కొండకొమ్మునుంచి దిగంతాల దాకా విస్తరించే విశాల దృక్పథం.

అయితే కాపిటల్ కావడానికి రాజకీయార్థిక శాస్త్ర పుస్తకమే, రాజకీయార్థ శాస్త్ర విమర్శ అనే ఉపశీర్షికతో ఉన్నదే అయినా అందులో సామాజిక, చారిత్రక, తాత్విక, సాహిత్య, రాజకీయార్థిక అంశాలెన్నో ఇమిడి ఉన్నాయి. అది చదవడానికి అర్థశాస్త్రంలో, తత్వశాస్త్రంలో, చరిత్రలో, సామాజిక శాస్త్రాలలో, సాహిత్యంలో కొంత పరిచయం అవసరం. అది ప్రధానంగా అంతకుముందు రెండు శతాబ్దాలకు పైగా సాగుతున్న రాజకీయార్థిక శాస్త్ర చర్చలను, ప్రత్యేకించి బ్రిటిష్ రాజకీయార్థిక శాస్త్రంలో ఆడమ్ స్మిత్, డేవిడ్ రికార్డోల పెట్టుబడిదారీ విధాన సమర్థనలను విమర్శించింది. ఆ నేపథ్యం తెలియడం అవసరం. అలాగే జర్మన్ తత్వశాస్త్రంలో హెగెల్ సాధించిన గతితార్కిక వాదపద్ధతిని, ఫ్యూర్‌బా అభివృద్ధి చేసిన భౌతికవాద విశ్లేషణను తనలో సంలీనం చేసుకుంది. ఆ తత్వశాస్త్ర చరిత్రతో పరిచయం అవసరం.

నిజానికి లెనిన్ అయితే హెగెల్ గతితర్కం తెలియకుండా కాపిటల్‌ను, ముఖ్యంగా మొదటి అధ్యాయాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోవడం అసాధ్యం అన్నాడు. తాను అభివృద్ధి చేసిన చరిత్ర పట్ల భౌతిక వాద దృక్పథం అనే భావనను వివరించడానికి మార్క్స్ కాపిటల్‌లో ప్రయత్నించాడు. అందువల్ల చరిత్ర గురించి, ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల గురించి అవగాహన కాపిటల్ అధ్యయనానికి అవసరం.

అలాగే మార్క్స్ విపరీతమైన చదువరి గనుకా, నిశితమైన పరిశీలకుడు గనుకా, తన అధ్యయనం ద్వారా గ్రహించిన ఎన్నో అంశాలను కాపిటల్‌లో భాగం చేశాడు. కాపిటల్ మొదటి సంపుటం వరకే చూసినా, మార్క్స్ అందులో బైబిల్ నుంచీ, షేక్ స్పియర్, గెథే, మిల్టన్, వోల్టేర్, హోమర్, బాల్జాక్, డాంటే, సెర్వాంటెస్, డ్రైడెన్, హీన్, వర్జిల్, జువెనాల్, హొరేస్, థామస్ మోర్, శామ్యూల్ బట్లర్ వంటి జర్మన్, ఇంగ్లిష్, ఇటాలియన్, ఫ్రెంచి, గ్రీక్, లాటిన్ రచయితలెందరినో ఉటంకించాడు. జర్మన్ జానపద గాథలు, ఇంగ్లిష్ కాల్పనిక నవలలు, వీరగాథలు, సామెతలు వంటివెన్నో ఉపయోగించుకున్నాడు. బ్రిటిష్, జర్మన్ పరిశ్రమల గణాంకాలు, ప్రభుత్వ పత్రాలు, కార్ఖానాల పర్యవేక్షకుల నివేదికలు వంటివెన్నో వాడుకున్నాడు.

ఒక్క మాటలో చెప్పాలంటే, కాపిటల్ ఒక విజ్ఞాన సర్వస్వం. అయితే

ఇందులో అత్యధిక భాగం 1860ల ముందువనీ, కనుక కాలం చెల్లినవనీ, ఇప్పుడు అటువంటి పెట్టుబడిదారీ విధానం లేదనీ, అందువల్ల కాపిటల్ ఇప్పుడు పనికిరాదనీ అనే విమర్శకులు కూడ ఉన్నారు. అందులో కొన్ని గణాంకాలకూ, వివరాలకూ, స్థలకాలాలకూ కాలం చెల్లినా, వాటిని విశ్లేషించిన పద్ధతి, సంవిధానం ముఖ్యమైనవనీ. అసలు మార్క్సిజం అన్నా, కాపిటల్ అన్నా ప్రధానమైనది సంవిధానమేనని జవాబు చెప్పినవాళ్లు కూడ ఉన్నారు.

కాపిటల్ చదవడం కష్టం అనుకునేవాళ్లకు, కాపిటల్‌లోకి ప్రవేశాన్ని సులభతరం చేయడానికి కూడ ఈ నూట యాభై ఏళ్లలో అనేక ప్రయత్నాలు జరిగాయి. కాపిటల్ మొదటి భాగం, పరిచయం, మూడు భాగాల పరిచయాలు, సంక్షిప్తీకరణలు, వ్యాఖ్యానాలు, వివరణలు ఇంగ్లిష్‌లోనే వందకు పైగా పుస్తకాలు, వేలాది వ్యాసాలు ఉన్నాయి. నేరుగా కాపిటల్ పరిచయం అనకపోయినా, కాపిటల్ లో ఉన్న విషయాలను వివరించే రాజకీయార్థ శాస్త్రం, మార్క్సిస్టు రాజకీయార్థ శాస్త్రం, మార్క్సిస్టు అర్థశాస్త్రం పేర్లతో వచ్చిన పుస్తకాలు, ఇతర సామాజిక, రాజకీయ, చారిత్రక అంశాలకు కాపిటల్ విశ్లేషణా పద్ధతిని అన్వయించిన పుస్తకాలు వందల్లో ఉంటాయి.

అయితే ఈ పరిచయాలు, సంక్షిప్తీకరణలతో కొన్ని సమస్యలు కూడ ఉన్నాయి. ఈ పరిచయాలు, సంక్షిప్తీకరణలు చేసినవారిలో కొందరు మార్క్స్ ను పూర్తిగా, సరిగా అర్థం చేసుకోలేదు. తమకు అర్థమైన భాగాలే, తమకు అర్థమైన మేరకు, తోచిన పద్ధతిలో తమ భాషలో రాశారు. మార్క్స్ క్లిష్టంగా చెప్పినదాన్ని తాము సరళంగా చెపుతున్నామని అనుకుంటూ దాని సారాంశాన్ని మార్చి తమ సొంత కవిత్వం జోడించారు. మార్క్స్ మౌలిక భావనలను, పునాది ప్రతిపాదనలను ఖండిస్తూనే, ఆ మౌలిక భావనల ఆధారంగా మార్క్స్ నిర్మించిన వాదనలను సమర్థిస్తామని అన్నారు.

నిజానికి ఇలా మార్క్స్ భావనలను అరకొరగా అర్థం చేసుకొని, వాటి సమగ్రతను, సంక్లిష్టతను, సారాన్ని పోగొట్టి తమకు అర్థమైన పద్ధతిలో రాయడం మార్క్స్ జీవించి ఉన్నప్పుడే మొదలయింది. ఫ్రెంచి సోషలిస్టులు 1880లో ఫ్రెంచి కార్మిక పార్టీ (పార్టి ఒహయ్యె ఫ్రాంచేస్–ఫ్రెంచి మాటల్లో వర్ణక్రమానికి ఉచ్చారణకూ చాల తేడా ఉంటుంది) స్థాపిస్తున్నప్పుడు దాని నాయకులు జూల్స్ గెస్డె, పాల్ లఫార్గ్ (మార్క్స్ కూతురు లారా సహచరుడు) మార్క్స్‌తో సంప్రదింపులతోనే ఆ పార్టీ ప్రణాళిక రాశారు. దానిలో కనీస కార్యక్రమం గురించి రాసినది మార్క్స్ భావాలకు అనుగుణంగా ఉన్నదని వారనుకున్నారు గాని, అది చూసి మార్క్స్, "నాకు కచ్చితంగా తెలిసిందేమంటే నేను మార్క్సిస్టును కాను" అన్నాడు. ఈ మాటను ఎంగెల్స్ ఆ తర్వాత కూడ మరి రెండుసార్లు ఉటంకించాడు. మళ్లీ ఆ లాఫార్గే మార్క్స్ రాజకీయార్థిక భావాలను వివరిస్తూ 1883లోనే ది రైట్ టు బి లేజీ అనే పుస్తకం రాశాడు.

అలాగే మార్క్స్ ఎంగెల్స్‌లకు సన్నిహితుడు, థియరీస్ ఆఫ్ సర్‌ప్లస్ వాల్యూ సంపాదకుడు కార్ల్ కాట్స్కీ 1887లోనే ది ఎకనమిక్ డాక్ట్రిన్స్ ఆఫ్ కార్ల్ మార్క్స్ అనే పరిచయ పుస్తకం రాశాడు. బహుశా కాపిటల్‌కు, మార్క్స్ రాజకీయార్థిక భావనలకు పరిచయంగా వెలువడిన మొదటి పుస్తకం అదే కావచ్చు. కాని దాంట్లో కాట్స్కీ మార్క్స్ కృషిని కేవలం ఆర్థిక సిద్ధాంతం స్థాయికి కుదించివేశాడని, మార్క్స్ ప్రతిపాదించిన చారిత్రక గతితర్కాన్ని ఒకరకమైన పరిణామవాదంగా చిత్రించాడని విమర్శ ఉంది. అలాగే మార్క్స్ చెప్పిన మిగిలిన విషయాలన్నీ పక్కనపెట్టి కార్మికవర్గం నానాటికీ దారిద్ర్యంలోకి దిగజారడం, పెట్టుబడిదారీ కేంద్రీకరణ జరగడం అనే పరిణామం మీదనే నొక్కి చెప్పాడని విమర్శ ఉంది. అంతకన్న ముఖ్యంగా కార్మిక రైతాంగ ఐక్యత భావనను పూర్తిగా తిరస్కరించాడని, పెట్టుబడిదారీ రాజ్యాన్ని కూలదోసి, కార్మికవర్గం రాజ్యాధికారం చేపట్టడం శాంతియుత పద్ధతులలో జరుగుతుందని, కొనసాగుతున్న వ్యవస్థలను తలకిందులు చేయనవసరం లేదని రాశాడని కాట్స్కీ మీద విమర్శలున్నాయి.

కాపిటల్ మొదటి సంపుటం వెలువడిన వెంటనే 'ఎంగెల్స్ సినాప్సిస్ ఆఫ్ కాపిటల్' పేరుతో కాపిటల్ పరిచయం రాశాడు. మార్క్స్ అల్లుడు, కాపిటల్ ఇంగ్లిష్ అనువాదకుడు ఎడ్వర్డ్ అవెలింగ్ 1891లోనే 'ది స్టూడెంట్స్ మార్క్స్ – యాన్ ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ కాపిటల్' అనే పుస్తకం రాశాడు. అమెరికాలో స్థిరపడిన జర్మన్ నావికుడు, సోషలిస్టు రచయిత ఎర్నెస్ట్ అంటర్ మన్ 'మార్క్సియన్ ఎకనమిక్స్ : ఎ పాపులర్ ఇంట్రడక్షన్ టు ది త్రీ వాల్యూమ్స్ ఆఫ్ మార్క్స్ కాపిటల్' 1907లో ప్రచురించాడు. జర్మన్ సోషలిస్టు జూలియన్ బొర్చార్ట్ 1919లో 'ది పీపుల్స్ మార్క్స్ – అబ్రిడ్జ్‌డ్ పాపులర్ ఎడిషన్ ఆఫ్ ది త్రీ వాల్యూమ్స్ ఆఫ్ కాపిటల్' అనే పేరుతో సంక్షిప్తీకరణ చేశాడు.

అది 1921లోనే ఇంగ్లిషులోకి అనువాదమై ఎన్నోసార్లు పునర్ముద్రణ అయింది (దీన్ని ఇంగువ మల్లికార్జున శర్మ తెలుగులోకి అనువదించి 1981లో ప్రచురించారు). మార్క్సిస్టు మేధావి రోమన్ రోస్డోల్స్కీ 1967లో 'ది మేకింగ్ ఆఫ్ మార్క్స్ కాపిటల్' అని జర్మన్‌లో రాసిన పుస్తకం 1977లో ఇంగ్లిషులో వెలువడింది. సోవియట్ అర్థశాస్త్రవేత్త విటాలీ వైగోడ్స్కీ 'ది స్టోరీ ఆఫ్ ఎ గ్రేట్ డిస్కవరీ – హౌ కార్ల్ మార్క్స్ రోట్ కాపిటల్' అని 1965లో, 'ది ఎవర్ లాస్టింగ్ సిగ్నిఫికెన్స్ ఆఫ్ మార్క్స్ కాపిటల్' అని 1975లో కాపిటల్ పరిచయ పుస్తకాలు రెండు రాశారు. అమెరికన్ సమాజశాస్త్రవేత్త డేవిడ్ స్మిత్, చిత్రకారుడు ఫిల్ ఇవాన్స్ కలిసి 1982లో 'మార్క్స్ కాపిటల్ ఫర్ బిగినర్స్' అనే బొమ్మల పుస్తకం ప్రచురించారు (తెలుగులో కార్టూన్లలో పెట్టుబడి అనే పేరుతో హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురించింది).

నలభై సంవత్సరాలకు పైగా వేరువేరు శాస్త్రాల విద్యార్థులకు కాపిటల్ బోధిస్తున్న అమెరికన్ భౌగోళికశాస్త్ర అధ్యాపకుడు డేవిడ్ హార్వే కాపిటల్ మొదటి సంపుటం మీద వరుసగా 13 ఉపన్యాసాలు ఇచ్చి, ఆ ఉపన్యాసాల ఆధారంగా 2010లో 'ఎ కంపానియన్ టు మార్క్స్ కాపిటల్' పేరుతో పుస్తకం ప్రచురించారు. అలాగే రెండో సంపుటం మీద ఇచ్చిన ఉపన్యాసాలతో 2013 లో 'ఎ కంపానియన్ టు మార్క్స్ కాపిటల్ వాల్యూం 2' ప్రచురించారు. ఆయన ఉపన్యాసాలన్నీ కూడ ఇంటర్నెట్ మీద అందుబాటులో ఉన్నాయి.

డబ్ల్యు ఎచ్ ఎమ్మెట్ రాసిన 'ది మార్క్సియన్ ఎకనమిక్ హాండ్ బుక్ అండ్ గ్లాసరీ', ఆల్థూసర్ రాసిన 'రీడింగ్ కాపిటల్', అలెక్స్ కాలినికోస్ రాసిన 'డెసిఫరింగ్ కాపిటల్', ఎర్నెస్ట్ ఫిషర్ రాసిన 'హౌ టు రీడ్ మార్క్స్', మైకెల్ హీన్రిచ్ రాసిన 'యాన్ ఇంట్రడక్షన్ టు ది త్రీ వాల్యూమ్స్ ఆఫ్ కార్ల్ మార్క్స్ కాపిటల్', ఎర్నెస్ట్ మాండెల్ రాసిన 'మార్క్సిస్ట్ ఎకనమిక్ థియరీ', కెకె దాస్ గుప్తా రాసిన 'ఎస్సెన్షియల్స్ ఆఫ్ మార్క్స్ కాపిటల్', పాల్ స్వీజీ రాసిన 'ది థియరీ ఆఫ్ కాపిటలిస్ట్ డెవలప్ మెంట్', బెన్ ఫైన్ రాసిన 'మార్క్స్ కాపిటల్', హారీ క్లీవర్ రాసిన 'రీడింగ్ కాపిటల్ పొలిటికల్లీ', స్టీఫెన్ షాపిరో రాసిన 'మార్క్స్ కాపిటల్', ఫ్రాన్సిస్ వీన్ రాసిన 'మార్క్స్ దాస్ కాపిటల్', హ్యూగో గిల్బర్ట్ చిత్రించిన 'కార్ల్ మార్క్స్

కాపిటల్ ఇన్ లిథోగ్రాఫ్స్', డేవిడ్ మెక్‌లెల్లాన్ రాసిన 'ది థాట్ ఆఫ్ కార్ల్ మార్క్స్ - యాన్ ఇంట్రడక్షన్', రాయా దునాయెవ్ స్కయా రాసిన 'ఔట్ లైన్ ఆఫ్ మార్క్స్ కాపిటల్ వాల్యూం వన్', జెన్రిఖ్ వోల్కోవ్ రాసిన 'బర్త్ ఆఫ్ ఎ జీనియస్' వంటి పుస్తకాలు డజన్లకొద్దీ ఉన్నాయి. ఇవి కాకుండా మార్క్స్ ఎంగెల్స్‌ల జీవిత చరిత్రలలో, రాజకీయార్థశాస్త్ర పాఠ్యపుస్తకాలలో, మార్క్సిస్టు రాజకీయార్థశాస్త్ర సూత్రాలను సామాజిక సమస్యలకు అన్వయించి రాసిన పుస్తకాలలో ఎన్నో చోట్ల కాపిటల్ భావనల వివరణలూ విశ్లేషణలూ ఉన్నాయి.

అలా 1880ల నుంచి ఇవాళ్టివరకూ కూడ ఎంతో మంది కాపిటల్‌ను పరిచయం చేసినవారున్నారు. వాటిలో కాపిటల్‌ను అద్భుతంగా, సులభంగా పరిచయం చేసినవీ ఉన్నాయి. కొన్ని భావనలు అద్భుతంగా ఉండి, మరికొన్ని భావనలు తప్పుడు అవగాహనను ఇచ్చేవీ ఉన్నాయి. మొత్తంగా మంచి పరిచయాలే అయినా, మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్తల మధ్యనే వివాదాస్పదంగా ఉన్న అంశాలలో భిన్నాభిప్రాయాల వల్ల అందరి ఆమోదాన్ని పొందని పుస్తకాలూ ఉన్నాయి. అవన్నీ కూడ ఆయా చర్చలను పరిగణనలోకి తీసుకుంటూ తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాలే.

కాపిటల్ ప్రచురణల, అనువాదాల సందర్భంలో చెప్పుకోవలసిన ఒక హాస్యాస్పద ఘటన కూడ ఉంది. లండన్‌లో వెలువడిన ఇంగ్లిష్ ప్రతిని ఏ అనుమతులూ లేకుండానే అమెరికాలో న్యూయార్క్ కు చెందిన ఒక ప్రచురణకర్త 1890లో పునర్ముద్రించాడు. ఇటువంటి పునర్ముద్రణలను పుస్తకప్రచురణ రంగంలో నకిలీ ప్రచురణ (పైరేటెడ్ ఎడిషన్) అంటారు. ఆ పుస్తకం గురించి పత్రికల్లో వ్యాపారప్రటనలు వేసినప్పుడు "డబ్బు సంపాదించే మార్గం చెప్పే పుస్తకం" అని ప్రచారం చేశాడు. ఆ ప్రచారంతో కాపిటల్ అతి త్వరలోనే ఐదువేల ప్రతులు అమ్ముడయ్యాయి.

**కాపిటల్ రచనకు మూలం**

అసలు రాజకీయార్థిక విశ్లేషణా రంగం వైపు మార్క్స్ ప్రయాణం, దాస్ కాపిటల్ రచన, అందుకోసం మార్క్స్ పడిన శ్రమ, తపన, అన్వేషణ, చివరికి పుస్తక ప్రచురణ, ప్రచురణానంతర పరిణామాలు అన్నీ కూడ కాల్పనిక రచనా సన్నివేశాలతో పోల్చదగిన ఉజ్వలమైన ఘటనలు. మానవజాతి చరిత్రలో కాపిటల్ వంటి అపారమైన, విస్తృతమైన ప్రభావం వేసిన గ్రంథాలు అతి తక్కువ ఉంటాయి. మూడు ప్రధాన సంపుటాలలో, మూడు పుస్తకాలుగా ప్రచురితమవుతున్న నాలుగో సంపుటంతో నాలుగు వేల పేజీలకు విస్తరించిన ఈ గ్రంథం మార్క్స్ జీవితకాల కృషి. ఆయన కనీసం తన ఇరవై ఆరో ఏటినుంచి మరణించేదాకా నలభై సంవత్సరాలు, 1844 నుంచి 1883 దాకా ఈ విషయాలు ఆలోచిస్తూ, రచిస్తూనే ఉన్నాడు. ఈ కృషి అంతా కూడ ఒకవైపు ప్రభుత్వ ఆంక్షలు, దేశబహిష్కారాల మధ్య, నిరంతర దుర్భర దారిద్ర్యం మధ్య, అనారోగ్యం మధ్య, దేశదేశాల కార్మికవర్గాన్ని, కార్మికవర్గ మేధావులను ఐక్యం చేసి కార్యాచరణలోకి నడిపించే కృషి మధ్య సాగింది.

నిజానికి మార్క్స్ రాజకీయార్థిక సిద్ధాంతవేత్త కావాలని బయల్దేరలేదు. తండ్రి కోరుకున్నది మార్క్స్ న్యాయశాస్త్రం చదవాలని. మొట్టమొదట బాన్ విశ్వవిద్యాలయంలో మార్క్స్ చదవాలనుకున్నవి తత్వశాస్త్రం, సాహిత్యం. అక్కడ ఒక కవుల బృందంలో సభ్యుడు కూడ అయ్యాడు. బెర్లిన్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్ర విద్యార్థిగా, జెనా విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర విద్యార్థిగా తత్వశాస్త్రాన్నీ న్యాయశాస్త్రాన్నీ సమ్మేళనం చేయాలని ఆలోచించాడు. "తత్వశాస్త్రం లేకుండా ఏమీ సాధించలేం" అని కూడ రాశాడు. ఆ తత్వశాస్త్ర ఆసక్తి వల్లనే హెగెల్ భావాల అభిమానిగా, ఫ్యూర్ బా, బ్రూనో బావర్‌ల అనుయాయిగా మారాడు. తత్వశాస్త్రంలోనే పిఎచ్‌డి సిద్ధాంతపత్రం రాశాడు. హెగెల్ తత్వశాస్త్ర రచనల ప్రచురణ బాధ్యతలు పంచుకున్నాడు.

అలా ఏదో ఒక విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర ఆచార్యుడుగా స్థిరపడదగిన అర్హతలున్నా, "తత్వశాస్త్ర ఆచార్యుల మధ్య ఉండడం దుర్భరం" అని భావించి అటువైపు వెళ్లలేదు. ఒకవేళ అలా విశ్వవిద్యాలయ అధ్యాపకుడిగా చేరదలచినా తన విప్లవ భావాల వల్ల, ప్రభుత్వ ఆంక్షల వల్ల అది కుదిరేది కాదు. అప్పుడు, రచనా స్వాతంత్ర్యం ఉంటుందని కొంత, భుక్తి కోసం కొంత ప్రారంభించి చివరిదాకా పత్రికారచయితగా కొనసాగాడు. ఈ మధ్యలో ఒక నవల రాశాడు, ఒక నాటకం రాశాడు. జెన్నీ గురించి ప్రేమ కవిత్వం రాశాడు. కాని "సాహిత్యం నాకు సరిపడదు, అది వదిలేస్తున్నాను" అని కూడ రాశాడు.

ఇదంతా 1843కు ముందు. అలా కవిగానో, నవలాకారుడుగానో, నాటకకర్తగానో, న్యాయవాదిగానో, తత్వవేత్తగానో, విశ్వవిద్యాలయ అధ్యాపకుడుగానో, పత్రికారచయితగానో మిగిలిపోగలిగిన కార్ల్ మార్క్స్‌ను చరిత్రే రాజకీయార్థిక శాస్త్రం వైపు నడిపించింది. యూరప్ దేశాలలో 1840లలో జరిగిన పరిణామాలు, పెట్టుబడిదారీ సంక్షోభాలు, సామాజిక సంక్షోభాలు, బుద్ధిజీవుల మధ్య సాగిన లోతైన తాత్విక, రాజకీయ, సామాజిక చర్చలు ఆయనను రాజకీయార్థిక శాస్త్రం వైపు చూసేలా చేశాయి. ప్రత్యేకంగా రైనిష్ జీటుంగ్ సంపాదకుడిగా వాణిజ్య సమస్యల మీద, రైతాంగ సమస్యల మీద, ప్రభుత్వ పాలన మీద రాస్తున్నప్పుడు, వ్యాఖ్యానిస్తున్నప్పుడు తాను అనివార్యంగా రాజకీయార్థ శాస్త్రం వైపు చూడవలసి వచ్చిందని మార్క్స్ చెప్పుకున్నాడు.

రాజకీయార్థ శాస్త్ర అధ్యయనం ప్రారంభించిన పదమూడు సంవత్సరాల తర్వాత, 1857లో రాసి, 1859లో అచ్చయిన ఎ కాంట్రిబ్యూషన్ టు ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీలో మార్క్సే స్వయంగా తాను రాజకీయార్థ శాస్త్ర అధ్యయనం వైపు ఎలా వచ్చాడో అద్భుతంగా వివరించాడు: "చట్టపరమైన సంబంధాలను గానీ, రాజకీయ రూపాలను గానీ వాటంతటవే అర్థం చేసుకోలేమనీ, సాధారణ మానవ మేధో అభివృద్ధి అనబడేదాని ఆధారంగా కూడ అర్థం చేసుకోలేమనీ నిర్ధారణకు నా అన్వేషణ నన్ను చేర్చింది. చట్టపరమైన సంబంధాలూ రాజకీయ రూపాలూ కూడ భౌతిక జీవన పరిస్థితులలోనే పుట్టుకువస్తాయని నిర్ధారణకు నేను వచ్చాను. ఈ భౌతిక జీవన పరిస్థితులు అనే మొత్తాన్ని పద్దెనిమిదో శతాబ్దపు ఇంగ్లిష్, ఫ్రెంచ్ ఆలోచనాపరులూ, వారిని అనుసరిస్తూ హెగెల్ కూడ 'పౌరసమాజం' అనే పదం కింద చుట్ట చుట్టారు. ఐతే ఈ పౌరసమాజ శరీరనిర్మాణం రాజకీయార్థ శాస్త్రంలోనే దొరుకుతుంది. అలా నా రాజకీయార్థ శాస్త్ర అధ్యయనం పారిస్లో ప్రారంభించాను. ఎం గిజో జారీచేసిన బహిష్కరణ ఉత్తర్వుల వల్ల అక్కడి నుంచి బ్రస్సెల్స్కు వెళ్లి, అక్కడ కొనసాగించాను" అని మార్క్స్ రాశాడు.

మార్క్స్ తొలి రచనలు చూస్తే, హెగెల్, ఫ్యూర్ బా ల అనుచరుడిగా, తత్వశాస్త్ర విద్యార్థిగా పరాయీకరణ గురించి ఎక్కువగా ఆలోచించినట్టు కనబడుతుంది. మనిషి దేవుడి నుంచి, ప్రకృతి నుంచి, సమాజం నుంచి పరాయీకరణకు గురవుతున్నాడని, ఈ పరాయీకరణను అర్థం చేసుకోవాలని పారిశ్రామిక యుగపు తొలిరోజుల తత్వవేత్తలందరూ ఆలోచించారు. కాని వాళ్లు పరాయీకరణ మూలాన్ని వెతకడంలో విఫలమయ్యారు. తోటి మనుషుల నుంచి మనిషి పరాయీకరణ

చెందడానికి మూలం తన నుంచి తాను పరాయి కావడంలో ఉందని, తన నుంచి తాను పరాయి కావడానికి మూలం తన శ్రమ ఫలితం నుంచి పరాయి కావడంలో ఉందని, శ్రమ ఫలితం నుంచి పరాయీకరణ అంటే మానవసారమైన శ్రమ పరాయీకరణేనని, అందువల్ల మానవ సంబంధాల సమాహారమైన మనిషి తోటి మనుషుల నుంచి పరాయి అవుతున్నాడని మార్క్స్ గుర్తించాడు. అంటే పరాయీకరణ గురించి అర్థం చేసుకోవాలంటే, శ్రమ గురించి, ఉత్పత్తి గురించి అర్థం చేసుకోవాలనుకున్నాడు. అలా తత్వశాస్త్ర చర్చ నుంచి రాజకీయార్థిక చర్చ వైపు ప్రయాణించాడు.

రచన విషయంలో మార్క్స్ సమగ్రతావాది, పరిపూర్ణతావాది. తాను రాసినదానిమీద అసంతృప్తితో, దాన్ని ఇంకా ఇంకా సమగ్రం చేయాలని, మెరుగుపెట్టాలని మళ్లీ మళ్లీ తిరగరాస్తుండేవాడు. అలాగే జీవితమంతా నిత్య విద్యార్థిగా ఎప్పటికప్పుడు కొత్త విషయాలు తెలుసుకోవడానికి, తన అభిప్రాయాలను ఆ కొత్త విషయాల వెలుగులో పరిపూర్ణం చేయడానికి ప్రయత్నించేవాడు. విద్యార్థి దశలోనే ఆయన గ్రీకు, లాటిన్ లతో పాటు ప్రధాన యూరపియన్ భాషలన్నీ చదవడం నేర్చుకున్నాడు. జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లిష్‌లో రచనలు చేయగలిగేవాడు. రష్యన్ సాహిత్యంలో, సామాజిక శాస్త్రాలలో తనకు అప్పటికి తెలియని విషయాలున్నాయని, అవి మూలంలో చదవాలని అనుకుని 50 ఏళ్లు దాటాక రష్యన్ నేర్చుకున్నాడు. కాపిటల్ రాస్తున్న క్రమంలో తనకు తెలిసిన ప్రాథమిక అంకగణితం సరిపోవడం లేదని భావించి అంకగణితంతో పాటు ఆల్జీబ్రా, కాలిక్యులస్ నేర్చుకున్నాడు.

"శాస్త్ర విజ్ఞానంలోనూ, ప్రజాజీవితంలోనూ ఏకకాలంలో నాయకులుగా ఉండగలిగిన అరుదైన మనుషుల్లో మార్క్స్ ఒకరు. ఆ రెండు అంశాలూ ఆయనలో ఎంత అవినాభావంగా ఏకమయ్యాయంటే ఆయనలోని మేధావినీ, సామాజిక యోధుణ్నీ కలిపి మాత్రమే అర్థం చేసుకోగలం. ఆ పరిశోధన అంతిమ ఫలితాలు ఏమైనా సరే అని శాస్త్ర విజ్ఞానాన్ని దానికదిగానే అధ్యయనం చేయాలని మార్క్స్ అనుకునేవాడు. కాని అదే సమయంలో శాస్త్రవేత్త ప్రజాజీవితంలో క్రియాశీల భాగస్వామ్యం వహించకుండా, తన గ్రంథాలయంలోనో, ప్రయోగశాల లోనో తలుపులు మూసుకుని జున్నుగడ్డలో పురుగులాగ కూచుంటే, తన సమకాలికుల జీవితం నుంచీ, రాజకీయ పోరాటం నుంచీ దూరంగా ఒంటరిగా ఉండిపోతే తనను తాను కించపరచుకున్నట్టే అని కూడ భావించే వాడు. 'శాస్త్ర విజ్ఞానం స్వార్థపూరిత సంతోషం కాదు. శాస్త్రీయ అన్వేషణలకు తమను తాము అంకితం చేసుకునే సదవకాశం దొరికిన వాళ్లు, తమ జ్ఞానాన్ని మానవజాతి సేవకు అందించడంలో అగ్రభాగాన ఉండాలి' అని ఆయన అనేవాడు. ఆయనకు ఇష్టమైన సూక్తులలో 'మానవ జాతి కోసం కృషి చేయాలి' అనేదొకటి" అని అని పాల్ లఫార్గ్ 1890లో రాసిన మార్క్స్ సంస్మరణ వ్యాసంలో అన్నాడు.

### కాపిటల్ ప్రణాళిక

ఇప్పుడు దొరుకుతున్న రూపంలో కాపిటల్ నిజానికి మార్క్స్ రాయదలచుకున్న ఉద్గ్రంథంలో పావువంతు కన్న తక్కువ. తన రాజకీయార్థిక శాస్త్ర అధ్యయనాన్నీ, విశ్లేషణనూ క్రోడీకరిస్తూ ఆన్ ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ పేరుతో వరుసగా కొన్ని పుస్తకాలు రాయాలని ఆయన మొదట అనుకున్నాడు. ఆ ఆలోచనను ఎన్నోసార్లు మార్చుకున్నాడు. 1858లో వేసుకున్న ఒక ప్రణాళిక ప్రకారం ఈ విషయాల మీద ఆరు పుస్తకాలు (1. ఆన్ కాపిటల్, 2. ఆన్ ప్రాపర్టీ ఇన్ లాండ్, 3. ఆన్ హైర్‌డ్ లేబర్, 4. ఆన్ ది స్టేట్, 5. ఆన్ ఇంటర్నేషనల్ ట్రేడ్, 6. ఆన్ ది వరల్డ్ మార్కెట్) రాయాలని అనుకున్నాడు. అలాగే రాజకీయార్థ శాస్త్ర చరిత్ర మీద, ఆర్థిక ప్రత్యయాలు-సంబంధాల అభివృద్ధి మీద మరి రెండు పుస్తకాలు రాయాలని అనుకున్నాడు.

ఈ ప్రణాళికకు అనుగుణంగానే 1859లో బెర్లిన్‌లోని డంకర్ పబ్లిషింగ్ హౌజ్ అనే ప్రచురణకర్తతో ఒప్పందం కుదుర్చుకుని ఆన్ ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ అనే మొదటి విడత పుస్తకం ఇచ్చాడు. ఆ తర్వాత ఒకటి రెండు సంవత్సరాలు పని ముందుకు సాగలేదు. 1862 చివరి నాటికి తన పుస్తకానికి కాపిటల్ అని పేరు పెట్టాలని నిర్ణయించుకున్నాడు. ఈ మధ్యలో ఇంటర్నేషనల్ పనులు, ఆర్థిక ఇబ్బందులవల్ల పని వేగంగా సాగలేదు.

చివరికి 1865 డిసెంబర్‌లో కాపిటల్ ముసాయిదా ప్రతి సిద్ధం చేశాడు. అది పూర్తిచేశాక, 1866 ఫిబ్రవరి 13న ఎంగెల్స్‌కు రాసిన ఉత్తరంలో "ఇప్పుడు అచ్చుకు పంపే ముసాయిదా ప్రతి సిద్ధమయింది గాని, అది ఎంత పెద్దదయిందంటే, దాన్ని నేను తప్ప మరెవరూ ప్రచురించలేరు, నువ్వు కూడ ప్రచురించలేవు" అని రాశాడు. ఆ పుస్తకాన్ని సంపుటాలుగా విడదీసి మొదటి సంపుటాన్ని పూర్తి చేయమనీ, మిగిలిన సంపుటాల పని తర్వాత చూసుకోవచ్చుననీ ఎంగెల్స్ సలహా ఇచ్చాడు. ఇక మార్క్స్ మొదటి సంపుటంలో వాక్య నిర్మాణాలు, వాదనలు తుది మెరుగులు దిద్దేపని మొదలుపెట్టాడు. "అతి కష్టంగా ప్రసవించిన తర్వాత, బిడ్డను శుభ్రం చేయడానికి నాకుతున్నట్టుగా ఉందిది" అని రాశాడు.

కాని దశాబ్దాల కృషి ఆయన ఆరోగ్యాన్ని బాగా దెబ్బతీసింది. దీర్ఘకాలంగా బాధిస్తున్న సెగగడ్డలు, కీళ్ల నొప్పులు, కాలేయ వ్యాధి, నిద్రలేమి ఆయన పనికి ఆటంకాలు కలిగించాయి. 1866 మొదట్లో తీవ్రంగా జబ్బుపడి, పనిచేయలేని స్థితిలో "... నేను ఎల్లవేళలా సమాధి అంచున ఉన్నట్టు అనిపిస్తున్నది. కనుక నేను ప్రతి క్షణాన్నీ పొదుపుగా వాడుకుని, పనిచేయగలిగినప్పుడే నా పుస్తకాన్ని పూర్తిచేయాలి. ఆ పుస్తకం కోసమే నేను నా ఆరోగ్యాన్నీ, సంతోషాన్నీ, కుటుంబాన్నీ త్యాగం చేశాను" అని ఎంగెల్స్‌కు ఉత్తరం రాశాడు. ఈ ఆరోగ్య సమస్యలకు తోడు ఆర్థిక సమస్యలు ఉండనే ఉన్నాయి. పుస్తకాల మీద వచ్చే ఆదాయం తక్కువ.

న్యూయార్క్ డెయిలీ ట్రిబ్యూన్ విలేఖరిగా అంతకు ముందు క్రమబద్ధంగా అందుతుండిన పారితోషికం అమెరికాలో 1861లో అంతర్యుద్ధం చెలరేగడంతో ఆగిపోయింది. ఎంతో కొంత సంపాదన కోసం రైల్వే కార్యాలయంలో గుమస్తాగా పనిచేయడానికి వెళ్లాడు గాని ఆయన చేతిరాత ఘోరాతిఘోరంగా ఉన్నదని వాళ్లు ఉద్యోగం ఇవ్వలేదు. ఈ స్థితిలో 1864లో మరణించిన సన్నిహిత మిత్రుడు, తొలితరం జర్మన్ కమ్యూనిస్టు విల్హెల్మ్ వోల్ఫ్ తన ఆస్తి మార్క్స్‌కు చెందాలని వీలునామా రాయడంతో కుటుంబ ఆర్థిక స్థితి మెరుగయింది. కాపిటల్ మొదటి సంపుటాన్ని మార్క్స్ ఆ విల్హెల్మ్ వోల్ఫ్‌కే అంకితం చేశాడు. "...మరే పుస్తకమైనా ఇంతకన్న కష్టతరమైన పరిస్థితుల్లో రాయబడి ఉంటుందా అనుమానమే. నేనే గనుక ఈ పుస్తక సృష్టి వెనుక ఉన్న రహస్య చరిత్రను రాస్తే, దాంట్లో అనంతమైన నిగూఢ ఆందోళనలు, విచారాలు, కడగండ్లు బైటపడి ఉండేవి" అని మిత్రుడు లుడ్విగ్ కుగెల్మన్‌కు మార్క్స్ సహచరి జెన్నీ ఉత్తరం రాసింది.

*(ఇంకా ఉంది)*

వీ

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

# కామన్ సివిల్ కోడ్ - ట్రిపుల్ తలాక్

**మౌలిక సమస్యలను పరిష్కరించడంలో విఫలమైన హిందూత్వ శక్తులు ప్రజలను మభ్యపెట్టడానికే ముస్లిం మతాన్ని లక్ష్యంగా చేసుకుని ఉమ్మడి పౌరస్మృతి, కామన్ సివిల్ కోడ్ వంటి చట్టాలను తేవడానికి ప్రయత్నిస్తున్నాయని అంటున్నారు షేక్ కరిముల్లా**

వార్తలు విందామని టివి పెట్టగానే ఒక కేంద్ర ప్రభుత్వ ప్రకటన ప్రసారమైంది. అది కామన్ సివిల్ కోడ్‌ను అమలు చేయమని 'లా కమిషన్'కు మెయిల్ చేయమని ఆ ప్రకటన సారాంశం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంక్షేమ కార్యక్రమాలపై టివిలో ప్రకటనలు ఇవ్వడం మామూలే. కాని ఉమ్మడి పౌరస్మృతికి అనుకూల మెయిల్ చేయమని ప్రజలను కోరుతూ ప్రకటనలు ఇవ్వడం విడ్డూరం అనిపించింది.

1980 నుండి భారత సమాజంలో కల్లోలం నెలకొంది. 1984లో సిక్కు ప్రజల ఊచకోత, 1992లో బాబ్రీ మసీదు నేలమట్టం, 2002లో గుజరాత్‌లో ముస్లిం ప్రజల ఊచకోత నుండి ముజఫర్ నగర్ మారణకాండ, ఆవుమాంసం తిన్నాడన్న నెపంతో ఉత్తరప్రదేశ్‌లోని అఖ్లాక్‌ను అతని కుటుంబం ముందే చంపడం, ప్రగతిశీల భావాజాలం కలిగిన గొప్ప వ్యక్తులైన గోవింద పన్సారే, కల్బుర్గీ, దబోల్కర్ లాంటి వారిని చంపడం, దళిత ప్రజలపై దాడులను పరిశీలిస్తే ఈ రోజు దేశంలో ఏం జరుగుతోంది.

ప్రజలు మౌలిక సమస్యల గురించి ఆలోచించకుండా, వాటి పరిష్కారంపై పోరాటాలు చేయకుండా ప్రజల దృష్టిని మళ్లించేందుకు సామ్రాజ్యవాద శక్తులు, దీనితో మిలాఖత్ అయిన హిందూత్వ మతతత్వ శక్తులు పన్నుతున్న కుయుక్తులని అర్థమవుతుంది. ఈ దేశ మూలవాసులైన ముస్లిం ప్రజలు ఇప్పటికే ఎంతో అభద్రతతో బిక్కు బిక్కుమంటూ జీవిస్తున్నారు. ఇటువంటి స్థితిలో కామన్ సివిల్ కోడ్, ట్రిపుల్ తలాక్ బండను వీరి నెత్తిన పెట్టింది మోడీ ప్రభుత్వం. కామన్ సివిల్ కోడ్ అమలు విషయమై ప్రజాభిప్రాయ సేకరణ చేసేందుకు భారత్ లా కమిషన్ విడుదల చేసిన ప్రశ్నావళి దేశ వ్యాప్తంగా ఒక చర్చను లేవనెత్తింది. దీంతో ముస్లిం సమాజంలో ఆందోళన మొదలైంది.

కేంద్రం కుట్రను కామన్ సివిల్ కోడ్‌ను వ్యతిరేకిస్తూ మొదటి సారిగా గుంటూరు జిల్లాలోని పిడుగురాళ్ల పట్టణంలో ముస్లిం మహిళలు నిరసన ర్యాలీ నిర్వహించారు. అలాగే 'కోరా' అనే ఒక ముస్లిం మహిళ పౌండేషన్ ఆధ్వర్యంలో ముంతాజ్ షేక్ నాయకత్వంలో ఉత్తర బొంబాయిలో కూడా ముస్లిం మహిళల నిరసన ఆందోళనలు మొదలైనాయి. ఆల్ ఇండియా ముస్లిం పర్సనల్ లా బోర్డ్ దీనిని వ్యతిరేకిస్తూ, ప్రతి ముస్లిం కుటుంబం ఇంటికి వెళ్లి మరీ సంతకాల సేకరణ కార్యక్రమం చేపట్టింది. పెద్ద ఎత్తున సంతకాలు సేకరించి లా కమిషన్‌కు పంపే పనిలో ఉంది. దీంతో ఈ అంశంపై దేశంలో పెద్ద చర్చ మొదలైంది. ఉమ్మడి పౌరస్మృతి గురించిన అంశం ఈనాటిది కాదు. గతంలో కూడా కొంత చర్చ జరిగింది. చాలా కాలంగా దేశంలో చర్చ జరుగుతూనే ఉంది.

రాజ్యాంగ రచనా కాలంలో ప్రజాస్వామిక దృక్పథంతో ప్రజల మధ్య ఐక్యతను సాధించేందుకు ఉమ్మడి పౌర చట్టంను రూపొందించడం జరిగింది. అయితే అంబేద్కర్, గాంధీ, నెహ్రూలు ఈ దేశంలోని భిన్న సంస్కృతులు, జీవన విధానాలు, ఆచార వ్యవహారాలు, మైనార్టీ ప్రజల అస్తిత్వం, వారి హక్కులు మొదలగు అంశాలను పరిగణలోనికి తీసుకొని రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో ఆర్టికల్ 44 ద్వారా ఉమ్మడి పౌరస్మృతిని చేర్చడం జరిగింది. తద్వారా భారత భూ భాగంలో నివసించే ప్రజలందరికి ఉమ్మడి పౌరస్మృతి వర్తిస్తుంది. అయితే ఆదేశిక సూత్రాలను ప్రభుత్వాలు విధిగా అమలు చేయాల్సిన రాజ్యాంగ బద్ధ బాధ్యత ఏమి ఉండదు. ఆదేశిక సూత్రాలలో ఇంకా చాలా మంచి విషయాలున్నాయి. అందరికి పని కల్పించమన్నారు. అందరికి ఉపాధి కల్పించమన్నారు. స్త్రీ, పురుషులకు సమాన పనికి సమాన వేతనం ఇవ్వాలన్నారు. ప్రజా రోగ్యాన్ని సంరక్షించమన్నారు. 14 సంవత్సరాల లోపు పిల్లలందరికి విద్య అందించమన్నారు. న్యాయ వ్యవస్థ అందరికి అందుబాటులో ఉండేటట్లు చూడమన్నారు. పశుపోషణ, వ్యవసాయాన్ని అభివృద్ధి చేయమన్నారు. పర్యావరణాన్ని సంరక్షించమన్నారు. ఇవన్నీ రాజ్యాంగ ఆదేశిక సూత్రాలలో ఉన్నాయి. ఈ పనులు ప్రభుత్వం చేయడం లేదని 1980లో సుప్రీంకోర్టు చివాట్లు పెట్టింది. ఆ తరువాత ఇవి వదిలేసి రాజకీయాలలో సంక్షేమవాదం వెనుకడుగేసి హిందూత్వ వాదం బలపడే కొలది ఉమ్మడి పౌరస్మృతి వెనుకపడ్డారు.

**పర్సనల్ చట్టాలు**

ఇందులో ఆయా మతాలు, జాతులకు సంబంధించి వివాహం, ఆస్తి వారసత్వ విడాకులు, దత్తత, భరణం మొదలగు విషయాలుంటాయి. ఆయా మతాల ప్రజల సాంప్రదాయక ఆచారాలు, మత గ్రంథాల నియమావళితో ముడిపడి ఉంటాయి. పర్సనల్ 'లా'లో ఉన్న లోపాలను తొలగించి ప్రజాస్వామిక విలువల ప్రాతిపదికన ఆధునీకరించాలి. సంస్కర్తలు గడచిన 100 సంవత్సరాలలో చాలా సార్లు ప్రయత్నం చేశారు. అంబేద్కర్ న్యాయ శాఖ మంత్రిగా ఉన్నప్పుడు హిందూ పర్సనల్ చట్టంను ఆధునీకరించాలని ప్రయత్నం చేశాడు. హిందువులు వ్యతిరేకించడంతో ఆగిపోయింది. అలాగే ముస్లిం మతస్తులకు వివాహం, విడాకులు, ఆస్తి హక్కులు మొదలగు స్థానిక సంప్రదాయాలను ఆచరిస్తున్న వారందరికి 1937 తరువాత షరియత్ చట్టం కిందకి తెచ్చేశారు. అది అలాగే జరిగిపోతోంది. మరి ఇప్పుడు ఎవరి ప్రయోజనాల కోసం ఉమ్మడి పౌరస్మృతిని ముందుకు తీసుకొస్తున్నారు?

**భారతీయ సంస్కృతి - వివాహం - విడాకులు**

భిన్నత్వంలో ఏకత్వం భారతీయ సంస్కృతి, విశిష్ట లక్షణం. అనేక మతాలు, జాతులు, ఆచార వ్యవహారాలు, అనేక భాషలున్నాయి. ఆహారపు అలవాట్లు, వేషధారణలో కూడా తేడాలున్నాయి. విడాకులు, ఆస్తి వారసత్వం మొదలైన విషయాలలో కూడా తేడాలున్నాయి. హిందూ మతంలో హైందవ ధర్మ శాస్త్రాల ప్రకారం ఎనిమిది రకాల వివాహాలున్నాయి. ఉదాహరణకు రుక్మిణీ దేవి శ్రీకృష్ణుని గాంధర్వ

వివాహం (ప్రేమ వివాహం) చేసుకుంది. బలవంతపు పెళ్లిళ్లు (రాక్షస, పైశాచిక వివాహాలు) ఉన్నాయి. రాజరికపు వ్యవస్థలలో స్వయం వరం ద్వారా స్త్రీ భర్తను ఎన్నుకొనే విధానం ఉంది. సీత, ద్రౌపదుల వివాహాలు ఇలాగే జరిగాయి. హైందవం వివాహాన్ని పవిత్ర బంధంగా భావిస్తుంది. వివాహం ఒక ధార్మిక క్రతువు కూడా కన్యాదానంలను ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అందులో కట్నం ఒక భాగం. చట్టం దాన్ని నిషేదించిన ఇంకా అది కొనసాగుతూనే ఉంది. ఇక ఇస్లాంలో వివాహ బంధం ఒక సాంఘిక ఒప్పందం వంటిది. అందులో మెహర్ (కన్యాశుల్కం) అనేది ఒక భాగం. ఈ దేశ మూలవాసులైన గిరిజనుల వివాహ వ్యవస్థను తీసుకుంటే భిన్న తెగల కారణంగా వారి వారి స్థానిక ఆచార వ్యవహారాల అణుగుణంగా పెళ్లిళ్లు జరిగిపోతుంటాయి. ఆస్తిపాస్తుల విషయం చూస్తే ఇస్లాంలో కొడుకుకు ఆస్థిపైన హక్కు తండ్రి చనిపోయేదాక రాదు. అప్పటిదాకా దానిని అనుభవించే హక్కు మాత్రమే కొడుకుకు ఉంటుంది. హిందూ సాంప్రదాయంలో మగ పిల్లవాడు పుట్టిన క్షణమే పూర్వీకుల ఆస్తిలో హక్కుదారుడౌతాడు.

### స్త్రీ స్వేచ్ఛకు ఏది స్థానం?

పై రెండు సాంప్రదాయాలలో స్త్రీకి ఆస్తిపైన హక్కు లేదు. ఆర్థిక స్వేచ్ఛ లేదు. రెండు సాంప్రదాయాలలో కూడా స్త్రీలపై వివక్ష ఉంది. స్త్రీ కుటుంబ జీవితానికి మాత్రమే పరిమితం చేయబడినది. సంపూర్ణంగా మగవాడి నియంత్రణలోనే బతకాలని ధర్మ శాస్త్రాలు నిర్దేశించాయి. స్త్రీకి స్వతంత్రంగా బతికే అర్హత లేదని, చిన్న తనంలో తండ్రి, పెద్దయినాక భర్త, ముసలి తనంలో కొడుకుల అదుపాజ్ఞలలో ఉండాలని మనువు చెప్పిన సంగతి తెలిసిందే. భర్తకు సేవ చేయడం, భర్తకు ఉపయోగపడడం స్త్రీ ప్రధాన కర్తవ్యం. ఆమెను దేవుడు అందుకోసమే సృష్టించాడు. భర్తపట్ల విధేయురాలైన స్త్రీకి మాత్రమే పరలోకం దక్కుతుందని కూడా అన్నారు. ఇలా స్త్రీ లైంగిక జీవితంపై, ఆర్థిక జీవితంపై మగవాడి నియంత్రణ ఉండేటట్లు చేశారు. దాదాపు అన్ని మతాలలో స్త్రీ అణచివేత ధోరణి ఉంది. గిరిజన సంస్కృతి దీనికి కొంత మినహాయింపు. కాబట్టి వివక్ష అన్ని మతాల చట్టాలలోనూ ఉంది.

### చేయాల్సింది పర్సనల్ చట్టాల సవరణ

ప్రస్తుతం మనకు కావాల్సింది కామన్ సివిల్ కోడ్ కాదు. చేయాల్సింది పర్సనల్ చట్టాలలోని లోపాలను సరిదిద్ది ప్రజాస్వామీక రించాలి. అన్ని మతాల వివాహ చట్టాలలోని లోపాలను సరిదిద్ది, స్త్రీలకు గౌరవ ప్రదమైన స్థానం దక్కే విధంగా చేయాలి. పర్సనల్ చట్టాలలోని సామాజిక అంశం స్త్రీ, పురుష సంబంధాలు, వివాహం, విడాకులు, ఆస్తి హక్కులు మొదలగు అంశాలలో స్త్రీ పురుషులకు సమాన హక్కులు కల్పించాలి. అన్ని మత సాంప్రదాయాలు స్త్రీలకు అన్యాయం చేశాయనేది వాస్తవం. మతాల పర్సనల్ చట్టాలలోని అప్రజాస్వామిక లక్షణాలను తొలగించాలి. అన్ని మతాలు శాస్త్రీయమైన ప్రగతిశీల భావజాలాన్ని పెంపొందించుకోవాలి. తద్వారా మతంలోని మంచిని మిగుల్చుకొని, చెడును వదిలించుకోవాలి. కాలానుగుణంగా మార్పులు చేసుకోవాలి. మొత్తంగా స్త్రీల పట్ల మనదృక్పథంలో మార్పులు రావాలి. అందరికి సమాన హక్కులు కల్పించాలి. ఈ పని రాజ్యం చేయాలి. ఇదే మన రాజ్యాంగ స్ఫూర్తి కూడా. దీనికి చిత్తశుద్ధితో కూడిన రాజకీయ కార్యాచరణ ఉండాలి. అంతేకాని రాజకీయ ప్రయోజనాల కోసం సున్నిత అంశాలను వివాదాస్పదం చేయడం సరికాదు.

### ట్రిపుల్ తలాక్‌లో ఏముంది?

ముస్లిం షరియత్‌లో మూడు సార్లు తలాక్ విషయం గురించి తెలుసుకోవడానికి చిలకలూరిపేటలోని ఇస్లామిక్ పండితుడు (ముఫ్తీ) అబ్దుల్ రౌఫ్‌ను నేను కలసి ఆయనతో చర్చించిన సందర్భంలో ట్రిపుల్ తలాక్ గురించి పలు విషయాలు ఆయన వివరించారు. పైకి అనుకుంటున్నట్లు మూడు సార్లు పురుషుడు 'తలాక్, తలాక్, తలాక్' అని ఉచ్చరించగానే విడాకులు ఇవ్వడం జరగదని, దానికి చాలా ప్రాసెస్ ఉందని చెప్పారు. విడాకులు ఎలా మంజూరు చేయాలనే విషయం దివ్య ఖురాన్ నుంచి వచ్చిందని వివరించారు. విడాకులు కోరుతున్న జంటను అర్హులైన ముస్లిం పెద్దలు కూర్చోబెట్టి ఎంతో సర్ది చెబుతారు. కొన్ని రోజులు వారికి అవకాశం ఇస్తారు. అప్పటికి వారు కలసి జీవించలేం అని అన్న పక్షంలో ముందు ఒక తలాక్ ఇప్పిస్తారు. ఆలోచించుకొమ్మని ఇద్దరికి నచ్చజెప్పి కొంత సమయం ఇస్తారు. వారు మరల విడాకులు కావాలని వస్తే రెండో తలాక్ ఇప్పిస్తారు. మరికొంత సమయం ఇచ్చి చివరి అవకాశం ఇస్తారు. ఇంత చేసిన మేం ఇంకా ఏమాత్రం కలసి జీవించలేమని వారు ఇద్దరు ఇష్టపూర్వకంగా పెద్దల ముందు ఒప్పుకుంటే అప్పుడు మూడో సారి తలాక్ ఇప్పిస్తారు. మూడో తలాక్ ఇచ్చిన తరువాతే వారిద్దరు విడిపోయినట్లు ప్రకటిస్తారు. ఈ ప్రాసెస్‌కి భిన్నంగా తలాక్ ఇవ్వడం జరగదని చెప్పారు. ఈ పద్ధతిలో తలాక్ తీసుకుంటున్న వారు చాలా తక్కువ మంది అని ఆయన వివరించారు. అలాగే మహిళలు విడాకులు ఇవ్వవలసి వస్తే 'ఖులా' భర్తకి ఇవ్వవలసి ఉంటుంది. 'ఖులా' అంటే మహిళలు విడాకుల కోసం చెల్లించాల్సిన శుల్కం.

### ఉమ్మడి పౌరస్మృతిపై చర్చ ఇప్పుడు ఎందుకు?

హిందుత్వ శక్తులు కేవలం ముస్లిం ప్రజలనే లక్ష్యంగా చేసుకున్నాయి. హిందూ వివాహ చట్టంలోనూ పలు లొసుగులు, వివక్షా పూరిత అంశాలపై చర్చ జరగడం లేదు. కారణం ఇది ఆర్‌ఎస్‌ఎస్ ఎజెండా. 1925లో పుట్టిన భారత జాతీయోద్యమంలో ఎటువంటి పాత్రలేని ఆర్‌ఎస్‌ఎస్ అఖండ భారత నిర్మాణం ద్వారా ఈ దేశాన్ని హిందూ రాజ్యంగా మార్చడం ఈ సంస్థ లక్ష్యం. అందుకే ఆర్‌ఎస్‌ఎస్ మొదటి నుండి కూడా పాకిస్తాన్ ఏర్పాటునే కాదు, భాషా రాష్ట్రాలను, రాజ్యాంగంలోని ఫెడరల్ స్ఫూర్తిని వ్యతిరేకిస్తూ వచ్చింది. అంటే ఆర్‌ఎస్‌ఎస్ రూపమాత్రంగానే మతోన్మాద సంస్థ. సారాంశంలో ఫాసిజం దాని తత్వం. ఫాసిజం ఎప్పుడూ కూడా జాతి పేరిట సామ్రాజ్యవాద ప్రయోజనాలను కాపాడుతుంది. అందుకు మతోన్మాదంను వాడుకుంటుంది. జాతీయోద్యమానికి దూరమై మత కలహాలు సృష్టించి రాజకీయంగా లబ్ది పొందిన చరిత్ర ఆర్‌ఎస్‌ఎస్‌ది. ఇది తప్ప ఈ సంస్థకు చెప్పుకోవడానికి వారసత్వ చరిత్ర ఏమీ లేదు.

అందుకే జాతీయోద్యమంలో పాలుపంచుకొని దేశానికి ఎంతో మేలు చేసిన గొప్ప నాయకులను పక్కన బెట్టి వల్లభాయ్ పటేల్‌ను తమ ఖాతాలో వేసుకోవడానికి ఆయన్ను భుజానకెత్తుకొని నానా తంటాలు పడుతున్నారు. పటేల్ కాంగ్రెస్ నాయకుడనేది జగమెరిగిన సత్యం. అందుకే మహాత్మాగాంధీ 'ఇది ఏకపక్ష దృక్పథం గల మతతత్వ సంస్థ' అన్నారు. ఈ చారిత్రక దృక్పథంలో నుంచి కామన్ సివిల్ కోడ్ అంశాన్ని అర్థం చేసుకోవాలి. సంఘపరివార్ శక్తులు అత్యంత వివాదాస్పద అంశాలైన ఆర్టికల్ 370, రామజన్మ భూమి, ఉమ్మడి పౌరస్మృతి అంశాలను రాజకీయంగా వాడుకునేందుకు తెరమీదకు తెచ్చాయి.

# హిందూ మతోన్మాదం - మోడీ, యోగి

***కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ పెచ్చరిల్లుతున్న హిందూ మతోన్మాద పాలన లౌకిక శక్తుల ఐక్య పోరాటానికి రంగం సిద్ధం చేసిందంటున్నారు* డా. కత్తి పద్మారావు**

హిందూ మతోన్మాదం భారతావనిలో పెచ్చురిల్లుతోంది. అంబేద్కర్ స్వాతంత్ర్యానికి పూర్వం నుండే ఆర్ఎస్ఎస్ లౌకికవాదానికి శత్రువని చెబుతూనే వచ్చాడు. గాంధీ అన్యాపదేశంగా ఆర్ఎస్ఎస్ పట్ల ఉదాసీనత వహించాడు. చివరకు గాంధీనే ఆర్ఎస్ఎస్ శక్తులు కబళించాయి. ఆర్ఎస్ఎస్ మూలవాసుల సంస్కృతికి వ్యతిరేకి. ముస్లిం మైనార్టీలకు శత్రువు. ఎంతో నెత్తురు హిందూ, ముస్లిం ఘర్షణల్లో భరత ఉపఖండంలో ఇంకిపోయింది. అందుకే అంబేద్కర్ దళితులను బౌద్ధ మత స్వీకారం చేయమని బోధించాడు. బౌద్ధ మత స్వీకారం ఒక్కటే హిందూ మతం పునాదులను కదిలించగలుగుతుందని అంబేద్కర్ విశ్వసించాడు. ఇవాళ యూపిలో కరుడుగట్టిన ఆర్ఎస్ఎస్ వాది యోగి ఆదిత్యనాథ్ బౌద్ధం పునాదులు తొలిచివేయాలనే ప్రయత్నంలో ఉన్నాడు. ముస్లింలను బిజెపి ప్రత్యక్షంగా శత్రువులుగా ప్రకటించింది. అంతర్గతంగా దళితుల అణచివేతను ప్రకటించింది.

**అంబేద్కర్ పిలుపు**

ఈ సమయంలో అంబేద్కర్ ఎందుకు దళితులను బౌద్ధం తీసుకోమన్నాడో మనం అర్థం చేసుకోవాల్సిన చారిత్రక అంశం ముందుకొచ్చింది. అందుకే ఆయన బౌద్ధంలోకి దళితులు ఎందుకు రావాలో చెప్పేక్రమంలో దళితులకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం హిందూమతంలో లేవని ఇలా ప్రకటించాడు.

మత మార్పిడిని రెండు కోణాలలో పరిశీలించాలి. సామాజిక, మతపరమైన, భౌతిక, తాత్విక కోణాలు. కోణమేదైనా ఏ ఆలోచనా మార్గమైనా, మొదటగా అర్థం చేసుకోవలసిన విషయం ఒకటుంది. అస్పృశ్యత స్వభావం, దానిని ఆచరిస్తున్న తీరు. అది అర్థం చేసుకోకుండా మత మార్పిడిపై నా ప్రకటన వెనుక ఉన్న అర్థాన్ని మీరు గ్రహించలేరు. అస్పృశ్యత, వాస్తవ జీవితంలో దాని ఆచరణపై స్పష్టమైన అవగాహన కోసం, మీపై జరిగిన అత్యాచార ఘటనలను గుర్తు చేసుకోమంటాను.

మీ పిల్లలను ప్రభుత్వ పాఠశాలల్లో చేర్చే హక్కును కోరినప్పుడు లేదా ఊరి బావి నుంచి నీరు తోడుకునే హక్కును లేదా గుర్రంపై పెళ్లికొడుకుతో ఊరేగింపు తీసుకెళ్లడం వంటి చిన్న కారణాల వల్ల అగ్రవర్ణ హిందువుల చేతిలో తన్నులు తిన్న ఘటనల వంటివి జ్ఞాపకం తెచ్చుకోమంటాను.

మీ కళ్ల ముందే జరిగే అటువంటి ఘటనల గురించి మీకు తెలుసు. అగ్రవర్ణ హిందువులు అస్పృశ్యులపై అత్యాచారాలు చేసేందుకు కారణాలు ఇంకా అనేకం ఉన్నాయి. వీటిని వెల్లడిస్తే హిందుస్థాన్ ఆవల ఉన్న ప్రజలు నిశ్చేష్టులవుతారు. మంచిరకం దుస్తులు ధరించినందుకు అస్పృశ్యులను కొడతారు. కంచువంటి లోహాలతో చేసిన సామాగ్రిని ఉపయోగించినందుకు వారిని చాలాసార్లు కొరడాతో శిక్షించిన సందర్భాలున్నాయి. వ్యవసాయం చేసినందుకు వారి ఇళ్లు తగులబెట్టారు. జంధ్యం వేసుకున్నందుకు హింసించారు.

మృతజీవులను తీసుకువెళ్లేందుకు తిరస్కరించినందుకు, గ్రామ వీధులలో చెప్పులు వేసుకు తిరిగినందుకు లేదా అగ్రవర్ణ హిందువులకు వంగి సలాం కొట్టనందుకు, బహిర్భూమికి వెళ్లేటప్పుడు కంచుపాత్రలో నీరు తీసుకువెళ్లినందుకు వారు తన్నులు తిన్నారు. ఈ మత హింసల నుండి బయటపడాలంటే మీరు హిందూ మతం నుండి బయటపడండి అని, బౌద్ధంలోకి రండి అని పిలుస్తున్నాను అని అంబేద్కర్ అన్నాడు.

**హిందూ మతోన్మాది యోగి**

ఈరోజు ఇక్కడ హిందూ మతోన్మాది యోగి ఆదిత్యనాథ్‌ను యూపి ముఖ్యమంత్రిగా చేయడం వల్ల బిజెపి తన ఆర్ఎస్ఎస్ అజెండాను

ఈ మూడు అంశాలు ముస్లిం ప్రజలకు ఆందోళన కలిగించేవే. తద్వారా హిందూత్వ జాతీయవాదాన్ని రెచ్చగొట్టి రాబోయే ఎన్నికలలో రాజకీయంగా లబ్ధి పొందాలని ప్రయత్నిస్తుంది. గత ఎన్నికలలో ఎన్నో వాగ్దానాలు చేసి అధికారంలోకి వచ్చిన మోడీ ఆచరణలో పూర్తిగా విఫలమైనాడు.

'అచ్ఛేదిన్' వచ్చాయని ఢంకా భజాయించడం తప్ప చేసిందేమీ లేదు. ప్రజల మౌలిక సమస్యలైన పేదరికం, నిరుద్యోగం, అధిక ధరలు, విద్య, ఆరోగ్యం, ఉపాధి అవకాశాలు కల్పించడంలో విఫలమైన మోడీ ప్రభుత్వం ప్రజలు ఈ సమస్యల మీద ఉద్యమించకుండా ప్రజల దృష్టిని మళ్లించేందుకే ఈ కుయుక్తులు.

**కామన్ సివిల్ కోడ్ అవసరమా?**

భిన్న సంస్కృతులు గల భారతదేశానికి కామన్ సివిల్ కోడ్ అవసరం లేదు. పర్సనల్ చట్టాలలోని లోపాలను మంచిగా సవరించుకుంటే చాలు. ఒక సర్వే ప్రకారం హిందూ మహిళలతో పోలిస్తే ముస్లిం మహిళలకు అన్యాయం జరుగుతున్నదని చెప్పడానికి ఆధారాలేమీ లేవు. కోర్టులకు వస్తున్న కేసులలో 90 శాతం హిందువులవే. ముస్లిం ఇతర మైనారిటీ మతాలకు సంబంధించిన కేసులు కేవలం 10 శాతం మాత్రమే. అలాగే గర్భ విచ్ఛిత్తి, వరకట్న నిషేధ చట్టం, 498ఎ, వరకట్న హత్యలకు సంబంధించి సెక్షన్ 304బి ఇవన్నీ ఉమ్మడిగా అందరికీ వస్తాయి. 2005 గృహ హింస చట్టం కూడా అందరికి వర్తిస్తుంది. దేశంలోని ప్రజలందరికి కుల మతాల కతీతంగా పెళ్లిళ్లు చేసుకునే విధంగా 'స్పెషల్ మ్యారేజ్ యాక్ట్ 1954' కూడా ఉంది. ఇలా అందరికి వర్తించే చట్టాలుండగా ఇప్పుడు కామన్ సివిల్ కోడ్ ఎందుకు? ఎవరి ప్రయోజనాలకి? అనేది సింపుల్‌గా అర్థం చేసుకోవచ్చు.

*(రచయిత సామాజిక విశ్లేషకులు)*

ముందుకు తెచ్చినట్లయ్యింది. ఇక అస్పృశ్యతను స్వాతంత్ర్యానికి ముందు దశలో కొనసాగిస్తారు. దళితులు తమ సహజాహారమైన గోమాంసాన్ని తినడాన్ని ఆదిత్యనాథ్ రావడమే నిషేధించడాన్ని బట్టి అతని కక్ష్య, కార్పణ్యం అంతా దళితులమీదేనని అర్థమైంది. దళితులు ఏ ఆహారం అయినా తీసుకోవడం వారి హక్కు. వారికి ఏది బలం చేకూరుస్తుందో వారు ఆ ఆహారాన్ని తీసుకుంటారు. గోమాంస స్వీకారాన్ని నిషేధించటానికి ఆదిత్యనాథ్‌యోగి ఎవరూ?

నిజానికి ఆదిత్యనాథ్ హిందూవాదే కాక ఠాగూర్‌ల నాయకుడు. గోరఖ్‌పూర్ పట్టణంలో 52 ఎకరాల సువిశాల ప్రాంగణంలో ఉన్న గోరఖ్‌పూర్ మఠానికి అధిపతి. 2007లో గోరఖ్‌పూర్‌లో జరిగిన మత ఘర్షణలలో అరెస్ట్ అయి జైలులో ఉన్నాడు. 2014 నుంచి గోరఖ్‌పూర్ మఠానికి అధిపతి కూడా. 1998 నుండి 2014 వరకు ఐదుసార్లు ఎంపిగా గెలిచాడు. ఇతను కరుడుగట్టిన ముస్లిం దళిత వ్యతిరేకి.

ఆదిత్యనాథ్ అసలు పేరు అజయ్‌సింగ్. 1972 జూన్ 5వ తేదీన పుట్టాడు. ఈయన బిజెపి ఎంపి మహంతి అవైద్యనాథ్ కుమారుడు. తండ్రి ఈయన కంటే కూడా ఘనుడు. ఉత్తరప్రదేశ్‌లో జరిగిన అనేక మత వివాధాల్లో ఆయన ముద్దాయి. సాక్ష్యాత్తు బాబ్రీ మసీదు ముద్దాయిల్లో ఈయన తండ్రి ఒకడు. ఇంతవరకు ఏ ఎంపి కూడా ఈయన ఉన్నటువంటి మతఘర్షణ కేసుల్లో లేదు.

మహరాజ్‌గంజ్ జిల్లా రుకియానా గ్రామంలో శ్మశాన స్థలాన్ని ఆక్రమించేందుకు ప్రయత్నించారంటూ 1997లో ఆయనపైన అనేక సెక్షన్ల కింద కేసులు నమోదయ్యాయి. 2007లో గోరక్‌పూర్‌లో జరిగిన మత ఘర్షణల్లో ఆదిత్యనాథ్‌ను పోలీసులు అరెస్ట్ చేశారు కూడా.

ఇలా చెప్పుకుంటూపోతే ఆయనపై ఎన్నో కేసులు. ఎన్నికల అఫిడవిట్‌లో పేర్కొన్న వివరాల ప్రకారమే 147, 148, 153ఏ, 295, 297, 336, 435, 506, ఐపిసి సెక్షన్ల కింద ఆయనపై కేసులు నమోదైనాయి. 2007లో తనను పోలీసులు అరెస్ట్ చేసినప్పుడు బిజెపి అండగా నిలబడలేదన్న కోపంతో ఆ పార్టీపై ఆయన తీవ్ర వ్యాఖ్యలు చేశారు. బిజెపికి పోటీగా ఉత్తరప్రదేశ్‌లో హిందూ యువవాహిని సంస్థను కూడా ఆయన ఏర్పాటు చేశారు.

### హిందూ సాయుధ సేనకు నాయకుడు యోగి

సామాజిక, సాంస్కృతిక రంగాల్లో యువతకు శిక్షణ ఇవ్వడం ఈ సంస్థ ఉద్దేశ్యమని ప్రకటించినప్పటికీ ఆచరణలో ఆయుధాల వినియోగంలో కూడా యువతకు శిక్షణ ఇస్తున్నారన్న ఆరోపణలున్నాయి. ఆదిత్యనాథ్ సంఘపరివార్ అజెండాను ఇక ముందుకు తీసుకొస్తార నడంలో ఎటువంటి ఆశంక లేదు. ఇక బ్రాహ్మణాధిపత్యం దేశంలో కొనసాగాలని చూస్తున్నారు. మొత్తం పాఠ్య గ్రంథాల్లో కూడా హిందూ వాదాన్నే ముందుకు తీసుకొస్తారు. ఈ విషయం మీద మహాత్మాపూలే తన గులాంగిరిలో ఎప్పుడో వాదించాడు.

### మహాత్మాపూలే విశ్లేషణ

ముఖ్యంగా బానిసలకు బోధించే విద్య బానిసత్వాన్ని ప్రేరేపిస్తుంది. మీరు మాకు సాంఘికంగా లోబడి ఉండాలని బ్రాహ్మణులు బోధిస్తున్నారు. ఈ విషయాన్ని మహాత్మాపూలే బ్రాహ్మణ విద్య నిర్మాణంలో ఉన్న బానిసత్వాన్ని ఇలా తెలిపారు. బ్రాహ్మలు గెలిచాక ఓడిపోయిన ఆదిమవాసులకి జ్ఞానం అనే వెలుతురు లేకుండా చేసి నిత్యాంధకారంలో ఉంచడం చేత వాళ్ల పాచిక పారింది. వాళ్ల ఉద్దేశాలు నెరవేర్చుకున్నారు. విజేతల మోసాల్నీ, దుర్మార్గాలనీ అణగదొక్కబడినవాళ్లు అర్థం చేసుకోలేక పోయారు. ఓడిపోయినవాళ్లని అణగదొక్కడానికి, యుగయుగాల పర్యంతం వాళ్లని బానిసత్వంలో నిలిపి ఉంచుకోవడానికీ ఆర్యులు చాలా కపట గ్రంథాల్ని తయారుచేసి అవన్నీ ఏకాఏకిన దేవుడి ముఖంలోంచి ఊడిపడ్డ ప్రకాశిత వాక్యాలని చెప్పుకొన్నారు. ఈ పచ్చి అబద్ధాన్ని దిగమింగేలాగ బీదల్నీ అజ్ఞానుల్నీ వొప్పించారు.

ఓడిపోయిన వాళ్లు తమ రాజ్యం దొంగిలించిన వాళ్లకి విశ్వాసంతో దాస్యం చెయ్యాలనీ, అప్పుడే దేవుడికి ప్రీతి అనీ, దేవుడు దళిత ప్రజల్ని సృష్టించడంలో ఉద్దేశం దోపిడీదార్లని విశ్వాసంతో కొలవడం కోసమేననీ, ఈశ్వరాజ్ఞ ప్రకారం ఈ ఫలాన్నే భక్తితో కోరుకోవాలనీ, ఏవేవో కల్లబొల్లి కథలు వాళ్ల పవిత్ర గ్రంథాల్లో రాసుకొన్నారు. వాళ్లు కపట మత గ్రంథాల్లో ఈ కట్టు కథల్ని వర్ణించి చెప్పారు.

ఈ కృతక గ్రంథాల్ని పైపైన తిప్పి చూసినా, వీటికి దైవ మూలం ఉందనే పుక్కిటి పురాణాల్ని పటాపంచలు చేసెయ్యవచ్చు. చమత్కారులైన మన బ్రాహ్మణ సోదరులకి కూడా (వీరిని సోదరులనడానికి మనకి సిగ్గుగా ఉంది) ఈ కృత్రిమ మతగ్రంథ రచనలు అపకీర్తి తెస్తాయి. అండ పిండ బ్రహ్మాండాల సృష్టికర్త, సర్వశక్తిమంతుడు, అఖిల ప్రాణుల యెడలా సమాన ప్రేమా, ఆదరణా కల్గినవాడు ఆయనకి కూడా ఇది తిరస్కారమే అని పూలే తన పుస్తకంలో వివరించారు.

మహాత్మాపూలే విద్యలో కల్పనాత్మకమైన భావాల్ని ప్రచారం చేయడాన్ని ఖండించాడు. విద్య విజ్ఞానాత్మకమైంది. ప్రపంచ దేశాలన్నింటిలో విద్య వల్ల మానవులు చైతన్యవంతమయ్యారు. తమకున్న మూఢనమ్మకాలను పోగొట్టుకున్నారు. కానీ భారతదేశంలో విద్య మనిషిని మార్చలేకపో తున్నది. దేవుడు, దెయ్యం అనే భావాన్ని దాటితేకాని విద్య తలకెక్కదు. ఇక్కడ ఆ భావాల్ని పెంచి పోషించేదిగా విద్య ఉందని మహాత్మాపూలే ఆనాడే చెప్పాడు.

### శూద్రులను బానిసలుగా మార్చిన హిందూవాదం

ఆర్‌ఎస్‌ఎస్, విశ్వహిందూ పరిషత్, బిజెపి శూద్రుల చేతే శూద్రుల కంట్లో పొడిపించాలని ప్రయత్నం చేస్తున్నారు. ఇక్కడ యోగికి అర్థం కాని విషయమేమిటంటే స్మృతుల్లో శూద్ర బానిసత్వాన్ని గురించి ఇలా చెప్పబడింది. అతీవ తృషితో విప్ర:న శూద్ర స్యోదకం పిబేత్॥ శూద్రహస్తేన యో భుంక్తే పానీయం నాపిబేత్క్వచిత్ అహోరాత్రోషితో భూత్వా పంచగవ్యేన శుద్ధ్యతి అంటే ఎంత ఆకలి వేసినా, ఎంత దప్పిక వేసినా బ్రాహ్మణుడు శూద్రుని చేత అన్నమును గాని, పానీయమును గాని స్వీకరించకూడదు. స్వీకరిస్తే అతడు ఒక పగలు, ఒక రాత్రి ఉపవాసం ఉండి, తర్వాత పంచగవ్యముచేత శుద్ధి పొందాలి.

ఆదిత్యనాథ్ యోగి శూద్రుడే. ఎన్నో దేవాలయాలకు వెళ్లటానికి అతడు అనర్హుడు. బ్రాహ్మణులకు భోజనం వడ్డించటానికి అనర్హుడు. కాని ఆయన బ్రాహ్మణులు ఇచ్చిన కరవాలాన్ని పూని శూద్ర, అతిశూద్రుల మీద దాడులకు ఉరుకుతున్నాడు. నిజానికి పరాశరుడు ఆయన స్మృతిలో శూద్రుల గురించి ఏం చెప్తున్నాడో చూడండి. శూద్రాన్నం శూద్రసంపర్కం శూద్రేణతు సహాసనం శూద్రాత్ జ్ఞానాగమ: కశ్చిత్ జ్వలంత మపి పాతయేత్ (పరాశర స్మృతి) కాబట్టి, శూద్రుని అన్నం, శూద్రుని సంపర్కం, శూద్రుని పక్క కూర్చోవటం, శూద్రుని వద్ద విద్య అభ్యసించటం అనే ఈ నాలుగు బ్రాహ్మణుడు చేయకూడనివి. ఆదిత్యనాథ్ యోగికే కాకుండా నరేంద్రమోడీకి కూడా ఈ సూత్రాలన్నీ వర్తిస్తాయి. వాళ్లు తమను బానిసత్వానికి గురిచేసే సిద్ధాంతాలనే తలకెత్తుకు మోస్తున్నారు. మరి

వీరు గోమాంస విక్రయాన్ని నిషేధిస్తున్నారు. పరాశరుడు బ్రాహ్మణులకు పాలమ్మడాన్ని నిషేధించాడు. సముద్ర యానాన్ని నిషేధించాడు.

త్ర్యహేణ శూద్రోభవతి బ్రాహ్మణ: క్షీరవిక్రయాత్ - (స్మృతి ముక్తాఫలే, అహ్నిక కాండే, విష్ణుపురాణేచ) అంటే మూడు పూటలు పాలు అమ్మినంత మాత్రాన, బ్రాహ్మణుడు శూద్రుడు అవుతున్నాడు. సముద్ర యానగమనమ్ బ్రాహ్మణస్య నశాస్యతే సంభవేద్యదిమోషేన పునస్సంస్కార మర్హతి (ప.స్మృ) అంటే మూడు వందల అరవై ఐదు దినములలో ఎప్పుడు సముద్ర ప్రయాణం బ్రాహ్మణుడు చేయకూడదు.

ఇప్పుడు బ్రాహ్మణులు తమ వృత్తుల్లో లేరు. పాలు అమ్ముతున్నారు. సముద్రయానం చేస్తున్నారు. మరి శూద్రులకు ఎందుకు నియమాలు పెట్టారు. అతిశూద్రులకు ఎందుకు నియమాలు పెట్టారు. ఆ నియమాలను ఇప్పటికీ ఎందుకు ఆచరిస్తున్నారు? నరేంద్రమోడీ, ఆదిత్యనాథ్‌యోగి తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. ద్వేషంతో దేశాన్ని పాలించలేరు. మనం ఒకసారి పరిశీలిస్తే ఉత్తర్‌ప్రదేశ్ మంత్రిమండలిలో ఒక్క ముస్లిం కూడా లేదు. ఎన్నికల్లో నాలుగు వందల మూడు స్థానాల్లో ఒక్కస్థానం కూడా ముస్లింకు ఇవ్వలేదు. ఇది రాజ్యాంగబద్ధమైన నిర్ణయమేనా?

అంటే మోడీ, యోగి ఇద్దరూ శూద్రులే అయినా హిందూవాదం చేతిలో పదును గల ఆయుధాలుగా మారిపోయారు. బ్రాహ్మణులు శూద్రులకే నీతులు చెప్పారు. శాస్త్రాలను తప్పకుండా ఆచరించాలని చెప్పారు. కానీ వారు ఆచరించరు. నటన, నాట్య వృత్తులను ఒక చండాలురకు మాత్రమే నిర్దేశించారు. మరిబ్రాహ్మణులు నటనను ఎందుకు వృత్తిగా చేసుకుని బ్రతుకుతున్నారు. ఈ విషయాన్ని కొప్పరపు సుబ్బారావు తన శాస్త్ర దాస్యంలో ఇలా ఉట్టంకించారు.

రజక శ్చర్మ కారశ్చ నటోబురుడ వీవచ
కైవర్త మేదభిల్లాశ్చ సప్తై తేంత్యజా: స్మృతా: - (మితా)
చండాలా ద్వివిధా: అంతరా బాహ్యశ్చ:
అంతరాపి ద్వివిధా: తత్రప్రథమే ఆద్యా:
రజకశ్చర్మ కారశ్చ నటోబురుడ ఏవచ - (హేమా)
ఏతే విప్రై ర్వర్జ్యా: ప్రయత్నత: - (తత్రైవ)

ఈ శ్లోకముల అభిప్రాయాలను బట్టి చూడగా మన శాస్త్రములు నటవృత్తిని చండాలురకు మాత్రమే నిర్దేశించినవి. అందువల్లనే ఆ నట వృత్తి బ్రాహ్మణులకు 'వర్జ్యా: ప్రయత్నత:' అని శాసించుచున్నవి. మరి చండాలురకే తగిన ఆ నాట్య వృత్తిని అవలంభించి జీవయాత్ర చేస్తున్న వందలకొలది నేటి బ్రాహ్మణ నటీనటులకు ఎవరు చండాల సమానులుగా పరిగణింపబడవలసినదేనా? (శాస్త్ర దాస్యం, కొప్పరపు సుబ్బారావు)

కొప్పరపు సుబ్బారావుగారు తన శాస్త్రదాస్యంలో బ్రాహ్మణులను ఈ విషయంపై నిలదీస్తున్నారు. వాళ్లు ఏం సమాధానం చెప్తారు?

**లౌకిక శక్తులు ఐక్యం అవ్వాలి**

వీళ్లిద్దరు మహాత్మాపూలేను, అంబేద్కర్‌ను జపిస్తూనే ముస్లింలకు, దళితులకు వ్యతిరేకంగా పరిపాలన చేయాలని చూస్తున్నారు. సెక్యులర్ స్టేట్‌లో రాజ్యాంగమే ప్రధానమైన గ్రంథం. రాజ్యాంగ సూత్రాలను అనుసరించినప్పుడే వీరు భారతదేశాన్ని పరిపాలించగలుగుతారు. భారతదేశ భౌగోళిక పరిస్థితులను బట్టి అనేక మతాలు భారతదేశానికి వచ్చాయి. భారతదేశ చరిత్ర రచించిన ప్రతి ఒక్కరు ఆర్యులు భారతదేశానికి వలస వచ్చారని చెప్పారు.

హిందూవాదం కూడా భారతీయం కాదు. వేదాలు అభారతీయమని చెప్పారు. హిందూ, బౌద్ధ, జైన, ముస్లిం, జొరాష్టియన్, సిక్కు అనేక మతాలు ఇక్కడ ఉన్నాయి. ఏ మతమైనా మానవత్వాన్ని ప్రబోధిస్తేనే నిలబడుతుంది. మత నాయకులు రాజ్యాన్ని పాలించలేరు. రాజ్యాన్ని పాలించాలంటే రాజ్యాంగం తెలిసి ఉండాలి.

రాజ్యాంగం అంటే ప్రజాస్వామ్య, లౌకికవాద, సామ్యవాద సిద్ధాంతాల పునాదుల మీద నిర్మించబడింది. ఈ పునాదులు అర్థం కాకుండా మోడీ, యోగి భారతదేశ పాలకులు కాలేరు. ఒకవేళ అయినా పాక్షికమైన సమాజాన్నే వాళ్లు పాలించగలుగుతారు.

ఇప్పుడు లౌకికవాద శక్తుల ఐక్యపోరాటానికి అనువైన సమయం.. అంతిమ విజయం రాజ్యాంగ శక్తులదే..

*(రచయిత సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షులు, నవ్యాంధ్రపార్టీ)*

వీ

---

*(... 4వ పేజీ తరువాయి)*

*వ్యవసాయదారునికి ఉందా? భారత దేశంలో వ్యవసాయం ఒక వ్యాపారం కాదు. ఆ స్థాయికి చేరుకోలేదు. అది ఒక ఉద్యోగం కాదు. అది ఒక జీవన విధానం. కాని వ్యవసాయ రంగంలో కూడా వ్యాపారులు ఉన్నారు. వారు దళారులు. పెట్టుబడితో నిమిత్తం లేకుండా మధ్య దళారీలు లక్షలు ఆర్జిస్తున్నారు. ఆర్థిక పరి భాషలో మధ్య దళారీకి, పెట్టుబడిదారునికి పెద్ద తేడా ఉంది కదా!*

*పెట్టుబడిదారీ దేశాలలో వ్యవసాయం పెద్ద పెద్ద కమతాలలో చేయబడుతుంది. ఒక్కో కమతం వేల ఎకరాల విస్తీర్ణంలో ఉంటుంది. భారతదేశంలో ఆ పరిస్థితి ఉందా? ఉదాహరణకు తెలంగాణ రాష్ట్రాన్ని తీసుకుంటే ఇక్కడ సగటు వ్యవసాయ కమతం విస్తీర్ణం 1.12 హెక్టార్లు. 62 శాతం కమతాలు ఒక హెక్టారు కంటే తక్కువ విస్తీర్ణం కలిగి ఉన్నవి. 23.9 శాతం భూ కమతాలు 1-2 హెక్టార్ల మధ్య ఉన్నవి. అంటే 85 శాతం కమతాలు సన్నకారు రైతుల ఆధీనంలో ఉన్నవి. ఆంధ్రప్రదేశ్‌లో కూడా అదే పరిస్థితి. నేను ఈ మధ్య గుంటూరు జిల్లాలోని రెండు గ్రామాలు చూశాను. ఆ రెండు గ్రామాలలో రైతులు 1 నుండి 5 ఎకరాలలోపు ఉన్న భూ కమతాలలోనే వ్యవసాయం చేస్తున్నారు. గ్రామానికి ఒకరో ఇద్దరో ధనిక రైతులు ఉంటారు. వారికీ పాతిక ఎకరాల కంటే ఎక్కువ భూమి ఉండదు. తెలంగాణ రాష్ట్రంలో నీటి పారుదల సౌకర్యాలు గల పొలాలు 2014-15లో 17.26 లక్షల హెక్టార్లు ఉండగా 2015-16 సంవత్సరానికి 13.9 శాతం తగ్గిపోయి 14.36 లక్షల హెక్టార్లుగా తగ్గిపోయాయి. ఇవి అధికారిక గణాంకాలు. ఆహార ధాన్యాల నిల్వ కోసం ప్రభుత్వాలు గిడ్డంగులను నిర్మిస్తున్నాయి. ఆ గిడ్డంగుల్లో ఎవరైనా రైతు తన పంట నిల్వ ఉంచుతున్నాడా? ఆ గిడ్డంగులన్నీ మధ్య దళారీలకే పూర్తిగా ఉపయోగపడుతున్నాయి. దళారీ వ్యవస్థ బలపడడాన్ని క్యాపిటలిజం అభివృద్ధి పొందుతున్నట్లు భావించగలమా?*

*గ్రామానికి ఒకరో ఇద్దరో ధనిక రైతులున్న మాట వాస్తవమే. ఆ ధనిక రైతుల వ్యవసాయం 'మిగుల్లు' పారిశ్రామిక రంగంలో 'పెట్టుబడి'గా ప్రవహిస్తున్నాయనడానికి ఎక్కడా ఆధారాలు లేవు. పోనీ వ్యవసాయ రంగం లోనే తిరిగి 'పెట్టుబడి'గా ఉపయోగపడుతున్నాయా అన్నదీ అనుమానాస్పదమే. అవి వారి పిల్లల కార్పొరేట్ చదువులకు, కార్పొరేట్ జీవిత సరళికే ఎక్కువగా ఉపయోగపడుతున్నది గాని, వ్యవసాయంలో 'పెట్టుబడి'గా ఉపయోగపడడం లేదన్నది కూడా వాస్తవమే. భారత వ్యవసాయ రంగంలో క్షేత్రస్థాయి పరిస్థితులను పరిగణనలోకి తీసుకుంటే 'క్యాపిటలిజం' ప్రవేశించడం దాదాపు అసాధ్యమే అనిపిస్తుంది. అయినా, డి. నరసింహారెడ్డి లాంటి సామాజిక ఆర్థికవేత్త ఈ వాదన చేస్తున్నారంటే దానిపై తప్పని సరిగా చర్చ జరగవలసిందే!*

**- రాజేంద్రబాబు అర్విణి**
హైదరాబాద్.

# సిరియాపై అమెరికా దుర్మార్గం

***అగ్రరాజ్యాల ఆధిపత్య దురహంకార నీతికి సిరియా తీవ్రంగా నష్టపోతోందనీ, దేశంలో కొనసాగుతున్న యుద్ధ, అంతర్యుద్ధ దాడుల వల్ల సామాన్య పౌరులు బలవుతున్నారనీ అంటున్నారు*** **అర్విణి రాజేంద్రబాబు**

గత ఆరు, ఏడు ఏండ్లుగా నిరంతరం రక్తం స్రవిస్తున్న భూఖండం సిరియా. రష్యా, అమెరికా లాంటి బలవత్తరమైన సైనిక శక్తులు ఆడుతున్న ఆధిపత్య చదరంగపు ఆటలో సదా ఆటుపోట్లకు గురవుతున్న దేశం సిరియా. సిరియా అంతర్యుద్ధం ప్రారంభమయినప్పటి నుండి ఇంత వరకు 4 లక్షల 65 వేల మంది సిరియన్ పౌరులు సైనిక దాడుల్లో, బాంబు తాకిళ్లతో ప్రాణాలు కోల్పోయారు. 10 లక్షల మందికి పైగా క్షతగాత్రులయ్యారు. 1 కోటి 20 లక్షల మందికి పైగా నిర్వాసితులయ్యి, పొట్ట చేతపట్టుకొని ఆహారం కోసం, ప్రాణ రక్షణ కోసం ఇతర దేశాలకు వలసపోయారు.

'అరబ్ వసంతం'గా చరిత్రకెక్కిన అరబ్ దేశాల పౌర స్పందన టునీషియా, ఈజిప్టు దేశాల అధ్యక్షుల్ని పదవీచ్యుతులని చేసింది. సిరియాలో కూడా ఈ అరబ్ వసంత గాలులు బలంగా వీచాయి. కాని సిరియా అధ్యక్షుడు బషర్-అల్-అస్సద్ ప్రజాందోళనను కర్కశంగా అణిచివేసే ప్రయత్నం చేశాడు. అరబ్ వసంతాన్ని సమర్థిస్తూ బహిరంగ స్థలాల్లో నినాదాలు రాసిన ముక్కుపచ్చలారని 15 మంది బాలురను నిర్బంధించి చిత్రహింసల పాలు చేసిన సంఘటనతో 2011లో ప్రభుత్వ వ్యతిరేకత ఒక్క సారిగా పెల్లుబికింది.

హంజీ అనే 13 ఏళ్ల బాలుణ్ని సైనిక బాలాలు తీవ్రంగా హింసించి చంపివేయడంతో ప్రజలు రోడ్ల మీదకు వచ్చి బషర్ అస్సద్‌కు వ్యతిరేకంగా ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. ప్రజలపై సాగుతున్న హింసాకాండను, అణిచివేత విధానాలను సహించలేక కొన్ని వేల మంది సైనికులు సైన్యాన్ని వీడారు.

సిరియా సైనిక బలగాల నుండి తిరుగుబాటు చేసి బహుళ సంఖ్యలో బయటకు వచ్చిన సైనికులు 2011లో 'ఫ్రీ సిరియన్ ఆర్మీ'ని ఏర్పాటు చేశారు. ఇది ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏర్పాటైన సంస్థ. ఆర్థిక ఇబ్బందులతో పాటు పౌరులకు భావప్రకటనా స్వేచ్ఛ, ఇతర ప్రాథమిక స్వాతంత్ర్యాలు హక్కులు లేకపోవడంతో కుతకుతలాడుతున్న సిరియా సమాజం 'ఫ్రీ సిరియన్ ఆర్మీ' ఏర్పాటుతో అంతర్యుద్ధంలోకి జారుకుంది. సిరియాలో ప్రజాస్వామ్య వాదులు, ఇస్లాం మతంలో సంస్కరణ వాదులు కొంత మంది అసద్ ప్రభుత్వాన్ని బలంగా వ్యతిరేకిస్తూ వర్గాలుగా మారిపోయాయి.

ప్రారంభంలో సిరియా అంతర్యుద్ధంలో మత ప్రస్తావనలు లేకున్నా, తరువాతి కాలంలో సైన్యంలో మత ప్రాతిపదికపై చీలికలు రావడం ప్రారంభమైంది. ఎక్కువగా 'సున్నీ' మతస్థులు అస్సద్‌కు వ్యతిరేకంగా, 'అలవైట్' అన్న మత సమూహానికి చెందిన వారు అస్సద్‌కు అనుకూలంగా యుద్ధంలో పరస్పరం సంఘర్షించుకునే శక్తులుగా మిగిలిపోయాయి. సిరియా దేశంలో అధిక సంఖ్యాకులు సున్నీ మతస్థులే. కాని అధికార వర్గంలో మాత్రం 'అలవైట్' వర్గానికి చెందిన వాళ్లే ఆధిపత్యం చెలాయిస్తున్నారు.

అంతర్యుద్ధం ప్రబలడానికి ప్రకృతిలో నెలకొన్న వర్షాభావ పరిస్థితులు కూడా తోడయ్యాయి. 2007 నుండి 2010 వరకు తీవ్రమైన క్షామ పరిస్థితులు దేశంలో నెలకొంది. దాదాపు 15 లక్షల మంది దేశాన్ని వదిలిపెట్టి ఆహారాన్ని, జీవన భృతిని వెతుక్కుంటూ వెళ్లిపోయే పరిస్థితి ఎదురయ్యింది.

మధ్య ప్రాచ్యంలో ఆధిపత్యం కోసం వెంపర్లాడుతున్న అమెరికా, రష్యాలు సిరియా అంతర్యుద్ధంలో ప్రవేశించి తలా ఒక పక్షాన్ని బహిరంగంగానే సమర్థించడంతో సిరియా ప్రపంచ పటంలోనే మాయని గాయంలా మారిపోయి ఊహకందని అకృత్యాలకు నిలయమైపోయింది.

బషర్ అస్సద్ ప్రభుత్వాన్ని రష్యా సమర్థిస్తుండగా, తిరుగుబాటుదారుల పోరాటానికి అమెరికా వెన్నంటి ఉంది. టర్కీతో సహా పలు అరబ్ దేశాలు తిరుగుబాటు దారులకు ఆయుధాలు సమకూర్చాయి. షియాలు ఎక్కువగా ఉన్న ఇరాన్, ఇరాక్ దేశాలు అస్సద్‌ను సమర్థిస్తుండగా, సున్నీలు అధిక సంఖ్యలో ఉన్న టర్కీ, ఖతర్, సౌదీ అరేబియా లాంటి దేశాలు అస్సద్ వ్యతిరేక శక్తులకు మద్దతు పలుకుతున్నాయి.

ఈ నేపథ్యంలో 2017 ఏప్రిల్ 4న అస్సద్ వ్యతిరేక శక్తుల ఆధీనంలో ఉన్న ఇడ్లిబ్ రాష్ట్రంలో ఖాన్ షేకేన్ అన్న పట్టణంలో రసాయన ఆయుధాలతో దాడి జరిగింది. అందులో 80 మంది పౌరులు, ముఖ్యంగా సగానికి పైగా పసి బాలురు మరణించారు. ఇది అవకాశంగా తీసుకుని, అమెరికా తన 'ఖాప్ పంచాయితీ' తత్వాన్ని మరోసారి బయట పెట్టుకుంది.

అమెరికా ప్రపంచమంతా తన కనుసన్నల్లో మెలగాలన్న వీధి రౌడీ మనస్తత్వాన్ని పదే పదే ప్రదర్శిస్తూ ఉంటుంది. తనదో న్యాయస్థాన మన్నట్లు, అందులో వాదించే వకీలు తానే, తార్పు చెప్పే న్యాయమూర్తి తానే, తీర్పు అమలు చేసే పోలీసు ఆఫీసరు తానే అన్న చందంగా వ్యవహరించడం దానికలవాటు.

ఖాన్ షేకేన్‌లో జరిగిన రసాయన ఆయుధాల దాడిలో ప్రాణాలు కోల్పోయిన 'అందమైన పసిపాపల' ఫోటోలు, వీడియోలు తనను కలిచివేశాయని, అందుకు సిరియా అధ్యక్షుడు అస్సద్‌ను శిక్షించడం కోసం సిరియాపై మిస్సైల్ దాడి చేస్తున్నట్లు ప్రకటించి ఏప్రిల్ 6న సిరియాపై బాంబుల వర్షం కురిపించాడు ట్రంప్.

ఇంత దయామయునిగా ఫోజుపెట్టిన ప్రెసిడెంట్ ట్రంప్, 'అందమైన పసిపాపల' అమాయకమైన మొఖాలు తన మనసులో కలత రేపాయని చెప్పిన ట్రంప్, ఈ సంవత్సరం మార్చ్ నెలలోనే అంటే సిరియాపై క్షిపణిదాడి జరగడానికి పక్షం రోజుల ముందు సిరియా, ఇరాక్, యెమన్‌లపై సైనిక దాడులు నిర్వహించాడు. ఆ దాడులలో 1,000 మంది పౌరులు మృత్యువాత పడ్డారు.

మనసు కలిచివేసే దృశ్యాలు చూసి నిజంగానే సిరియాపై మిస్సైల్ దాడికి ఒడిగట్టాడా ట్రంప్? అంత దయాళుడా అమెరికా అధ్యక్షుడు? అంత దయార్ద్ర హృదయుడయితే, తాను అధ్యక్షునిగా బాధ్యతలు చేపట్టిన వారం రోజుల్లోనే సిరియా నుండి శరణార్థుల రాకను ఎందుకు నిషేధించినట్లు? 'దయార్ద్ర హృదయుడైన'ఈ 'మానవతావాది' మార్చ్ 16న సిరియా దేశంలోనే అల్-జిన్నా హకా అనే పట్టణంలో ఒక మసీదును కూల్చివేయడానికి అమెరికా యుద్ధ విమానాలను పంపాడు.

బాంబింగ్ జరిగిన ఆ సమయంలో ఆ మసీదులో ప్రార్థనలు జరుగుతున్నాయి. ఆ దాడిలో 60 మంది పౌరులు మృతి చెందారు. దాదాపు అదే సమయంలో ఐసిస్ ఆక్రమణలో ఉన్న ఇరాక్ పట్టణం మోసుల్‌పై అమెరికా సైనికులు భీకరమైన దాడి జరిపారు. ఆ దాడిలో 200 మంది పౌరులు మృత్యువాత పడ్డారు. గత 25 సంవత్సరాలలో అమెరికా జరిపిన దాడులలోకెల్లా ఇది అతి హీనమైనదని వాషింగ్టన్ పోస్ట్ పత్రిక వ్యాఖ్యానించింది,

మరి, ట్రంప్ అకారణంగా సిరియాపై క్షిపణుల దాడికి ఎందుకు పాల్పడ్డట్లు? ఓటింగ్‌లో అయితే ట్రంప్ నెగ్గాడు గాని, బహుళ సంఖ్యలో అమెరికన్లు ఆయన్ను అధ్యక్షుడుగా అంగీకరించే పరిస్థితి లేదు. లక్షలాది మంది మహిళలు 'మాకొద్దీ ట్రంప్' అంటూ రోడ్డు మీదకు వచ్చారు. కొన్ని ముస్లిం దేశాల నుండి వచ్చే ప్రయాణికులను దేశంలోకి అడుగు పెట్టనియకుండా ట్రంప్ జారీ చేసిన ఆదేశాలను కోర్టులు కొట్టివేశాయి. వైట్ హౌస్‌లో తక్కువ సమయం గడుపుతూ, ఎక్కువ కాలం న్యూయార్క్ లోని తన 'ట్రంప్ హౌస్' లోనే ఉంటూ తన వ్యాపారాలు చక్కదిద్దు కుంటున్నాడని విమర్శలు ఎక్కువయ్యాయి.

ట్రంప్ పాలనను నిరసిస్తూ ఆఫ్రో - అమెరికన్ల ర్యాలీలు అధిక మయ్యాయి. ట్రంప్‌ను పదవి నుండి తొలగించాలని, అధ్యక్ష పదవి నుండి 'ఇంపీచ్' చేయాలని డిమాండ్ రావడం మొదలయింది. రష్యా అధ్యక్షుడు పుతిన్‌కు ట్రంప్ తొత్తు అని చాలా మంది అమెరికన్లు నమ్మడం ప్రారంభమైంది. ట్రంప్ గెలుపు వెనుక పుతిన్ హస్తం ఉన్నట్లు పత్రికా కథనాలు విరివిగా వెలువడ్డాయి.

అమెరికాకు, రష్యాకు మధ్య ఉండే జాతి వైరం అందరికీ తెలిసిందే. బద్ధశత్రువైన రష్యాతో, ఆ దేశపు అధ్యక్షునితో సఖ్యత ఏంటని ప్రశ్న మొదలైంది. ఇలా ఆత్మరక్షణలో పడిపోయిన ట్రంప్‌కు ఏదైన తీవ్రమైన చర్య, ప్రపంచ దృష్టిని ఆకర్షించే చర్య, అమెరికనల్ల దృష్టిని మరల్చే చర్య తీసుకోవాల్సిన అవసరం ఏర్పడ్డది. దేశాధినేతలపై ప్రజల అసంతృప్తి మెల్లమెల్లగా పరిధులు దాటుతుంటే తీవ్రమైన చర్య ఒకటి ఆ దేశాధినేత ఆలోచనల్లోకి వస్తుంది. అది యుద్ధం కావచ్చు. మరోటి కావచ్చు.

1970వ దశకంలో అప్పటి భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీకి ఇలాంటి అవసరమే ఒకటి ఎదురయింది. కోర్టు ఆమె ఎన్నికను కొట్టివేసింది. పెల్లుబుకుతున్న ప్రజల అసంతృప్తికి ఆలంబనగా జయప్రకాశ్ నారాయణ్ ఇచ్చిన 'సంపూర్ణ విప్లవ' నినాదం తోడయింది. స్వతంత్ర భారతదేశంలో ఎన్నడూ లేని విధంగా రైల్వే కార్మికులు సమ్మెకు దిగారు.

ఈ పరిస్థితులలో తన అధికారం కాపాడుకోవడం కోసం ఇందిరాగాంధీ అసాధారణ చర్యకు ఉపక్రమించారు. అదే దేశ వ్యాప్తంగా అత్యయిక పరిస్థితి విధించడం. ఎమర్జెన్సి ప్రకటించి తనకెవరూ ఎదురు తిరగకుండా అధికారం కాపాడుకునే ప్రయత్నం చేసింది ఇందిరాగాంధీ.

అలా తమ అధికార దృక్పథనాకి తూట్లు పడుతున్నప్పుడు దేశ ప్రజల దృష్టిని మరల్చడానికి నియంతలు అనేక మార్గాలు అన్వేషిస్తుంటారు. సిరియాపై క్షిపణి దాడుల యోచన ట్రంప్‌కు వచ్చిన ఆలోచన. దీంతో ప్రజల దృష్టిని కొంత మళ్లించగలనని, తానేమీ రష్యా దేశపు తొత్తును కానని ప్రజలకు చెప్పాలనుకున్నాడు. సిరియాపై క్షిపణి దాడుల తర్వాత ప్రజలలో ట్రంప్ రేటింగ్ 75 శాతం పెరిగిందని రష్యా ప్రభుత్వ టెలివిజన్ ఛానల్ ప్రకటించింది.

అమెరికాలో ట్రంప్ ప్రతిపక్షం డెమొక్రటిక్ పార్టీ నాయకులు హిల్లరి క్లింటన్, బెర్ని సాండర్స్ క్షిపణి దాడి కంటె ముందు హిల్లరి క్లింటన్ సిరియాపై బాంబుదాడి చేయాలని తన అభిప్రాయం చెప్పింది. రసాయన ఆయుధాల ప్రయోగం చేసినందుకు గాని అస్సద్‌ను ఖండించాల్సిందేనని బెర్ని సాండర్స్ పత్రికా ప్రకటన చేశాడు. అంటే, అమెరికాలో ప్రభుత్వ పక్షం, ప్రతిపక్షం రెండూ కూడా ప్రపంచ శాంతికి తామే రక్షకులమని, ఇతర దేశాలను శిక్షించే అధికారం తమకు ఉందని నమ్ముతున్నాయి.

అంతకు ముందు కూడా అమెరికా పూర్వ అధ్యక్షుడు బరాక్ ఒబామా మధ్య ప్రాచ్యంలో సైనిక చర్యకు పూనుకోను అని పైకి ప్రకటిస్తూనే, 2013లో అస్సద్ ప్రభుత్వంపై దాడి చేశాడు. అప్పుడు కూడా అస్సద్ రసాయనిక ఆయుధాలు ప్రయోగించాడన్న నెపం ప్రధానంగా ఉండింది. అప్పుడు ఒబామా జరిపిన దాడిలో 1,000 మందికి పైగా సిరియన్ పౌరులు మరణించారు. అప్పుడు బషర్ అస్సద్ రాజీకివచ్చి రసాయనిక ఆయుధాల ప్రయోగంపై అమెరికా విధించిన షరతులకు ఒప్పుకున్నాడు. ట్రంప్ స్వంత పార్టీలోనే ట్రంప్‌ను, ట్రంప్ విధానాలను తక్షణంగా వ్యతిరేకించే అరిజోనా సెనేటరీ మెక్ కెయిన్, దక్షిణ కెరోలినా సెనేటరీ అండన్ గ్రాహం కూడా అస్సద్ 'లక్ష్మణ రేఖ' దాటాడని, ఇందుకు అతణ్ని శిక్షించవలసిందేనని ట్రంప్‌కు సలహా ఇచ్చాడు.

అయితే, సిరియా దేశంలో తిరుగుబాటు దారుల ఆధీనంలో ఉన్న ఒక పట్టణంలో జరిగిందని చెప్పబడుతున్న రసాయన ఆయుధాల దాడి వెనక అస్సద్ ప్రభుత్వం హస్తం నిజంగానే ఉందా? అన్నది చర్చనీయాంశమే. అస్సద్ ప్రభుత్వం తనవల్లే ఈ దాడి జరిగిందన్న ప్రచారం ఒక అభూత కల్పన అని కొట్టి పారేసింది.

అమెరికా పాల్పడిన దుందుడుకు సైనిక చర్యను సమర్థించుకునేందుకు ఈ ప్రచారానికి తలపెట్టిందని, తనను అప్రతిక్షపాలు చేసేందుకు అమెరికా ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదని సిరియా అధ్యక్షుడు అస్సద్ ఆరోపణ. ఇదిలా ఉండగా, సిరియాలో జరిగిన రసాయన ఆయుధాలు ఉపయోగించిన సంఘటనను తీవ్రంగా ఖండించాలని, ఇది సభ్య దేశాల ఒడంబడికకు వ్యతిరేకమని అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు సంయుక్తంగా ఐక్యరాజ్య

# కొండలుంటే ఏంటి? పోతే ఏంటి?

**అభివృద్ధి పేరుతో తెస్తున్న ప్రాజెక్టుల వల్ల పర్యావరణం దెబ్బతింటుదనీ, పర్యావరణ పరంగా అరుదైన తూర్పు కనుమలు కూడా కనుమరుగయ్యే ప్రమాదం ఉందనీ, వీటిని కాపాడుకోవడం సామాజిక బాధ్యతగా గుర్తించాలని అంటున్నారు బి. శ్రీనివాసరావు**

ఒరిస్సా నుండి ఆంధ్రప్రదేశ్, కర్ణాటకలను కలుపుకుంటూ తమిళనాడు వరకు విస్తరించి ఉన్న ఒక ప్రధాన ఆర్థిక వనరు తూర్పు కనుమలు. భౌగోళికంగా ఎంతో ప్రాధాన్యం కలిగి ఉన్న పురాతన పర్వత శ్రేణి ఈ తూర్పు కనుమలు. ఐక్యరాజ్య సమితి ప్రత్యేక గుర్తింపు పొందిన పశ్చిమ కనుమల కంటే పురాతనమైనవి. పర్యావరణ పరంగా ముఖ్యమైనవి అయిన ఈ కనుమల పరిరక్షణలో నేడు అనేక సవాళ్లు ఎదురవుతున్నాయి. వేగవంతమైన ఆర్థిక అభివృద్ధి, పెరుగుతున్న జనాభా అవసరాలు సుస్థిర అభివృద్ధి లక్ష్యాలకు పెద్ద అడ్డు గోడలుగా నిలుస్తున్నాయి. ప్రపంచం అంతా సమానత్వం, ఆర్థిక పరమైన విజ్ఞత, పర్యావరణ పరిరక్షణ అనే మూడు ప్రధాన భావనలతో కూడిన అభివృద్ధిని సాధించడం అని వివరించేదానినే సుస్థిర అభివృద్ధి, నిలకడగల అభివృద్ధి అని ఐక్యరాజ్య సమితి నిర్వచించింది.

అభివృద్ధి పేరుతో రోడ్లు, ప్రాజెక్టుల నిర్మాణం పేరుతో జరుగుతున్న వివిధ ఆర్థిక వ్యవహారాలు, ఎంతో మంది ప్రజలను ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రభావితం చేస్తున్నాయి. విలువైన అటవీ సంపద, జంతు జాలం అంతరించిపోతున్నాయి. ఇవన్నీ ఒకెత్తు అయితే, ఈ విధానాలు ఇలాగే కొనసాగితే అతికొద్ది కాలంలోనే ఇదివరకటి సహజవనరు అయిన 'బొగ్గు' వలె తూర్పు కనుమలు కూడా అంతరించిపోయే ప్రమాదం ఉంది. ఒకప్పటి తరం ప్రజలు కలలో కూడా ఊహించని విధంగా నీటిని ప్రస్తుత తరం మార్కెట్‌లో కొనుక్కొని గొంతు తడుపుకోవాల్సి వస్తున్నది. ప్రస్తుత తరం, ఊహించని విధంగా ఇప్పటికే మార్కెట్‌లోకి ఆరోగ్యకరమైన గాలి అమ్మకానికి వచ్చేసింది. ప్రతి శ్వాసకు రు. 12.50 పైసలు అయ్యేలా గాలి సీసాలు ప్రస్తుతం దొరుకుతున్నాయి. అగ్ని పర్వతాలు పేలడం, తుఫాను, సునామీల వంటి ప్రకృతి వైపరిత్యాల వలన ప్రకృతి దెబ్బతినడం కంటే మానవాళితోనే వాతావరణానికి 170 రెట్లు ఎక్కువగా హాని జరుగుతుందని ఇటీవల కొన్ని పరిశోధనలు వివరిస్తున్నాయి.

పర్వతాలు ప్రజలకు ఎన్నో రకాలుగా దోహదం చేస్తున్నాయి.

---

సమితిలో ప్రతిపాదించిన తీర్మానాన్ని రష్యా వీటో చేసింది. పది దేశాలు ఆ తీర్మానాన్ని సమర్థించగా రష్యా, బొలివియా దేశాలు వ్యతిరేకించాయి. చైనా, కజకిస్తాన్, ఇథోపియాలు ఓటింగ్‌కు దూరంగా ఉన్నాయి.

ట్రంప్ ప్రయోగించిన క్షిపణి దాడి బషర్ అస్సద్ ప్రభుత్వాన్ని ఏమాత్రం కదిలించలేక పోయిందన్నది వాస్తవం. అస్సద్ ప్రభుత్వం సైనిక శక్తికి అది పరీక్ష కానేకాదు. అయితే, దీని ద్వారా ట్రంప్ తన విమర్శకులను తన దారికి తెచ్చుకొనే ప్రయత్నం చేశాడు. డెమొక్రటిక్ పార్టీని, రిపబ్లికన్-పార్టీలోని తన వ్యతిరేకుల నోళ్లు మూయించే ప్రయత్నం చేశాడు.

రష్యా అధినేత పుతిన్‌కు కూడా తాను హెచ్చరికలు పంపగలనని అమెరికన్లకు తెలియజేశాడు. దాంతో పాటు తన ఆధిపత్య నైజాన్ని, తన అగ్రరాజ్య ఉనికిని కాపాడుకోవడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటానని ఉత్తర కొరియా, చైనా దేశాలకు ఈ క్షిపణి దాడి ద్వారా సందేశం పంపాడు. ఈ పనికోసం సిరియా పౌరుల ప్రాణులను బలిగా తీసుకున్నాడు.

ఈ చర్య వల్ల ట్రంప్ తనంతకు తానే సమస్యల వలయంలో చిక్కుకున్నాడని చెప్పవచ్చు. సిరియా అధ్యక్షుడు బషర్ అస్సద్ ఏమీ బలహీనపడలేదు. రష్యాతో సహా అంతర్జాతీయంగా ఆయన మద్దతు దారులు తమ మద్దతుకొనసాగిస్తూనే ఉన్నారు. తిరుగుబాటుదారుల ఆక్రమణలో ఉన్న ప్రాంతాలను తన ఆధీనంలోకి తెచ్చుకొనేందుకు తన ప్రయత్నాలు కొనసాగిస్తూనే ఉంటాడు. అందుకు బాంబు దాడులు, సైనిక దాడులు, వీలైతే రసాయన ఆయుధాలతో దాడులు చేస్తూనే ఉంటాడు.

వాటిని ఆపాలంటే అమెరికా పూర్తి స్థాయిలో యుద్ధానికి సన్నద్ధం కావలసి ఉంటుంది. పూర్తి స్థాయి యుద్ధంలోకి దిగితే, అమెరికా అంత తొందరగా బయటకు రాలేదు. ఆ దేశానికి వియత్నాంతో యుద్ధం చేసిన చేదు అనుభవం ఉంది. ఏది ఏమైనా అడపాదడపా ఇట్లాంటి సంఘటనలు పునరావృతమవుతూనే ఉంటాయి. సిరియా ప్రజలు అగ్ర రాజ్యాల అమానుషత్వానికి, స్వదేశీ రాజకీయ నాయకుల పదవీ కాంక్షకు బలవుతూనే ఉంటారు.

సిరియా జనాభాలో ఇప్పుడు సగం మాత్రమే ఆ దేశంలో మిగిలి ఉన్నారు. చాలా మంది సైనిక దాడులలో, బాంబు దాడులలో మరణించారు. మరి కొంతమంది రక్షణ కరువై దేశం వదిలిపెట్టి కాందిశీకులుగా వేరే దేశాలకు వెళ్లిపోయారు.

యుద్ధాల వలన, కరువు కాటకాలతో ఏర్పడిన దుర్భిక్ష పరిస్థితుల వలన, రాజకీయ రంగంలో నెలకొని ఉన్న అశాంతి వలన ఎన్నో కడగండ్లను ఎదుర్కొంటున్న సిరియాలోని సామాన్య ప్రజానీకానికి నైతిక మద్దతు తెలపాల్సిన బాధ్యత ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ప్రజాస్వామ్య వాదులది. మేధావులది.

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)*

ముఖ్యంగా పర్వతాలు వివిధ అడవులకు, తద్వారా వైవిధ్య భరితమైన జంతు జాలానికి ప్రధాన ఆధారంగా ఉంటున్నాయి. ప్రపంచంలో 5 శాతం భాగంలో పర్వతాలు ఉండి, 10 శాతం మంది ప్రపంచ జనాభా ఈ పర్వతాలలో ఆవాసాలు కలిగి ఉన్నారు. ఈనాటి ప్రధాన పర్యావరణ సమస్య అయిన 'గ్లోబల్ వార్మింగ్' (ఉష్ణోగ్రతలు పెరగడం) అనే అంశానికి అటవీ ప్రాంత క్షీణత ఒక ముఖ్య కారణం. గనుల తవ్వకం అనే ముఖ్యమైన ఆర్థిక కార్యకలాపం, పోడు వ్యవసాయం, స్మగ్లింగ్, జనాభా పెరిగి అడవులను ఆక్రమించుకోవడం మొదలగు పనులు మొదట అడవిని, తర్వాత జంతు జాలాన్ని, క్రమేణా కొండలను కనుమరుగు అయ్యేలా చేస్తున్నాయి. గ్రామాల నుండి వలసలు పెరిగి, పట్టణ అభివృద్ధి ప్రాధాన్యత సంతరించుకున్న వేళ కొండలను తొలచి ఫ్లైఓవర్లు, రోడ్లు, అభివృద్ధి ప్రాజెక్టులను నిర్మించడం అత్యవసరమయింది. ఇది ఒక రకంగా కొండలను పట్టణాలకు తరలించడం వంటిదని, దీనికి బదులు ప్రజలనే కొండ ప్రాంతాలకు, గ్రామాలకు తరలించడం మంచిదని పర్యావరణ వేత్తలు అభిప్రాయపడుతున్నారు. వివిధ నీటి వనరుల క్షీణత, కొండలపై నివాసం ఉండే ప్రజలు ఇబ్బందులు పడడం క్రమంగా సమాజంలోని అందరిపైనా ప్రభావం చూపించే అవకాశం స్పష్టంగా కనిపిస్తుంది.

అంతరిక్షంలో చాలా ఖనిజ సంపద ఉంది అని, వాటిని ఉపయోగించుకోవచ్చని అనేక మంది భావిస్తున్నప్పటికీ, ప్రస్తుత సాంకేతిక పరిజ్ఞానం ఇంకా అలాంటి అవకాశాలను మనకు కలిగించలేదు. ఈ తరుణంలో మనందరం మరింత విజ్ఞత ప్రదర్శించి, తూర్పు కనుమలను పరిరక్షించుకోవడం ఒక ముఖ్యమైన బాధ్యత అవుతుంది.

ఇటువంటి అవగాహన పెరగడానికి, ప్రజలలో చైతన్యం తీసుకురావడానికి సామాజిక శాస్త్రాల అధ్యయనం మరింతగా పెరగాల్సిన అవసరం కనిపిస్తున్నది. సామాజిక బాధ్యత, సామాజిక సమస్యల మూల కారణాలపై స్పష్టత, పరిష్కార వ్యూహాల రూపకల్పన, క్షేత్ర స్థాయిలో అమలు మొదలగునవి సామాజిక శాస్త్రాల విస్తృతి పెరగడం ద్వారా సాధ్యమవుతుంది.

జూన్ 5 లేదా మరో పర్యావరణ సంబంధిత దినోత్సవం రోజు సామాజికంగా 'పర్యావరణాన్ని కాపాడాలి' అనే నినాదాన్ని అందరికీ పరిచయం చేయడం ముఖ్యమైన విధానంగా ప్రస్తుతం ఉంటున్నది. దీనితో పాటు వివిధ రంగాల ప్రజలకు దోహదపడేలా వేరు వేరు పర్యావరణ పరిరక్షణ వ్యూహాలను క్షేత్ర స్థాయిలో పరిచయం చేయాలి.

గనుల తవ్వకం, సెజ్‌లు, వ్యాపార అభివృద్ధి, అవస్థాపనా సౌకర్యాల రంగాలలో పర్యావరణ పరిరక్షణ సాధ్య సాధ్యాలను మరింత లోతుగా విశ్లేషించుకోవాలి. కొండలు లేకపోతే ఏంటి? అనే మౌలికమైన ప్రశ్నకు సమాధానం వెతకాల్సిన సమయం వచ్చింది.

ముఖ్యంగా పర్యావరణ విలువను డబ్బుల రూపంలో లెక్కపెట్టాల్సిన సమయం వచ్చింది. ఖచ్చితంగా తెలియకపోయినా ఒక స్పష్టమైన అంచనాలు తయారు చేసుకోవాలి. ప్రభుత్వ విధానాలు, చట్టాలు, అవగాహన, న్యాయ స్థానాలు, సామాజిక మాధ్యమాలు ఆచార వ్యవహారాల కంటే డబ్బుల రూపంలో ప్రతి ప్రకృతి వనరు విలువను అంచనావేసి, ధర రూపొందించడం మనుషులుగా మనందరి నిర్ణయాలు తీసుకునే పద్ధతిని ఎక్కువగా ప్రభావితం చేయగలుగుతుంది. వ్యక్తి విచక్షణ ఎక్కువ సందర్భాలలో డబ్బుతో ముడిపడిన వ్యవహారం అయినందున రాయల్టి, పన్నులు, సెస్, ధరలు, పెనాల్టీలు మొదలగునవి నిర్ణయించేటప్పుడు పర్యావరణ నష్టాన్ని ఆర్థిక కోణంలో మదించడం చాలా వరకు హేతుబద్ధమైన నిర్ణయాలు తీసుకోవడంలో తోడ్పడుతుంది. పర్యావరణ అంశాలపై మరిన్ని పరిశోధనలు జరిపి గణాంకాలు సేకరించడం, ప్రచురించడం మన సమాజానికి అత్యవసరం.

హరిత ఆంధ్రప్రదేశ్, నీరు–చెట్టు, ప్రకృతి వ్యవసాయం, ఇంకుడు గుంతలు మొదలైన విధానాలు సంతోషకరం అయినప్పటికీ, తూర్పు కనుమలు ఎక్కువగా విస్తరించిన ఆంధ్రప్రదేశ్‌లో అడవుల శాతం ఇప్పటికీ దాదాపు 20 శాతానికే పరిమితమైంది. వన సంరక్షణ సమితి, ప్రజల భాగస్వామ్యం మరింతగా పెంచి అనుకున్న హరిత ఆంధ్రప్రదేశ్ లక్ష్యాలను సాధించాల్సిన తరుణమిదే. తోటల పెంపకం, సామాజిక అడవులు, అర్బన్ ఫారెస్ట్రీ, కూరగాయలు, ఔషధ మొక్కలు, నీడనిచ్చే చెట్ల పెంపకం మొదలైన వాటి మీద ప్రజలలో అవగాహన పెంచడంతో పాటు, చెట్ల పరిరక్షణ, నీటిని అందించడం మొదలైన ప్రాధామ్యాలను గుర్తు చేయడం ప్రస్తుతం అత్యవసరం.

పర్యావరణ పరిరక్షణకు అనుకూల జీవన విధానాన్ని అవలంబించే ఆవిష్కరణలకు తోడ్పాటు పెరగాలి. పర్యావరణ పరిరక్షణ అనేది ఒక నిషిద్ధ పదంగా ఉన్న సగటు ఆలోచన మారాలి. మనందరం ప్రకృతిలో భాగమే. మన ఆర్థిక విధానాలు ప్రకృతి తత్వానికి అనుకూలంగా లేకపోతే డైనోసార్లలా మానవజాతి కూడా అంతరించిపోయే ప్రమాదమున్నది. అందువల్ల ఆర్థికాభివృద్ధికి 'ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్' విధానం ఎంత అవసరమో, పర్యావరణానికి విఘాతం కలిగినప్పుడు 'ఈజ్ ఆఫ్ క్లోజింగ్ బిజినెస్' విధానాలను రూపొందించడం కూడా అంతే అవసరం.

హైదరాబాద్‌లో జరిగిన ఐక్యరాజ్య సమితి జీవ వైవిధ్య సదస్సు, అంతకు ముందు జరిగిన 'అంతర్జాతీయ పర్వతాల సంవత్సరం' వేడుకలు పర్వతాల ప్రాధాన్యతను గుర్తించినా, ఇంకా తూర్పు కనుమలకు ఐక్యరాజ్య సమితి ప్రత్యేక గుర్తింపు లేకపోవడం ఒక ప్రధాన బలహీనత.

అల్లా ఉద్దీన్ అద్భుత దీపం మనవద్ద లేదనేది బహిరంగ రహస్యం. ఇది ఒక సత్యం. 1970లలో వచ్చిన అనేక ఆర్థిక సూత్రాలు అప్పట్లోనే ఆర్థికాభివృద్ధి హద్దులు గుర్తించాలని పేర్కొన్నాయి. ఇనెటిక్స్, బయో టెక్నాలజీ వంటి రంగాలలో ఎంత అభివృద్ధిని సాధించినా, ఇంకా జీవాన్ని మనం సృష్టించలేకపోతున్నాం. సైన్స్, మతం, సంప్రదాయాలు ఇలా ఏదైనా ఈ సృష్టి రహస్యాలను పూర్తిగా ఛేదించలేకపోయాయి. ఇలాంటి సమయంలో పర్యావరణ పరిరక్షణకు అనుకూలమైన సామాజిక, ఆర్థిక విధానాలను రూపొందించుకోవడం మనందరి కర్తవ్యం. చంద్రుడు, ఇతర గ్రహాలపైకి ఇంకా మనం పూర్తి స్థాయిలో వెళ్లనప్పుడు, జనాభా అవసరాలు పెరుగుతున్నప్పుడు వాస్తవిక దృక్పథంతో వ్యవహరించాలి. పర్యావరణం, పక్కవాడి సమస్యలు అవసరం లేదు అనే నిర్లిప్తత నుండి, ఒక రకమైన అచేతన నుండి మనందరం బయటపడితేనే తరతరాలుగా మనం నమ్మిన ప్రకృతి అనుకూల జీవన విధానానికి నిజమైన అర్థం ఉంటుంది. లేదా మన వినాశనాన్ని మనమే కోరి తెచ్చుకున్నట్లు అవుతుంది.

*(రచయిత ఆర్థికశాస్త్ర అధ్యాపకులు)* వీ

# అవే విధానాలు... అదే పాలన...

**పాలకులు మారినంత మాత్రాన విధానాలు మారవనీ, గత ప్రభుత్వాలు కొనసాగించిన ప్రపంచ బ్యాంకు విధానాలనే ఉద్యమ పార్టీ అని పేరుచెప్పుకున్న టిఆర్ఎస్ ప్రభుత్వం కొనసాగిస్తున్నదనీ అంటున్నారు వంగాల సంపత్ రెడ్డి**

తెలంగాణ ప్రభుత్వం పాలన రెండు దశాబ్దాల కింద ప్రపంచ బ్యాంకు విధానాలను అమలు చేసిన చంద్రబాబు పాలనకు భిన్నంగా ఏమి లేకపోగా కొనసాగింపుగా చూడాలి. ఇలా వ్యాఖ్యానించడం చాలా మందికి కోపం తెప్పించవచ్చు. తప్పదు. నిజం చేదుగానే ఉంటుంది. ఈ నిర్ధారణకు ఎలా వచ్చానో వివరిస్తాను. ఈ విధంగా నేను నిర్ధారణకు రావడానికి ఒక కథ, ఒక ఉపన్యాసం కారణమైనాయి.

2000 ఫిబ్రవరి 12న ఇప్పటి డిటిఎఫ్‌గా మారిన అప్పటి ఎపిటిఎఫ్ ఆధ్వర్యంలో పొత్కపల్లి హైస్కూలులో జరిగిన విద్యా సదస్సులో విజన్ 2020 మీద ఎన్. వేణుగోపాల్ మాట్లాడారు. తన ఉపన్యాసంలో పాలకులు ఎలా ఆలోచిస్తారు, ఎలా ప్రచారం చేసుకుంటారో వివరించారు. ఎంత దుర్మార్గాన్నైనా ఎలా సమర్థించుకుంటారో వివరించారు. పాలకులు ఏ విధంగా ప్రవర్తిస్తారో, వారి ఆలోచనా సరళి ఎలా ఉంటుందో నాకు అర్థమయింది.

2000 మేలో జరిగిన డిటిఎఫ్ మహాసభల సందర్భంగా విడుదల చేసిన సావనీరులో ఉన్న అల్లం రాజయ్య కథ ద్వారా ప్రజలు ఎలా ఆలోచిస్తారో, ప్రజల వైపు నుండి ఎలా ఆలోచించాలో అర్థమయింది.

ఏది మంచి? ఏది చెడు? ఎట్లా నిర్ణయించాలి? ఇవ్వాళ ఇదే ప్రశ్న మేధావులు అడుగుతున్నారు. ప్రజలకు ఉపయోగపడేది ఏదైనా మంచే, ఉపయోగపడనిదేదైనా చెడే. ఉపయోగపడడం అంటే ఉత్పత్తి సాధనాలు ప్రజల పరం కావడం.

ఇప్పుడు మూడేళ్ల తెలంగాణ పాలనను పాలక వర్గాల వైపు నుండి కాకుండా ప్రజల వైపు నుండి చూడగలిగితే వాస్తవాలు అర్థమవుతాయి.

కెసిఆర్ పాలన మొత్తం ప్రపంచ బ్యాంకును సంతృప్తి పరచడం దగ్గరే ఆగిపోయింది.

ప్రపంచ బ్యాంకు తన ప్రయోగాలకు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌ను ఎన్నుకున్నది. కుట్ర ద్వారా అధికారంలోకి వచ్చిన చంద్రబాబు ద్వారా తన విధానాలు అమలు పరచడానికి ప్రపంచ బ్యాంకు విజన్ 2020ని ముందుకు తీసుకువచ్చింది. విజన్ 2020 ద్వారా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఏ విధంగా విభిన్న రంగాలలో అభివృద్ధి చెందుతుందో ప్రచారం చేసింది. దీనిని నమ్మిన మధ్య తరగతి, పేద తరగతి ప్రజలు చంద్రబాబుకు మరొకసారి అధికారం అప్పగించారు. ఇక తనకు ఎదురులేదని చంద్రబాబు విర్రవీగాడు. 2020 వరకు తానే ముఖ్యమంత్రినని నమ్మాడు. తాను ఏం చేసినా చెల్లుతుందని భ్రమపడ్డాడు. అతనిని నడిపిస్తున్న ప్రపంచ బ్యాంకు భ్రమపడింది.

విజన్ 2020 ద్వారా జరిగేది అభివృద్ధి కాదని, విధ్వంసమని నమ్మిన ప్రజలు సభలు, సమావేశాలు నిర్వహించారు. విజన్ 2020 అంటే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని వనరులను 2020వ సంవత్సరం నాటికి బహుళజాతి సంస్థలకు అప్పగించడం, ప్రపంచ బ్యాంకు దళారులకు అప్పగించడమేనని ప్రజలు ప్రచారం చేశారు. ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరించడం, ప్రభుత్వ రంగ సంస్థల నిర్వహణ నుండి ప్రభుత్వం తప్పుకోవడమేనని నమ్మిన ప్రజలు 2004లో చంద్రబాబును అధికారం నుండి తప్పించి రాజశేఖర్ రెడ్డికి అప్పగించారు. విజన్ 2020ని చంద్రబాబు నగ్నంగా అమలు చేస్తే రాజశేఖర్ రెడ్డి దానికి మానవీయ ముఖం కప్పి అమలు చేశాడు.

ఆ విజన్ 2020 విధానాలు ఇప్పుడు తెలంగాణలో ఉద్యమ ముఖం కప్పుకుని, త్వరిత గతిన మరొక పేరుతో అమలు చేయబడుతున్నాయి. ఎవరు ఏ పేరుతో అమలు చేసినా ఆ విధానాల అంతిమ లక్ష్యం వనరుల దోపిడే. సామాజిక అసమానతలను పెంచడమే.

విజన్ 2020 విధానాల అమలులో భాగంగా చంద్రబాబు మావోయిస్టులను ఎన్‌కౌంటర్ చేస్తే, రాజశేఖర్ రెడ్డి అదే మావోయిస్టులతో చర్చలు జరిపి ఎన్‌కౌంటర్లు చేశాడు. విజన్ 2020 విధానాల అమలుకే కెసిఆర్ మావోయిస్టుల ఎజెండానే తన ఎజెండాగా ప్రకటించి ఎన్‌కౌంటర్లు చేస్తూనే ఉన్నాడు.

పారిశ్రామిక వేత్తలకు లక్షల ఎకరాలు భూములు సిద్ధంగా ఉంటాయి. వారికి ఎప్పుడూ రెడ్ కార్పెట్ సిద్ధంగా ఉంటుంది. దళితులకు పంచడానికి మాత్రం భూమి ఇక ఎండమావిలో నీరే.

తెలంగాణలో పల్లెపల్లెకూ, గడపగడపకూ తాగునీరు అందించే లక్ష్యంతో మిషన్ భగీరథ పథకం మొదలైంది. వేల కోట్ల రూపాయలను ప్రభుత్వం ఖర్చు చేస్తున్నది. వేల కోట్ల రూపాయలను అప్పుగా తెచ్చిన ధనంతో యుద్ధ ప్రాతిపదికన పనులు జరుగుతున్నాయి. మంచి నీరు ఇవ్వడం మంచిదే. ఉచితంగా ఇవ్వడం మరీ మంచిది. ప్రపంచ బ్యాంకు విధానాలు అమలవుతున్న వేళ ఉచితంగా ఇవ్వడం సాధ్యమా? మిషన్ భగీరథ పథకానికి మేమంటే మేమని అప్పులు ఇవ్వడానికి బ్యాంకులు ఎందుకు ముందుకు వస్తున్నాయనేది అర్థం చేసుకుంటే తప్ప మిషన్ భగీరథ అంతిమ లక్ష్యం అర్థం కాదు. వేలకోట్లు ఖర్చుపెట్టి పైపులైనులు వేసి ఇంటింటికి తాగునీరు ఇవ్వడం ద్వారా అయిన ఖర్చును నిర్వహణ ఖర్చుల పేర వేల కోట్ల యూజర్ చార్జీలు వసూలు చేయడం ద్వారా లాభాలు పొందవచ్చనే ఏకైక లక్ష్యంతో రుణాలు ఇస్తున్నాయి. లాభాలు లేకుండా ఎవరు రుణాలు ఇవ్వరు కదా.

నిజానికి మిషన్ భగీరథ అంతిమ లక్ష్యం ఇక్కడి నీటి వనరులను మార్కెట్ సరుకులుగా మార్చడం. అంటే నీటి వనరులను ప్రైవేటీకరించడం. అది కూడా విజన్ 2020 ఎజెండాలో భాగంగానే. నీటి వనరులను 2020 వరకు ప్రైవేటీకరించే ఏకైక లక్ష్యంతోనే మిషన్ భగీరథ పనులు యుద్ధ ప్రాతిపదికన నడుస్తున్నాయి.

తెలంగాణ వచ్చిన తరువాత ఓపెన్ కాస్టులు మూత బడతాయని అనుకున్నారు. మూతబడక పోగా కొత్తగా ఓపెన్ కాస్టులను ప్రారంభించే

# బేయర్ - మాన్‌సాంటోల దుర్మార్గపు కలయిక

**దశాబ్దాలుగా జన్యు పంటలతో వ్యవసాయాన్ని నాశనం చేసిన మాన్‌సాంటో, రెండో ప్రపంచ యుద్ధం కాలం నుంచే మనుషులపై విష ప్రయోగాలతో లక్షలాది మందిని పొట్టనపెట్టుకున్న బేయర్ కంపెనీల కలయిక మానవాళికి తీవ్రమైన నష్టం చేస్తుందని అంటున్నారు డా. నళిని**

ఒకరు జన్యుమార్పిడి విత్తనాల క్రిమి సంహారకాల దిగ్గజం, మరొకరు ఫార్మా దిగ్గజం. ఇద్దరూ కలిసి దశాబ్దాలుగా నేలకి, పంటలకి, జనావళికి చేస్తున్న నష్టం కొలవలేనిది. అలాంటి మాన్‌సాంటోని బేయర్ యాభై ఆరున్నర బిలియన్ డాలర్లకి కొనడానికి ఒప్పుకుంది. వీరిద్దరూ కలిస్తే ప్రపంచంలో మూడోవంతు విత్తనాల మార్కెట్‌పై, నాలుగోవంతు క్రిమి సంహారకాల మార్కెట్‌పై వీరికి పట్టు ఏర్పడుతుంది.

గతంలో వియత్నాం యుద్ధం సమయంలో కూడా వీరిద్దరూ ఒకటై, 'ఏజెంట్ ఆరెంజ్' అనే రసాయనాన్ని తయారు చేశారు. అది చెట్లని నాశనం చేసే రసాయనాల మిశ్రమం. అందులో ప్రధానంగా డయాక్సిన్ అనే రసాయనం చెట్లని నాశనం చేయడమే కాక, మనుషుల్లో అనేక హానికరమైన ప్రభావాలని కల్పించగలదు. 'ఆపరేషన్ రాంచ్ హాండ్' పేరుతో అమెరికా ఈ రసాయనాన్ని ఉత్తర వియత్నాం మీద, వియత్కాంగ్ దళాల మీద ప్రయోగించింది.

1961-1972ల మధ్య నాలుగున్నర మిలియన్ ఎకరాల నేల మీద పంతొమ్మిది మిలియన్ గ్యాలన్ల ఏజెంట్ ఆరెంజ్‌ని విరజిమ్మి అడవుల్ని నాశనం చేసి, విమాన దాడులతో యుద్ధాన్ని సులభతరం చేసుకున్న అమెరికా, అక్కడి ప్రజలకు తీరని ఆరోగ్య సమస్యల్ని సృష్టించింది. గర్భస్రావాలు, పిల్లల్లో వికారాలు, దద్దుర్లు, నరాల బలహీనతలు, మానసిక వ్యాధులు, రకరకాల క్యాన్సర్లు సంభవించాయి. ఆ రసాయనా లని వెదజల్లిన అమెరికా సైనికులు కూడా ఈ వ్యాధుల భారినపడ్డారు. వారు కోర్టుకి వెళ్లి కొంతలో కొంత పరిహారం పొందారు. కాని, వియత్నాం ప్రజలని ఏ అంతర్జాతీయ కోర్టూ ఆదుకోలేదు. ఆ యుద్ధంలో తెలుపు, పర్పుల్, పింక్, గ్రీన్, బ్లూ అంటూ ఇతర హరివిల్లు క్రిమి సంహారకాలని వినియోగించినా, ఆరెంజ్ చారలు ఉన్న ఐదున్నర గ్యాలన్ డ్రమ్ములు కలిగించిన విధ్వంసాన్ని మరే ఇతర రసాయనంతో పోల్చలేం.

ఇలాంటి నేర చరిత్ర కలిగిన రెండు కంపెనీలు చేతులు కలపడానికి ముందు అనేక జాతీయ, అంతర్జాతీయ సంస్థలే వాటిని వ్యతిరేకించాయి. 'కూడలి వద్ద వ్యవసాయం - ఒక నివేదిక' అంటూ ఐఎఎఎస్‌టిడిలో 59 దేశాల నేతృత్వంలో 400 మంది శాస్త్రవేత్తలు వెల్లడించిన నివేదికలో వారు 'ప్రపంచ ఆకలిని తీర్చేది జన్యుమార్పిడి పంటలు కానే కాదని' తీర్మానించారు. అమెరికాలో పంట దిగుబడి చూసినా జన్యుమార్పిడి పంటలు చాలాసార్లు మామూలు పంటల కన్నా తక్కువ దిగుబడిని ఇస్తున్నాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థ గ్లైకోఫాస్ఫేట్‌ని క్యాన్సర్ కారకమని నిర్ధారించినా గానీ మాన్‌సాంటో సంస్థ దాని 'రౌండ్ అప్' అనే ఉత్పత్తిని మార్కెట్ నుంచి ఉపసంహరించలేదు. పైగా ఎదురు కేసులు వేసి దాన్ని సమర్థించుకునే ప్రయత్నం చేస్తోంది.

**బేయర్ చరిత్ర**

1863లో జర్మనీలో ఏర్పడింది. ఫ్రెడరిక్ బేయర్, వెస్కాట్‌లు పార్ట్‌నర్లు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో క్లోరీన్ గ్యాస్‌తో సహా అనేక రసాయన ఆయుధాల తయారీపై కేంద్రీకరించింది.

1925లో బేయర్, హెక్స్ట్, బిఎఎస్ఎఫ్ కలిసి ఒక కూటమిగా 14 ఫార్బెన్‌ని ఏర్పరిచి హిట్లర్ ఎన్నికలకి విరివిగా దోహదపడ్డాయి. ఈ సంస్థ ఆష్‌విట్జ్‌లో మొదటి కాన్‌సెంట్రేషన్ క్యాంపులని ఏర్పరిచి, తన 14 ఫార్బెన్ ప్లాంట్ కోసం బానిస కూలీలను తయారు చేసుకుంది. ఆ క్యాంపులని తర్వాత కాలంలో హిట్లర్ వినియోగించుకున్నాడు. యూదు

---

పనులు మొదలు పెట్టింది ప్రభుత్వం. ఓపెన్ కాస్టులకు వ్యతిరేకంగా ప్రజలు చేస్తున్న ఉద్యమాలను అణిచివేసే ప్రయత్నాలు చేయడం ప్రపంచ బ్యాంకు విధానాలను అమలు పరచడానికే తప్ప మరొకటి కాదు.

జిల్లాల పునర్విభజన సందర్భంగా కూడా ప్రజల మనోభావాలను పట్టించుకోలేదు. తమకు జిల్లా కావాలని పోరాడుతున్న నాయకులను నాన్ బెయిలబుల్ కేసుల కింద అరెస్టు చేసి జైలుకు పంపించడం ద్వారా తానెంత అప్రజాస్వామికంగా ప్రవర్తించగలదో తెలంగాణ ప్రభుత్వం తనకు తానే నిరూపించుకుంది.

ఇందిరా పార్క్ దగ్గర ధర్నాలకు అనుమతిని నిరాకరించడమంటే నిరసనలు తెలిపే కనీస ప్రజాస్వామిక హక్కును కూడా తెలంగాణ ప్రభుత్వం గౌరవించే స్థితిలో లేదన్న మాట. ప్రపంచ బ్యాంకు విధానాలను అమలు చేసే ఏ పాలకులయినా ఈ విధంగా కాకుండా మరొక విధంగా ప్రవర్తిస్తారా?

ప్రజలపై తీవ్ర భారం పడే విధంగా తెలంగాణ ప్రభుత్వం ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వంతో చేసుకున్న విద్యుత్ ఒప్పందం చాలా ఖరీదైనది. ఈ ఒప్పందం అంతిమంగా ఆదానీకీ ఉపయోగం. విద్యుత్ తయారు చేసే సంస్థలకు ఆదానీయే బొగ్గు సరఫరా చేస్తున్నాడు. ఆదానీ, ప్రధానమంత్రి నరేంద్ర మోడీకి సన్నిహితుడనే విషయం బహిరంగ రహస్యమే. ఆదానీకి లాభం చేకూర్చడానికే ప్రభుత్వం ఈ ఒప్పందం చేసుకుందా? లేదా నరేంద్ర మోడీకి దగ్గరవడానికి ఈ ఒప్పందం చేసుకున్నదా? ఏమో? ఆలోచించాల్సిందే. విద్యారంగం నుండి తప్పుకోవడానికి ప్రభుత్వం పావులు కదుపుతోంది. ఆ క్రమంలో ఉపాధ్యాయులపై విష ప్రచారాన్ని ప్రభుత్వమే ముందుండి నడిపిస్తున్నది.

2020 వరకు తెలంగాణలో వనరులను ప్రపంచ బ్యాంకు దళారీలకు అప్పచెప్పడమే లక్ష్యంగా తెలంగాణ పాలన నడుస్తున్నది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్)*

వీ

జాతీయులపై విరుచుకుపడ్డాడు. హిట్లర్ నెలకొల్పిన షుట్జ్ స్టాఫెల్ (ఎస్.ఎస్) అనే పారామిలటరీ సంస్థకి 14 ఫార్బెన్.జైక్లాన్ – బి అనే సైనైడ్ ఆధారిత క్రిమి సంహారిని అందించింది. పదిలక్షల మంది ప్రజలని క్యాంపుల్లో ఊచకోత కోశాక, శవాలని తగలబెట్టడానికి మిథనాల్‌ని కూడా సరఫరా చేసింది.

1946లో న్యూ రెంబర్గ్ యుద్ధ నేరాల ట్రిబ్యునల్ తన తీర్పులో, 14 ఫార్బెన్ లేకపోతే రెండవ ప్రపంచ యుద్ధమే సంభవించేది కాదని అభిప్రాయపడింది. 14 ఫార్బెన్ అధికారి ఫ్రిజ్ టెర్‌మీర్‌ని న్యూ రెంబర్గ్‌లో శిక్షించారు. బానిసలని తయారు చేసినందుకు, మూకుమ్మడి హత్యలు చేసినందుకు, ప్రజలపై అమానుష దాడులు చేసినందుకు ఈ శిక్ష. అయితే, ఐదేళ్ల జైలు శిక్ష అనుభవించాక అతను 1956లో బేయర్ బోర్డు ఛైర్మన్‌గా ఎన్నికై, ఆ పదవిలో పదేళ్ల పాటు కొనసాగాడు.

యుద్ధ నేరాలపై న్యూ రెంబర్గ్ తీర్పు తర్వాత పదిహేనేళ్లకి, 1962లో బేయర్, హెక్స్ట్, బిఎఎస్ఎఫ్ కూటమి మరోసారి మానవహక్కుల ఉల్లంఘనకి పాల్పడింది. దానికి 'కోడెక్స్ ఎలిమెంటేరియస్ కమిషన్' అని నామకరణం జరిగింది. రోగాలని వ్యాపారం చేసుకునే ప్రవృత్తిని ప్రేరేపిస్తూ, ఆరోగ్యాన్ని పణంగా పెట్టి లాభాలు గడించడం వీరి లక్ష్యం. హాని చేయని బలమైన ఆహారానికి బదులు జన్యుమార్పిడి ఆహార పదార్థాలని, విటమిన్ మినరల్ సప్లిమెంట్లని వీరు ముందుకు తెచ్చారు.

80వ దశకం మధ్యలో బేయర్ హీమోఫిలియా వ్యాధికి ఉపయోగపడే ఫాక్టర్ ఎనిమిదిని తయారు చేసినప్పుడు అందులో ఎచ్ఐవి వైరస్ ఉందని తేలింది. ఆ శాంపిల్స్‌ని విసర్జించడానికి బదులు వాటిని ఆసియాకి, లాటిన్ అమెరికాకి తరలించింది. సురక్షితమైన శాంపిల్స్‌ని దాచిపెట్టింది.

90వ దశకంలో మెడిక్ ఎయిడ్ ప్రోగ్రాంలో నీతిమాలిన బిల్లింగు విధానాన్ని అవలంబించింది. కుటుంబ నియంత్రణ కోసం బేయర్ తయారు చేసిన యాజ్, యాస్మిన్ అనే మాత్రల్లో డ్రాస్ పిరెనోన్ అనే సింథటిక్ హార్మోన్ వల్ల వందలాది మంది స్త్రీలు మరణించారు.

గుండె, లివర్ ఆపరేషన్లలో రక్తస్రావాన్ని అరికట్టే ట్రాసిలాల్ మందు విపరీతమైన దుష్ప్రభావాన్ని చూపడంతో దాన్ని 2006లో నిషేధించారు. కానీ, దాన్ని మార్కెట్ నుంచి ఉపసంహరించడానికి బేయర్‌కి, ఎఫ్‌డిఎకి రెండేళ్లు పట్టింది. దాని వల్ల కలిగే దుష్ఫలితాలని బేయర్ గుట్టుగా ఉంచేసింది. 2008లో క్లోథియానిడిన్ అనే క్రిమిసంహారి వల్ల తేనెటీగలు మరణిస్తున్నాయని జర్మన్ కోయాలిషన్ బేయర్‌ని హెచ్చరించింది. ప్రపంచ వ్యాప్తంగా ఇది సంక్షోభాన్ని కలిగించింది.

**మాన్‌సాంటో విషపూరిత గత చరిత్ర**

మిసోరీలోని సెయింట్ లూయిలో జాన్ ఫ్రాన్సిస్ క్వీనీ అనే ముప్పయ్యేళ్ల ఫార్మసిస్టు ఈ సంస్థని నెలకొల్పాడు. వీరి మొదటి ఉత్పత్తి సాకరిన్. ఈ తీపి పదార్థాన్ని కోకాకోలా కంపెనీకి అమ్మారు.

1920లలో ట్రాన్స్‌ఫార్మర్లు, కెపాసిటర్లు, ఇతర విద్యుత్ ఉత్పాదకాల కోసం కావలసిన లూబ్రికెంట్లు, కూలెంట్లను ఈ సంస్థ తయారు చేసింది. కాలి పోకుండా, మంచి ఇన్సులేటర్లుగా పని చేసే ఈ ఉత్పత్తులు పోలీ క్లోరినేటెడ్ బైఫినైల్స్ (పిసిబి) జాతికి చెందినవి. వీటివల్ల గర్భ సంబంధిత వ్యాధులు సంభవించవచ్చు. పిల్లల ఎదుగుదలని, రోగ నిరోధక శక్తిని ఇవి దెబ్బతీస్తాయి. క్యాన్సర్‌కి కారణమవుతాయి. 'ఒక్క డాలరు వ్యాపారాన్ని కూడా మేం కోల్పోలేం' అంటూ వాటి దుష్ప్రభావాలని వారు దాచిపెట్టారు. చివరికి 1977లో అమెరికా వాటిని నిషేధించింది.

రెండవ ప్రపంచ యుద్ధంలో మన్‌హటన్ ప్రాజెక్టు కింద మాన్‌సాంటో ఆటంబాంబు తయారీకి ఎంతగానో తోడ్పడింది. 1944లో అది తయారు చేసిన డి.డి.టిని 1972లో నిషేధించారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత రసాయన క్రిమిసంహారకాల మీద కేంద్రీకరించి, డయాక్సిన్‌ని కలిగి ఉండే 2,4,5,-టి ని తయారు చేసింది. ఏజెంట్ ఆరెంజ్‌లో భాగమైన ఈ ఉత్పత్తి, వియత్నాం యుద్ధంలో నాలుగు లక్షల మంది మరణాలకి, అవకరాలకి కారణమయింది. ఐదు లక్షల మంది పిల్లలు వికలాంగులుగా పుట్టడానికి హేతువయింది.

1973లో బ్రాడ్ స్పెక్ట్రం క్రిమిసంహారిని తయారు చేసింది. గ్లైఫాసెట్ రసాయనం కలిగిన 'రౌండ్ అప్' అనే ఉత్పత్తి క్యాన్సర్‌కి కారణం కావచ్చని ప్రపంచ ఆరోగ్య సంస్థ హెచ్చరించినా, అది ఇప్పటికీ సురక్షితమైన ఉత్పత్తిగా చెలామణి అవుతోంది.

1982లో మాన్‌సాంటో మొట్ట మొదటి జన్యు మార్పిడి కణాన్ని మొక్క నుంచి తయారు చేసింది. 80వ దశకం మధ్యలో అది జి.డి. సియెర్లీ నుంచి ఆస్పార్‌టెమ్ అనే పదార్థాన్ని కొని, న్యూట్రా స్వీట్‌ని ఉత్పత్తి చేసింది. ఈ కృత్రిమ తీపి పదార్థం అన్ని అవయవాలని హాని చేయగలదని, మెదడులో కణుతులకి కారణం కావచ్చని ఎఫ్‌డిఎ నిర్ధారించింది. 80–90 దశకాల్లో అది కాలిఫోర్నియా యాంటీ టాక్సిక్ ఇనీషియేటివ్‌కి, (ప్రొపోజిషన్ 65), క్రిమిసంహారక నియంత్రణ ఇనీషియేటివ్ (ప్రొపోజిషన్ 128) కి వ్యతిరేకంగా ఐదు లక్షల డాలర్లు ఖర్చు పెట్టి, అలాక్లోర్ అనే తన క్రిమిసంహారి నీటిని కలుషితం చేసి, క్యాన్సర్‌ని కలిగించగలదనే ఆరోపణని తోసిరాజంది. ఇదే సమయంలో జన్యు మార్పిడి పంటల క్షేత్ర పరీక్షలు జరిపింది. కనెక్టివిట్‌లో మిస్టిక్ నదిలోకి తన వ్యర్థాలని విడుదల చేస్తున్న నేరానికి మాన్‌సాంటో 1.2 మిలియన్ డాలర్ల నష్ట పరిహారాన్ని చెల్లించింది.

90వ దశకం మధ్యలో కృత్రిమ హార్మోన్ ద్వారా పాల ఉత్పత్తిని పెంచి ఆవులకి హాని తలపెట్టింది. అదే సమయంలో భూమిలోకి, నీటిలోకి, భూ గర్భంలోకి 37 మిలియన్ పౌండ్ల విష పదార్థాలని విడుదల చేసినందుకు టెక్సాస్ వ్యర్థ పదార్థాల నియంత్రణ సంస్థకి 41.1 మిలియన్ డాలర్ల నష్ట పరిహారం చెల్లించవలసి వచ్చింది.

1996లో రౌండ్ అప్ రెడీ సోయాబీన్స్‌ని, బిటి పత్తిని, 1998లో రౌండ్ అప్ రెడీ మొక్కజొన్నని తయారు చేసింది.

2007 నాటికి మాన్‌సాంటో విడుదల చేసిన జన్యుమార్పిడి విత్తనాలు ప్రపంచ ఉత్పత్తుల్లో 90 శాతంగా వెల్లువెత్తాయి.

2010లో మాన్‌సాంటో అధికారి మైకేల్ టేలర్ ఆహార పరిరక్షణ సంస్థ (ఎఫ్‌డిఎ) డిప్యుటీ కమిషనర్‌గా ఎన్నికయ్యాడు – కోళ్ల గూటికి నక్క కాపలా! 2012 నుంచి మాన్‌సాంటో ఎన్నికల కోసం 25 మిలియన్ డాలర్ల పైనే వెచ్చించింది. జన్యు మార్పిడి లేబుల్స్‌ని తగిలించకుండా అది అడ్డుకుంటోంది.

అలా ఈ రెండు కంపెనీలు కలిసి మానవాళికి ఎంతో నష్టం చేశాయి. అనారోగ్యానికి, బాధకి, చావుకి కారణమయిన ఈ సంస్థలు ఎన్నో కుట్రల ద్వారా ప్రజలకి హాని చేశాయి. వీరి కలయిక వల్ల ప్రపంచ ఆహార వ్యవస్థ అస్తవ్యస్తమై పోతుంది. జన్యు మార్పిడి పంటలు, క్యాన్సర్ కారకమైన క్రిమిసంహారకాలు రాజ్యమేలుతాయి. వీటిని హరించే ఎంజైములు గాని, బ్యాక్టీరియా గాని మన పేగులు తయారు చేయలేవు. అందుకే ఈ దిగ్గజాలని ఎదిరించడానికి బలమైన సమైక్య పోరాటం అవసరం. అందుకు అందరం చేయి చేయి కలపాలి.

*(ట్రె బోలింగర్ వ్యాసం ఆధారంగా)*

*(రచయిత పిల్లల డాక్టర్)*

## ఆయేషా మీరా హత్య కేసులో సత్యంబాబు నిర్దోషి

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో బీఫార్మసీ విద్యార్థిని ఆయేషా మీరా దారుణహత్య, అత్యాచారం కేసులో పిడతల సత్యంబాబును నిర్దోషిగా ప్రకటిస్తూ హైకోర్టు మార్చ్ 31న కీలక తీర్పు ఇచ్చింది. ఎనిమిదిన్నరేళ్లుగా అక్రమంగా జైల్లో నిర్బంధించిన సత్యంబాబును తక్షణమే విడుదల చేయాలని పోలీసులను ఆదేశించింది. కోర్టు ఖర్చుల కింద అతడికి లక్ష రూపాయలు చెల్లించాలని ప్రభుత్వానికి స్పష్టం చేసింది. ఈ కేసులో దర్యాప్తు సక్రమంగా జరగలేదని పోలీసుల్ని తీవ్రంగా మందలించింది. అమాయకులపై కేసు నమోదు చేసినందున, దర్యాప్తులో కనీస జాగ్రత్తలు పాటించనందున దర్యాప్తు అధికారులపై క్రమశిక్షణా చర్యలు తీసుకోవాలని.. ఈ కేసును అపెక్స్ కమిటీకి అప్పగించాలని ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఉమ్మడి హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ సి.వి.నాగార్జునరెడ్డి, జస్టిస్ ఎం.ఎస్.కె.జైశ్వాల్‌తో కూడిన ధర్మాసనం తీర్పు ఇచ్చింది.

## ప్రజాస్వామిక వాదుల నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ సభ

ప్రొ. సాయిబాబా అతని సహచరులు, తెలంగాణ ప్రజాస్వామిక వేదిక నాయకుల నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ, వారి విడుదల కోరుతూ ప్రజాస్వామిక హక్కుల సమన్వయ సంస్థ, తెలంగాణ ప్రజాస్వామిక వేదిక, ప్రొ. సాయిబాబా విడుదల పోరాట కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 3న బాగ్‌లింగంపల్లిలోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సభ జరిగింది. అందులో వక్తలు ప్రజా సమస్యల పరిష్కారం కోసం పోరాడుతున్న వారిపై పాలకులు దాడి చేస్తున్నారన్నారు. పీడితుల కోసం పోరాడుతున్న వారంతా జైళ్లలో మగ్గుతున్నారన్నారు. అనారోగ్యంతో ఉన్న సాయిబాబాను జైల్లోనే చంపే ప్రయత్నం జరుగుతుందన్నారు. ప్రజా పోరాటాల ద్వారా వచ్చే పర్యవసానం ఎలా ఉంటుందో పాలకులు ఆలోచించుకోవాలని అన్నారు. సాయిబాబా అతని సహచరులను, తెలంగాణ ప్రజాస్వామిక వేదిక నాయకులను బేషరతుగా విడుదల చేయాలని డిమాండ్ చేశారు.

## మధుకర్ మృతదేహానికి రీ పోస్టుమార్టం

పెద్దపల్లి జిల్లా మంథని మండలం ఖానాపూర్‌కు చెందిన దళిత యువకుడు మధుకర్ అనుమానాస్పద మృతిపై ఏప్రిల్ 10న మరోసారి మృతదేహానికి శవపరీక్ష నిర్వహించారు. వెంకటాపూర్‌కు చెందిన శిరీషను ప్రేమించిన కారణంగానే హత్య జరిగిందని మృతుడి బంధువులు, తల్లిదండ్రులు మళ్లీ శవపరీక్ష కోసం హైకోర్టును ఆశ్రయించారు. ఈ నేపథ్యంలో న్యాయస్థానం సూచనల మేరకు మధుకర్ తల్లిదండ్రుల సమక్షంలో శవపరీక్ష నిర్వహించారు. శవ పంచనామా నిర్వహించిన నిపుణులు శవం కుళ్లిపోయిందని, భాగాలన్నీ తీసుకున్నట్టు తెలిపారు. మధుకర్ ఈ ఏడాది మార్చి 14న ఖానాపూర్ సమీపంలోని చెట్లపొదల్లో శవమై కన్పించాడు. 15న శవపరీక్ష అనంతరం మృతదేహాన్ని గ్రామ సమీపంలోనే ఖననం చేశారు.

## తెలంగాణ రాష్ట్ర సమితి ప్లీనరీ

తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) 16వ ఆవిర్భావ దినోత్సవం ఏప్రిల్ 15న జరిగింది. ఈ సందర్భంగా టిఆర్ఎస్ పార్టీ అధ్యక్షుడిగా కెసిఆర్ 8వ సారి ఎన్నికయ్యారు. ప్లీనరీలో 8 తీర్మాణాలను ప్రవేశపెట్టారు. వీటన్నిటిని ప్లీనరీ సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది. వీటిలో 'సంక్షేమంలో స్వర్ణయుగం', నీటిపారుదల, వ్యవసాయ రంగాల్లో నూతనాధ్యాం', విద్యుత్ రంగంలో విజయం – పెట్టుబడుల ఆకర్షణ, పరిశ్రమల స్థాపన – ఐటి రంగ అభివృద్ధి', వినూత్న విధానాలు – ప్రగతి కాముక పథకాలు', 'తాగునీటి వ్యథ తీర్చే మిషన్ భగీరథ', సామాజిక రుగ్మతలపై సమరం' తీర్మానాలు ప్రవేశపెట్టారు.

## మిర్చి రైతుల ఆందోళన

పండించిన ఎండుమిర్చికి గిట్టుబాటు ధర లేదని రైతులు ఆందోళన చేశారు. కనీస మద్దతు ధర క్వింటాలుకు పదివేల రూపాయలు చెల్లించాలని, మార్క్‌ఫెడ్ ద్వారా కొనుగోలు చేయాలని, దళారీలను అరికట్టాలని డిమాండ్ చేశారు. ఏప్రిల్ 4న గుంటూరు మిర్చి యార్డ్ ఎదుట రాస్తారోకో చేశారు. ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం, కౌలు రైతు సంఘం ఆధ్వర్యంలో ఈ ఆందోళన నిర్వహించారు. మిర్చియార్డు చైర్మన్ హామీ ఇచ్చినా రైతులు ఆందోళన విరమించలేదు. మార్కెటింగ్ శాఖ డిప్యూటీ డైరెక్టర్ ఆందోళన కారుల వద్దకు వచ్చి హామీ ఇవ్వడంతో రైతులు రాస్తారోకో విరమించారు. ఏప్రిల్ 19న హైదరాబాద్‌లోని మలక్‌పేట్ గంజ్‌లో మిర్చి రైతులు ఆందోళన చేశారు. గిట్టుబాటు ధర లభించేవరకు నిరసన తెలుపుతామని అన్నారు. మార్కెట్ ముందున్న జాతీయ రహదారిపై రాస్తారోకో నిర్వహించారు.

## 'గోవు' రాజకీయాలు ఇక చెల్లవు

హైదరాబాద్‌లోని బంజారాహిల్స్‌లోని లా మాకాన్‌లో ఏప్రిల్ 19న అడ్వాన్సింగ్ దళిత్ పాలిటిక్స్ అంశంపై గుజరాత్‌కు చెందిన దళిత్ లడక్ సమితి నాయకులు జిగ్నేష్ మెవాని మాట్లాడారు. గోవు సంరక్షణ పేరుతో రాజకీయాలు చేస్తున్న బిజెపి ప్రభుత్వం మనుషుల మీద దాడులు చేయడం ఎలా న్యాయం అని ప్రశ్నించారు. కుల నిర్మూలనకోసం అణగారిన వర్గాలు ఐక్యతను చాటుకునే సమయం వచ్చిందని అన్నారు. దళితులు ఆత్మగౌరవం కోసం ఇన్ని రోజులు పోరాటాలు చేశారని, ఇప్పుడు భూమిపై అధికారం కోసం ఉద్యమించాలని ఆయన పిలుపునిచ్చారు. దళితులు, ముస్లింలు ఒకతాటి మీదకు వచ్చి ఉద్యమాన్ని ఉధృతం చేసేందుకు సన్నద్ధం కావాలన్నారు. కార్యక్రమంలో సీనియర్ జర్నలిస్టు మాలిని సుబ్రహ్మణ్యం పాల్గొన్నారు.

## పిఒడబ్ల్యు ఆరవ రాష్ట్ర మహాసభలు

విశాఖపట్నంలో పిఒడబ్ల్యు ఆరవ రాష్ట్ర మహాసభలు ఏప్రిల్ 15, 16, 17 తేదీల్లో జరిగాయి. ఏప్రిల్ 15 జరిగిన బహిరంగ సభకు హాజరైన ప్రముఖ రచయిత్రి రాణా ఆయూబ్ మాట్లాడుతూ మహిళలంతా ఐక్యమైతే నరేంద్ర మోడీ, రాష్ట్రంలోని చంద్రబాబు వంటి ప్రజాకంటక పాలనను అంతమొందించగలరని అన్నారు. రాజకీయ పార్టీలు మహిళలను ఓటు బ్యాంకుగానే చూశాయని, ఇంక్విలాబ్ జిందాబాద్, విప్లవం వర్ధిల్లాలంటూ పోరాడాలని పిలుపునిచ్చారు. సభకు పిఒడబ్ల్యు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధ్యక్షులు ఆర్. గంగాభవాని అధ్యక్షత వహించగా, తెలంగాణ అధ్యక్షులు జి. ఝాన్సీ, సంఘం ఏపి ప్రధాన కార్యదర్శి ఎం. లక్ష్మి ప్రసంగించారు.

## ధర్నా చౌక్ పరిరక్షణ కోసం కొనసాగుతున్న దీక్షలు

ఇందిరా పార్క్ వద్ద ఉన్న ధర్నా చౌక్‌ను పునరుద్ధరించాలని కోరుతూ మఖ్దూం భవన్‌లో ఏప్రిల్ 15 నుంచి ధర్నా చౌక్ పరిరక్షణ కమిటీ ఆధ్వర్యంలో రిలే నిరాహార దీక్షలు కొనసాగుతున్నాయి. ధర్నా పదవ రోజున, ఏప్రిల్ 23న ఉపాధ్యాయ సంఘాలు పాల్గొన్నాయి. రాష్ట్రంలో ఎమర్జెన్సీ తరహా పాలన నడుస్తోందని విమర్శించాయి. ధర్నా చౌక్‌ను ఎత్తివేయడమంటే భావ ప్రకటన స్వేచ్ఛను హరించడమేనని ఆందోళన వ్యక్తం చేశాయి. ఏప్రిల్ 25న దీక్షల్లో మహిళా సంఘాల నాయకులు కూర్చున్నారు. ఈ సందర్భంగా రమా మేల్కొటే మాట్లాడుతూ అధికారంలో ఎవరున్నా ప్రజాస్వామ్యాన్ని దిక్కరిస్తే ఎదిరిస్తామని హెచ్చరించారు. ఉద్యమ పార్టీ అధికారంలోకి వచ్చి ధర్నా చౌక్‌ని తొలగిస్తామంటే తెలంగాణ ప్రజలు సహించబోరన్నారు. ముఖ్యమంత్రికి ప్రగతి భవన్ ఎంతో తమకు ధర్నా చౌక్ అంతేనన్నారు. ఇందిరా పార్క్ వద్ద ఉన్న ధర్నా చౌక్‌లో ధర్నాలకు అనుమతి ఇవ్వకపోతే ప్రగతి భవన్‌లో ధర్నా చేస్తామని హెచ్చరించారు. వీ

## జీఎస్‌టి బిల్లుకు లోక్‌సభ ఆమోదం

దేశవ్యాప్తంగా ఒకే ప్రత్యక్ష పన్నుల విధానం అమలులోకి తేవడంలో భాగంగా వస్తు, సేవల పన్ను (జీఎస్‌టి) బిల్లులకు మార్చ్ 28న లోక్‌సభ మూజువాణి ఓటు ద్వారా ఆమోదం తెలిపింది. కేంద్ర జీఎస్‌టి బిల్లు, సమీకృత జీఎస్‌టి బిల్లు, రాష్ట్రాలకు పరిహారం చెల్లింపు బిల్లు, కేంద్ర పాలిత ప్రాంతాల జీఎస్‌టి బిల్లుకు సభ ఆమోదం తెలిపింది. ఒకే దేశం, ఒకే పన్నుల వ్యవస్థలో భాగంగా ఈ ఏడాది జూలై 1 నుంచి జీఎస్‌టి వ్యవస్థను అమల్లోకి తీసుకు రావాలని కేంద్రం భావిస్తోంది.

## జార్ఖండ్‌లో ఎన్‌కౌంటర్

జార్ఖండ్‌లో పీపుల్స్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా మిలిటెంట్లకు, పోలీసులకు మధ్య ఏప్రిల్ 9న ఎదురుకాల్పులు జరిగాయి. గిరిజాతోలి ప్రాంతంలో జరిగిన ఈ ఘటనలో ఇద్దరు పోలీసులు ప్రాణాలు కోల్పోయారు. మిలిటెంట్ల ఉనికికి సంబంధించిన సమాచారం అందడంతో పోలీసుల బృందం అక్కడికి చేరుకున్నట్లు అధికారులు తెలిపారు. మిలిటెంట్లు కాల్పులు ప్రారంభించగా పోలీసులు ప్రతిస్పందించారని, అరగంటపాటు ఎదురు కాల్పులు కొనసాగాయని, ఘటనలో పోలీసు అధికారి విద్యాపతి సింగ్, కానిస్టేబుల్ తరుణ్ బిరులి చనిపోయారని వెల్లడించారు. మరో అధికారికి గాయలైనట్లు తెలిపారు.

## శ్రీనగర్ ఉపఎన్నికల్లో హింస

జమ్ము కశ్మీర్‌లోని శ్రీనగర్ ఏప్రిల్ 9న జరిగిన ఉప ఎన్నిక జరిగింది. ఈ సందర్భంగా హింసాత్మక సంఘటనలు చోటు చేసుకున్నాయి. బుద్గాం పోలింగ్ స్టేషన్ వద్ద ఆందోళనకారులు భద్రతా సిబ్బందిపైకి రాళ్లు రువ్వారు. దీంతో పోలీసులు వారిని అదుపు చేసేందుకు కాల్పులు జరపడంతో ముగ్గురు యువకులు ప్రాణాలు కోల్పోయారు. భద్రతా బలగాలు ఆందోళనకారులను పలుమార్లు హెచ్చరించినా వినకపోవడంతో కాల్పులు జరపాల్సి వచ్చిందని పోలీసు అధికారి వెల్లడించారు. ఈ కాల్పుల్లో మరో ఆరుగురు గాయపడ్డారు. చనిపోయిన వారిని మొహ్మద్ అబ్బాస్(20), ఫైజాన్ అహ్మద్(15)గా పోలీసులు గుర్తించారు. మరోవైపు చందూర అసెంబ్లీ స్థానానికి పోలింగ్ జరుగుతుండగా పెద్ద సంఖ్యలో ఆందోళనకారులు పోలింగ్‌బూత్‌పై రాళ్లు రువ్వారు. దీంతో పోలింగ్ అధికారులు, భద్రతా సిబ్బంది అక్కడి నుంచి వెళ్లిపోవాల్సి వచ్చింది. బుద్గాం, గందేర్‌బల్ ప్రాంతాల్లోను ఇదే పరిస్థితి ఉంది.

## నారాయణ్ సన్యాల్ కన్నుమూత

నక్సల్బరీ తొలితరం నాయకుల్లో చివరివాడైన నారాయణ్ సన్యాల్ (80) కేన్సర్‌తో బాధపడుతూ కోల్‌కతాలో ఏప్రిల్ 16న మృతిచెందారు. పదేళ్లకు పైగా జైలులో ఉన్న ఆయనను అనారోగ్య కారణాలతో 2014లో విడుదల చేశారు. నక్సల్బరీ పోరాటానికి మే నెలతో 50 ఏళ్లు నిండుతాయి. సరిగ్గా అంతే ఉద్యమ జీవితాన్ని ఆయన కలిగి ఉన్నారు. 2005 జనవరిలో ఖమ్మ జిల్లా భద్రాచలంలో బస్‌స్టాండ్‌లో పోలీసులు అరెస్ట్ చేశారు. బ్యాంకు ఉద్యోగిగా ఉన్న ఆయన 1967 నాటి నక్సల్బరీ వసంత మేఘగర్జన నాటి నుంచి విప్లవ రాజకీయాల్లో నారాయణ్ సన్యాల్ భాగమయ్యారు.

## బాబ్రీ మసీదు కేసు విచారణ

ఉత్తరప్రదేశ్‌లోని బాబ్రీ మసీదు విధ్వంసం కుట్ర సంగతి తేల్చండి అని లఖ్‌నవ్‌లోని ప్రత్యేక కోర్టుకు భారత సర్వోన్నత న్యాయస్థానం ఏప్రిల్ 19న ఆదేశించింది. బిజెపి సీనియర్ నేతలైన అద్వాణీ, మురళీమనోహర్ జోషి, ఉమాభారతితో పాటు 13 మంది బాబ్రీ మసీదు విధ్వంసానికి కుట్ర పన్నారంటూ సిబిఐ దాఖలు చేసిన అభియోగాలను పునరుద్ధరించాలని స్పష్టం చేసింది. కుట్ర కేసులో నిందితుడైన కళ్యాణ్‌సింగ్ గవర్నర్‌గా రాజ్యాంగపరమైన రక్షణ అనుభవిస్తున్నందున ఆయనకు మినహాయింపు ఇచ్చింది. ఆయన పదవీకాలం ముగిసిన తర్వాత విచారించవచ్చని స్పష్టం చేసింది. సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ పిసి ఘోష్, జస్టిస్ నారీమన్‌లతో కూడిన ధర్మాసనం ఈ ఆదేశాలను జారీచేసింది. బాబ్రీ మసీదు కూల్చివేత జరిగి 25 సంవత్సరాలు గడుస్తున్నా కేసులను పరిష్కరించకపోవడంపై ప్రత్యేక కోర్టు ఆగ్రహం వ్యక్తం చేసింది.

## హిమాచల్ ప్రదేశ్‌లో బస్సు ప్రమాదం

హిమాచల్‌ప్రదేశ్ రాజధాని సిమ్లాకు 95 కిలోమీటర్ల దూరంలోకి చోపల్‌లో ఏప్రిల్ 19న బస్ 820 అడుగుల లోయలో పడి 45 మంది మృతి చెందారు. వికాస్ నగర్ నుంచి టియునికి 47 మందితో బయల్దేరిన బస్సు మార్గ మధ్యలోనే లోయలో ప్రవహిస్తున్న టాన్స్ నదిలోకి పడిపోవడంతో ఈ ఘటన జరిగింది. మరణించిన వారిలో 31 మంది పురుషులు, 11 మంది స్త్రీలు కాగా ముగ్గురు చిన్న పిల్లలు ఉన్నారని పోలీసులు తెలిపారు. బస్సు లోయలో పడిపోవడానికి కొద్ది సెకన్ల ముందే ప్రమాదాన్ని గుర్తించి కండక్టరు, అతడితోపాటు 13 ఏళ్ల బాలుడు బస్సులోంచి దూకేశారన్నారు.

## తమిళ రైతుల ఆందోళన

కరువు కోరల్లో చిక్కుకున్న తమిళనాడు రైతులు దేశ రాజధాని ఢిల్లీలో జంతర మంతర్ వద్ద నిరసన ప్రదర్శన చేశారు. నలభై రోజులుగా సాగిన ఈ నిరసన ప్రదర్శన ఏప్రిల్ 23న తమిళనాడు ముఖ్యమంత్రి పళనిస్వామి హామీ మేరకు దీక్షను విరమించారు. తమ డిమాండ్‌లు పరిష్కరించకపోతే మే 25 నుంచి మళ్లీ ఉధృతమైన ఆందోళనలు చేపడతామని హెచ్చరించారు. డిఎంకె సహా ఇతర ప్రతిపక్షాలు ఏప్రిల్ 25న తమిళనాడు బంద్ పాటించాయి. తమిళనాడు వర్తకుల సమాఖ్య, వ్యాపారుల సమాఖ్య, రవాణ కార్మికుల సంఘాలు, చలనచిత్ర పరిశ్రమ వర్గాలు బంద్‌కు మద్దతు ప్రకటించాయి.

## సాధ్వి ప్రజ్ఞాసింగ్‌కు బెయిల్

మాలెగావ్ పేలుళ్ల కేసులో నిందితురాలైన సాధ్వి ప్రజ్ఞా సింగ్ ఠాకూర్‌కు బొంబాయి హైకోర్టు ఏప్రిల్ 25న బెయిల్ మంజూరు చేసింది. మరో నిందితుడు మాజీ లెఫ్టినెంట్ కల్నల్ ప్రసాద్ పురోహిత్ బెయిల్ విజ్ఞప్తిని తిరస్కరించింది. ఆయనపై ఉన్న అభియోగాలు తీవ్రమైనందున బెయిల్ ఇవ్వడానికి కుదరదని స్పష్టం చేసింది. ప్రాథమిక ఆధారాలను బట్టి సాధ్వికి వ్యతిరేకంగా కేసు బలంగాలేదని న్యాయమూర్తులు జస్టిస్ రంజిత్ మోరె, జస్టిస్ శాలిని ఫన్ సల్కార్ జోషితో కూడిన ధర్మాసనం పేర్కొంది. 2008, సెప్టెంబర్ 29న నాసిక్ జిల్లా మాలెగావ్‌లో మోటారు సైకిల్‌కు అమర్చిన బాంబు పేలడంతో ఆరుగురు మరణించగా 100 మంది గాయపడ్డారు.

## ఛత్తీస్‌గఢ్‌లో ఎన్‌కౌంటర్

ఛత్తీస్‌గఢ్‌లోని సుకుమ జిల్లా చింతగుహ బురకాపాల్ మధ్య సిఆర్‌పిఎఫ్ 74వ బెటాలియన్‌కు చెందిన జవాన్లపై మావోయిస్టులు ఏప్రిల్ 24న దాడిచేసి కాల్పులు జరిపారు. ఈ ఘటనలో 25 మంది జవాన్లు మరణించారు. ఏడుగురు గాయపడ్డారని సిఆర్‌పిఎఫ్ అధికారులు తెలిపారు. మేం జరిపిన ఎదురు కాల్పుల్లో కనీసం పది పన్నెండు మంది మావోయిస్టులు చనిపోయి ఉంటారని ఆయన వివరించారు. ఈ ఘటనలో దాదాపు 300 మంది మావోయిస్టులు పాల్గొని ఉంటారని అన్నారు. బస్తర్‌లోని కాలాపత్తర్ ప్రాంతంలో నిర్మాణంలో ఉన్న రహదారి వద్ద భద్రతపరమైన తనిఖీలు చేస్తుండగా ఈ దాడి జరిగిందన్నారు. వీ

### పాకిస్తాన్‌లో దాడులు

పాకిస్తాన్‌లో ఆత్మాహుతి దాడులు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి. వాయువ్య పాకిస్తాన్‌లో పరాచినార్ అనే గిరిజన ప్రాంతంలో మసీదు వద్ద ఆత్మాహుతి దాడి జరిగింది. మార్చ్ 31న జరిగిన ఈ దాడిలో ఇరవై మందికి పైగా మరణించారు. దాదాపు వంద మంది తీవ్రంగా గాయపడ్డారు. షియా ముస్లింలను లక్ష్యంగా చేసుకుని ఈ దాడి జరిగింది. మరణించిన, గాయపడిన వారిలో అధికంగా పిల్లలు, మహిళలు ఉన్నారు.

### పరాగ్వేలో నిరసనలు

దక్షిణ అమెరికా దేశమైన పరాగ్వేలో రాజ్యాంగాన్ని సవరించాలని అధికార పార్టీ బిల్లు ప్రతిపాదించింది. 1992లో రూపొందించిన పరాగ్వే రాజ్యాంగం ప్రకారం దేశాధ్యక్షుడిగా బాధ్యతలు నిర్వహించిన వ్యక్తికి మరోసారి దేశాధ్యక్షుడయ్యే అవకాశం ఉండదు. అయితే ఈ నిబంధనను సడలించాలని, పరాగ్వే అధ్యక్షుడు హోరేసియో కార్ట్స్‌ను మరోసారి దేశాధ్యక్షున్ని చేయాలని అధికార పార్టీ ప్రయత్నిస్తున్నది. రహస్యంగా జరిగిన పార్లమెంట్ సమావేశంలో ఈ బిల్లుకు 25 మంది సెనెటర్లు మద్దతు ప్రకటించారు. ఈ బిల్లును ప్రతిపక్ష పార్టీలు, ప్రజలు తీవ్రంగా వ్యతిరేకించారు. ఏప్రిల్ 1న రాజధాని అసన్సియన వీధుల్లోకి వచ్చి ఆందోళన చేశారు. పార్లమెంట్ భవనానికి నిప్పు పెట్టారు. కాంగ్రెస్ బిల్డింగ్ ప్రవేశ ద్వారాన్ని బద్దలు కొట్టారు. రాజ్యాంగ సవరణకు మద్దతు పలికిన సెనెటర్ల కార్యాలయాలపై కూడా దాడిచేశారు. నిరసనకారులపై పోలీసులు చేసిన దాడిలో ప్రతిపక్ష నేత రోడ్రిగో క్వింటానా మరణించారు. దీంతో ఆందోళనలు తీవ్రరూపం దాల్చాయి.

### కొలంబియాలో తుపాను

కొలంబియాలో భీకరమైన తుపాను ప్రజలను అతలాకుతలం చేసింది. మొకావో నగరంలో మార్చ్ 31 నుంచి ఏప్రిల్ 1 వరకు 130 మిల్లీమీటర్ల వర్షపాతం నమోదయింది. ఎడతెరిపి లేని వర్షం వచ్చిన వరద కారణంగా మూడు వందల ఇరవై మందికి పైగా మరణించారు. మరో నాలుగు వందల మంది గాయపడ్డారు. రెండు వందల మందికి పైగా గల్లంతయ్యారు. భారీ ఆస్తి నష్టం సంభవించింది. వందలాది కుటుంబాలు నిరాశ్రయులయ్యాయి. పుటుమాయో ప్రావిన్స్‌లో కొండచరియలు విరిగి భవనాలపై పడ్డాయి. ఏప్రిల్ 18, 19న మానిజేల్స్ పట్టణంలో కురిసిన భారీ వర్షం కారణంగా వచ్చిన వరదల్లో దాదాపు ఇరవై మంది మరణించారు. ఒక్క రోజులోనే 156 మిల్లీమీటర్ల వర్షపాతం వల్ల భారీ ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవించాయి.

### ఇరాక్‌లో ఆత్మాహుతి దాడి

ఇరాక్‌లోని తిక్రిత్ నగరంలో ఏప్రిల్ 5న ఐదుగురు ఉగ్రవాదులు సైనిక ఉన్నతాధికారి ఇంట్లోకి ప్రవేశించేందుకు ప్రయత్నించారు. ఈ క్రమంలో భద్రతా దళాలకు, ఉగ్రవాదులకు మధ్య కాల్పులు జరగడంతో ముగ్గురు ఉగ్రవాదులు చనిపోయారు. మరో ఇద్దరు ఆత్మాహుతి దాడికి పాల్పడ్డారు. ఈ దాడిలో 31 మంది మరణించారు. నలభై మందికి పైగా గాయపడ్డారు. మృతుల్లో ఎక్కువ మంది సామాన్య పౌరులు ఉన్నారు.

### ఈజిప్ట్‌లో దాడులు

ఈజిప్టులోని నైలు డెల్టాలో టాన్టా పట్టణంలో కాప్టిక్ చర్చిలో, ఆ తరువాత అలెగ్జాండ్రియా చర్చిలో ఏప్రిల్ 9న ఆత్మాహుతి దాడులు జరిగాయి. ఈ దాడుల్లో 47 మంది మరణించారు. వంద మందికి పైగా గాయపడ్డారు. తొలుత ఈజిప్ట్ రాజధాని కైరోకు 120 కిలోమీటర్ల దూరంలో ఉన్న టాన్టా పట్టణంలోని కాప్టిక్ చర్చిలో జరిగిన ఆత్మాహుతి దాడిలో ఇరవై తొమ్మిది మంది మృతి చెందారు. డెబ్బై ఎనిమిది మంది గాయపడ్డారు. ఆ తరువాత అలెగ్జాండ్రియా చర్చిలో మరో ఆత్మాహుతి దాడిలో పద్దెనిమిది మంది మరణించారు. ఐఎస్ఐఎస్ ఆత్మాహుతి దళాలు ఈ దాడికి పాల్పడ్డాయి. ఈ దాడుల నేపథ్యంలో ఈజిప్ట్ కాబినెట్ మూడు నెలల పాటు దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించింది.

### సిరియాలో రసాయనిక దాడి

సిరియాలో రసాయనిక దాడి జరిగింది. అటు తిరుగుబాటుదారులకి, ప్రభుత్వానికి మధ్య జరుగుతున్న యుద్ధంలో సామాన్య పౌరులు తమ ప్రాణాలు కోల్పోతున్నారు. ఏప్రిల్ 4న వాయువ్య సిరియాలో అల్‌ఖైదా అనుబంధ సంస్థ ఫతేహ్ అల్ షామ్ ఫ్రంట్ దళాల ఆధీనంలో ఉన్న ఇడ్లిబ్ రాష్ట్రం ఖాన్ షేఖున్ పట్టణంపై ప్రభుత్వ దళాలు వైమానిక దాడి జరిపాయని, అది ప్రమాదకర రసాయనిక దాడి అని మానవ హక్కుల సంస్థ తెలిపింది. ఈ దాడిలో 86 మంది మరణించగా, ఐదు వందల మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. మృతుల్లో, గాయపడిన వారిలో ఎక్కువగా సామాన్య పౌరులు, ముఖ్యంగా చిన్నారులు ఉన్నారు. ఈ దాడిని సాకుగా చూపుతూ ఏప్రిల్ 7న ఎలాంటి ముందస్తు హెచ్చరికలు లేకుండానే అమెరికా క్షిపణి దాడులకు పాల్పడింది. షైరత్ వైమానిక స్థావరంపై తోమహాక్ క్షిపణులను ప్రయోగించింది. ఈ దాడుల్లో తొమ్మిది మంది మరణించారు. ఏప్రిల్ 15న పశ్చిమ అలెప్పోలోని రాషిదన్‌లోని ఉత్తర నగరం ఫుయా, కఫరాయా ప్రాంతాలలో ప్రభుత్వ ఆధీనంలో ఉన్న ప్రాంతాల నుంచి తరలివెళ్తున్న బస్సులపై బాంబుదాడులు జరిగాయి. ఈ దాడిలో 120 మందికి పైగా మృతిచెందగా అందులో అరవై మందికి పైగా చిన్నారులు ఉన్నారు.

### టర్కీలో రెఫరెండం

టర్కీ అధ్యక్షుడికి విస్తృతాధికారాలు కల్పించే అంశంపై ఏప్రిల్ 16న రెఫరెండం నిర్వహించారు. ఈ రెఫరెండంలో అధ్యక్షుడు ఎర్డోగన్‌కు అనుకూలంగా 51.4 శాతం (2,51,57,025 మంది), వ్యతిరేకంగా 48.59 శాతం (2,37,77,091) ఓట్లు వచ్చాయి. దీంతో రాజ్యాంగ సవరణకు ఎర్డోగన్ ఏర్పాట్లు చేస్తున్నారు. అయితే ఓట్ల లెక్కింపులో అక్రమాలు చోటు చేసుకున్నాయని ప్రధాన ప్రతిపక్షం రిపబ్లిక్ పీపుల్స్ పార్టీ (సిఎచ్‌పి) ఆరోపించింది. రాజ్యాంగ సవరణతో వచ్చే మార్పుల్లో ప్రధానంగా అధ్యక్షుడి పదవి కాలం ఐదేండ్లకు పెరుగుతుంది. రెండు మార్లు అధ్యక్ష పదవిని పొందవచ్చు. ప్రభుత్వంలోని కీలక పదవులు, మంత్రులు, ఉపాధ్యక్షులు అధ్యక్షుడి చేతిలో ఉంటాయి. దేశ ప్రధాని పదవిని తీసేస్తారు. అత్యవసర పరిస్థితి విధించే అధికారం అధ్యక్షుడి పరిధిలోకి వచ్చేస్తుంది.

### అఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్ దాడులు

అఫ్ఘనిస్తాన్‌లోని బాల్కీ ప్రావిన్స్‌లో ఏప్రిల్ 21న ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో నూట నలభై మంది చనిపోయారు. నూట యాభై మందికి పైగా గాయపడ్డారు. బాల్కీ ప్రావిన్స్‌లోని మజారి-ఇ- షరీఫ్ పట్టణంలో ఉన్న ఆర్మీ బేస్‌పై సైనిక దుస్తుల్లో వచ్చిన పది మంది తాలిబన్ దళాలు తమను తాము పేల్చుకొని దాడికి పాల్పడ్డారు. మరణించిన వారిలో ఎక్కువగా సైనికులే ఉన్నారు.

### ఫ్రాన్స్ అధ్యక్ష ఎన్నికలు

ఫ్రాన్స్ అధ్యక్ష పదవికి ఏప్రిల్ 23న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో ఏ అభ్యర్థికీ పూర్తి మెజారిటీ రాలేదు. ఎన్‌మార్చ్ పార్టీ నాయకుడు ఎమ్మాన్యుయల్ మాక్రోన్‌కు 23.7 శాతం ఓట్లు రాగా, ఆయన సమీప ప్రత్యర్థి నేషనల్ ఫ్రంట్ అభ్యర్థి మరైన్ లీ పెన్‌కు 21.7 శాతం ఓట్లు వచ్చాయి. వామపక్షాల మద్దతుతో నిలిచిన మీ లెంచోన్‌కు 19.6 శాతం ఓట్లు వచ్చాయి. రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి ఫిల్లోన్‌కు 19 శాతం ఓట్లు వచ్చాయి. దీంతో మే 7న జరిగే రెండో రౌండ్ ఎన్నికల్లో గెలిచిన వ్యక్తి ఫ్రాన్స్ అధ్యక్షుడిగా ఎన్నికవుతారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(మార్చ్ 1 నుండి మార్చ్ 31, 2017 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1086), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (900) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1986)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | - | 2 | - | 21 | 23 | 3 | 8 | 5 | 4 | 3 | 2 | 1 | - | 1 | 26 | 35 | - | - | - | 4 | 6 |
| హైదరాబాద్ | - | - | - | 6 | 10 | 2 | 6 | 4 | - | - | 3 | 7 | 4 | 2 | 19 | 18 | - | - | - | 1 | 1 |
| కరీంనగర్ | - | - | - | 6 | 8 | 2 | 5 | - | - | - | - | 3 | 2 | 3 | 9 | 14 | - | - | - | - | - |
| ఖమ్మం | - | 2 | - | 6 | 9 | - | 4 | 4 | 2 | - | - | 2 | 1 | 3 | 13 | 12 | - | - | - | - | 4 |
| మహబూబ్‌నగర్ | - | 1 | - | 5 | 5 | 4 | 3 | 1 | - | 4 | 5 | 5 | 8 | 8 | 35 | 5 | - | - | - | - | - |
| మెదక్ | 3 | 49 | 2 | 9 | 12 | 39 | 59 | 3 | 10 | 4 | 15 | 19 | 39 | 62 | 69 | 19 | - | - | - | 5 | 2 |
| నల్గొండ | - | 4 | 1 | 8 | 9 | 2 | 1 | 2 | - | - | 1 | 1 | 5 | 5 | 31 | 11 | - | - | - | - | 4 |
| నిజామాబాద్ | - | - | - | 2 | 2 | - | 3 | - | - | 2 | 1 | 3 | 1 | 4 | 12 | 7 | - | - | - | - | - |
| వరంగల్ | - | 2 | - | 7 | 5 | 3 | 5 | - | - | - | 3 | 1 | 1 | 2 | 16 | 15 | - | - | - | - | 2 |
| వికారాబాద్ | - | 2 | - | 4 | 3 | 2 | 4 | 1 | - | - | - | 2 | 2 | 7 | 13 | 11 | - | - | - | - | 1 |
| **తెలంగాణ** | **3** | **62** | **3** | **74** | **86** | **57** | **98** | **20** | **16** | **13** | **30** | **44** | **63** | **97** | **243** | **147** | **-** | **-** | **-** | **10** | **20** |
| అనంతపురం | - | 6 | - | 19 | 23 | 5 | 5 | - | 2 | 3 | - | 4 | 16 | 7 | 51 | - | - | - | - | - | 11 |
| చిత్తూరు | - | - | - | 3 | 6 | 5 | 8 | - | - | - | 2 | 4 | 4 | 2 | 19 | 3 | - | - | - | - | 13 |
| కడప | - | - | - | - | 6 | - | - | - | - | - | 1 | 1 | 1 | 3 | 12 | 2 | - | - | - | - | - |
| గుంటూరు | - | 2 | - | 4 | 4 | - | 2 | 1 | 1 | 2 | 1 | 4 | 1 | 1 | 26 | 10 | - | - | - | - | 1 |
| కృష్ణా | - | 2 | - | 2 | 2 | 1 | 3 | - | - | - | - | 1 | 3 | 3 | 16 | 6 | - | - | - | - | 1 |
| కర్నూలు | - | 4 | - | 3 | 5 | 6 | 4 | 8 | 5 | 2 | 3 | 3 | 8 | 4 | 19 | 13 | - | - | - | - | 8 |
| తూర్పు గోదావరి | - | 2 | 3 | 4 | 5 | 1 | 10 | 5 | 3 | 5 | 4 | 5 | 2 | 1 | 30 | 21 | - | - | - | 1 | - |
| ప్రకాశం | - | - | - | 3 | 6 | 1 | 4 | - | - | 1 | 1 | 3 | 5 | 3 | 22 | 9 | - | - | - | - | 2 |
| శ్రీకాకుళం | - | - | - | 3 | 8 | 2 | 14 | 3 | - | 1 | 1 | 3 | 4 | 8 | 31 | 9 | - | - | - | - | 1 |
| పశ్చిమ గోదావరి | - | - | - | 1 | - | - | 5 | - | 1 | 2 | 1 | 3 | 5 | 2 | 11 | 14 | - | - | - | - | - |
| నెల్లూరు | - | - | - | 3 | 4 | 1 | 3 | - | 1 | 2 | - | 1 | 1 | 2 | 18 | 13 | - | - | - | - | 4 |
| విజయనగరం | - | - | - | 2 | 2 | 1 | 3 | 1 | - | 2 | 1 | 3 | 6 | 3 | 12 | 8 | - | - | - | - | - |
| విశాఖపట్నం | - | - | - | 3 | 8 | 1 | 1 | 2 | 1 | 8 | - | 2 | - | 2 | 22 | 5 | - | - | - | 10 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **16** | **3** | **50** | **79** | **24** | **62** | **20** | **14** | **28** | **15** | **37** | **56** | **41** | **289** | **113** | **-** | **-** | **-** | **11** | **42** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం-ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణారం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతి - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| మా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| గుజరాత్ ఫైల్స్ | రానా అయూబ్ | 130 |
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 200 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీలాదేవి | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | రు. 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం ప్రచురణ | 125 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహో ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| అభాగ్యజీవులు | విరసం ప్రచురణ | 170 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెపిం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 120 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'దకాండ | 100 |

**వీక్షణం**, మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail com, www veekshanam wordpress com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 190 - May 2017 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/04/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19

Date of Posting : 29th, 30th

# వీక్షణంను ఆదుకోండి

## చందాలు చేర్పించండి, ప్రకటనలు, విరాళాలు సేకరించండి

### మళ్లీ ఒకసారి మీ స్నేహహస్తం కోసం వీక్షణం విజ్ఞప్తి

గత ఐదారు సంవత్సరాలుగా వీక్షణం ఆర్థిక పరిస్థితి దినదినగండంగా గడుస్తున్నదని మీ అందరికీ తెలుసు. వీక్షణం కార్యాలయాన్ని మామూలు కన్న సగం అద్దెకు ఇచ్చిన ఇంటి యజమాని, ఏనెలకానెల బిల్లు చెల్లించలేకపోయినా అరువుకు అచ్చువేసిపెట్టే ప్రింటింగ్ ప్రెస్ యజమానులు వంటివారి ఔదార్యం వల్ల, కనీసం ఐదుగురు సిబ్బంది అవసరమయ్యే చోట ముగ్గురు మాత్రమే మామూలుగా వచ్చే జీతంలో సగం జీతానికే పనిచేస్తున్న సిబ్బంది వల్ల వీక్షణం తక్కువ ఖర్చుతో నడుస్తున్నది. అయినా వీక్షణం వార్షిక ఖర్చు పన్నెండు లక్షల రూపాయలు కాగా, చందాలు, విడిప్రతి అమ్మకాలు. [illegible] అమ్మిన పుస్తకాల మీద వచ్చే ఆదాయం కలిసి సంవత్సరానికి ఆరు - ఏడు లక్షల రూపాయల [illegible] వస్తున్నది. ఖర్చుకు సమానమైన ఆదాయాన్ని రాబట్టాలంటే పత్రిక విడిప్రతి ధర, చందా కనీసం రెట్టింపు చేయవలసి ఉంటుంది. పాఠకుల కొనుగోలు శక్తిని దృష్టిలో పెట్టుకున్నప్పుడు అది అసాధ్యం.

అందువల్లనే వీక్షణం ఆ లోటును విరాళాల ద్వారా, వ్యాపార ప్రకటనల ద్వారా పూరించుకోవడానికి ప్రయత్నిస్తున్నది. గతంలో లోటులో సగం దాకా పూరిస్తుండిన ప్రకటనలు కూడ ఇటీవల తగ్గిపోయాయి. వీక్షణం ప్రతి సంవత్సరం దాతల దగ్గరికి వెళ్లి విరాళాలు సేకరించి, అప్పులు తీర్చి, మరుసటి సంవత్సరానికి తనను తాను సిద్ధం చేసుకుంటున్నది. మూడు సంవత్సరాల కింద తెలుగు సామాజిక, సాహిత్య రంగాల ప్రముఖులు కొందరు వీక్షణంకు చేయూతనిమ్మని చేసిన విజ్ఞప్తికి ప్రతిస్పందించి ఎందరో దాతలు విరాళాలు ఇవ్వడానికి ముందుకొచ్చారు. అలా 2016లో వీక్షణం అభిమానుల నుంచి ఏనెలకానెల అందిన విరాళాలు రు. 2,59,500. అప్పటికీ ఆ సంవత్సరంలో ఏర్పడిన మరొక రెండున్నర లక్షల రూపాయల లోటును దాతల దగ్గరికి వెళ్లి తీర్చుకున్నాం.

ఈ సంవత్సరం మళ్లీ అదే పరిస్థితి కొనసాగుతున్నది. ఏనెలకానెల దాతల ఔదార్యంతో, విరాళాలతో, సహకారంతో పత్రిక క్రమం తప్పకుండా వెలువడుతూ వస్తున్నది. కాని ఆ ఆశావహ పరిస్థితి కూడ నానాటికీ తరిగిపోతున్నదని అనిపిస్తున్నది. ఇప్పుడిక వీక్షణం మరొకసారి పాఠకుల, అభిమానుల, దాతల వైపు చూడక తప్పడం లేదు. మాకేమీ శాశ్వత నిధి ఆశలు లేవు. పత్రిక ఒక సామాజిక, చారిత్రక అవసరాన్ని తీరుస్తున్నదని, దీన్ని క్రమం తప్పకుండా తీసుకురావాలని తప్ప మాకు గొంతెమ్మ కోర్కెలేమీ లేవు. ఈ కనీస అవసరాన్ని తీర్చే బాధ్యత తీసుకోవలసింది వీక్షణం పాఠకులు, అభిమానులు, శ్రేయోభి[illegible]మాత్రమే... తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణావేదిక, రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ఆగిపోకుండా ఆదుకోవలసింది మీరే.

- ప్రతి చందాదారూ మరొక చందాదారును చేర్పించవచ్చు
- తమ తమ ప్రాంతాల్లో న్యూస్ స్టాల్స్‌లో వీక్షణం అమ్మడానికి ఏర్పాట్లు చేయవచ్చు
- తమ తమ ప్రాంతాల్లో లైబ్రరీల్లో, కాలేజీల్లో, ఆఫీసుల్లో వీక్షణం చందాలు చేర్పించవచ్చు
- ప్రకటనలు, విరాళాలు ఇవ్వగలిగిన దాతలకు వీక్షణంను పరిచయం చేయవచ్చు

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao



మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M175 |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Vedavalli |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |